అట్టలో పైవైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది

నాగార్జున కొండ క్రీ శ 2వ శతాబ్దం

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

# మాస్తి చిన్న కథలు

(సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన కన్నడ చిన్నకథలు)

మాస్తి వెంకటేశ అయ్యంగార్

తెలుగు సేత

జి. ఎస్. మోహన్

సాహిత్య అకాడెమీ

**Mastı Chınna Kathalu** Telugu translatıon by G S Mohan of Mastı Venkatesha Iyengar's award wınnıng short storıes *Sannakathegalu Vol 12-13* Sahıtya Akademı, 1999, Rs 150



Fırst Publısed 1999

ISBN - 81 - 260 - 0701 - X

**సాహిత్య అకాదెమీ**

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - **110001**

విక్రయ విభాగము

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ-**110001**

జీవన్‌తార భవనము, **4**వ అంతస్తు, 23A/44X

డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా-**700053**

**172,** ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,

దాదర్, ముంబాయి - **400014**

గుణా బిల్డింగ్, **304-305,** అణ్ణా సాలై,

తేనాంపేట, చెన్నై-**600018**

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్,

డా. బి ఆర్ అంబేద్కర్ వీధి, బెంగళూరు-**560 001**

రూ **125-00**

Laser Typeset at MAP Systems, Bangalore
Prınted at Ananya Publıcatıons, Bangalore

# విషయ సూచిక

# మునీశ్వరుడి చెట్టు

## 1

కాల్మాడినుంచి హాలార్‌కు వెళ్ళేదార్లో శావిగె, కుంబల పల్లి గ్రామాలు ఉన్నాయి ఆ రెండూ రోడ్డుకు కొంచెం దూరంలో ఉన్న పల్లెలు ఆ రెండిటి మధ్య రోడ్డుకు సమీపంలో ఒక తోపు ఉంది దానికి ఒక ప్రక్క పాతకాలంనాటి ఒక పెద్దబావి దానికి ఒక ప్రక్కన మెట్లు తక్కిన మూడు వైపులా రాతితో కట్టిన అందమైన బావి తోపుకు ఒక మూలలో, బావికి దగ్గర్లో ఒక పెద్ద అత్తిచెట్టు చిన్న తనంలో ఆ దార్లో పెద్దలతో పాటు వెళ్తూ నేను ఆ చెట్టును గుర్తు పెట్టుకొన్నాను దాని పేరు మునీశ్వరుడి చెట్టు ఎందుకో కాని నాకు ఆ చెట్టంటేనే ఆ రోజుల్లో భయంగా ఉండేది కొంచెం పెరిగి పెద్దవాణ్ణయ్యాక హాలార గ్రామానికి వెళ్తూ, నాతోటి మిత్రులు ఆ చెట్టును చూసి నా లాగానే భయపడడం నాకు జ్ఞాపకం వయసొచ్చిన పిల్లలు ఆ మార్గం గుండా వెళ్ళాల్సి వస్తే వాళ్ళ తల్లులు "ఒరేయ్, నీళ్ళు తాగాలని శావిగె బావి దగ్గరికి వెళ్ళేరు!" అంటూ హెచ్చరించేవాళ్ళు మాటల్లో శావిగె బావి అన్నా, దాని అర్థం మునీశ్వరుడి చెట్టు దగ్గరికి వెళ్ళేవు అని చెప్పడంవల్ల మునీశ్వరుడిని నిందించినట్టు అవుతుందని వాళ్ళ భయం అంచేత మునీశ్వరుడి చెట్టు అనడానికి బదులుగా దగ్గర్లో ఉన్న శావిగె బావి పేరు చెప్పేవాళ్ళు యుక్తవయస్సు వచ్చి నాకిలాంటి భయాలు తగ్గిన తర్వాత ఆ చెట్టును గురించిన సంగతుల్ని శావిగెలోను, కుంబలపల్లిలోను పెద్దల్ని అడిగాను వాళ్ళు చెప్పిన విషయాలను బట్టి ఆ చెట్టుకు సంబంధించిన కథను మీ ముందుంచుతున్నాను

## 2

ఇప్పటికి దాదాపు యాభైయేళ్ళనాటి మాట. కావిగ గ్రామంలో రామయ్య, రాజమ్మ అనే దంపతులు ఉండేవాళ్ళు. రాజమ్మ సుంకరపల్లెకు చెందిన ఆడపడుచు. ఆమె మంచి అందగత్తె. ఎంత అందమో ఇప్పుడెవ్వరూ వర్ణించి చెప్పలేరు. ఆ రోజుల్లో ఆ చుట్టుప్రక్కల పల్లెల్లో ఆమె చాలా అందగత్తె. ఎవరినోట విన్నా ఆమె మాటే. ఆమె నడకలో వయ్యారం ఉండేది. ఆ నవ్వులో చూపరుల మనస్సు దోచుకొనే మాయ ఉండేది. కొన్ని సంవత్సరాల పాటు అలా మగలిద్దరూ అన్యోన్యంగా సుఖంగా ఉండేవాళ్ళు. ఇంట్లో రామయ్య పినతల్లి తప్పితే మరెవ్వరూ లేరు. ఆరేడేళ్ళు సంసారం సాగించినా వీళ్ళకు సంతానం కలగలేదు. ఆ తర్వాత, ఏదేం జరిగిందో కాని, భర్త తనను నిర్లక్ష్యం చేస్తున్నాడని రాజమ్మకు అనిపించింది. రాజమ్మకు తనవిషయంలో మొదట ఉన్నట్టుగా శ్రద్ధాసక్తులు లేవని రామయ్య భావించాడు. రాజమ్మ నాలుగైదు సార్లు చెప్పకొండా పనేమీ లేకపోయినా పుట్టింటికి వెళ్ళి రెండు, మూడురోజులుండి వచ్చింది. సుంకరపల్లికీ, కావిగ గ్రామానికి మహా అంటే ఒక మైలు దూరం మాత్రమే ఉండటంవల్ల ఎవరైనప్పటికీ, ఆ రెండు పల్లెల్లో ఒక గ్రామం వాళ్ళు మరో గ్రామంలో పని చెయ్యాల్సిన అవసరం ఉండేది కాదు. ఎంత పని ఉన్నా, పెళ్ళి పేరంటాలు ఉన్నా, అన్నీ చూసుకొని వాళ్ళ గ్రామానికి పోవచ్చు. ఇలాంటి పరిస్థితుల్లో రాజమ్మ పుట్టింట్లో ఎందుకు ఉండిపోయింది? ఊళ్ళోవాళ్ళు ఆ విషయంగా తర్జన భర్జనలు చెయ్యసాగారు, కారణం ఏమైవుంటుందని భావించారు, గుసగుసలు మొదలయ్యాయి. ఎప్పుడూ లేనిది, అని మాట్లాడుకొన్నారు.

గ్రామస్థులు ఊహించిన కారణం ఇది. పిల్లలు లేకపోవడంవల్ల రాజమ్మ చాల బెంగ పడిపోయింది. దాన్ని పోగొట్టుకోవడానికి పుట్టింట్లో ఉండిపోయింది. ఆమె చెల్లెలి భర్త నరసప్ప ఆడవాళ్ళంటే గౌరవించే రకం. ఆయనకి, ఆమెకీ చాలా వయసు పెరిగి ఉండాలి.

రాజమ్మ నరసప్పతో మామూలుకంటే ఎక్కువ చనువుతో వర్తించడం ఎవరైన చూసారని కాదు. ఆమె సుంకరపల్లెలో పనిచేసిన ఆ రెండు మార్లు

మధ్యాహ్నం పూట ఆ చెల్లెలింటికి వెళ్ళింది, చెల్లెలికి జడవేసింది తాను కూడ అక్కడే జడవేయించుకుంది ఇంతకీ ఆమె రాజమ్మకు సొంత చెల్లెలుకాదు ఇద్దరు పినతండ్రి, పెదనాన్న పిల్లలు నరసప్ప ఆ మధ్యాహ్న సమయాల్లో ఇంట్లోనే ఉన్నాడు, లోపల వీళ్ళ మాట్లాడుతూ ఉండడం ఆయన గట్టిగా నవ్వడం ఆయనకి వినిపించి ఉంటుంది

ఊళ్ళో వాళ్ళ ఈ ఊహ ప్రతి ఇల్లూ చెట్టూరాయి వగైరాలన్నిటికి వ్యాపించిన తర్వాత ఎక్కడో ఎవరో అనుకుంటున్న అరమాట కొరమాట రామయ్య చెవిని కూడ పడింది ఆ మాట చెవిన పడగానే ఆయనెంత దుఃఖించాడో చెప్పడం సాధ్యం కాదు భార్య నడత తప్పి ప్రవర్తిస్తే భర్త ఎందుకు అవమాన పడతాడో ఖచ్చితంగా చెప్పడం కష్టం బహుశా ఈ అవమానానికి ముఖ్య కారణం తాను జీవితంలో ఓడిపోయానన్న భావన కావచ్చు భార్యకొవచ్చు భార్యను ఒప్పించి ఆమె మనస్సును తనదిగా చేసుకునే బాధ్యత భర్తది, ఈ బాధ్యతని ఈయన విస్మరించాడు, జీవితమనే పరీక్షలో ఓడిపోయాడు భార్య సత్ప్రవర్తనతో మెలిగి, భర్త నడవడిలో కొరత ఏర్పడ్డప్పుడు ఈ వాదం అన్వయించదు 'భార్య ఎంతటి కులటురాలైన భర్త ఓటమి ఓటమె ఎప్పుడైనా,ఎక్కడైనా ఎంతటివాడి తలనైనా వంగిపోయేలా చేసే ఈ అపజయపు అవమానం పుగ్రామాల్లో నివసించే వాళ్ళకు మరి సహించరాని భారం అవుతుంది, భర్తని క్రుంగదీస్తుంది ఇలాంటి భర్త అందరి జాలికి పాత్రుడవుతాడు ఈ జాలి దుర్భరమవుతుంది'

రాజమ్మ తన మనస్సును తగినట్టుగా నడుచుకోలేదని రామయ్య ఆగ్రహించాడు ఇంటికి వెళ్ళాలి, ఈమెను నిలదీసి అడగాలి సరైన రీతిలో దండించాలి, ఇక ముందు ఆమెను అదుపులోకి తెచ్చుకోవాలి ఇలాంటి అపవాదు వచ్చిన తర్వాత భర్త పెత్తనం ఎంత దుర్బలమవుతుందో భర్త అయినవాడికి అర్థంకాదు గాలిని బంధించే విధంగా మనస్సునె బంధించవచ్చు ఎలా బంధించవచ్చునన్న విషయం మాత్రం మనుషులకు తెలియదంటె తన మనస్సునే బంధించుకోలేని మనిషి మరొక మనస్సును ఏ విధంగా బంధించగలడు? అయితే సమాజ సంప్రదాయం ప్రకారం 'భర్త' అనేవాడు

ఒక విచిత్ర ప్రాణి తాను మగడు కావడం వల్లనె భార్య మనిషి మీద అదికారం ఉందని బావిస్తాడు ఆ భావం చేత ప్రేరితుడై అలా నడుచుకుంటాడు

ఆ రోజు రాత్రి రామయ్య, బార్య తన దగ్గరికి రాగానే ఆమెను తాకడానికి మనస్సు రాక చిరాకు పడ్డాడు అతని ముఖంలో ఎప్పటిలాగా స్నేహబావం లేదు అతని మాటలు వాడిగా ఉన్నాయి కంఠధ్వనిలో కాఠిన్యం కన్పించింది అయినా ముందు వెనుకలు ఏమి చెప్పకుండా "నువ్వు ఇల్లు వదిలి పెట్టి అనవసరంగా మీ ఊరికి వెళ్తూ ఉండడం మంచిది కాదు " అన్నాడు

రాజమ్మకు ప్రాణం లేచిపోయినంత పని అయింది ఆమె ఊరికి వెళ్ళి తిరిగి వచ్చి పదిరోజులకు పైగా అయింది నిష్కారణంగా అన్నమాట, దాంతోపాటు ఆయన కళ్ళలో కాఠిన్యం, ఆమెకు విచిత్రంగా కన్పించాయి అయినా వెనకా ముందూ ఏమి తెలియక పోవడం వల్ల ఆమె ఎప్పటిలాగనే జవాబిచ్చింది

"నేను వెళ్ళాలని చెప్పలేదు కదా?"

చాలాసేపు ఆలోచించి ముందు వాక్యాన్ని సిద్ధం చేసుకున్న భర్తకు ఆ జవాబుకు ప్రత్యుత్తరం ఏమివ్వాలో తోచలేదు "ఇక ముందు వెళ్ళడం కాదు, ఇంతకు ముందు వెళ్ళిన విషయం" అని అనాలి "ఏముంది?" అని అడుగుతుంది ఏమని చెప్పాలి "సరసప్పలో" సరసాలు ఆడావా?" ఇలాంటి మాటని చెప్పడానికి భర్త అయినవాడికి మనస్సురాదు "జనం ఏమైనా అనుకొంటారు నేనూ, నువ్వూ ఒకే చోట ఉందాం" ఇలా ఏదో తేల్చేసి మాట్లాడాలి ఇలాంటి మాటలు భార్యను అదుపులోకి తేలేవు రామయ్య రెండు క్షణాలు ఆలోచించి "ఆమాటలన్ని అనవసరం నేను చెప్పిన మాటను గుర్తుంచుకో" అన్నాడు ఇక మాట్లాడడం ఇష్టం లేదన్నట్టుగా, ప్రక్కకు తిరిగి నిద్ర నటించాడు

రాజమ్మ తన భర్త తీరును గమనించి ఏదో ముంచుకొచ్చిందని గ్రహించింది గ్రామస్థులు తననుగురించి చెడ్డగా అనుకుంటున్న విషయం

రాజమ్మకు ఇదివరకె తెలుసు అది భర్త చెవిని పడి ఉంటుందా? అందువల్ల అతను కోపగించుకొని ఉండొచ్చా? ఏమి జరిగిఉంటుంది అనిఆలోచిస్తూ పడుకొంది ఆమె ఇంతకు ముందు తాను రెండు సార్లు పుట్టింటికి వెళ్లి మూడు, నాలుగు రోజులు ఉన్న విషయాన్ని గుర్తు చేసుకొంది ఆమెకు పుట్టినిల్లు ఈ ఇంటికంటె ప్రస్తుతం ఎక్కువ బాగుందనిపించింది ఎందుకో మరి? ఆ ఇంట్లోని వాళ్లంతా తనను ఆప్యాయంగా చూసుకొనేవాళ్ళు వదిన ముఖం త్రిప్పుకోవడం తప్పితే, ఆ ఊరు ఈ ఊరుకంటె ఎంతో మేలనిపించింది అదెందుకన్న విషయాన్ని ఆలోచించి ఇలా మనుస్సులో అనుకుంది నరసప్ప మాటలు వినాలనిపిస్తుంది అతను ఈమెను మెచ్చుకొంటున్నట్లుగా ఉండెవాడు భర్త అలా ఎప్పుడూ మాట్లాడలేదు అయితే అక్కర్తతో చూసుకొనేవాడు అది చాల కాలం నాటి మాట ఇటీవలి కాలంలో తన భర్త తన వైపు నవ్వుముఖంతో చూసినట్టుగా గుర్తులేదు తన కడుపులో ఒక కాయ కాయలేదు ఏం చెయ్యాలి? నా నుదటి వ్రాత అంతే దీనికి భర్త చిరాకు పడితే ఎలా? రాజమ్మ మనస్సు ఈ ఆలోచనలవైపు మళ్ళీ నెమరు వేస్తూ ఇరుసులో ఇరుక్కున్న సానరాయులా తయారైంది ఆశపడి తెచ్చిన చీర, రంగునిలవడంలెదు ఎంతో ఆశతో ఆరంబించిన జీవితం, రంగు నిలువలేదు ఏం చెయ్యాలి? చీరను కట్టి చింపాలి, జీవితాన్ని అనుభవించి ముగించాలి

కొంతకాలం భార్యాభర్తలు ఒకరితో ఒకరు మాట్లాడకుండా ఇంట్లో కాలం వెళ్ళబుచ్చారు బ్రతుకులోని ఈ శూన్యస్థితి రాజమ్మకు దుస్సహమైంది ఆమె ఒకరోజ భర్తతో "నేను పదిరోజులు మా అన్న ఇంట్లో ఉండి వస్తాను"

"మీరు నా మీద చాల విసుగు చెందారు నాకూ చాలాకష్టంగా ఉంది" అని చెప్పి ఈ మాటని చెప్పాలని ఆమె ఉద్దేశం అయితె అవినోట పెగల్లేదు

రామయ్య "నీయిష్టం" అన్నాడు ఆతను చెప్పిన తీరు సరిగా లేదని పించింది ఆమెకు నీవు పో నక్కర్లేదని అంటాడని ఆమె ఆశించింది అతను

అలా అనలేదు, ఆమె మనస్సుకి కష్టమనిపించింది ...... నామీద కోపగించుకొన్నారు? నామీద ఒట్టు ఇలా చేయకండి" అని అనాలి ఎందుకో సంకోచించింది ఆ సంకోచాన్ని వదిలించుకొని చెప్పాలనుకొనేసరికి "ఇష్టంవచ్చిన వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి నన్ను జనం మరింత అనుకొనేలా చెయ్యొద్దు" అన్నాడు

రామయ్య మనస్సు ఎందుకు చెదిపోయిందో రాజమ్మకు స్పష్టమైయింది ఇది తెలుసు కొన్న తర్వాత న్యాయంగా ఆమె తన ఉద్దేశాన్ని వదలిపెట్టాలి విడిచిపెట్టలేదు మరుసటిరోజు కుంటల పల్లెకు వెళ్ళింది వెళ్తూ "నరసప్ప ఇంటికి వెళ్ళకూడదు, ఆతనితో మాట్లాడ కూడదు" అని నిశ్చయించుకొంది

అయితే అనుకొన్నట్టుగా జరగలేదు ఆమె పుట్టింటికి వెళ్ళిందే తడవు ఆమె చెల్లెలు "జడవేస్తాను ఇంటికి రా" అని పిలిచింది ఆమె వెళ్ళలేదు మరుసటిరోజు ఆమె పిలుచుకొని పోవడానికి వచ్చింది ఆమె ఏదో సాకుచెప్పి "ఇప్పుడు రావడానికి వీలుకాదు" అంది "ఎందుకు" అని చెల్లెలు అంది నోరు తెరచి ఏమి చెప్పడానికి వీలులేక విధిలేక ఆమె వెంట వెళ్ళింది వెళ్ళడమే తరువాయి రాజమ్మ గొంతుధ్వని విని నరసప్ప వచ్చి ఆమెతో మాట్లాడుతూ నిల్చుండిపోయాడు విధి లేక ఇంటికి వెళ్ళినట్టే గత్యంతరలేక ఆతనితో మాట్లాడింది అయితే ఇది సత్యం భర్త ఆజ్ఞప్రకారం ఆయింటికి వెళ్ళకూడదు, అతనితో మాట్లాడకూడదు అని అనుకుంది పైపెచ్చు, ఆ రెండింటివల్లా ఆమెకు సంతోషం ఉంది త్వరగా వెళ్ళి వస్తానని చెప్పిన ఆమె జడవేసింది, వేయించుకొంది, ఆ రెండింటివల్లా కావలసినంత పొద్దు గడిపి అత్తయింటికి వెను తిరిగింది

మూడోరోజు మధ్యాహ్నం రాజమ్మ బావిదగ్గరికి వెళ్ళి తిరిగి వస్తుంటే నరసప్ప ఎదురువచ్చాడు "బావికి వచ్చావా రాజమ్మా?" అని ప్రశ్నించాడు నవ్వుతూ చూశాడు ఆతని దృష్టి ఆమె ముఖం మీద పడింది, శరీరం మీదకి ప్రాకింది ఏదో చెప్పలేని సంతోషం, దానికి ఏదో భయం, ఆమె మనస్సులో ఒక్కసారిగా ఆవరించాయి, దేహం జుమ్మనిపించింది అడిగిన ప్రశ్నకు బదులుగా "ఊఁ" అని మాత్రం చెప్పి ఇంటికి త్వరగా వచ్చేసింది

అతన్ని వదలి ఇటుపైపు వచ్చిన క్షణమె ఆమెకు కాళ్ళలో నడవడానికి శక్తి లేనట్లనిపించింది, గుండె జోరుగా కొట్టుకుంది, మొహం చెమర్చింది మనసుకు కొంచెం సంతోషం, దానికి తోడు కొంత ఇబ్బంది కలిగింది

రాజమ్మ మరుసటిరోజ సాయంత్రం గ్రామానికి వచ్చేసింది భర్త "ఇదేమిటి త్వరగా వచ్చేశావు?" అని అడగలేదు "నరసప్ప ఇంటికి వెళ్ళావా?" అని ప్రశ్నించలేదు ఈమె ఎదురుగా వచ్చి నిల్చున్నా చూడనట్టు మొహం ప్రక్కకు త్రిప్పేశాడు

మూడో రోజు ఇంట్లో కూర్చోవడానికి విసుగు పుట్టి రాజమ్మ ఉతకాల్సిన గుడ్డల్ని తీసుకుని బావి వైపుకు వెళ్ళింది బట్టలు ఉతకడానికి మధ్యాహ్న సమయంలో గ్రామస్థులు వెళ్ళడం పరిపాటి అయితే ఈమె ఆరోజు ముందుగానె వెళ్ళింది ఈమె బావి దగ్గర బట్టలు ఉతుకుతోంది తోపులోనుండి నరసప్ప వచ్చాడు, " రాజమ్మా బావికి వచ్చావా?" అని అడిగాడు రాజమ్మ "ఊ" అంది తలవంచుకొని పని చేస్తూవుంది అతను రెండు క్షణాలు అక్కడె నిల్చుని వెళ్ళిపోయాడు అతను ఎక్కడికో వెళ్ళాలని బయల్దేరినా, తననుచూడడానికె ఇక్కడికి వచ్చి కాచుకొని ఉండాలని రాజమ్మ ఊహించింది ఇతను ఇలా రావడం తప్పు అని ఆమెకు అనిపించింది అయితె వచ్చాడని సంతోషపడింది ఆమె ఉతికి ఎండిన గుడ్డల్ని గంపలో వేసుకొని బావినుంచి బయటికి వచ్చింది

రోడ్డుకు దగ్గర్లో ఈమె కంటికి కన్పించారు ఒకడేమో నరసప్ప, ఇప్పుడు ఇక్కణ్ణుంచి వెళ్ళినవాడు మరొకడు ఎవరు? రాజమ్మ చూసింది ఇంకొకడు రామయ్య ఆ రాత్రి రామయ్య విస్తరి ముందు కూర్చొన్నప్పుడు రాజమ్మ ఎప్పట్లాగానే వడ్డించడానికి వచ్చింది అతను, "చిన్నమ్మ, నువ్వువడ్డించు" అని తన పినతల్లిని పిలిచాడు

ఆమె, రాజమ్మకు ఒంట్లోబాగా లేదేమో, ఇతనికి తెలిసుండాలి, అందుకె పిలుస్తున్నాడు, ఈ కోడలు తనకు ఒంట్లో బాగాలేదని చెప్పరాదా? అని ఆలోచిస్తూ కొడవలి చెంబులోంచి గిన్నె తీసుకుని, "ఏమా! ఒంట్లో

బాగోలేదా?" అని అడిగింది రాజమ్మ మొహం చిన్న బుచ్చుకుంది ఆమె బదులు చెప్పలేదు గిన్నెను అత్త చేతిలో ఉంచి లోపలికి వెళ్ళింది ఒక పైపు గోడకు ఆనుకుని కూర్చుంది

రాత్రి పడకగదిలో రాజమ్మ తనకు పరుపువెయ్యడానికి రామయ్య అనుమతించలేదు తన పరుపును తానే వాక్కొన్నాడు తనంత తాను పడుకొన్నాడు

మాట్లాడకపోతే మార్గం లేదు రాజమ్మ "ఎందుకింత కోపంగా ఉన్నారు? నేనేం చేశానని?" అడిగింది

"ఏం చేశావా? నీకు తెలీదా?"

"ఏం చేశావని అడగండి, చెప్తాను! కావాలంటే దేవుడిమీద ప్రమాణం చేస్తాను నేనే పాపమూ చెయ్యలేదు"

"పాపంచేసిన ఏమిటంద చెప్పావని ఒప్పుకొంటుంది?"

"దేవుడిమీద ఒట్టు ముందుగాని అని అనకండి దేవుడిదయవల్ల మీరు నూరేళ్ళు బతకాలి"

"ఇలాంటి బతుకు బతకడంకంటే ఇద్దరూ ఇప్పుడే చస్తే బాగుంటుంది"

"ఎందుకు, ఏమైంది"

"మీ అన్న ఇంటికి వెళ్ళావు కదా, నరసప్ప ఇంటికి కూడ వెళ్ళావా, లేదా?"

"నేను వెళ్ళకూడదనే అనుకున్నాను లక్ష్మి ."

"నాకీ పురాణం అంతా అవసరం లేదు వెళ్ళకూడదని నేను చెప్పాను నా మాట కాదని వెళ్ళావు"

"కొంచెం వినండి"

"నేను వినను. వెళ్ళుంటే వెళ్ళానని చెప్పు లేకపోతే లేదని ఏడు".

"తప్పయింది ఆమె పట్టు పట్టి లాక్కు వెళ్ళింది వెళ్ళాను"

"బావి దగ్గరికి కూడ అదే పట్టుబట్టి పిలుచుకొని వెళ్ళిందా?"

ఇతను తన నడతను గమనిస్తున్నాడని తెలిసి రాజమ్మకు బాల భయం వేసింది చాలా ఆశ్చర్యం కూడ అయింది ఆమె కళ్ళు పెద్దవి చేసి అతని పైపే చూసింది

"ఆహా! ఎవరూ చూడలేదని అనుకున్నావు కదా! మీరు మాట్లాడు కొన్నది ఎవ్వరికీ తెలియకపో వచ్చు మంచి మధ్యాహ్న సమయంలో బావి దగ్గర చేరితె ఎవరికీ కనిపించకుండా ఉంటుందా? ఆ రోజు నరసప్ప బావి దగ్గరికి వచ్చాడు కదా"

"నేను నిజం చెప్తాను "

"ఏయ్, సిగ్గు వదిలేసిన ఆడదానా! దాన్ని నిజం, నిజం అంటావు? ఎందుకొచ్చావు నువ్వు ఆ ఇంటికి? మా యింట్లోఎప్పుడూ ఇలా జరగలెదు నా నొసట రాసివుంది! నిన్ను తెచ్చుకొని మా వంశకదని ఇలా ముగించాలని మంచిది, ఎలావుంటే నీకు సుఖం అనిపిస్తుందో అలానె ఉండు! నాకు సుఖం అనిపించినట్టుగా నెనుంటాను ఇక నాకూ నీకూ సంబంధం లేదు"

రాజమ్మ వెంటనే మోకాళ్ళ మీద కూర్చుంది అతని కాళ్లమీద తల ఉంచింది "నేను తప్పు చెయ్యలేదు" అంది

రామయ్య తన్నాలని అనుకోలేదు కాళ్ళను లాక్కొన్నాడు ఆ వెగంలో అవి ఆమె నుదుటికి తగిలాయి ఆతను తన్నాడని ఆమె అనుకుంది ఒక క్షణం కింద అంత వినయంగా ఉన్న జీవం, ఇతను తన్నాడని తెలుసుకోగానే కోపంతోనిండిపోయింది ఊగిపోయింది రాజమ్మ చివాలున లేచి నిల్చుంది, భర్త పైపు రుసురుసమంటూ చూసింది, ఒక క్షణం అలా ఉంది, ఏమీ మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయింది

రామయ్య అలాగే పడుకొన్నాడు ఉదయం లేచి కొంచెం డబ్బు తీసుకొని ఇంటినుంచి బయటికి వెళ్ళిపోయాడు ఆ రోజు సాయంత్రం

హాలార్‌నుంచి వీళ్ళింటికి ఉత్తరం తెచ్చారు ఆ సమయంలో రాజమ్మ, ఆమె అత్త, రామయ్య కోసం శావిగె, కుంబల పల్లి "గ్రామాలని గాలించి వచ్చారు బావులు, చెరువులు చూసి వచ్చారు జాబురాగానే రామయ్య కాశీ యాత్ర చెయ్యడానికి బయల్దేరాడని ప్రస్తుతం అతనికోసం నిరీక్షించాల్సిన అవసరం లేదని వాళ్ళకు తెలియవచ్చింది

రాజమ్మ సంసారం పాడయిపోయింది రామయ్య పినతల్లి కొంతకాలం అక్కడే ఉంది, ఎవరో బంధువుల దగ్గర ఉండాలని మరెక్కడికో వెళ్ళిపోయింది ఇంట్లో ఒంటరిగా ఉండలేక, ఇంటికి తాళం వేసి కుంబల పల్లెకి వెళ్ళి అన్న దగ్గర ఉండిపోయింది రాజమ్మ

## 3

ఇరవై ఏళ్ళు గడిచాయి ఈ మధ్య కాలంలో రామయ్య ఎక్కడెక్కడ తిరిగాడు? ఏం చేశాడు? ఏం తెలుసుకొన్నాడు? అన్న విషయాలను మనం ఊహించుకోవాలి అదే కాలంలో రాజమ్మ ఏ విధంగా ఉండేది, అన్న విషయాన్ని కూడా ఊహించాల్సిందే

ఇరవై సంవత్సరాలు గడిచాక ఒకరోజు శావిగె, కుంబలపల్లి గ్రామాల నడుమనున్న తోపు మధ్య ఉన్న మంటపానికి ఒక సన్యాసి వచ్చాడు అతను సంప్రదాయాన్ని పాటించి తలగొరికించుకున్న సన్యాసి కాదు, దండాన్ని చేతబట్టినవాడు కాదు అతను వెంట్రుకల్ని బాగా పెంచాడు గడ్డం మీసాలు బాగా పెరిగాయి ఇలా కన్పించే వ్యక్తుల్ని ఈ ప్రాంతంలో మునీశ్వరులు అనిపిలవడం వాడుకలో ఉంది మునీశ్వరుడు వచ్చినరోజే ఈ రెండు పల్లెల్లో ఉన్నవాళ్ళు అతని దగ్గరికి వెళ్ళారు నమస్కారం చేసి, తమ సేవలను స్వీకరించాలని ప్రార్థించారు ఆయన ఎక్కువగా సైగలతోను, మధ్య అతి హీన స్వరంలో సగం మాట తోను, తనకు ఇవన్ని అవసరం లేదని స్పష్టంచేశాడు వీళ్ళు తెచ్చిన పదార్థాలను తాకి, దేవుడికి అర్పించినట్టు చేసి, వీళ్ళకే తిరిగి ఇచ్చివేశాడు మునీశ్వరులు ఇక్కడే కొంతకాలం ఉండాలని గ్రామస్థులు కోరారు సన్యాసి అలాగె నంటూ తల ఊపాడు

నాలుగయిదు రోజుల్లో రెండు గ్రామాల్లోని ప్రజలు తండోప తండాలుగా వచ్చి ఆయన్ని చూసుకొని వెళ్ళారు సన్యాసి ఎక్కువ సమయాన్ని ధ్యానంలోనె గడిపేవాడు ప్రజలు ఆయన్ని చూడడానికి అవకాశం ఉన్నది సాయం వేళలో, అదీ కొద్ది సేపు మాత్రం, బావి ప్రక్కల్లో ఉన్న రః అత్తి చెట్టు క్రిందనే ఇతని ప్రవర్తన గ్రామస్థులకు చాల సంతోషాన్నిచ్చింది ఎవరో మహాత్ముడు వచ్చాడన్న వార్త చుట్టు ప్రక్కల ఉన్నా గ్రామాలన్నిటికి ప్రాకింది

ఆతనికి నీడనిస్తున్న చెట్టును జనం మునీశ్వరుడి చెట్టు అని పిలిచారు

ఊళ్ళో ఉన్న ఆడవాళ్ళు అక్కడికి వచ్చి సన్యాసికి నమస్కారం చేసేవాళ్ళు వాళ్ళల్లో రాజమ్మ కూడ ఒకతె ఆమె తన చెల్లెలితోపాటు మహాత్ముణ్ణి చూడడానికి వచ్చింది

అప్పటికే నరసప్ప కన్ను మూశాడు ఆయన్ను చూడవచ్చిన ఆ చెల్లెలు విదవ

సన్యాసికి నమస్కారం చేసి కూర్చొన్న మూడు నిమిషాలకే ఇతను రామయ్య అన్న విషయం రాజమ్మకు తెలిసింది ఆమె తనకే విషయం తెలిసిందని మొహంలో చూపించలేదు అందరిలాగానే ఆమె కూడ కూర్చొని అందరి మాటల్ని వింటూ ఉండేది సన్యాసి మూడు పొళ్ళు మౌనంగా వినేవాడు కష్టాల్ని చెప్పుకొంటే దేవుడున్నాడు, ఆతని మీద భారం వేయండి, ఓర్పు పట్టండి అని సైగలతో బదులు చెప్పేవాడు అది, ఇది కావాలని అడిగేవాళ్ళకి అడగవద్దనో, ఉన్నాదాంట్లో సంతృప్తి పొందండనే సంజ్ఞ చేసేవాడు ఆశీర్వదించమని కోరిని వాళ్ళకు, వాళ్ళు తెచ్చిన కొబ్బరికాయతో పాటు కుంకుమాక్షతలనిచ్చి అనుగ్రహించేవాడు ఇతని చర్యలన్నిటిని గమనించిన రాజమ్మకు ఇతను రామయ్య అన్న విషయంలో లేశ మాత్రం కూడ సందేహం లేకపోయింది ఆరోజు ఆమె త్వరగా లేచింది సన్యాసికి నమస్కరించి చెల్లెలితో పాటు ఇంటికి తిరిగివచ్చింది ఇతన్ని తాను గుర్తించినట్టుగా తక్కిన వాళ్ళు కూడ గుర్తించారా అని ఆలోచించింది రెండుమూడు రోజులు జనం మాట్లాడుకొన్న మాటల్ని బట్టి ఆయన్ని ఇతరులు గుర్తించినట్టు కన్పించలేదు

ఆ నెలలో ఐదారు సార్లు రాజమ్మ సన్యాసి సన్నిధికి వెళ్ళి వచ్చింది ఇతన్ని తాను గుర్తించినట్టు వ్యక్తం చెయ్యలేదు అతను ఏదో విధంగా తనని గుర్తుపడతాడేమోనని నిరీక్షించింది ఆయన చూపుల్లో అదేం కనపడలేదు

చివరికి ఒకరోజు తోపులోని చెట్టు దగ్గరికి ముందువెవచ్చి కాచుకొని, అతను చెట్టు దగ్గరికి వచ్చి కూర్చోగానే ఎదురుగా వచ్చి నమస్కరించింది సన్యాసి కూర్చోమని ఆమెకు సంజ్ఞ చేశాడు

రాజమ్మ కూర్చొంది కంట్లో నీళ్ళు కారుస్తూ, "వదలి వెళ్ళి పోగానే, నన్ను పెళ్ళాడిన దొకటే ఉందన్న విషయం మరచిపోయారా?" అంది

సన్యాసి "మరచిపోలేదు, గుర్తుంది" అని సంజ్ఞచేశాడు

"నేను గుర్తించాను కదా, ఇక మాట్లాడితే తప్పేముంది? నాతో మాట్లాడండి"

సన్యాసి, మౌనంగా ఉండడమే క్షేమం అని సంజ్ఞ చేశాడు నోట పువ్వులాంటి మాటరావాలి, చెత్తలాంటి మాటలు రారాదు, అందువల్ల వీలయినంతవరకు నోరు విప్పకుండా ఉండాలని పైగ చేశాడు

రాజమ్మకు ఇదంతా విచిత్రంగాతోచింది చేత్తో చేస్తున్న సంజ్ఞకున్న అర్థం నోటితో చెప్తున్నట్టుగానే స్పష్టం అయ్యేది చాల సంవత్సరాల సాధనవల్ల అతను ఈ సంజ్ఞా భాషని సిద్ధంచేసుకొని ఉండాలి

రాజమ్మ "నన్ను వదలి మీరు వెళ్ళిపోయారు నాగతి ఏమిటని ఆలోచించారా? చెపట్టిన నన్ను విడిచి వెళ్ళారు కదా, ఇది న్యాయమా?"

సన్యాసి "వదలివెళ్ళిన ఆ మనిషిపేరు ఇప్పుడిక్కడున్న మనిషి వేరు జ్ఞాపకం ఉంది, జీవం ఒక్కటే, అయితే వ్యక్తి అతడు కాడు" అని తెలిపాడు

రాజమ్మ "నాకింతటి సూక్ష్మం తెలీదు వదలివెళ్ళిన భర్త వచ్చారన్నది మాత్రం నాకు తెలుస్తుంది మనస్సుకు నెమ్మదినిచ్చే రెండు మాటలాడండి, నాకంతే చాలు మీరు సన్యాసి అయ్యారు, మిమ్మల్ని మరేమీ నేను అడగను" అంది

"వేపట్టిన బార్య, పదేళ్ళ సంసారం చెసిన నేను, ఎక్కువా కాకుండా తక్కువ కాకుండా ఉండడంవల్లే నాశనమయ్యాను మీరు కోపగించుకుని వెళ్ళిపోయినప్పుడు నెను తప్పు చెయ్యలేదు నన్నూ వదలిపెట్టివెళ్ళారు, నన్ను పెద్దవాళ్ళ చెతుల్లో ఉంచారు చెడిపోకుండా ఉండే యోగ్యత నాకులెదు, నేను చెడిపోయాను ఇప్పుడు చూస్తున్నారుగా నేనెంత ప్రాదేయపడుతున్నానో నేను విదిలాని ఏ ఆడదానితోనా సమానమని మీరు అంటున్నారు దీనికంటె అప్పుడు కోపగించుకొని మీరు నన్ను తన్నారు కదా, అదె నాకు సంతోషం"

సన్యాసి "ఆ రోజు ఆ నేను నిన్ను తన్నలేదు కాలును లాక్కోవడంలో అది నీకు తగిలింది స్త్రీలందరూ లోకమాతలు నాకాలు నీకు తగిలింది తప్పు దాన్ని నమ్మాలి మరచిపోవాలి" అని తెలిపాడు

సన్యాసి "నువ్వు సుఖంగా ఉండు లోకం అంతా సుఖంగా ఉండాలి అలాగే నువ్వు సుఖంగా ఉండాలి నువ్వు ర౹ అందరికంటే ఎక్కువకాదు, తక్కువకాదు" అని తెలిపాడు

"నా బతుకు నాశనం అయింది కదా, నాగతి ఏమిటి?"

"నువ్వు లోకమాతవని గుర్తుంచుకో ఏం చేసినా లోకమాతగానె చేశానని బావించుకో ర౹ సంకల్పాన్ని సాదించు, పాపం పోతుంది"

"అప్పుడూ మీరు నా యోగ్యతకు మించిన నడతను ఆశించారు ఇప్పుడూ నా యోగ్యతను మించిన తపస్సు చేయమంటున్నారు మానంవదలిన దాన్ని, బతకు చెడినదాన్ని, లోకమాత ఎలా అవుతాను?"

"కొత్తగా కావాల్సిన అవసరం లెదు అయ్యేవున్నావు"

"కానివ్వండి దీన్నెలా దృఢపరచుకొవాలి, మీరు నాకు తెలియజెయ్యండి నేను రోజూ వస్తాను వచ్చి మీకాళ్ళు తాకుతాను అనుమతించండి"

"లోకమాతవు నువ్వు నానుండి నీవేమీ నేర్చుకోవాల్సిన అవసరం లెదు నేను నీ బిడ్డను నువ్వు నా కాళ్ళను తాకకూడదు"

"పిల్లలెప్పుడు పుట్టలేదో అప్పడె మనం పరస్పరం బిడ్డలయ్యాం నా జన్మ అప్పుడే పాడయిపోయింది"

రఃలోగా జనం వచ్చారు దగ్గర కూర్చున్నారు రాజమ్మ తన మాటల్ని ఆపాల్సి వచ్చింది

మర్నాడు రాజమ్మ కొంచెం ముందుగా వెళ్ళింది, సన్యాసి బయటికి రాగానే దగ్గరికి వెళ్ళి కాళ్ళు తాకి నమస్కరించింది అతను కూర్చోగానే ఎదురుగా కొంచెం దూరంలో కూర్చుంది, క్షణం ఆగి" నాకు దారి చూపించాలి" అంది

సన్యాసి "నువ్వు లోకమాతవు ఇక నువ్వు అడగతగింది కానీ, నేను చెప్పదగ్గది కానీ ఏమీ లేదు నేను చూపించాల్సిన దారి ఇదే" అని తెలిపాడు

రాజమ్మకు తరువాత ఏం చెప్పాలో తోచలేదు, ఆమె మౌనంగా కూర్చుంది సన్యాసి లేచి మంటపంలోకి వెళ్ళిపోయాడు రాజమ్మ అక్కడే కూర్చుండి పోయింది ఊళ్ళోని జనం వచ్చారు సన్యాసి బయటికి రాలేదు పటం ఎదురుగా కూర్చోని ధ్యానంలో నిమగ్నుడయి ఉన్నారు వచ్చిన జనం చాలసేపు కాచుకొని కూర్చున్నారు సన్యాసి బయటికి రాకపోవడంతో ఒక్కొక్కర్రుగా జనం వెళ్ళిపోయారు రాజమ్మ కూడ ఇంటికి వెళ్ళిపోయింది

మూడో రోజు మళ్ళీ రాజమ్మ కాస్త ముందుగా తోపు దగ్గరికి వెళ్ళింది వాడుక ప్రకారంగా అవేళకు సన్యాసి బయటికి రావాలి ఎందుకో, ఏమో అనుకంటూ ఆమె మంటపం తలుపు వైపు చూస్తూ అక్కడే కూర్చుండి పోయింది వాడుకవేళకు జనం రావడం మొదలు పెట్టారు "మునీశ్వరులు ఎక్కడ ? బయటికి రాలేదు కదా!" అని అనుకున్నారు ఒకడు వెళ్ళి మంటపం వాకిలి దగ్గర నిల్చుని తొంగిచూశాడు

అది ఖాళిగా ఉంది. సన్యాసి ఒకటి రెండు గుడ్డలు, ఒకటి రెండు వస్తువులు, దేవుడి పటం, ఏది అక్కడ లేదు "ఏమిటే, మునీశ్వరులు వెళ్ళి పోయినట్టుంది" అని ఆతను గట్టిగా అరుస్తూ చెప్పాడు

రాజమ్మకు పిడుగు మీద పడ్డట్టయింది ఆమె కూర్చున్న చోటే తెలివి తప్పి పక్కకు ఒరిగిపోయింది అయితే వచ్చిన వాళ్ళెవ్వరూ ఈమె వైపు చూడడం లేదు అందరూ మంటపం దగ్గరికి వెళ్ళారు సన్యాసి వెళ్ళిపోయి ఉండటాన్ని చూసి" అయ్యో, వెళ్ళి పోయారు కదా, చెప్పకనే వెళ్ళిపోయారు! ఎవరు ఏం తప్పు చేశామో" అని రకరకాలుగా మాట్లాడు కుంటున్నారు

రాజమ్మ అప్పటికే కోలుకుంది "తప్పు చేసింది ఎవరూ కాదు నాయానా, నేనే చేశాను అప్పుడు భార్యగా ఉన్నదాన్ని, సరిగ్గా నడచుకోలేదు, ఊళ్ళోంచి వెళ్ళగొట్టాను ఇప్పుడు సన్యాసిగా మారివచ్చారు, నడత చెడ్డ ఆడదాని ఉండలేక కాళ్ళు తాకాను, అడవినుంచి కూడ వెళ్ళగొట్టాను నాదయ్యా తప్పు" నాది అంటూ తల బాదుకుంది 'అయ్యా నాదేవుడా ఎందుకు నన్నిలా పరీక్షిస్తున్నావు? అప్పుడు పరీక్షించావు నేను చెడ్డాను మళ్ళీ పరీక్షస్తున్నారు కదా! నేనేం చయ్యాలి? నేనేం చెయ్యాలి, నేనేం చెయ్యాలి?" అని అరుస్తూ మంటపం దగ్గరికి పరుగెత్తింది సన్యాసి మామూలుగా కూర్చుండే స్థలంలో మోకాళ్ళు ఆన్చి నమస్కారంచేసింది నాచెయి వదలకు రక్షించు నాది తప్పయింది, నా తప్పును మన్నించండి నేను చెడిపోయింది నిజం, అందుకని నన్ను వదలద్దు నాదేవుడా, నా చేయి వదలకు కొంగు పట్టుకొని అర్థిస్తున్నాను నన్ను కాపాడు" అంటు బిగ్గరగా అరచింది, శూన్యంలోకి కొంగు పట్టింది

ఈమె ఈ చేష్టల్ని చూస్తుండగా అక్కడికి వచ్చిన జనం సన్యాసి విషయం మరిచిపోయారు రాజమ్మకు మతి చెడిపోయింది మతిభ్రమించిన దానిలాగ అరుస్తూ ఉంది ఆమె మాటలవలన సన్యాసిగా వచ్చిన వ్యక్తి రామయ్య అని అందరికీ అర్థమైంది అంతదాకా అందరూ సన్యాసి గొప్ప వ్యక్తి అని బావించారు అతను రామయ్య అని తెలిసిన తర్వాత వాళ్ళల్లో చాలామంది మనస్సుల్లో అతని మీదున్న గౌరవ బావం సన్నగిల్లింది "ఊరు వదలి పారిపోయాడు వేషంవేసుకుని వచ్చి గొప్పవాడిలా చలామణి కావడానికి చూశాడు ఎప్పుడయితే గుర్తు దొరికిందో, ఇక్కడ ఉండి ప్రయోజనంలేదని మళ్ళీ పారిపోయాడు " అని అనుకున్నారు వాళ్ళల్లో

పేదవాళ్ళు "పో నీ ఇంటికి వెళ్ళమ్మా, దెనికడే సరిపో తుంది రః లో జు ఇంటికి వెళ్ళు " అన్నారు అందరూ తమ తమ ఇళ్ళకు వెళ్ళిపొయారు ఎవరో వెళ్ళి రాజమ్మ ఒక్కత్తే ఉంది ఏదో పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ ఉంది" అన్న వార్తను తెలియజేశారు

ఆమె అన్నయ్య తోపు దగ్గరికి వచ్చారు రాజమ్మ "అయ్యో నా దేవుడా నన్ను వదిలి పెట్టి వెళ్ళి పొయావు కదా! అయ్యో నా దేవుడా నేను మళ్ళీ నిన్ను తరిమాను కదా!" అంటూ అరుస్తూ ఒకసారి మంటపం దగ్గర నిల్చుని తొంగి చూస్తుంది , మరోసారి సన్యాసి కూర్చుండె ఆ చెట్టు దగ్గరికి వెళ్ళి దాన్ని చుట్టేది దాల్లో ఏదో కాలి గుర్తు చూసింది అతని కాలి గుర్తని అనుకుని దాన్ని తాకేది కళ్ళకు ఒత్తుకొనేది, నోటికి తాకించేది ఒక్కోసారి మోకాళ్ళ మీద వంగి ఆ గుర్తు మీద తన నుదురు తాకించేది లేచి కూర్చుని, "అయ్యో నా దేవుడా వెళ్ళి పోయావా?" అంటూ తల బాదుకొనేది ఇలాంటి అవస్థలో ఆమె అన్న అక్కడికి వచ్చాడు

సన్యాసిగా వచ్చినవాడు రామయ్య అయి ఉంటాడని ఆమె అన్నయ్య ముందే అనుకొన్నాడు ఇప్పుడు చెల్లెలి మాటలవల్ల తన ఊహ సరిఅయిందేనని తెలిసి, అతను ఆమె కోసం చాలా దుఃఖించాడు అతనికి రామయ్య విషయంలో ఉదాసీనభావం "మూర్ఖుడు, మగవాడై ఆడదాన్ని అదుపులో ఉంచుకుని బతకలేక పారిపోయాడు తన చెల్లెల్ని దిక్కు లేని అడదానిగా చేశాడు ఆమెను నలుగురి నోట్లో పడెట్టు చేశాడు ఇలాంటి ముండాకొడుకులు బతకలెక సన్యాసులు కావల్సిందే కదా" అనేది అతని అభిప్రాయం అతను రాజమ్మతో "రామ్మా వాడు పో తె పొయాడు వాడిప్పుడు నీకు అక్కర్ల కొచ్చాడు? చాలు, రా' అని పిలిచాడు

రాజమ్మ "అన్నయ్యా, నేను రాను అయనే నాకు కానప్పుడు నువ్వవుతావా? ఒకసారి ఇంటినుంచి తరిమినా పాపం కట్టుకొన్న దాన్ని ఇప్పుడు అడవినుంచి కూడ తరిమిన పాపం కట్టుకుని చావాలా? నేను ఆయన్ని వెదుక్కోనైరావాలి, నేను వెళ్తాను" అంది

ఆమె అన్నయ్య రఃమెకి మతి భ్రమించిందని గ్రహించాడు, "అలాగే,

రా రెపు వెళ్ళవుగాని, కావాలంటె నెనూ వస్తాను" అని అమెరు నవ్వు చెప్పె రీతిలో చెప్పాడు రాజమ్మ అతని వెంట ఇంటికి వెళ్ళింది

ఆమె రాత్రి బోంచెయ్యలేదు ఊరకే గొణుగుతూ ఇంటి పంచలో పడుకుంది ఉదయం వీళ్ళు లేచే సరికి ఆమె అక్కడ లేదు

4

అన్నయ్య ఆమె ఎక్కడికో వెళ్ళి ఉంటుందని నాలుగు వైపులా వెదికించాడు వెతకించిన నాలుగు దిక్కుల్లో ఏది ఆమె వెళ్ళిన దిక్కు కాదు రాజమ్మ నాలుగు సంవత్సరాలు ఎక్కడెక్కడో తిరిగింది చెప్పరానంత కష్టం అనుభవించింది నాలుగు సంవత్సరాల తర్వాత మరీ పిచ్చి పట్టిన దానిలాగ మునీశ్వరుడి చెట్టు దగ్గరికి వచ్చింది

ఊళ్ళో వాళ్ళకి ఆమె గుర్తుతెలిసింది అయితె ఆమె చెదిరిన వెంట్రుకలు, చూపు తగ్గిన కళ్ళు, చిరిగి మాసిన గుడ్డలు, పచ్చి పచ్చి మాటలు, ఇవన్నీ ఎవరినీ ఆమెదగ్గరికి వెళ్ళడానికి ధైర్యం లెకుండా చేశాయి ఆమె మధ్యాహ్నం ఊళ్ళోకి వెళ్ళి, ఒక్కొక్కసారి అన్నయ్య ఇంట్లో బోజనం చేసేది తక్కిన సమయాల్లో ఆమె తోపులో కాలం గడిపేది మునీశ్వరుడి చెట్టు కింద కూర్చొనేది కొంత సేపు తనకు తాను ఏదో పాడుకొనేది కొంతసేపు ఎవరితోనో మాట్లాడుతూ ఉండేది ఒక్కొక్కసారి నవ్వేది "ఆఖరుకు వచ్చారుకదా" అనేది మరోసారి "సన్యాసిగా వచ్చారంటే ఇది అబద్ధపు మాట" అనేది ఎవరైనా పెద్దవాళ్ళు ధైర్యం చేసి దగ్గరికి వస్తే "నేను బతుకు చెడుపుకున్నాను లయితె నా బర్త ఫరవాలేదన్నారు జీవితం చెడగొట్టుకొన్న వాళ్ళు లోకంలో ఉన్నారు" అనేది

పిచ్చిదయినా ఆమె ఎవరికి హాని చేయదని తెలుసుకొన్న తర్వాత, ఊళ్ళోని జనం కొంతమంది ఏడ్పించడం మొదలు పెట్టారు తెలిసినవాళ్ళు ఇది చూస్తే వద్దనే వారించేవాళ్ళు అలాంటివాళ్ళు లేనప్పుడు రాజమ్మ ఆకొంటెగాళ్ళను పిచ్చిగా అరుస్తూ వాళ్ళను తరిమేది

ఏమైనా ఉన్న నాలుగైదేళ్ళు ఆ తోపు ఆమె తోపే అయిపోయింది

ఆమె, మునీశ్వరుడి చెట్టు పిచ్చిదయింది

ఇలా ఉంటుండగా ఒకరోజు ఆ పిచ్చిది ఆ స్థలం నుంచి మాయమైంది ఎక్కడికి వెళ్ళిందని విచారిస్తే పొలాల్లో పని చేసుకునే వాళ్ళనుంచి వివరాలు తెలిశాయి కాషాయ రంగు గుడ్డల్ని ధరించిన వ్యక్తి ఒకడు హోలార్ మార్గం గుండా వెళ్తున్నాడు పిచ్చిది, " నా దేవుడా" అంటూ అరుస్తూ అతని వైపు పరిగెత్తింది ఆ వ్యక్తి రఃమెను చూసి భయపడినట్టున్నాడు ఆతను పరుగెత్తాడు రఃమె "నేను మళ్ళీ మిమ్మల్ని వదలను మీరు నన్ను పిలుచుకొనే వెళ్ళాలి" అని వడివడిగా ఆతని వెంట పరుగెత్తింది

పిచ్చిది వెనక్కి తిరిగరాలేదు అన్నయ్యకు ఆ రాత్రి బాటసారులు ఆమె సంగతి తెలిపారు హోలార్ గ్రామ సమీపంలో ఓ అనాధ దార్లో చచ్చి పడివుంది

# చెన్నమ్మ

పురోహితుల కుటుంబానికి చెందిన లక్షమ్మగారు, తలమీద తోమిన పాత్ర గంపను, నడుంమీద నీళ్ళు నింపిన చిన్న కడవను పెట్టుకుని చెరువునుంచి ఊళ్ళోకి రావడానికి సిద్ధంగా ఉన్నారు ఊరి లోపలినుంచి రామప్ప, చెన్నమ్మ, చివరిగా మాదప్ప బయటకు వచ్చారు చెన్నమ్మ బిడ్డను ఎత్తుకుని ఉంది

లక్షమ్మగారు "ఏం రామప్ప, బెంగుళూరుకు బయల్దేరుతున్నవా? ఎవరా అన్నారు, ఈ రోజు ఉదయం నువ్వు వచ్చావని వచ్చినవాడివి ఒక రోజు ఉండి అందర్ని చూసుకోని వెళ్ళరాదా?" అన్నారు

"లేదమ్మగారు, పనిచేసిన రోజుకు జీతం అందువల్ల వచ్చినవాణ్ణి వెంటనే వెళ్తున్నాను ఇంకోసారి వచ్చినప్పుడు ఒకరోజు పోతెపోని అని ఇంటికి వచ్చి వెళ్తాను"

"చెన్నమ్మ తోడు వస్తుందా?"

"అవునమ్మగారు వెళ్ళొస్తాను మంచిది కానివ్వమని దీవించండమ్మగారు"

ఈపాటికి దగ్గరికి వచ్చిన మాదవ్వ "ఎప్పుడూ ఊరు వదలివెళ్ళని పిల్లకాదు ఈ రోజు బెంగళూరు పేటకు బయల్దేరుతోంది దేవుడు మంచి చెయ్యమని ఆశీర్వదించు లక్ష్మమ్మ పైగా చేతిలో ఈ పసికందు నాకు ప్రాణంలా ప్రాణంలేదు" అంది

ఈమాట రామప్పకు రుచించలేదని ఆయన ముఖం చెప్తోంది లక్ష్మమ్మ, "ఎందుకు ఆలోచిస్తావు? రామప్ప బుద్ధివంతుడు భార్యని, బిడ్డని

చూసుకొంటాడు పల్లెమయితెనేం? సంత అయితేనేం? చెన్నమ్మ ఏమాత్రం తెలివిలేని పిల్లనా? ఊరిని పాలించే తెలివి ఉంది సుఖంగా ఉంటుంది ఊరికే ఉండు" అన్నారు

"ఉంటాగా కానీ అమ్మా ఉంటాగా కానీ, అయితే ఊళ్ళో ఉండె మా గుండె కొట్టుకొంటూ ఉంటుంది"

"ఏమీ వద్దు సుఖంగా ఉంటారు నన్ను చూడు నీళ్ళు నిండిన కడవ తెస్తూ ఉన్నాను రామప్పా! పెళ్ళాన్ని, బిడ్డనీ జాగ్రత్తగా చూసుకోవయ్యా

"వస్తాం తల్లీ, చూసుకొంటానమ్మగారు వస్తాం"

"దార్లో ఆంజనేయస్వామికి కొబ్బరికాయ కొట్టి నమస్కారం చేసి వెళ్ళండి"

ఇలా అంటూ లక్ష్మమ్మగారు ఊరి వాకిలినుండి లోపలికెళ్ళారు రామప్ప, చెన్నమ్మ, మాదవ్వ ముందుగు నడిచారు వెనుక బోయ లక్కుడు చిన్న బట్టల మూటను ఎత్తుకొని నడుస్తున్నాడు అది చెన్నమ్మ బట్టల మూట అయిఉంటుంది

మాదమ్మ, బిడ్డనీ అల్లుణ్ణీ కొంతదూరం సాగనంపి వాళ్ళు దెవస్థానంలో కొబ్బరికాయ కొట్టి ముందుకు బయల్దేరి పోగా దార్లో నిల్చుండి పోయింది వీడ్కోలు చెప్తూ కూతురు ముంగురుల్ని సవరిస్తూ "వెళ్ళొస్తావా బిడ్డా? పాపను బాగా చూసుకో మొగుడికి పూట పూటకి సంగటి పెట్టు బుద్ధిమంతురాలిగా బతుకు" అంది మనవణ్ణి చేతుల్లోకి తీసుకొని మనసారా ముద్దాడింది "నా బంగారు బిడ్డని ఇష్టం వచ్చినోళ్ళకియ్యొద్దు, దిష్టి తగిలెను, తీస్కో" అంటూ వెనక్కిచ్చింది, పిల్లాడి మొహాన్ని చేత్తో నిమిరి, తన తల ప్రక్కకి వాణ్ణుంచి మెటికలు విరిచింది, పొంగి వస్తున్న కన్నీళ్ళను చీర కొంగుతో తుడుచుకొంది

ఒక నిమిషంలో లక్కడు వచ్చాడు ముసల్ది వాడితో 'ఏంయ్, లక్కప్పా, జాగ్రత్తగా పిల్లల్ని రైలెక్కించి దీపం పెట్టే పొద్దుకి వచ్చేస్తావు కదరా?" అంది వాడు "ఊ, వచ్చేస్తానమ్మ" అన్నాడు ముసల్ది "రాగానే నాకోమాట చెప్పు,

రైలు సిక్కిందని" ఉంది అక్కడు "అట్టాగేనమ్మ" అని చెప్పి బయల్దేరాడు

ముసల్దానికి రః అల్లుడు బెంగుళూరులో సంసారం చెయ్యడం ఇష్టంలేదు రామప్ప ఆమె పదిర కొడుకు అతనికి అంతో ఇంతో భూమి ఉంది రఃమెకి కొంచెం ఉంది రెండింటిని బాగా చూసుకొంటే గ్రామంలో తగనంత సుఖ జీవనం గడపొచ్చు అయితే రామప్ప ఇంట్లో తోడు లేక పెరిగాడు, చిన్నతనంలోనే బెంగుళూరు గురించి కలలు కన్నాడు నాలుగు సార్లు అక్కడికి వెళ్ళి, అక్కడ కార్ఖానాల్లో పని చేసే వాళ్ళకు లభించె కూలి లెక్కపెట్టి "ఊళ్ళో జీవితం దరిద్రపు బతుకు పట్టణ జీవితం పుణ్యావంతుల బతుకు" అని మనసులో నిర్ణయించుకొన్నాడు రెండెళ్ళ క్రితం అతని తండ్రి గతించిన తర్వాత, "బెంగుళూరు జీవితం ఎలా ఉంటుందో చూసి తీరాలి" అని అక్కడికి వెళ్ళి ఉండిపోయాడు అతను స్వాభావికంగా మాటకారి ఆరు నెలలు బదుకువల్ల ఊరు కంటె బెంగుళూరె సుఖం అని వాడికి అనిపించింది ఊరికి వెనుతిరిగివచ్చి భూమినిసాగు చేసె విషయంలో తగిన ఏర్పాటు చెసి, మళ్ళీ బెంగుళూరుకు వెళ్ళి ఒక కార్ఖానాలో ఒప్పందం రాసిచ్చి కార్మికుడుగా చెరాడు మద్యలో ఒకటి రెండుసార్లు ఊరికి వచ్చి వెళ్ళడం తప్ప, ఒకటిన్నర సంవత్సరం పాటు కార్ఖానాల్లో పని చెశాడు చేతికి కొంత డబ్బు చెరింది మొదట్లోనే భార్యని బెంగుళూరు తీసుకెళ్ళాలని అనుకున్నాడు కానీ ఆమె గర్భవతి కావడంవల్ల మాదవ్వ ఆమెను అతని వెంట పంపించనని చెప్పింది ప్రసవించి పిల్లాడికి ఆర్నెల్లు అయ్యాక విధి లేక ఆమె ఒప్పుకుంది ఇతను భార్యను పిలుచుకొని ప్రయాణమయ్యాడు

చెన్నమ్మకు కూడ బెంగుళూరు వెళ్ళడం ఇష్టం లేదు అయితే భర్త రమ్మంటె రఃమె మాత్రం ఏమి చెయ్యగలదు? బిడ్డను తీసుకొని బయల్దేరింది తల్లినికూడ తనతో పాటు రమ్మని చెప్పాలి ఆమె రాదు, పైగా అది భర్తకు సమ్మతం కాదని కూడ అతని మాటలవల్ల ఆమెకు అర్థమై ఉంటుంది ఏమైనా ఊరినుంచి బయల్దెరెటప్పుడు ఆమె మనస్సు అంత సంతోషంగా ఏమీ లేదు తెలిసిన వాళ్ళను వదలి, రఃగుడి, రః కుంట, రఃదారి, రః తోపులెని పెద్దపట్టణంలోఒక సందులోని కొత్త ఇంట్లో కొత్త ముఖాలమధ్య కాపురం చెయడం ఆమె సహజమైన ఉత్సాహాన్ని భ్రంశదేసింది

సాయంకాలం అప్పుడు వెళ్ళి తిరిగి వచ్చాడు పోస్టు రైలు అందించని ఉన్నాడు ఆ విషయంలో సందేహమేమీ లేదు అయినా మాటవ్వాసు ర. మాటతోనె నెమ్మదనిపించింది అతి ప్రౌఢంగాని మనుష్య స్వభావానికి ఆటంకం లేకపో ఎడమె ఒక గొప్ప ఆనందం అకారణంగానె వేదకాలంలోని ఆర్యులు రాజా సూర్యుడు ఉదయించినప్పుడు "ఉషో" అని అతి సంతోషంతో బిగ్గరగా అనేవారు

రామప్ప, చెన్నమ్మ పసిపాపతో పాటు బెంగుళూరు సుఖంగా చేరాడు రామప్ప కార్ఖానాకు సమీపంలో పెండేపేటలోని ఒక సందులో ఇల్లు అద్దెకు తీసుకొని ఉన్నాడు రాత్రి ఇల్లు చేరేసరికె, ఇంటి దగ్గరే ఉన్న తోటికార్మికుడు తిరుమలయ్య వీళ్ళింటి దీపం వెలిగించి ఉంచాడు దగ్గర్లో ఉన్న హోటలు నుంచి కొంచెం అన్నం, పులుసు, చారు మజ్జిగ తెప్పించుకొన్నాడు చెన్నమ్మ ఇంటికి చేరుకున్నప్పటినుండే "ఎందుకు ఇక్కడికి వచ్చానో?" అని బాధపడింది ఇంటిముందు మురికి కాలువ వాసన, ఇంట్లోకి వెళ్ళినా అది
ఎ ˇ ఽ ఽ ు ౖ ు
అంటుకుని వచ్చింది పల్లెలో అప్పుడప్పుడు ఇలాంటి వాసనరావడం సహజం అదె ఇక్కడ అరవై గడియల అనుభవంగా కన్పించింది వీధిలో ఆధునిక కాలంలోని, అదెలాంటి మాటో చెప్పాడు రామప్ప, ఆ దీపాలు ఉన్నాయి ఇంట్లో కిరసనాయిలు దీపం చెన్నమ్మ ఊళ్ళో కిరోసిన్ చూసి ఉంది, అయితే తన ఇంట్లో మూడుపాళ్ళు ప్రమిదనె వెలిగించేవాళ్ళు అందువల్ల అమెకు కిరోసిన్ వాసన డాకు తెప్పించె విధంగా ఉంది హోటల్నుంచి తెప్పించిన భోజనాన్ని ఆమె మొగుడికి వడ్డించింది, ఆ తర్వాత ఆమె కూడ నోటికి పెట్టుకుంది అది ఎలాంటి భోజనం! చూడడానికి రంగురంగుగా ఉంది, నోటికి సుఖంలేదు రామప్ప ఒక ప్రక్క కూర్చుని, "ఎందుకు, సరిపడలేదా?" అన్నాడు చెన్నమ్మ "ఏమి వంటో ఇది" అంది, భోజనం చేయడం ముగించింది

పాపకు పాలిచ్చి పడుకోపెట్టింది, దాని ప్రక్కన కూర్చుంది

కొంతసేపటికి తిరుమలయ్య వచ్చాడు 'ఏమయ్యా! మందిరానికి

వస్తావా ?" అని అడిగారు

రామప్ప, "వార్కి ఇల్లు కొత్తది ఒక రోజు నేను రాను నువ్వు వెళ్ళు" అని జవాబిచ్చాడు

"ఇదెట్లాంటిది ? మందిరమా ?" అని చెన్నమ్మ అడిగింది

రామప్ప తిరుమలయ్య ఇద్దరూ దాన్ని ఆమెకు వివరించారు వీళ్ళ మందిరం అన్నది ఒక భజన చేసే ఇంటిని గురించి కార్ఖానాలో పని చేసే వాళ్ళందరూ భజన చేసుకోవడానికి దీన్ని ఏర్పాటు చేసుకున్నారు ఒక్కొక్కరూ కొంత కొంత చందావేసుకుని, అందరూ ఒక చోట చేరి దాన్ని నడపడానిని ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకొని ఆధునిక పద్ధతిలో దీన్ని నడిపిస్తున్నారు కార్ఖానా కార్మికులే కాకుండా ఇతరులు కూడ అందులో చేరవచ్చును కొంత మంది అందులో చేరారు అయితే కార్ఖానా జనమే అధికం మందిరంలో వారానికోసారి అందరూ కలుస్తారు ఎలాంటి చీకూ చింత లేని కొంతమంది రోజూ అక్కడ చేరేవాళ్ళు

రామప్ప మందిరానికి ముఖ్య నిర్వాహకుడుగా ఉండేవాడు అతను దాని కార్యదర్శి ఇంతకు ముందు లాంటి ఆలోచన లేకపోవడంవల్ల ఆతను రోజూ మందిరానికి వెళ్ళి వచ్చేవాడు అతను భక్తి గీతాలను పాడడం నేర్చుకున్నాడు అయితె బాగా పాడేవాళ్ళు కొంతమంది మాత్రమె, అందులో రామప్ప ఒకడు అందువల్ల ఆతను రాని రోజు కార్యక్రమం పేలవంగా ఉండెది

చెన్నమ్మ భర్తతో "దేవుడి సేవ ఉన్న తర్వాత వెళ్ళా సరిపో యింది కదా నేనొచ్చానని ఎందుకు నిలపాలి ?" అంది

ఆమె అలా అన్నదె తడవు రామప్ప "అలా అయితే వెళ్ళొస్తాను" అని ఎయుల్దేరాడు "తలుపు వేసుకో దీపం చిన్నదిగా చెయ్యి" అంటూ బయటికి వెళ్ళాడు

చెన్నమ్మ తలుపు వేసుకుంది దీపం చిన్నది చేసి ఒక వైపు ఉంచింది ప్రయాణ బడలిక వల్ల ప్రక్కలో పడుకొంది పడుకొన్న కొద్ది క్షణాలు,

“తనపర్తి, మొదలు ఇల్లు కొత్తది, ఈ రోజా మందిరానికి రాను, అన్నవాడు, ఉండనీ వెళ్ళు, అని చెప్పగానే ఎందుకు వెళ్ళిపోయాడు? ఉండి ఉంటే బాగుండేది” అనుకుంది అలాగే నిద్రపట్టింది

రామప్ప రాత్రి చాలా ప్రొద్దుపోయాక వచ్చాడు చెన్నమ్మకు వర్తి విషయంలో అసమాధానపడడం ఇష్టంలేదు ఇది మన ఆడపడుచుల్లో తరతరాలుగా వస్తున్న సంప్రదాయం పురుషుడు పదిచోట్లకు వెళ్ళాలి, పదిమందిని అనుసరించాలి చేయడానికి వెళ్ళిన పనులన్నింటిని ముగించుకొని రావాలి ఇంటావిడ కోసం మాట్లాడుతున్న మాటల్ని సగంలో వదలి, చేస్తున్న పనిని రేపటికోసం ఉంచి, ఇంటికి ముందుగా పరుగెత్తి రావడానికి వీలుకాదు ఇంతకీ అతను ఈ కష్టాలన్నిటిని పడుతున్నది ఎవరికోసమని? ఇంటి ఇల్లాలికోసం, తమ పిల్లలకోసం అతను వచ్చే సమయానికి నవ్వుతూ పలకరించి, సమాధానపరచి, అతణ్ణి కూడ ఒక పసిపాపలా పెంచడం స్త్రీకర్తవ్యం తెచ్చి పెట్టిన దాన్ని తిని నీడలో కూర్చొనే ప్రాణం ఈ మాత్రం కూడ చేయలేకపోతే, వాననక, ఎండనక తిరిగి తిరిగి, పొద్దస్తమానం కష్టపడి పని చేసి వచ్చే మగవాడు సంసారాన్ని నడపడం ఎలా? చెన్నమ్మ ఈ మాటల నన్నింటిని అప్పుడు మనసులో తిరగేసుకొందని కాదు, ఈ మాటల నన్నింటిని ఒక ఉపన్యాసంలో విన్నదని కాదు, అనేక సందర్భాల్లో పెద్దలు చిన్నవాళ్ళను గురించి అలాంటి మాటల్ని చెప్పగా, విని విని, మనసు ఆ మాటల్ని తలచుకోకుండా వాటి అర్థాన్ని తెలుసుకొనే స్థితికి వచ్చింది రామప్ప తనని పిలుచుకొని వచ్చిన మొదటిరోజే ఇంత ఆలస్యంగా ఇంటికి వచ్చాడే అని ఆమె మనస్సులో ఏదో భావం వచ్చి ఉండాల్సింది అయితే ఆ భావం ఆమెకు కలగలేదు తలుపు తెరచి, అతను పడుకొన్న తర్వాత, అతనికి దుప్పటి కప్పి, తాను పడుకుంది

## 2

రెండు మూడురోజుల్లో రామప్ప సమయం చూసుకుని ఆమెకు ఒక సూచన ఇచ్చాడు ఆమె ఎందుకు కార్ఖానాలో కూలి చేయకూడదు? అతను ఈ మాటను ఎంతో ఉపాయంగా చెప్పినా చెన్నమ్మ ఈ మాట విని సిగ్గు

పడింది తాను మామిని దున్నిన రైతు కూతురు, మామిని దున్నిన భర్తకు భార్య బెంగుళూరులో కూలి చేసి డబ్బు సంపాదించాలా? చెన్నమ్మకు రః కూలి చేసె జనం ఉన్నారు, తాను వాళ్ళలో చేరింది కాదు తాను కూలి ఇచ్చేది! వాళ్ళ గతిలేని జనం తాము బాగ్యవంతులు మరి బాగ్యవంతులు కాకపోయినా ఎంతో ఇంతో గతి ఉన్న జనం ఊళ్ళో కూలి ఇచ్చే తాను పట్నానికి వచ్చి దానికంటే ఎక్కువ పెద్దరికం గడించడానికి బదులు కూలి చేసే ఆడదయితె, బతుకు తలక్రిందు లైనట్టే! ఆమెకు భర్త తన విషయంలో తగినంత గౌరవం చూపడం లేదని పించింది ఇల్లాలిని కేవలం ఒక సేవకురాలుగా బావించాడని అనుకుంది ఎందుకిలా? తెలియని వాడు కాడు, దూరపు బంధువు కూడా కాదు అన్ని తెలిసినవాడు, చెయిపట్టినవాడు, కూలిదానవు చెడ్డ బుద్ధి రః పట్నం ప్రజలు ఆడవాళ్ళను మర్యాదగా బతకనివ్వరు

రామప్ప సూచనకు ఆమె రెండు క్షణాల తర్వాత "ఊళ్ళో కూలిచ్చె వాళ్ళ కూతురు బెంగుళూరులో కూలి చేస్తె బాగుంటుందా? నాకు వద్దనిపిస్తుంది" అంది

"ఏమా, ఏమిటి కూలి అంటె పొలంలో కూలి చేయుడం అనుకున్నావా? కార్ఖానాలో కూలి, ఎండలో నిల్చొనేది కాదు, బట్టలు మాసిపోయేవి కావు అక్కడ నాలుగు మంది మగ కూలీలకిచ్చేది ఇక్కడ ఒక ఆడ కూలికిస్తారు ఇక్కడ కూలి చేసే ఆడవాళ్ళు కట్టుకనే బట్టలు పల్లెలోపదెకరాల పొలం ఉన్న యజమానురాలు కూడ కట్టదు కూలి అంటే ఏమైంది

'ఏమి కట్టుకొన్నా, ఎలాంటివి కట్టుకున్నా కూలి అనేది కూలీనె మన్నపొలంలో మనం ఎండలో కష్టపడ్డా తప్పులేదు మరొకళ్ళ ఇంట్లో నీడలో కూచుని రాగిపిండి విసిరి డబ్బు తీసుకో కూడదు ఊళ్ళొని పొలాన్ని ఎవరి చెతికో ఇచ్చి బెంగుళూరు వెళ్ళి చెన్నమ్మ కూలి చేస్తోందని అంటే పుట్టింటికి మర్యాదనా మెట్టినింటికి మర్యాదనా?"

రామప్ప మాట్లాడడం చాలించాడు

# 3

నెల రోజులు గడిచాయి ఒకరోజు రామప్ప ఆమెకు ఒక జత వెండి కడియాలు తెచ్చాడు, పిల్లాడికి కొత్త చొక్కా, పుట్టింటివాళ్ళకి తెచ్చిన బట్టలు చూపించాడు చెన్నమ్మ ఊరి హనుమంతరాయుడికీ, తల్లికీ, పురోహితుల లక్ష్మమ్మకూ తల మొక్కి కడియాలను చేతికి తొడుక్కొంది, పిల్లాడికోసం తెచ్చిన గుడ్డని చూసి సంతోషపడింది భర్త తన విషయంలో, పిల్లాడి విషయంలో, ఇంత ఉత్సాహంగా ఉండడం ఆమెకు చాల ఉత్సాహాన్నిచ్చింది

మరి కొన్ని రోజులు గడిచాక ఆతను భార్యతో ఒకరోజు "చెన్న, నాకి రోజునుంచి రోజుకు నాలుగణాలు ఎక్కువగా ఇస్తారు" అన్నాడు

చెన్నమ్మ, 'ఇది ఎట్లాంటిది రోజుకు పావలా అనేది? నువ్వు కార్ఖానాలో కూలిగా ఉన్నావా?" అంది

"అదె కదా నెను చెప్పేంది? మరా చాల జీతం అనేదాన్ని కార్ఖానాలో కూలి అంటారు

"అదెట్లా గవుతుంది? రోజుకు లెక్కేస్తే దినం కూలి అవుతుంది నెలకు లెక్కవేస్తే జీతం అవుతుంది ఊళ్ళో సంవత్సరమంతా పనివేసి గింజల్ని తీసుకునె వాళ్ళని జీతగాడంటారు మీరిక్కడికి వచ్చి దినకూలేనా చేసింది?"

"ఇది పల్లెమాట చూడు, మాదావరపు లింగడు ఇక్కడ కోర్టులో పని చేస్తున్నాడు వాడికి నెలకి పదహైదు రూపాయలు వస్తాయి వాడిది కూలి కాదు, ఉద్యోగం నాకు నెలకు ముప్పయిమూడు రూపాయలొస్తాయి, మాది కూలి ఇది పెద్దదా? అది పెద్దదా?"

"ఎట్లాగో నీయిష్టం లింగప్ప ఇక్కడే ఉన్నడా? ఎప్పుడైనా ఇంటి పక్క రమ్మని చెప్పలేదా?"

"రమ్మన్నా, వస్తాడు అయితే వాడిది ఇదే పొగరు తనది ఉద్యోగం, నాది కూలి అని అదిగో ఆపెట చివర్లో గుట్టల దగ్గరున్న ఒక గుడిసెలో ఉన్నాడు

రెండు నెలల తర్వాత రామప్ప పెళ్ళానికి రాళ్ళ ముక్కుపుడక ఒకటి తెచ్చాడు ఆమె దాన్ని చూసి, "ఇది నాకు వద్దు మనవాళ్ళు ఇలాంటి రాయి వెయ్యర్రు" అంది

రామప్ప ఏమి చెప్పినా ఆమె ఆ తెల్లరాయి ముక్కుపుడకను వేసుకోవడానికి ససేమిరా ఒప్పుకోలేదు చివరికాయన దాన్నివెనక్కిచ్చి, కాస్త తక్కువ వెల ఉన్న మరో ఎర్రరాయి ముక్కుపుడకని తెచ్చాడు దాన్ని ఆమె తీసుకొంది తర్వాత, "ఇదేమిటి నెలా, రెండునెలలకి ఇంతడబ్బు మిగుల్తుందా? ఎక్కువగా వచ్చిన డబ్బా ఇది?" అని అడిగింది

రామప్ప, "ఎక్కువగా వచ్చింది, దానికి తోడు అంగడివాళ్ళు డబ్బు తర్వాత ఇద్దువు కాని తీసుకొని పొమ్మంటారు కొంతని ఇచ్చి ఆరు నెలల్లో లెక్క తీర్చేయచ్చు" అన్నాడు

"కడియాలు డబ్బిచ్చి తీర్చేశావా?"

"లేదు, ఇదికొంచెం ఉంది అది ఇది రెండు తీరపోతాయి"

"ఇంక మిగిలే డబ్బుకు నగలు, గుడ్డలు తీసుకురావద్దు సంవత్సరం అయిన తర్వాత ఊళ్ళో పొలం కొందాం"

"పొలం కొనేది పాతమాట పొలాన్ని కట్టుకోవచ్చా? తొడుక్కోవచ్చా? నగల్ని, గుడ్డల్ని వేసుకోవచ్చు వేసుకొన్నవాళ్ళని చూడొచ్చు పొలం కొంటే గుత్తకు ఇచ్చి, సంవత్సరం కాచుకుని నాలుగుగింజలు తినడానికి అవుతుంది ఏం సంతోషం?"

"తండ్రి వచ్చి బెంగుళూర్లో సంపాదించి నాలుగు పొలాలు తీసి పెడితే, కొడుకు ఊళ్ళోనే ఉండి నగా నట్రా కొంటాడు"

"ఏహే, నువ్వేం ముసల్దానవయ్యావా? కొడుల్ని తెచ్చి నలుగు పెట్టడానికి? నేనింకా ప్రాయంలో ఉన్న మొగుణ్ణి! చూశావా?"

చెన్నమ్మ ఏది లేక నవ్వింది "నే చెప్పాల్సింది చెప్పాను ఆ పైన నీయిష్టం" అంది

4

ఈ మధ్య రామప్ప రామ మందిరానికని, మరెక్కడికో అని సాయంకాల పూటవెళ్ళి వారానికి రోజు, రెండు రోజులు రాత్రి చాల పొద్దు పోయిన తర్వాత ఇంటికి రావడం మొదలు పెట్టాడు మొదట్లో రెండు మూడుసార్లు ఇలా ఆలస్యంగా వచ్చినప్పుడు అతను ఆమె దగ్గిరికి వెళ్ళలేదు, ఏదో ఆలోచిస్తున్నవాడిలాగ పడకను కాస్త లాక్కొని ముఖం అటువైపు తిప్పుకొని పడుకొనేవాడు మొదటిసారె చెన్నమ్మకు ఇతను లోపలికి వచ్చినప్పుడు ఏదో వాసన ముక్కుకు తాకింది ఆమె దాని విషయం ఆలోచించలేదు ప్రతి సారి ఇదే వాసన వచ్చినప్పుడు 'ఇది ఏమయి ఉండొచ్చు' అని ఆలోచించింది ఆలోచించింది అయితే కాని, భర్తను అడగలేదు అదే దాక్షిణ్యం వీటినన్నింటిని విచారించి తాను చెయ్యదగ్గదెమిటి ? అతని అదుపులో తానుండాలి, దాన్నొదలి అతనిమీద తన అధికారమా ? ఈ రోజు కాకపోతే రెపు తానే చెప్తాడు అదే తెలుస్తుంది

రాను రాను, రామప్ప ఇలా రాత్రుళ్ళలలో ఆలస్యంగా రావడం సాధారణమై పోయింది మధ్యలో ఒక్కొక్కరోజు అతను రాత్రి అంతా ఇంటికి రాకుండా, తెల్లవారగానే ఇంటికివచ్చి పది నిముషాలుండి కార్ఖానాకు వెళ్ళేవాడు మొదటిసారి ఇలా జరిగినప్పుడు 'ఇదెమిటి రాత్రంతా నిద్రపొలేదా ?' అనిఅడిగింది రామప్ప అదే సమాధానం చెప్పి మాటమార్చాడు ఆ జవాబు ఆమెకు సరిగా విన్పించలేదు, అయితే మామూలుగా ఎప్పుడూ చూపించే దాక్షిణ్యంవల్ల ఆమె ఆ మాటను అక్కడికే వదలి పెట్టింది

ఒకరోజు రాత్రి ఇలా చాల ఆలస్యంగా వచ్చి రామయ్య ఇంట్లోకి ప్రవేశించే సమయంలో చాలా తూలుతూ నడిచాడు చెన్నమ్మ పల్లెలో వద్దె వాళ్ళు ఇలా నడవడాన్ని చూసింది వాళ్ళు తప్ప తాగినప్పుడు ఇలా నడిచేవాళ్ళు తన భర్త ఏమైనా తప్పతాగాడా ? మరేదైనా రోగమా ? ఆమె చాలా భయపడి, అతని దగ్గరికి వెళ్ళి, అతణ్ణి పట్టుకొని పడక దగ్గరికి తీసుకెళ్ళింది అతని ముఖం దగ్గర, అదేదో, చాల చెడ్డవాసన చెన్నమ్మ ఎప్పుడో ఒకటి రెండుసార్లు హొలారులోని కల్లంగడి ముందు వెళ్ళినప్పుడు కల్లు వాసన వచ్చేది ఇది ఆ వాసన కాదు మరేదో వాసన దానికంటచాలా

ఎక్కువగా అతని బట్టలనుంచి ఒక విధమైన వాసన వస్తోంది అదెలాంటిదో వాసనే ఉండాలి, ఆమె ముక్కును బద్దలు చేసేలా ఉంది ఆమె ఈ వాసనని ఎలాగో సహించుకొంది భర్తను పరుపుమీద పడుకోబెట్టింది అప్పుడు ఏమీ మాట్లాడకుండా, ఉదయం ఈ విషయాన్ని విచారించాలనుకుంది

ఉదయం రామప్ప ఫ్యాక్టరి సైరన్ విన్న తర్వాతకూడ కాసేపు పడుకొని, ఆ తర్వాత లేచి తొందరగా చేతులు, కాళ్ళు, ముఖం కడుక్కొని రొట్టెతిని కార్ఖానాకు బయల్దేరాడు చెన్నమ్మ అప్పుడు అతణ్ణే క్రిందటిరోజు రాత్రి అడగాలనుకొన్న మాటల్ని అడగడానికి వీలుకాలేదు ఆ రోజు సాయంకాలం అతను ముందుగా ఇంటికి వచ్చాడు, భోంచేసి రామమందిరానికి వెళ్ళి తొందరగానే ఇంటికి వచ్చాడు ఇలాంటి సమయంలో క్రిందటిరోజు రాత్రి ఒక భాగం, అదెందుకో శూన్యమయిపోయినట్లు ఆమెకు అనిపించింది పల్లెలో ఉండి ఉంటే భార్యాభర్తల జీవితం ఇరవై నాలుగు గంటలూ అన్యోన్యంగా సాగి ఉండేది పట్టణ జీవితంలో భర్త ఇంట్లో ఉన్నంత సేపూ తనవాడు, తక్కిన సమయాల్లో తనవాడు కాడు అన్నట్లు ఆమె మనస్సు బతుకును విభజించుకొంది రామప్ప కూడ ఇంట్లో ఉన్న ఆ కాస్త సేపూ భార్య బిడ్డ అని చూసుకొంటున్నా ఎక్కువ భాగం బయటి జీవితానికి ఎక్కువ విలువ ఇచ్చేలా కన్పించాడు కార్ఖానా బతుకు, రామమందిరం, తక్కినపనులు, ఇతర అలవాట్లు, అతనికీ అతని భార్యకీ మధ్య ఒక పెద్ద అంతరాన్ని కల్పించాయి రెండు కాగితాలను జిగురుతో అంటిస్తే, అవి జిగురు ఉన్న చోట అంటుకొని, లేని చోట ఆ రెండూ వేరుగా కన్పిస్తాయి పల్లె జీవితంలో ఒకదాన్నొకటి చుట్టుకొని అల్లుతాడులాగ కావలసిన వీళ్ళిద్దరి జీవితాలు ఇక్కడ సగం అంటిన, సగం అంటని కాగితంలా తయారయ్యాయి చెన్నమ్మకానీ, రామప్ప కానీ ఈ విషయం గురించి వివరంగా ఆలోచించలేదు అయితే ఇద్దరూ జీవితంలో రుచిని పొందలేక పోయారు

## 5

మళ్ళీ ఒకసారి రామప్ప చెన్నమ్మను కార్ఖానాలో పని చేయమని అడిగాడు చెన్నమ్మకు ఈపాటికి కూలి అనే శబ్దంమీద హీనభావం

తగ్గిపోయింది అయితే, పిల్లవాడిని చూసుకోవడం ఎలా? అంతేకాకుండా, ఆమెకు ఇరుగుపొరుగు వాళ్ళు చెప్పిన మాటలవల్ల కార్ఖానాలో పనిచేసే ఆడవాళ్ళు చెప్పిన మాటలవల్ల, కార్ఖానాలో పనిచేసే ఆడవాళ్ళ విషయంలో మంచి అభిప్రాయం లేదు వాళ్ళలో చాలా మంది నీతి తప్పిన వాళ్ళని ఆమె ఉద్దేశం ఇలాంటి వాళ్ళ మధ్యలో ఉండి తాను పనిచెయ్యడమా? ఇది తన భర్తకి ఎందుకు అవసరమనిపిస్తోంది?

ఆమె, "రోజుకో పావలా ఎక్కువయింది అన్నావు వచ్చే డబ్బు చాలుకదా ఎందుకింత దురాశ? దేవుడిచ్చింది చాలు" అంది

"కడియాలు ముక్కుపుడక తెచ్చిన అప్పు తీర్చడమయింది నాలుగు డబ్బులు సంపాదిస్తే ఊళ్ళో పొలం కొనొచ్చు అన్నావు కదా అందుకోసం ఇలా అన్నాను ఒకడు సంపాదించి మిగిలించేదేముంటుంది? ఇద్దరూ సంపాదిస్తే సంవత్సరానికో పొలం కొనొచ్చు, సంపాదించిన దాంట్లో నాలుగు డబ్బులు మిగిల్చి పండు వేస్తారు పదేళ్ళ సంపాదిస్తే అదొక 'వెయ్యి రూపాయలవుతుంది ఒకడు సంపాదిస్తే వెయ్యిరూపాయలయితే, ఇద్దరు సంపాదిస్తే రెండు వేల రూపాయలవుతే ఎవరైనా వద్దంటారా?"

"అలాగవుతే ఈ బెంగుళూర్లో పదేళ్ళు ఉండాలంటావా? నాకు ఇప్పుడే చాలయి పోయింది"

"ఎందుకు చాలయింది? పల్లెలో తింటున్న రాగి ముద్దంతా పట్నంలో అన్నం అయిపోయిందనా?"

అహా! ఓయబ్బ! నీపట్నం అన్నం, ఈమురికివాడల వాసనా, రెండూ వద్దనిపిస్తున్నాయి.నాకు ఊళ్ళోఉండి, పొలంలోపనిచేసి హాయిగా ముద్దతినాలనిపిస్తుంది ఆ పొలం కొనడానికే ఇప్పుడు సంపాదించాలనేది ఉండె రెండు పొలాల్లో సంపాదించేదేమిటి? హాయి ఏమిటి? మరో రెండు పొలాలు కొంటే హాయిగా ఉండొచ్చు"

చెన్నమ్మ వెంటనే ఒప్పుకోలేదు రామప్ప కూడ ఆమెను బలవంత పెట్టలేదు మూడు రోజుల తర్వాత అతను యేదో మాట్లాడు కొంటూ,

తనతో పాటు కార్ఖానా మేస్త్రిని కూడ పిలుచుకొని వచ్చాడు. మేస్త్రి, కాసేపు తర్వాత తానె సలహా ఇచ్చేటట్టుగా, "రామప్పా, నీ సంసారం చిన్నదిగానె ఉంది. ఇంటావిడ ఊరికె ఎందుకుండాలి కార్ఖానాలో చేరొచ్చు కదా? నాలుగు డబ్బులను సంపాదించవచ్చు" అని మాట మొదలు పెట్టాడు.

రామప్ప, "ఔను నేనూ ఆ మాట చెప్పాను. పిల్లవాడు ఇంకా చాల చిన్న వాడని అలాగే ఉంది," అన్నాడు.

మేస్త్రి "ఏదేం మాట? పిల్లవాడిని చూసుకోవడానికి కార్ఖానాలోపల అన్ని ఏర్పాట్లు ఉన్నాయి కదా! ఎంతోమంది పిల్లలు అక్కడ బాగా పెరుగుతున్నారు. ఇంటికంటె అదె బాగుంది" అన్నాడు.

రామప్ప భార్యతో "ఏమిటే చెన్న, విన్నవా మేస్త్రీగారు చెప్పిన మాటని" అని అడిగాడు. ఆ తర్వాత జ్ఞాపకం చేసుకున్న వాడిలాగ మేస్త్రీతో, "ఊళ్లో జమీందారుగా ఉన్నవాళ్ళు ఇక్కడ కూలికి చేరారన్న మాట నాకు గుండెలు పిండినట్టవుతుంది" అన్నాడు.

మేస్త్రి, "ఊళ్ళో జమీందార్లు, ఏడాదికి నూరు రూపాయల సంపాదన. బెంగుళూర్లో కూలి, నేను నాలుగు వందల రూపాయలు సంపాదించాను. పేరు కడుపునింపుతుందా? మర్యాదను కంచంలో పెట్టుకొని తినడానికి కాదు. అది ఇది చేరి నాది ఇప్పుడు నాలుగు వేలరూపాయిల ఆస్తి ఉంది. జమిన్దారులెవాళ్ళు అంతే జమిందారులుగా ఉన్నారు, వెరే దారి లేదు. అనెవాళ్ళు అనని మనం బుద్ధిగా ఉండాలి,"అన్నాడు.

మళ్ళీ కొంచం సేపు మాట్లాడి మేస్త్రీ వెయల్దేరాడు. అతనూ, రామప్ప ఇద్దరు కలిసె వెళ్లారు.

వీళ్ళ ఈ మాటలవల్ల చెన్నమ్మ మనస్సు కొంచం మారింది. కార్ఖానలో చెరి ఆరు నెలలు చూద్దాం అని ఆమె నిర్ణయించుకొంది. అయితె ఈ విషయం ఊళ్ళో తెలియకూడదు. ఆరోజు సాయంత్రం మళ్ళీ రామప్ప ఆమె కార్ఖానాలో చేరె విషయం ప్రస్తావించాడు, ఆమె ఒప్పుకొంది, "ఊళ్ళో ఎవరికీ ఈ సంగతి తెలియనీయకు," అని చెప్పింది.

## 6

కార్ఖానాలో చెన్నమ్మని కొద్దిరోజులు ఒక పనిలోను, మరికొన్నిరోజులు మరో పనిలోను తర్ఫీదునిచ్చి, నెల నెలన్నర రోజుల్లో రోజుకు పది అణాల కూలి పనికి చేర్పించారు ఈ కూలి చేసే ఆడవాళ్ళు వరుసగా నిల్చుని పనిచేస్తుంటె మేస్త్రీ అయినవాడు అక్కడికి వస్తాడు అక్కడ ఒక్కొక్కర్తి దగ్గరా నిల్చి వాళ్ళు చేసే పనిని గమనించేవాడు ఏదైనా పని విలిపించుకుని చెప్పేవాడు, లేదా తానే వెళ్ళి చెప్పేవాడు, ఇలా చెయ్యడంలో అతను ఒక్కొక్క-సారి అనవసరంగా స్వాతంత్ర్యం తీసుకునేవాడు, చనువుగా మాట్లాడేవాడు వాడుకవల్లనో లేదా మరోకారణం వల్లనో చాలమంది స్త్రీలు ఈ చనువును అంగీకరించారు ఒకరిద్దరు అంగీకరించలేదు అయితే ఆయనతో పోట్లాడడానికి వీలు లేదు చిన్న మాటకు తగువు పడ్డట్లవుతుందని వాళ్ళు సంకోచ పడేవారు

పనిలోనికి చేరిన రోజు మెస్త్రీ ప్రవర్తన చెన్నమ్మకు తెలియువచ్చింది, ఇతను తన దగ్గర ఇలా నడచుకొంటె ఎలా అని ఆమె మనసులో భయం చోటుచేసుకొంది అయితే మేస్త్రీ తక్కిన స్త్రీలతో నడమకోనే రీతిలో ఈమె దగ్గర నడమకోలేదు మాటల్లో ప్రవర్తనలో, మర్యాదతో నడచుకొన్నాడు చెన్నమ్మ, మంచిదయిందనుకొని సమాధానపడి ఇంటికి వచ్చింది నెలన్నర రోజులు ఇదే విధంగా ప్రశాంతంగా నడిచింది

చెన్నమ్మ పేరు ఇతర స్త్రీలకంటే త్వరగానే పది అణాల జాబితాలో చెరింది ఇది ఆమెతో పాటు పనిచేసె ఆడవాళ్ళకు కొంత ఈర్ష్యను కలిగించింది వాళ్ళల్లో ఒకరిద్దరు ఈమె వైపు అసూయతో చూసేవాళ్ళు తమలో తాము గుసగుసలాడేవాళ్ళు "చిన్న వయస్సు, అందంగా ఉంది ఇందువల్ల మేస్త్రీ ఈమెను ఆకర్షించేందుకు ఇదంతా చేస్తున్నాడు" అన్న తమ అభిప్రాయాన్ని వినివిన్పించనట్లు ఈమె చెవికి పడేలా అనుకొనేవారు యు చెన్నమ్మకు ఈ విషయం తెలిసి మనస్సుకు చాల కష్టమనిపించింది కూలి అయితే అవ్వొచ్చు, పరపురుషునితో అవినీతి సంబంధం ఉందని ఎవరైనా అంటే అది విని సహించడానికి ఆమె సిద్ధంగాలేదు ప్రాణంపోతే పోవచ్చు;

చెడ్డ పేరు రావడం భరించరాని అసహ్యం అయితె వీళ్ళు తన గురించి ఏమన్నా మేస్త్రీ తనపట్ల మర్యాదగా ప్రవర్తిస్తూ ఉండడంవల్ల ఆమె మనస్సు గట్టి చేసుకుని తనపని తాను చేసుకొనేది

## 7

రః మధ్యలో ఒకరాజు పొరుగూరి లింగప్ప వీళ్ళయింటికి వచ్చాడు అతను వచ్చినప్పుడు రామప్ప ఇంట్లోలేడు చెన్నమ్మ వాడిని లోపలికి పిలిచింది, ఇంట్లో కూర్చుండనిచ్చి యోగక్షేమాలని విచారించింది, "ఇంటాయన వస్తారు ఉండు" అంది

లింగప్ప, " నేను రః పాటికి మూడు నాలుగు సార్లు ఇక్కడికి వచ్చానమ్మా మీరెవ్వరూ లేరు నీవు కార్ఖానాలో చేరారవని ఆ తర్వాత తెలిసింది ఎందుకమ్మా ఇలా చేశావు ?" అన్నాడు

"ఏమంటున్నావు లింగప్పా ? నేను పనికి చేరడం బాగా లేదంటావా ?"

"ఔను, బాగా లెదు రామప్ప కార్ఖానాలో చెరుతానని చెప్పినప్పడే నేను వద్దన్నాను కచేరి పనుల్లో జీతం తక్కువ కూలినే ఎక్కువగా వస్తుందని అయన ఇక్కడై చేరాడు అప్పుడె రః మాట కూడా చెప్పాడు పెళ్ళాన్ని పిల్పిస్తాను, ఆమెని పన్లో చేర్పుతాను, నీ జీతానికి నాలుగింతలు డబ్బు సంపాదిస్తాను అన్నాడు నేను, నీయిష్టం నాయనా, పెళ్ళాన్ని కార్ఖానా పన్లో చేర్పించకు కార్ఖానా కూలిగా పనిచేసి పరమాన్నం తినడంకంటే, కచేరిలో పనివానిగా మర్యాదగా అంబలి తాగొచ్చని అన్నాను నా మాట అతను వినలేదు నిన్ను పిలుమకొని వచ్చాడు, కార్ఖానాలోనూ చెర్పాడు "

భర్త తనని ఊరినుంచి పిలుచుకొని రావడానికి ముందే తనని కూలిగా చేర్పించడానికి ఆలోచన చేశాడని తెలిసి చెన్నమ్మకు చాల ఆశ్చర్యం వేసింది, అంతె దుఃఖించింది కూడ తన బర్తకి తనని భార్యగా పోషించడానికి చెత కాకపోయింది భార్య కూడా సంపాదించాలి, సంపాదించడానికి భార్య కావాలి భర్తకి తనకంటే, తన సంపాదన ఎక్కువ ప్రీతి పాత్ర మైందని మనస్సులో చాల బాధ పడింది అయినా భర్త బర్తే, దిగమింగి ఆమె, "కూలి

అంటే ఏమనుకొన్నావు? ఊళ్ళో కూలి లాగా గాదు కదా ఇక్కడి కూలి విషయం వేరే" అంది

లింగప్ప, "వేరే గీరే నాకు తెలీదమ్మా నేను మాత్రం కూలి కాదని చెప్పాను నా పెళ్ళాం కూడా అంతే కార్ఖానాలో కూలి గీలి పనికి చెర్పించడం నాకిష్టంలేదు నా మాట విని ఇప్పుడయినా ఆ కూలి పని విడిచి పెట్టడం మంచిది లేకుం నేను దూరంవాణ్ణైనాను మట్టంగా చెప్తున్నాను కార్ఖానా పని మర్యాదకాదు" అన్నాడు

"మట్టం కాదని ఎవరన్నారన్నా? అయితే మట్టానికి తెలిసిన మర్యాద ఇంట్లో మొగుడికి తెలీకుండా ఉంటుందా? ఇప్పుడేమో కార్ఖానాలో చేరాను బాగా లేకపోతే వదిలేస్తాను"

"సరేనమ్మా అయితే చేరినంత సులభంగా వదలిపెట్టడానికి కాదమ్మ డబ్బు రుచి చాల చెడ్డది రామప్ప తెలియని వాడేం కాదు అయితే ఏం చేసేది? జతకు ఆమేస్త్రీ దొరికాడు గాలి తిరిగింది"

ఇలా అంటూ లింగప్ప మరేదో చెప్పాలనుకుంటున్నా తమాయించుకొన్నాడు గాలితిరిగిందేమిటి అని చెన్నమ్మ అడగాలి, తాను చెప్పాలి, అని అతని భావన ఇతని ముందు తనయింటి విషయాలను ఎందుకు ప్రస్తావించాలని చెన్నమ్మ ఊరుకొంది తాను నిరీక్షించింది జరగక పోయేటప్పటికి లింగప్ప తానె మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు

"వాళ్ళిద్దరూ ఒక లేదీని ఉంచుకొన్నారు అందువల్ల ఎంత సంపాదించినా చాలదు అందుకనే రామప్ప నన్ను కూడా సంపాదించమని చెప్పడం"

చెన్నమ్మకు గుండె గుభేలుమంది భర్త ఎన్నో రోజులు రాత్రిళ్ళు ఆలస్యంగా రావడం, అసలు రాకుండానే ఉండడం, ఆమె మనస్సులో సందేహాన్ని కలగజేసింది అయినా ఆమె ఆ వైపు మనస్సు మళ్ళించక ఊరికే ఉండిపోయింది ఇప్పుడు లింగప్ప లేదీని ఉంచు కొన్నాడు అన్న మాటల్ని ఉపయోగించగానే మొగుడు దారి తప్పాడని నిశ్చయమైంది అయితే ఆమెకు "లేదీ" శబ్దం కొత్తది అది మరేదైనా ఉండొచ్చునేమో, తన భయానికి కారణం

ఉండకుండా ఉంచుకున్న ఆశ ఒక్కటే కొంత మిగిలింది ఆమె "అంటే ఏందన్నా" అని అంది

లింగప్ప "లేదు, లేదు అంటే ఇంగ్లీషు ఆడవాళ్ళు కాన్వానా దగ్గర్లో రామమందిరానికి ఆ పక్క ఒకతె ఉంది వీళ్ళు ఐదారుమంది ఆమె దగ్గర తాగేది, తందనాలాడేది, మరన్ని చెప్తారు తెల్లని ఆడది, అన్ని రకాల తళుకు బెళుకుల్ని ప్రదర్శిస్తుంది వీళ్ళ సంపాదన అంతా ఆమె చెయ్యి చేరుతోంది" అన్నాడు

చెన్నమ్మ ఆశ, మర్యాద, సంతోషం అన్నీ ఒక్కక్షణంలో కుప్పకూలాయి ఆమెకు ఏమీ చెప్పడానికి తోచలేదు ఆమె నోరు మెదపలేదు ఆమె కళ్ళల్లో మాత్రం నీళ్ళు పొంగివచ్చాయి

## 8

ఆ సమయానికి సరిగ్గా రామప్ప వచ్చాడు లింగప్పను చూసి, "ఏమీ లింగప్పా ఎప్పుడొచ్చావు?" అని అడిగాడు లింగప్ప, "వచ్చి కొంచెం సేపయింది," అన్నాడు

రామప్ప పెళ్ళాం వైపు చూశాడు ఆమె మొహంలో ఇతనిమీద ఏర్పడ్డ అవిశ్వాసం బాగా కన్పిస్తోంది పల్లెల్లో పుట్టిపెరిగిన జనం ఇలాంటి భావాలను దాచి పెట్టుకోలేరు ఏ మాటయినాసరే అప్పటి మాట అప్పుడే అనాలి భార్య ముఖకవళికలవల్ల లింగప్ప ఏదో ఆమెకు చెప్పాడని రామప్ప గ్రహించాడు అతడు "చూసి చాల కాలమయింది ఇన్ని రోజులు ఏమయింది రావడానికి" అని లింగప్ప అడిగాడు

లింగప్ప, "మూడు నాలుగు సార్లు వచ్చాను ఇంటికి తాళం వేసింది ఆ విషయమే చెన్నమ్మకు చెప్తున్నాను" అన్నాడు

"చెన్ని"

"అదే, వచ్చి వెళ్ళాను, మీరు లేరని"

"సరే, అయింది కదా"

"ఏయింది సరె, ఈ కార్ఖానా కూలి పని సంసారం చేసె ఆడవాళ్ళకు తగిందికాదని హూడా చెప్పాను కదా"

"నీకెందుకయ్యా ఈ విషయం" నీకు ఇష్టం వచ్చినట్టు నువ్వుండు మాకు ఇష్టంవచ్చినట్టు మేముంటాము"

చెన్నమ్మ "వాళ్ళవాళ్ళకిష్టమొచ్చినట్టు వాళ్ళుండాలి కదా? నీకు నువ్విప్పుడు చేస్తున్నదంతా బాగుందికదా?" అంది

"ఎందుకు? నేనేం చేశాను?"

ఏం చేసుంటే అది"

"అదే, అదేమిటి?"

"ఏమిటనేది నీకు తెలియదా? నేన్నీకు చెప్పలా? చేస్తున్నదంతా బాగుంటే చాలు"

ఈ మాటలాడేటప్పటికే చెన్నమ్మ దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది, కళ్ళల్లో నిండుకున్న నీళ్ళు చెక్కిళ్ళ మీదికొచ్చాయి

రామప్ప జరుగుతున్న దాన్నంతటినీ వెంటనే ఊహించాడు "ఒసేయ్, ఇంటి ఆడదానికి నీకెన్ని మాటలే? మనవాడని ఎవరో ఇంటికొస్తే వాడితో నీకెంత చనువే"

లింగప్ప, "రామప్పా కోప్పడవద్దు నేనే ఆ మాటా ఈ మాటా అన్నాను చెన్నమ్మ ఒక్క మాట కూడ అనలేదు" అన్నాడు

"ఓరేయ్, నువ్వు పెద్ద సంసారివి నేను లేనప్పుడు వచ్చి నా పెళ్ళాన్ని ఏమి చెయ్యాలనుకొన్నావు? అందుకొసం ఏమోమో చెప్పి దాని మనస్సు పాడుచేసావా?"

లింగప్పకు కోపం వచ్చింది ఇంత సులభంగా తనని, చెన్నమ్మని వీడు చెడ్డవాళ్ళుగా చేశాడు కదా, ఎలాంటి అయోగ్యుడు? ఇంతకీ వీడుమన్ను తింటున్నాడు వీడికి ఎంత కొవ్వు?

అతను అన్నాడు! "ఏమి మాటలయ్యా నువ్వనేది? నువ్వు లేనప్పుడు

నేనొచ్చానా, నేనొచ్చినప్పుడు నువ్వు లేవా? ఎంత సంసారులైనా ఇలాంటి మాటల్ని ఆలోచించకుండా అనకూడదు, ప్రతివాడూ ఇలాగంటె గతేమిటి?"

"అందరూ కాదయ్య అంటున్నది, ఇంటి మగవాడు"

"ఇంటి మగవాడనేవాడు ఇలాంటి మాటల్ని వాగకూడదు తాను సరిగా బతికి, సరిగా బతికించేవాళ్ళు అనవచ్చు"

రామప్పకు కోపం నెత్తికెక్కింది అతను హద్దు మీరాడు, లింగప్పచెంపకొకటి ఇచ్చాడు, "ఇందుకోసమే వచ్చావా నువ్వు మాయింటికి?"అన్నాడు

లింగప్పకు కూడ ఎక్కడలేని కోపం వచ్చింది వాడు లేవాడు రామప్పను కొట్టాలని వాడి చెయ్యి దురద పుట్టింది ఇక కొట్టాలి,చెన్నమ్మ లోపలినుంచి"నువ్వు వెళ్ళిపో, జగడం వద్దు, నీకు పుణ్యం ఉంటుంది"అంది

లింగప్ప కోపాన్ని అణచుకొన్నాడు, ఒకమాటకూడ అనకుండ వెళ్ళిపోయాడు

రామప్ప,"ఏమే వాడికి దెబ్బ తగిలిందని చాల బయం వేసిందా?లం "

"ఆ మాట ఆడొద్దు ఆడావో జాగ్రత్త!ఎవరి గురించి అంటున్నావు.

"ఎవరికి? నీకే వాడితో సరసం "

ఆరు నెలలకి ర: రోజొచ్చాడు లింగప్ప వాడితో నాకు సరసమేమిటి?ఎవడో వచ్చి సరసమాడితే ఒప్పుకునే ఆడది లేదిక్కడ నీకు బయపడి నేను బతుకుతున్నానా? మంచి అమ్మ, అబ్బకు పుట్టినదాన్ని నేనుమంచి దానిగా ఉన్నాను, నన్ను బెదరించి సంసారిని చేస్తావా?"

"వచ్చినవాణ్ణి కూర్చోబెట్టుకుని నీయిష్టమొచ్చినట్టు మాట్టాడుతూ ఉంటే బెదరించడం కాదు వాతపెడతాను"

"ఆహా, అందుకె ఊర్నుంచి పిలుచుకొచ్చావేమో వాత పెట్టడానికి ఒక ఆడది ఉండనీ, సరసం ఆడడానికి మరొకరు ఉన్నారనీ"

"మరొకరు ఉన్నారు ఎవర్ని చూశావే నువ్వు?"

"నేనెందుకు చూస్తాను? చూసిన వాడివి నువ్వు చెప్పుకో రాత్రి

నాగా పేపటి పడ్డ తర్వాత ఎక్కణ్నుంచి వచ్చేది ? రాత్రింక రాత్రప్పుడు ఎక్కడ పడుకొనేది ? ఇది నేను తెలిసుండాలి కదా"

"ఆహా తెలుసు చెప్తాను నువ్వు తనిఖీ చేస్తావా ?"

"తనిఖీ చేసే పెళ్ళాం అంటే నిజంగానే తనిఖీ చేస్తారు హూతే చేసి ఆడపడుచు, కష్టపడి డబ్బిచ్చే తొత్తు అంటే తనిఖీ చేసేదేముంది ?"

"ఓసేయ్ "

"ఇదేంది ఒసె ఒసే అని చాలా ముతక చేసి మాట్లాడుతున్నావు పెళ్ళయి మూడేళ్ళయింది ఇప్పటిదాకా ఓసేయ్ అన్లేదు ఈ రోజు ఈ పూటకి రెండు సార్లయింది ఇదేనా బెంగుళూరు బతుకు"

"నేను బతికె బతుకు బతికితే ఉన్నాను ఇంతే"

"నేను బతికె బతుకు బాగానే ఉంది, కళ్ళకు ఒత్తుకోవచ్చు నువ్వు బతికే బతుకు బతకను ఊరికి పోదాం పద, బాగుంటుందా బాగుండదా సూద్దువుగాని"

"ఇక ఎప్పుడు మాట్లాడొద్దు ఊరికి వెళ్ళేది , ఏంది చెప్పాల్సింది నేను ఇంటాడదానిగా మర్యాదగా బతకాల్సింది నువ్వు ఇంటి ఆడదన్న మాట మరచి మాట్లాడితె ఓర్చుకొనేవాణ్ణి కాను నేను"

"ఇగ చాల్లె కట్టుకున్నదాన్ని కదా ? ఏమేం చెస్తావా చెయ్యి"

9

ఇక్కడికి వాగ్వివాదం ముగిసింది, అయితే అలాగానే వీళ్ళ సంబంధం పూర్తిగా తెగింది అంటే దానికి చికిత్స లేదనలేదు మళ్ళీ వాదించి, ఇద్దరూ జాగ్రత్తగా ఉంటె , విరిగిపోయిన చెతి ఎముక మళ్ళీ అతికే మాములు వేయి అయినట్టుగా దాంపత్యం మళ్ళీ అతకవచ్చు దీనికి ఇద్దరూ ప్రయత్నించాలి, జాగ్రత్తగా నడుచుకోవాలి

వెన్నమ్మా దీన్ని గ్రహించింది ఉపరంజిలా ఆరంభమైన అన్యోన్య జీవితం ఇలా చెడిపోయిందే అని ఆమె చాల దుఃఖించింది పాత్ర నిండుగా పోసిన పాయసం వడ్డించే సమయంలో చేయిజారి కిందపడి నేల పాలయింది తమ ఇద్దరి జీవితాలూ ఈ పట్టణపు బతుక్కి బలి అయ్యాయని ఆమెకు

అనిపించింది ఎంత త్వరగా అపార్థం వచ్చింది ఎవతో ఆ ఆడదాని ప్రస్తావనవల్ల తన మనస్సు తలక్రిందులైనప్పుడు రామప్ప రావడం, తన పేరును వాడి తెలివిగా లింగప్ప పేరుతో చెప్పడం, తన బుద్ధిని చెడిపివేశాయి తానూ, తనవర్తా ఏదో పెద్ద గదియలో వచ్చారు ఊళ్ళో ఉండిఉంటే ఈ కార్ఖాన, ఈ రామమందిరం, ఈ బడి, ఈ రోగమొచ్చి తమని తాకేవి కావు, అంతా అయిపోయింది భర్తతో పాటు ఊరికెడితే బతుకు మళ్ళీ బాగుపడవచ్చు అయితే భర్త రావాలి కదా అతను రాడు సన్నిపాతంలో మనుష్యుడు ఏదో ఒక తప్పు మాటను పట్టుకొని తన స్వభావాన్ని మరిచేటట్టుగా రామప్ప బెంగళూరు పిచ్చిలో పడి పల్లెటూరివాడి స్వచ్ఛమైన బుద్ధిని పోగొట్టుకొన్నాడు ఊరికి వెళ్దాం అంటే, నువ్వు వెళ్ళు అంటాడే కాని తాను మాత్రం బెంగళూరు వదలిరాడు మరికొంతకాలం తాను ఇక్కడేఉండి, మెల్లగా అతన్ని మచ్చిక చేసుకొని, ఇతను ఊరికి వచ్చే విధంగా మనస్సును మార్చి, ఇద్దరూ ఊరికి వెళ్ళాలి, భర్తను కాపాడుకొనే బాధ్యత తనది, తాను ఓడిపోతే ఇద్దరూ చెడ్డట్టే ఇలా చెన్నమ్మ తనలో తాను తర్కించుకొంది, సహనంతో నడుచుకోవాలని నిశ్చయించుకొంది

ఏమిటే, తనను వదలి మరో స్త్రీతో సంబంధం పెట్టుకొన్న భర్త విషయంలో ఇంక సహనమూ సహనంకాదు గత్యంతరం లేదన్న కారణం చేత ఆశ్రయించిన అసహాయ స్థితి చేటలో ఉన్న బియ్యం కాస్త జారి మట్టిలో పడింది, దాన్ని ఎత్తుకోవాలి చెరగాలి, మట్టిని వేరువేసి బియ్యాన్ని రక్షించుకోవాలి ఇలాంటి అవస్థ చాలమంది జీవితాల్లో వస్తూ ఉంటుంది, అలాంటి సందర్భాల్లో తెలివితేటలున్న ప్రాణి ఇలాంటి ఓర్పును వహించి నడుచుకొంటుంది తప్పు గురించి ఓర్పు వహించడం కాదు, తప్పు చేసిన ప్రియమైన ప్రాణిని వదల లేనటువంటి మోహంతో, కాపాడుకోవాలనే ఆశతో

ఆ రాత్రే రామప్ప భార్యతో మంచిగా మాట్లాడాడు, చెన్నమ్మ కూడ సంతోషంతో మారు మాట్లాడింది వీళ్ళ జీవితాలు మళ్ళీ మునుపటిలాగ సాగేలా కన్పించింది

# 10

కార్ఖానాలో మాత్రం రఃమెకు కొన్ని ఇబ్బందులు మొదలయ్యాయి మేస్త్రీ తక్కిన స్త్రీలతో మాపించె చనువును రఃమె దగ్గర కూడ చూపించదలవాడు ఏదో పని చెప్పేవాడిలాగ దగ్గరకు రావడం, ఏదో అయిందన్నట్టుగా చెయ్యికి చెయ్యి తగిలించడం, రఃమె తలవంచి పని చెస్తున్నప్పుడు తాను కూడ ఆ పనిని చూడడానికి అన్నట్టుగా వంగి ఆమె తలకు దగ్గరగా తల తాకించడం మొదలైనవి చెయ్యడం మొదలెట్టాడు మొదటి సారే చెన్నమ్మ ఇలా చెయ్యకూడదని అడ్డుపడింది మేస్త్రీ, "మేమూ పెళ్ళాం పిల్లలు ఉన్నవాళ్ళమమ్మా ఎందుకిలా భయపడతావు?" అన్నాడు

రెండు రోజుల తర్వాత మళ్ళీ అదే చేష్టలు చెన్నమ్మ రః విషయం రామప్పకు తెలిపింది, "వాడిని హెచ్చరించు, వాడుసరిగా నడుచుకొంటే సరి, లేకపోతే నాకు చాల కష్టమవుతుంది" అంది

రామప్ప రః విషయాన్ని మనస్సుకు పట్టించుకో లేదు ఆ అయోగ్యుడయిన మేస్త్రీ చెన్నమ్మను ఇలా చేయడం తనకు ఇష్టమే అన్న రీతిలో ఊరకే ఉండిపోయాడు చెన్నమ్మ మరి రెండు సార్లు మేస్త్రీ చనువును చవిచూచి భర్తతో, "ఇదేమిటి ఇలా వీడి పోకిరి తనాన్ని సహిస్తావా? భర్త కాపాడకపోతే పెళ్ళాం మర్యాద ఎలా నిలుస్తుంది?" అంది

రామప్ప, "వాడేం అంత చెడ్డవాడుకాడు తెలీక ఏదో చేస్తాడని పిస్తుంది నీవే వద్దను ఊరికే ఉండిపోతాడు" అన్నాడు

మేస్త్రీ నడతను ఖండించడానికి ఇతను వెనుకడుగు వేస్తున్నాడని చెన్నమ్మకు అనిపించింది ఎందుకు? ఇతను మేస్త్రీకి ఇంత భయపడడానికి కారణమేమిటి?

నాలుగుయిదు రోజుల్లో రఃమెకు రోజుకు రెండణాల కూలి ఎక్కువ చెసి, రఃమె ఒక్కతై కూర్చుని చేయాల్సిన పనికి, ఒక గదిలోనికి ప్రమోషన్ ఇచ్చారు చెన్నమ్మ అనుమానంతోనే అక్కడికి వెళ్ళింది ఒకటి రెండు రోజుల్లో మేస్త్రీ ఉద్దేశాన్ని గ్రహించి, తనకు ఎక్కువ కూలి వద్దు, ఆ వెనుకటి పనినే

వెస్తాను, అని పది మంది కూలిలు పనిచేసే మొదటి గదికె వెనుతిరిగి వచ్చేసింది

ఎక్కువ కూలి వస్తూ ఉంటె వద్దన్నదానికి రామప్ప చాల అసంతృప్తి చెందాడు మేస్త్రీ నాకు మంచి స్నేహితుడు అతనిమీద లేనిపోని నిందని మోపుతున్నావా?" అని బార్య మీద తప్పుమోపాడు చెన్నమ్మకు చాలా ఆశ్చర్యం, చాలా దుఃఖం, చాలా బయం కలిగాయి ఆ మొగుడు తనని పెళ్ళాంగా బావించడం లేదని ఆమెకు అనిపించింది తన బార్య అనే మనిషిని ఇలా మరొకరు ముట్టారని తెలిసే ఊరకుండే బర్త ఉంటాడా? ఉంచుకొన్న స్త్రీని మరొకరు తాకారంటెనే మగవాడికి కోపం వస్తుంది కదా! తాను రామప్పకు ఒక ఉంచుకొన్న స్త్రీకంటే తక్కువయ్యానని ఆమెకు అనిపించింది ఇక ఆ కార్ఖానాలో బతకడం ఎలా? బతికి ఇక సాధించాల్సిందేమిటి?

కొద్ది రోజుల్లో చెన్నమ్మ తానిక కార్ఖానాలో పని చెయ్యడం సాధ్యంకాదని బర్తకు చెప్పింది రామప్ప "నేను కొంచెం కష్టాల్లో ఉన్నాను మేస్త్రీ నన్ను కాపాడుతున్నాడు నీవు కొంచెం ఓర్పువహించు" అన్నాడు

చెన్నమ్మ "కావలసినంత ఓర్పు వహించాను వాడు ముట్టుకోవడానికి వస్తే నేను ఊరికె ఉండాలా? ఏమిటి నీకష్టం చెప్పు, ఆ కడియాలు, ఈ గొలుసు, అవసరమైత అమ్మెయ్,కూలికని మానాన్ని పోగొట్టుకోలేను" అంది

ఆమె మర్నాటినుంచి కార్ఖానాకు వెళ్ళలేదు మొగుడు దగ్గరకు వచ్చి మంచి మాటలతోనే బలవంతం చేశాడు చెన్నమ్మ "ఊళ్ళోకంటే బెంగళూరులో బాగా బతుకుతామని కదా మనమిక్కడికి వచ్చింది? నేను సంపాదించకపోతే ఆ త్రాసు తూగదంటె ఇది ఎలాంటి బతుకు? ఉన్న సామాన్లను అమ్మి ఏదైనా అప్పు గిప్పుంటే తీర్చేయ్ ఊరికి వెళ్దాం అంబలో, ఆకుకూరో దేవుడిచ్చింది తిని బతుకుదాము" అంది

రామప్ప కొంచెం కోపగించుకున్నాడు ఆమెలొంగలేదు

## 11

ఆ తర్వాత పదిరోజులు అలా మగలు సరిగా మాట్లాడలేదు ఆ

రోజు సరిపోతుంది, రేపు సరిపోతుంది, అన్న ఆశగా చెన్నమ్మ పది రోజుల్ని ఎలాగో గడిపింది చివరికి భర్తతో, "నేవు నన్ను బతకనిచ్చేది ఇలాగే అవుతె, నన్ను, కొడుకుని ఊరికి పంపించు నేవు ఊరికి వచ్చేదాకా మేమక్కడే ఉంటాము వచ్చిన తర్వాత తిరిగి సంసారం పెద్దాం", అంది, కూర్చున్న వాడి మోకాళ్ళ మీద మొహం పెట్టుకొని కన్నీరుకార్చింది ఆమె మాట కానీ, కన్నీళ్ళుకానీ రామప్పను మార్చినట్టు కన్పించలేదు

మళ్ళీ పది రోజులు గడిచాయి ఒక రోజు రామప్ప కార్ఖానాలో ఉండాల్సిన సమయంలో, కార్ఖానాలోని పనివాడొకడు వచ్చి రామప్ప ఇంట్లో ఉన్నడా అని అడిగాడు చెన్నమ్మకు అతడెందుకిలా అడుగుతున్నాడో అర్థం కాలేదు రామప్ప ఇంట్లో లేడని చెప్పి "కార్ఖానాలో లేడా బాబూ?" అని అడిగింది ఆ వచ్చినతను, "కార్ఖానాలో ఉంటే ఇక్కడెందుకు వస్తాం? దొంగ తప్పించుకొన్నాడు," అని చెప్పి వెళ్ళిపోయాడు

చెన్నమ్మను ఏదో తెలియని భయం ఆవహించింది మొగుడు ఏదైనా చెరువులో కాని, బావిలో కానీ జారి పడ్డాడా? దార్లో ఏదైనా వాహనం క్రింద పడిపోయాడా? పొద్దున్ననగానె ఇంటినుంచి వెళ్ళినవాడు కార్ఖానాకు ఎందుకు వెళ్ళలేదు? ఆమె ఇంటికి తాళం వేసి పిల్లాణ్ణి తీసుకొని కార్ఖానాకు వెళ్ళింది రామప్ప దారి ప్రక్కల్లో ఎక్కడైనా పడి ఉన్నాడేమో అన్నట్టుగా అతను రోజూ వెళ్ళొచ్చే దార్లో ఎడమ, కుడి ప్రక్కల చూసుకుంటూ వెళ్ళింది కార్ఖానాలో అతను మామూలుగా ఉండే రెండు మూడు చోట్ల వెతికి చూసింది రామప్ప లేడు కార్ఖానాలో తెలిసిన ఆడకూలీలు, మగ కూలీలు ఆమె వైపు కొంచెం విచిత్రంగా చూస్తున్నట్టు ఆమెకు అనిపించింది సంగతేమిటని మేస్త్రీని విచారించడానికి వెళ్ళింది అతను కనిపించలేదు అతను ఎక్కడున్నాడో తెలుసుకొని వెళ్ళి విచారించడానికి ఆమెకు మనస్సురాలేదు చెన్నమ్మ "దేవుడా, ఏమి చెడుపు కాచుకుందో, దాన్ని సరి చేసి రక్షించు," అని హనుమంతుడిని మనస్సులో తలచుకొంది ఆ పిల్లవాడి నొసట ఏమిరాసి ఉందో అని వాణ్ణి గుండెకు హత్తుకొంది భర్త ఇంటికి వచ్చి ఉండ వచ్చునేమోననిపించింది, తొందరగా నడిచి ఇల్లు చేరింది

రామప్ప అక్కడికి రాలేదని గ్రహించింది కొద్దిగా మెరిసిన మెరుపు అణగిన తర్వాత కారుమబ్బులు నల్లగా నిలుమన్నట్టు, నిరాశ ఆమె మనస్సును ఆవరించింది

రాత్రి దీపం వెలిగించిన తర్వాత కార్ఖానాలో పనిచేసేవాళ్ళు వీళ్ళ యింటిముందు నిలబడి, తలుపు వైపు చూస్తూ వెళ్ళడాన్ని చెన్నమ్మ గమనించింది ఒక సారి ఒకడు వచ్చి "రామప్ప వచ్చాడేమమ్మా?"అని అడిగాడు ఆమె "లేదు" అంది వాడు ఆ మాటను నమ్మని వాడిలాగ గదిలో అటూ ఇటూ చూశాడు "ఒట్టలు ఇక్కడే ఉన్నాయి కదా" అన్నాడు చెన్నమ్మ ఆ అనుమానంవల్ల అవమాన పడింది, కోపం చేసుకుంది "ఇదేమయ్యా ఇలా మాట్లాడతావు? ఆయన్ని నేను దాచిపెడతానా? అంత అవసరమేమిటి?" అంది ఆ మనిషి వెళ్ళిపోయాడు

రామప్ప ఆరాత్రంతా రాలేదు, మరుసటి రోజు కూడా రాలేదు అతను ఏమయి పొయ్యాడో అన్న భయంవల్ల చెన్నమ్మకు భోజనం సహించలేదు ఆమె రామమందిరానికి వెళ్ళి అక్కడున్న వాళ్ళను భర్తను గురించి వాకబు చేసింది అక్కడి వాళ్ళల్లో ఒకతను, "అదేదో కొంచెం ఎక్కువ తక్కువ అయిందమ్మా ఒకింత డబ్బు సర్దడానికి ఊరికి గీరికి వెళ్ళుండవచ్చు" నన్నాడు మళ్ళీ చేతులు, కాళ్ళు, మొహం లేని గుడ్డి భయం చెన్నమ్మ ఊపిరిని కట్టేసింది తానిక బెంగుళూరులో ఉండడమా, ఊరికి వెళ్ళడమా అని ఆలోచిస్తూ ఆమె ఇంటికి వచ్చింది భర్త ఊరికి వెళ్ళే వాడవుతే తనకు తెలుపకుండా వెళ్తాడా? లేకపోతే అతను బెంగళూరులో ఏమయిపోయినట్టు? బెంగుళూరులా తాను అతన్ని వెతికేట్టులేదు ఎక్కడని వెతికేది? లక్షల కొద్ది ఉన్న జనంలో ఒక వ్యక్తిని వెతకడం బావిలో పడ్డ ముక్కెర్రను వెతకినట్టే ఆ రోజు మరుసటి రోజు ఇంట్లో ఉండి అతనికోసం వేచి, రాకపోతే ఇంటికి తాళం వేసి ఊరికి వెళ్ళి చూడాలని ఆమె నిశ్చయించుకుంది

కార్ఖానా పనివాళ్ళు ఇంటికి వచ్చి రామప్పను గురించి విచారించడం తగ్గింది మరుసటి రోజు అర్ధరాత్రిలో చెన్నమ్మకు నిద్రరాక పడకమీద దొర్లుతూ ఉండా ఎవరో మెల్లగా తలుపు తట్టిన శబ్దం విన్పించింది చెన్నమ్మ

లేచి "ఎవరు" అంది రామప్ప "నేను, తలుపు తీయి" అన్నాడు తలుపు తీయగానె లోపలికి వచ్చి, దాన్ని మళ్ళీ తానే మూశాడు "ఎవరైనా వచ్చి అడిగితే లేదని చెప్పు" అన్నాడు ఇద్దరూ లోపలికెళ్ళారు

భర్త ఏదో కష్టాల్లో ఉన్నాడని తెలిసి చెన్నమ్మ అతని మీదున్న విసుగునంతా మరచింది అగ్గిపుల్ల తీసి వెలిగించాలని చూస్తూ "భోంచేస్తావా" అని అడిగింది రామప్ప, భోంచేశాను, పడుకో, ఎవరైనా వచ్చి అడుగుతారు ఇంట్లో లేడని చెప్పు దీపం వెలిగించకు" అన్నాడు

చెన్నమ్మా "ఇదంతా ఏమిటి" అని అడగాలనుకుంది ఈ విషయం తనమీద మరింత కోపానికి దారితీస్తుంది మంచిది, అదే తెలుస్తుంది ఇలా ఆలోచించి ఊరికే ఉండిపోయింది, రామప్ప పడుకొన్న తర్వాత తాను కూడా పడుకొంది

## 12

ఉదయం రామప్ప కొంచెం ముందుగానె లేచి చెన్నమ్మ దగ్గర కూచుని ఉన్న సంగతంతా చెప్పాడు రామమందిరానికి సంబంధించిన లెక్కల వ్యవహారాన్ని చూసుకొనే జవాబుదారి రామప్పది నలుగురు వ్యవస్థాపకులు దాని నిర్వహణ బాధ్యతను చూసుకొనేవాళ్ళు అందులో డబ్బుకు సంబంధించిన జవాబ్దారి ఇతనిది "అది ఇది ఏదో చేసి చెతినుంచి కాస్త డబ్బు పోయింది దాన్ని సర్దడానికని మందిరం డబ్బుల్ని వాడుకొన్నాను ఈ విషయం వీళ్ళల్లో కొంతమందికి తెలుసు అయినా ఊరుకున్నారు ఇది మన మేస్త్రీకి తెలుసు భయ పడవద్దు, అవసరమైతే నేను మరికొంత అప్పు ఇస్తాను, అన్నాడు ఆ ధైర్యం మీద, మళ్ళీ ఒకింత డబ్బు ఖర్చు పెట్టాను ఇప్పుడు ఏడాది చివరికి లెక్కలు చూపించాలి అప్పిస్తానన్నావు కదా, ఇవ్వమంటే, వీలుకాదన్నాడు ఇదేమిటయ్యా అంటే, ఏమో నీవు నీ పెళ్ళాం ఇద్దరూ సంపాదిస్తారన్న ధైర్యంమీద, తొందరగా అప్పు తీరుస్తారని, ఇస్తానన్నాను ఇప్పుడు సంపాదించేది నీవొక్కడివే, నూరు రూపాయల పైన నీకు అప్పిచ్చి నేనెప్పుడు దాన్ని వెనక్కి తీసుకొనేది, నావల్లకాదు, అన్నాడు అందువల్ల ఈ డబ్బు సర్దడానికని నేను మూడులోజుల్నించి తప్పించుకొని తిరుగుతున్నాను మేస్త్రీ

ఒక ఉపాయం చెప్పాడు ఆ విధంగా చేస్తే ఠః తంటా అంతా సుఖంగా తిరిపోతుంది అయితె దాన్ని తీర్చడానికి నువ్వు మనస్సు చెయ్యాలి "

"ఏంచెయ్యాలి ? నేను మళ్ళీ కార్ఖానాకు వెళ్ళను"

"ఛీ, పిచ్చిదానా వెళ్ళమని ఎవరన్నారు ? ఇప్పుడుమాడు నాదీ, నీది అంతా చేరి ఫండులో డబ్బు ఉంది నా లెక్క ప్రకారం నాది నూరురూపాయలు, కార్ఖానాది వంద రూపాయలు ఉన్నాయి అంటే ఠః డబ్బు రావాలంటే పదేళ్ళయినా సంపాదించి ఉండాలి, లేదా హాలి మరణించాలి నేను చనిపోయ్యాక మావూరు రెడ్డి వ్రాసిచ్చిన ఒక కాగితాన్ని నీచేతికిస్తాను నువ్వు దాన్ని తీసికెళ్ళి కార్ఖానాలో చూపించి, ఆ ఫండు డబ్బంతా తీసుకో ఊరికెళ్తాను అంటె నీ డబ్బు కూడా ఇస్తారు అంతా తీసుకొని ఠః మందిరం డబ్బు తీర్చేసి, బెంగుళూరు వదలివెళ్ళి పోదాం ఒక ఆరు నెలలు ఎక్కడైకైనా వెళ్ళిపోయి, ఆ తర్వాత ఊరికి వెళ్దాం ఇదంతా నువ్వు చెయ్యాలి "

"ఇదేనా నువ్వు చెప్పే మాట ? ఉన్న మంగళ సూత్రాన్ని లేదని చెప్పి అబద్ధపు డబ్బు ఇప్పించమకొనివచ్చేదా ? దేవుడిచ్చిన కుంకుమని తుడిచెయ్యడం మంచిదా ?"

"మొహం కడుక్కొన్నప్పుడు కుంకుమ చెరిగిపోదా ? కొత్తదారం వేసుకోవాలంటే మంగళ సూత్రం తీయవా ? ఇలా తీస్తావు, అలా వేసుకొంటావు కష్టంనుంచి తప్పించుకొవడానికి ఇలా చెయ్యాల్సిందే "

"నువ్వు అలా ఇలా అని రెడ్డి ఇచ్చె కాగితం తప్పుడు కాగితం అని వాళ్ళకి తెలిస్తే ?"

"దాన్నంతా మేస్త్రీ చూసుకొంటాడు ఫండునుంచి ఇలా డబ్బు తీసుకోవడం అదెన్నో సార్లయింది ఠః కార్ఖానాలో ఉంటారు చచ్చిపోయారని చెప్పి ఫండు తీసుకొని మరో కార్ఖానాలో చేర్తారు అక్కడ చచ్చిపోయారని చెప్పి ఫండు తీసుకొని, ఇక్కడ దగ్గర్లో ఉన్న కార్ఖానాకు మళ్ళీ వచ్చేస్తారు "

"ఇలా అవుతే ఎలా? పచ్చి మోసంకదా? ఎవరూ పట్టుకోరా?

"దీన్నంతా చూసుకోవడానికి ఎవరికి సమయం ఉంటుంది? ఒక వేళ పట్టుకొన్నా వాడి మీద వీడు, వీడిమీద వాడు చాడి చెప్పాల్సివుంటుంది"

"ఇలాంటి చాడి చెప్పి పదిమందిలో బతకడం ఎలా? దీనికంటే ఊళ్ళోని పొలం ఒకటి అమ్మేసి ఠః డబ్బు తీరిస్తే సరిపోతుంది"

బెంగళూరులో సంపాదించి ఊళ్ళో పొలం కొనాలి కదా ఊళ్లో పొలం అమ్మితె ఊరూరే నవ్విపోతుంది అంతే కాకుండా సరైన వెలకు అమ్ముడయి డబ్బు తేవడమంటే చాల రోజులు పడుతుంది ఇదేమీ అన్యాయం కాదు, మనదే డబ్బు వాళ్ళ లెక్కల్లో ఉంది తీసుకోవడానికి ఏదో చట్టం చేశారు దాని ప్రకారంగా నడచుకోవాలంతే మనదే డబ్బు; మనం తీసుకొంటాం "

చెన్నమ్మకు ఠః ఏర్పాట్లన్ని నచ్చ లేదు ఆమె ఊరకుంది రామప్ప కాసేపయింతర్వాత, "కాదంటే రేపు మందిరం వదలాలి, కార్ఖానా విడిచి పెట్టాలి వెళ్ళమంటే జైలుకు వెళ్ళాలి," అన్నాడు

"ఠః డబ్బిచ్చినా మందిరమూ, కార్ఖానా రెండూ వదలాలికదా?" అని చెన్నమ్మ అడగాలి జైలు మాట అన్నాడు కదా, అందుకోసం దీన్నంతా చేయాల్సి వస్తుందని పిస్తుంది అని ఆలోచించింది, ఊరకుంది క్షణం విడిచి "నా మొగుడు పోయారన్న మాటని మొగుడున్న ఏ ఆడది అంటుంది? దాన్నొదలి ఏంచెప్తావో చెప్పు చేస్తాను" అంది రామప్ప అక్కడికే మాటలు చాలించి, ఉదయంకాగానే బయటికి వెళ్ళాడు మరుసటిరోజు రాత్రి వెనుతిరిగి వచ్చాడు

"నీవు కార్ఖానాకు వెళ్ళి డబ్బు తీసుకు రావాల్సిన పని లేదు ఠః కాగితానికి బొటన వ్రేలు గుర్తు వెయ్యి మేస్త్రీ అంతా చూసుకొంటాడు" అన్నాడు ఆమె ముందు ఒక కాగితం. ఒక ఇంకు సీసా ఉంచాడు చెన్నమ్మ "ఇదేమిటి"అని అడిగింది రామప్ప, "నీకు రావాల్సిన డబ్బుకు రసీదు" అన్నారు

చెన్నమ్మ కాగితాల మీద బొటనవ్రేలు గుర్తు వేసింది

మరుసటిరోజు రామప్ప, "దండు ప్రాంతంలో ఒక పని దొరికేట్టుంది అక్కడికి వెళ్దాం" అన్నాడు పదహైదు రోజులు పగలంతా తప్పించుకొని, రాత్రి పూట మాత్రం తిరుగుతూ, చివరికి, "పనిదొరికింది" అన్నాడు ఆ మర్నాడు పనిచేసే స్థలానికి దగ్గర్లో ఉన్న పూర్ణపురంలో ఒక ఇంటిని అద్దెకు తీసుకొని, అక్కడికి ఆమెను తీసుకెళ్ళాడు

రెండు నెలలు వాళ్ళక్కడ సుఖంగా ఉన్నారు సుఖంగా అంటె, కార్ఖానాలో, రామ మందిరంలో చేసిన తప్పువల్ల ఇబ్బందుల పాలయ్యాననే భయంలో అలా ఉన్నాడు ఈ సంసారంలో మరో సుఖం సాధ్యం కాదు రామప్ప రోజు విడిచి రోజు ఇంటికి వచ్చేవాడు ఆ రాని రోజుల్లో ఎక్కడో ఉండెవాడు చెన్నమ్మ ఒకటి రెండుసార్లు "ఎందుకిలా"? అని అడిగింది వాడు మొరటుగా సమాధాన మిచ్చాడు ఆమెకీపాటు పడుతూ ఇక్కడ ఉండడానికంటే ఊరికి వెళ్ళి ఉంటే బాగుండాదనిపించింది ఈమె నాలుగు రోజులు వదలి ఈమాట చెప్పాలనుకొని ఆలోచించింది, ఊరకుంది

## 13

ఈలోగా ఒక రోజు రామప్ప అర్ధరాత్రి ఇంటికి వచ్చాడు అతనికి తలమీద గాయమయింది, చెంపమీద ఒకటి రెండు దెబ్బలు తగిలి ఉండడం కన్పించింది చెన్నమ్మ "ఏం జరిగించి"? అంది రామప్ప, "ఉండు చెప్తాను" అన్నాడు ఏమీ చెప్పలేదు, ఊరకె పడుకొన్నాడు అదేంచేశాడో, ఇంకేం, ఇబ్బందులు రానున్నాయో అని చింతిస్తూ పడకమీద పడుకొంది పిల్లాడిని హృదయానికి హత్తుకొని "వీడి బతుకెంత బాగుండాల్సింది? ఇప్పుడు వీడి నొసట ఏం వ్రాసిందో? దేవుడా, నీ ఇచ్ఛ ఏమిటి? మమ్మల్ని మంచి దార్లో పడెయ్" అని హనుమంతుని తలచుకొని ప్రార్థించింది

మరుసటి రోజు మధ్యాహ్న సమయానికి వీళ్ళింటి ముందు పోలీసులు వచ్చారు, "రామప్ప ఉన్నడా?" అని అడిగారు చెన్నమ్మ, "కార్ఖానాకు వెళ్ళారు"అంది పోలిసులు కార్ఖానాకు వెళ్ళారు, రామప్పను పట్టుకొన్నారు మళ్ళీ ఇంటి దగ్గరికి పిలుచుకొనివచ్చి, "ఇతను నా భర్త, ఇతని పేరు రామప్ప",, అని ఆమెనుండి వాఙ్మూలం తీసుకొని రామప్పను అరెస్టు చేసి

తీసికెళ్ళారు

చెన్నమ్మకు ఇప్పుడేం చెయ్యాలో తోచలేదు ఆమెకప్పుడు సహాయ పడేవాళ్ళు లింగప్ప, మేస్త్రీ పెండె పేటలో తానుండిన ఇంటియజమాని తిరుమలయ్య సహాయం చేయవచ్చు, అయితే అతను అంత తెలిసినవాడు కాదు లింగప్ప ఒక ఆఫీసులో పని చెస్తున్నాడనె కాని, ఏ ఆఫీసో ఆమెకు తెలీదు ఏమైనా రామె మేస్త్రీని చూడక తప్పిందికాదు ఇంటికి తాళంవెసి, పిల్లాడని ఎత్తుకుని చెన్నమ్మా ఆ వెనుకటి కార్ఖానాకు వెళ్ళింది

మెస్త్రి కార్ఖానాలో రామెకు కన్పించాడు, అయితె ఆమె కలవలేకపోయింది తెలిసిన వాళ్ళతో చెప్పిపంపించి, అంతకుముందు గుర్తయిన వాళ్ళ సహాయంతో అతనున్న చోటుకు వెళ్ళి, అతన్ని కలుసుకోవడానికి ప్రయత్నించింది, అతను తప్పించుకొన్నాడు అక్కడ ప్రయత్నం విఫలంకావడంలో దిక్కుతెని ఆ ఆడది కార్ఖానా రామమందిరానికి వచ్చింది అక్కడ లింగప్ప కన్పించాడు

చెన్నమ్మ దారి దొరికిందని సంతోషపడింది "లింగప్ప, నీవు నాకు దేవుడిలా దొరికావు అదెం అయిందో ఏమో, ఇంటాయన్ని పోలీసులు పట్టుకెళ్ళారు ఇదెమిటో కొంచెం చూడప్పా ఆయనకి తిండి తీర్థాలు చూడాలి కదా ఆడ మనిషిని ర ఊళ్ళోనాకు దిక్కుతోచడం లెదు ఆయన మీద కోపం పెట్టుకోవద్దు చుట్టమని చేయిపట్టుకో," అంది, భోరుమని ఏడ్చింది

లింగప్ప కంట్లో కూడ నీళ్ళొచ్చాయి అతను "అదేమని చెప్పేది చెన్నమ్మ, నిన్నటి రోజు రాయన ఆ లెడి ఉంది కదా, ఆమె ఇంటికి ఇతను వెళ్ళినప్పుడు కొత్తవాడెవడో వచ్చాడంట వీడికీ వాడికీ పోట్లాటయింది ఇద్దరూ కొట్టుకొన్నారు వాడు రామప్పని కొట్టాడు రామప్ప వాణ్ణి కొట్టాడు, చెయ్యి పట్టి రాడ్చాడు ర జగడంలో వాడి రెట్టవిరిగింది 'అయ్యో' అంటూ వాడు అరచాడు ఆ తర్వాత వాడు పోలీసువాళ్ళకు ఫిర్యాదిచ్చాడు వాళ్ళు విచారణ చేస్తున్నారు అందువల్ల ఇదంతా జరిగింది ఇప్పుడు ఇతన్ని పట్టుకొన్నది అలా ఉండని, ఇతను చచ్చిపోయాడని నీవు

చెప్పావు కదా, కార్ఖానాకు మోసం జరిగిందని మళ్లా విచారణ జరుగుతోంది అదేం మాట ? నాకు తెలిలేదు" అన్నాడు

"ఎన్నటి జగడానికి, ఆ మాటకి సంబంధం ఏమిటి ?"

"కొట్టినవాళ్ళెవ్వరంటె రామప్ప అన్నారు వాడి వెనుకా ముందు ఏమిటని అడిగితే ఆ కార్ఖానాలో ఉండినవాడని అన్నారు కార్ఖానాకు వెళ్ళి అడిగితె రామప్ప చచ్చి మూడు నెలలయిందని అన్నారు ఏమిటని విచారిస్తే అతను కన్ను మూశాడని అతని భార్య చెప్పింది, డబ్బు తీసుకెళ్ళిందని అన్నారు"

"నేను డబ్బు తీసుకొన్నానని అన్నారా ?"

"ఔను, నీవిలాగే ఊరికి వెళ్ళడం మంచిది పోలీసు వాళ్ళ చేతికి దొరక్క నెలరోజులు తప్పించుకొని ఉండాలి"

"అయ్యో నాయనా, నేను ఆడదాన్ని ఏంచెయ్యగలను దేవుడు చేసినట్టవుతుంది ఇంటికి వెళ్తాను మొగుడొచ్చేదాకా దీపం వెలిగించుకొని ఉంటాను మరెదైనా జరిగితే దేవుడిచ్చిందాన్ని తింటాను మంచిది నాయనా, నేను వస్తాను"

సంసారం పట్ల నిరాశ, భర్త పెట్టిన పరీక్ష, ఇప్పుడు ఎదురైన కొత్త సమస్య, చెన్నమ్మ జీవితాన్ని ఒక విచిత్రమైన ధైర్యం వైపుకు మళ్ళించాయి ఆమె పిల్లాడిని తీసుకొని పూర్ణపురంలోని తన కొత్త యింటికి వెళ్ళింది

అక్కడ ఆమె చాల రోజులుండలేదు మరుసటి రోజె మళ్ళీ పోలీసువాళ్ళు వచ్చారు ఆమె కార్ఖానాలో డబ్బు తీసుకొన్నందుగాను జైలుకు తీసుకెళ్ళారు "నేను తీసుకోలేదు" అని ఆమె చాలా చెప్పింది ఆమె, "నీవు డబ్బు తీసుకెళ్ళావని మేస్త్రీ అంటున్నాడు, గుమాస్తా చెప్తున్నాడు నీ బొటన వ్రేలి గుర్తున్న అర్జీ రసీదు" ఉన్నాయి

తన బొటన వ్రేలి గుర్తున్న అర్జీ రసీదు ఉన్నాయనగానే తన భర్త ఏమి చేసి ఉంటాడో చెన్నమ్మ గ్రహించింది ఆ రోజు అతను మూడు కాగితాలమీద ఆమె బొటన వ్రేలి గుర్తులు వెయించుకొన్నాడు, ఇది మనకు

రావాల్సిన డబ్బుకు రసీదు అన్నాడు అయితే అవి వేరె కాగితాలయి ఉండాలి, ఆ కాగితాలను తీసుకొని తన భర్త, మేస్త్రీ, రఃమ పనంతా చేసి ఉండాలి

లింగప్ప ఆ రోజు పోలీస్ స్టేషన్‌కు వచ్చాడు రామప్ప మాటలవల్ల చెన్నమ్మ ఊహ నిజమని తెలిసింది

లింగప్ప చెన్నమ్మ అంగీకారాన్ని పొంది మాదవ్వని బెంగుళూరుకు పిలిపించాడు

చెన్నమ్మ ఇప్పుడు సంకట పరిస్థితిలో చిక్కుకొంది నిజం చెప్పి భర్తని, మేస్త్రీని జైలుకు పంపించాలి, లేదా నోరు మూసుకొని తాను జైలుకు వెళ్ళాలి రామప్ప తనకు తానుగా జైలుకు వెళ్తానని ఉంటె రఃమె ఏమి చెప్పి ఉండేదో అతను ఆ మాటను ప్రస్తావించలెదు మళ్ళీ మళ్ళీ ఒక మాట మాత్రం అన్నాడు "పాపం, మేస్త్రీ నాకు సహాయం చేయదలిచి జైలుకు వెళ్ళేటట్టయింది!" అన్నాడు

తన చేయి పట్టిన తప్పు తప్పితే మరే తప్పునూ చేయని రఃమె జైలుకు వెళ్ళాల్సి వచ్చింది కదా అని అతనికెమంత దుఃఖం కాలేదు తన పెళ్ళాం కావడం వల్ల తన అపరాదం కోసం కష్టం అనుబవించ వచ్చని అనుకున్నాడో ఏమో! లేదా ఆ సంగతే ఆలోచించలేదేమో!

ఇతనింత నిర్లక్ష్యంగా ఉంటుంటే తనింత దీనంగా ప్రతిమాలి తప్పించుకోవడం ఏమిటని చెన్నమ్మ చాల బాదపడింది, పోలీసువాళ్ల అన్ని ప్రశ్నలకీ, "నాకె విషయమూ తెలేదు, మీరు కావాల్సింది చెయ్యండి" అని అంది

## 14.

పోలీసు విచారణ ముగిసింది కోర్టుముందు వీళ్ళిద్దర్ని నిలబెట్టారు ఎవర్నో ఎముకవిరిగేలా కొట్టినందుకుగాను రామప్ప మీద ఒకనేరం, కార్ఖానాకు మోసంచేసి డబ్బు తీసుకున్నందుకుగాను బార్యాబర్తలిద్దరి మీదా ఒక నేరం మోపారు

కొట్టాడన్న నేరంకేసులో రామప్ప ప్రతివాదిని బ్రతిమాలి రాజీ వేసుకొన్నాడు. ఆ విషయంగా కోర్టు రామప్పను మన్నించింది

మోసం కేసులో మేస్త్రీని కాపాడడం కోసం అతని పేరును వీళ్ళిద్దరూ ప్రస్తావించలేదు ఇద్దరూ జైలుకు వెళ్ళితే ప్రయోజనమేమిటి? ఒకరయినా తప్పించుకోవచ్చు కదా అని లాయరు చెప్పాడు రామప్ప తనకే విషయమూ తెలియదనడం, చెన్నమ్మ కూడా అలాగే చెప్పడం, ఏమీ తెలియని ఆడదని కోర్టు ఆమెను వదలిపెట్టవచ్చునని లాయరు సూచించాడు ఆ సూచన ప్రకారమే చెన్నమ్మ కోర్టులో ఏమాటా చెప్పలేదు ఆమెకు పదిరోజుల్లో ఒక సంగతి మాత్రం నిశ్చయమయి పోయింది తాను రామప్పను పెళ్ళి చేసుకొన్నది ఆ కష్టాలననుభవించడానికేనని విధి వ్రాతకాకపోతే ఏ ఊళ్ళోనో పుట్టిన తాను ఆ ఊరొచ్చి ఎందుకిలా కావలసి వచ్చింది? ఆమె మేజిస్ట్రేటుతో, "జరగాల్సిన తప్పేదో జరిగిపోయింది మహాప్రభు, తెలియని ఆడదాన్ని, కాపాడండి," అంది

రామప్ప ఏదైనా చేశాడనడానికి స్పష్టమైన సాక్ష్యాధారాలు లేవు అతని అంగీకారం లేందే ఆమె ఏమీ చేసి ఉండదన్న ఊహ తప్పితే, అతని నేరాన్ని నిరూపించడానికి ఆధారాలు లేవు మేజిస్ట్రేటు అతని నేరం విషయంలో సందేహం ఉండడం వల్ల, ఆ సందేహాన్ని అతనికి అనుకూలంగా నిర్ధారించి అతన్ని వదలిపెట్టారు బొటనవ్రేలు గుర్తు మొదలైన తగినన్ని సాక్ష్యాలతో చెన్నమ్మను అపరాధి అని నిర్ణయించి, ఆమెను ఆరు నెలలు జైలుకు పంపించారు

తాను స్త్రీ అన్న కారణంచేత తాను ఆ తప్పుల్ని చేసి ఉండదని మేజిస్ట్రేటు తనని కూడ వదలి వేయవచ్చని చెన్నమ్మ చివరిదాకా కొంత ఆశను పెట్టుకొంది ఆదెప్పుడైతే శూన్యమయిందో, ఆమెకు లోకమే అన్యాయంగా అనిపించింది పోలీసులు ఆమెను బయటికి తీసుకొనివచ్చారు రామప్ప, మాదవ్వ, లింగప్ప ఆమె చెంతకు వచ్చారు ఆమె తల్లి భుజంమీద తలపెట్టి ఏడ్చింది, లింగప్ప వైపు ఒక్క క్షణం ఊరకే చూసింది, ఏ మాటని మాట్లాడలేదు, రామప్ప వైపు చూడనేలేదు

రామప్ప దగ్గరకు వచ్చి ఏదో మాట్లాడాలనుకొన్నాడు ఆమె గుడ్డతో ముహం కప్పుకొంది, "నాకిప్పుడేం మాటలువద్దు నాకెం వద్దు" అంది

## 15

మాదవ్వ పల్లెకు వెళ్ళింది రెండు నెలలకోసారి రెండు మార్లు వచ్చి జైల్లో ఉన్న కూతుర్ని చూసింది ఆ సమయంలో లింగప్ప ఆ ముసలమ్మతో పాటు ఉండేవాడు రామప్ప చాలసార్లు చెన్నమ్మను చూడడానికి ప్రయత్నించాడు, ఆమె బయటికి రాలేదు

ఆరు నెలలు గడచి ఆమెను జైలునుంచి వదలి పెట్టే రోజు వచ్చింది దాని వెనుకటి రోజు మాదవ్వ ఊరినుండి వచ్చింది లింగప్ప ఆమెను జైలుకు పిలుచుకొని వచ్చాడు వాళ్ళు వచ్చె సమయానికి రామప్ప కూడ జైలు వాకిట్లో కాచుకొని ఉన్నాడు

చెన్నమ్మ బయటికి వచ్చింది, తల్లి దగ్గర వచ్చి కూర్చొంది పొద్దున్న మన ఊరి ప్రక్కవెళ్ళే రైలొకటి ఉంది, అందులో ఊరికి వెళ్దాం, అంది

రామప్ప దగ్గరికి వచ్చాడు, ఇలా అన్నాడు "చెన్నా, నాది తప్పయింది నెను నిన్ను చూసుకొంటాను, నా వెంటరా," అన్నాడు

చెన్నమ్మ మాట్లాడలేదు వద్దని మాత్రం తల ఆడించింది భర్త వైపు చూడనేలేదు

ఆరు నెలల్లో ఆమె అదోలా అయిపోయింది కాలం రామప్పనుకూడ ఊరికే వదల్లేదు, అతను కూడా అదొలా అయ్యాడు

రామప్ప ఎంతెంతో చెప్పాడు ఆమె నోరు మెదపలేదు మళ్ళీ తల ఆడించలేదు అతని మాటలేవి తన చెవులకు పడలేదన్నట్టుగా మౌనం వహించింది కొద్ది నిమిషాల తర్వాత, "లెవమ్మా, రైలుకు వెళ్దాం," అంది

రామప్ప తాను తగినంత ఓర్పు వహించానని అనుకొన్నాడు కొంచెం కోపం వ్యక్తం అయ్యే ధ్వనితో, "అలాగవుతె నువ్వు నన్ను వదలి వేస్తావా ?" అన్నాడు మాదవ్వ కూతురుతో "నీ మొగుడి మాటలకు బదులు చెప్పు

చెయ్యి పట్టినవాడు అడిగిందానికి బదులివ్వకపోతె ఎలా?" అంది

చెన్నమ్మ, "మొగుడు పెళ్ళాన్ని వదలొచ్చునదా పెళ్ళాం మొగుణ్ణి వదలి పెట్టడం ఎక్కడైనావుందా? ఇప్పుడు నాకెంవద్దు ఊరికెళ్ళాలి" అంది

రామప్ప, "అలాగవుతె నెల ఆగి వస్తావా? లేక రానేరావా? లేదా నేను ఊరికి వచ్చెదా? ఏదో ఒకటిచెప్పు" అని అడిగాడు

"నేను నెలరోజుల్లోను రాలెను, రెండు నెలల్లోను రాలేను రానని చెప్పలెను ఊరికి వచ్చినా నెనిప్పుడు సంసారం చెయ్యలెను ఇప్పుడు నాకెం అక్కర్లం లేదు నన్నెందుకిలా పోరు పెడతావు?"

రామప్ప, "ఆహా! నువ్వెప్పుడూ ఇంతె సరే నేనెక్కడికైనా వెళ్ళి ఏమైనా అవుతాను" అన్నాడు

చెన్నమ్మ మౌనంగా ఉంది రామప్ప, "సరె ఇప్పుడు నువ్వేమీ చెప్పకుండా ఉంటే నేను చచ్చానని అనుకో, చూడు" అన్నాడు

మాదవ్వ, "నాయనా, ఎందుకింత చెడ్డమాటలాడతావు? ఏమీ తెలియని పిల్ల ప్రాణం రోసిపోయింది కొంచెం ఓర్పువహించు సరిపోతుంది" అంది

రామప్ప, "అలాగవుతే, ఆ మాటని ఆమె చెప్పని" అన్నాడు

చెన్నమ్మ ఏమీ మాట్లాడలేదు

రామప్ప "సరె ఆమె ఆ మాటా చెప్పదు మంచిది నా పెళ్ళాం, నేను దాని పాలిటలేదని అనుకోని," అన్నాడు, వెళ్ళిపోయాడు

మాదవ్వ, "ఉండి చేసిన ఉపకారం ఏమిటి? లేదని తప్పిపోయేదేమిటి?" అని గొణుక్కుంది కూతురుతో "లింగప్ప ఇంటికివెళ్ళి, పసికందుకు ఒకింత అన్నంపెట్టి ఆ తర్వాత రైలుకు వెళ్దామేమే?" అంది

చెన్నమ్మ "ఎవరింటికీ వెళ్ళడమొద్దమ్మా సరిసమానమైన వా . . దగ్గర నేను ఏమొహం పెట్టుకొని వెళ్ళను? దామితల్లి నోరుతెరిస్తే నేనిక్కడ . . పలికి

దిగిపోతాను, అంత పుణ్యవంతురాలిని కాను పోదాంపద, రైలుకు పోదాం"అంది

లింగప్ప వాళ్ళతోపాటు రైల్వేస్టేషన్‌కు వెళ్ళాడు చెన్నమ్మ తల్లికి మెల్లగా ఏదో చెప్పింది ఆమె లింగప్పతో, "లింగప్పా, నువ్వు మాతో పాటు రావద్దు మొగుడు వెళ్ళినతర్వాత ఎవరితోనో వెళ్ళిందని ఎందుకొచ్చిన మాట ? నువ్వు వెళ్ళిరా నాయనా దిక్కులేని సమయంలో దేవుడిలాగ జతలో ఉన్నావు దేవుడు నీ పిల్లల్ని కాపాడనీ" అంది

తాను వాళ్ళతో రాకూడదని చెన్నమ్మ సూచించినట్టుగా లింగప్ప గ్రహించాడు ఆమె ఆలోచన సరియైందనే అతనికి తోచింది ఎంతటి బుద్ధి మంతురాలు అని అతను చాల మెచ్చుకొన్నాడు "సరేనమ్మా, అలాగవుతే మీరు వెళ్ళొస్తారా రైలుకు డబ్బుంది కదమ్మా" అని అడిగాడు

మాదవ్వ ఉంది అంది అతను వెళ్ళిపోయాడు

## 16

వాళ్ళని వదలి పెట్టి బయల్దేరిన లింగప్ప తన ఇంటివైపు నడిచాడు దాల్లో పెండేపేట, అక్కడే కార్ఖానా అక్కడేదో గలాటా జరుగుతోంది దాల్లో ఉన్నవాళ్ళను, "ఇదేమిటి ?" అని అడిగాడు కార్ఖానా కూలీలు ఏదో సమ్మెచేసి రైలు పట్టాలనుంచి మైదానందాకా నిల్చున్నారు కార్ఖానా కాపలా కాయడానికి పోలీసులు వచ్చారు కూలీలు కార్ఖానా మీద దాడి చేయాలను కొన్నారు" అని చెప్పారు లింగప్ప, ఆదాల్లో వెళ్తే ఇంటికి వెళ్ళడమా, మానడమా అనిఆలోచించాడు, అలాగే నాలుగడుగులు ముందుకు వేశాడు కార్ఖానా వాకిట్లో పోలీసులు నిల్చున్నారు వాళ్ళముందు ఇతనికి తెలిసిన మేజిస్ట్రేటు నిల్చున్నారు ఆయన కూలీలతో "వెళ్ళిపోండి ఇక్కడ గుమికూడకండి మీరు వెళ్ళకపోతే పోలీసులు మిమ్మల్ని లాఠీఛార్జి చేసి గుంపు చెదరగొట్టాల్సి వస్తుంది" అని చెప్తున్నారు

ఒక్క క్షణం కూలీలు మొదటి వరుసనుంచి ఎవడో ముందుకు దూసుకొచ్చాడు "రండ్రా వీళ్ళు మనకో లెక్కా?" అన్నాడు అతను

రామప్ప అతని వెంట కొంత జనం చేరారు అతను ముందు పరిగాడు వెనకు జనం వస్తున్నారా, లేదా అని ఆలోచించినట్టు లేదు గుంపు అతని వెనక వస్తోంది, అయితే అతనికీ గుంపుకీ మధ్యచాల అంతరం ఉంది ఆ గుంపును ఆపగలిగితే కార్ఖానా మిగులుతుంది లేకపోతే కార్ఖానా మాట అలా ఉండని, పోలీసులు, మేజిస్ట్రేటు ప్రాణాలతో బయట పడేట్టులేదు పోలిసులు తుపాకీలను గుంపు వైపు గురి పెట్టి "అక్కడే ఆగిపోండి లేకపోతే కాలుస్తాం"అని అరిచారు గుంపు ఆగలేదు తుపాకులు ఒక్కసారిగా మ్రోగాయి

అందరికంటే ముందు ఉరుకుతున్న రామప్ప గుండెలుకు అక్కడే కూలిపోయాడు గుంపులోనూ ముగ్గురు నలుగురికి దెబ్బలు తగిలి ఉండాలి చివరికి గుంపు చెదరింది

లింగప్పకు తాను రామప్ప చావును చూడడానికి వచ్చానేమో ననిపించింది పోలీసులు, కార్ఖానా అధికారులు, అందరూవచ్చి తూటాలు తగిలి గాయపడ్డ వాళ్ళని మోసుకొని వెళ్ళారు లింగప్ప వాళ్ళతోపాటు వెళ్ళాడు, రామప్ప గుర్తు చెప్పాడు అతని అత్త, బార్య రైలుకు వెళ్తున్న విషయాన్ని చెప్పి, తాను వెళ్ళి, వాళ్ళను పిలుచుకొని వస్తాను, శవాన్ని వాళ్ళకు అప్పగించవలసిందిగా, కోరాడు

అధికారులు సరేనన్నారు లింగప్ప రైలు వెళ్ళిపోతుందన్న ఆతురతతో ఒక జట్కా బండిని మాట్లాడి రైల్వే స్టేషన్‌కు వచ్చాడు ఇంకారైలు బయల్దేరలేదు చెన్నమ్మ మాదవ్వ పిల్లాడితోపాటు రైలుబండి ఎదురుగా ఉన్న బెంచిమీద కూర్చున్నారు

ఇతను తిరిగి వస్తుండడాన్ని చెన్నమ్మ దూరంనుంచి చూసింది ఇతను మళ్ళీ ఎందుకు వస్తున్నాడని ఆమె చిరాకు పడింది లింగప్ప త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ వీళ్ళదగ్గరికి పరుగెత్తు కొచ్చాడు, "అవ్వా, పని చెడిందే!"అన్నాడు

మాదవ్వ, "ఎందుకయ్యా, ఏమైంది" అని అడిగింది

"అయ్యో, ఏమని చెప్పేదమ్మా? 'నేను పొయ్యాననే అనుకో, నేను పొయ్యానని అనుకో' అని అన్నవాడు నిజంగానే పొయ్యాడు కదమ్మా? పిల్లవాణ్ణి దిక్కులేని వాణ్ణిగా చేసిపొయ్యాడే?

"ఇదేమయ్యా ఇలా అంటావు? ఇప్పుడేకదా అలా చెప్పింది?"

"ఔను కార్ఖానా కూలివాళ్ళది ఏదో గొడవ మీకూ తుపాకి శబ్దం విన్పించి ఉంటుంది మిమ్మల్ని వదలి పెట్టిన రామప్ప నేరుగా అటువెళ్ళాడు పోలీసు వాళ్ళమీద పడి గుండేలు తిన్నాడు ప్రాణంపోయిందమ్మా! బిడ్డ అనాథయ్యాడే"

ఒక్క క్షణం ఎవ్వరూ మాట్లాడలేదు ఈ మాటల్ని విని చుట్టూ పది మంది గుంపుచేరారు

లింగప్ప, "ఇతని పెళ్ళాన్ని, అత్తని, పిలుచుకొని వస్తాను, శవాన్ని ఇక్కడే ఉంచండి అని చెప్పివచ్చాను" అన్నాడు

మాదవ్వ కూతురి వైపు చూసింది ఆమె ఏమీ చెప్పలేదు "రామ్మా, వెళ్దాం" అని తల్లి కూతుర్ని పిలిచింది

చెన్నమ్మ "అమ్మా వెళ్ళేటట్టవుతే నువ్వు వెళ్ళిరా నేనిక్కడే ఉంటాను"అంది

ఏమైనా ఉందా, వచ్చిపోయాడన్నా ఇంకా కోపమేనా?"

కోపం కాదమ్మా, కోపం కాదు ఎవరిని వెళ్ళి చూసేదని ఈ జీవానికి సంకటం మొహం అదే, కాని మనిషి వేరే ఆ రోజే పొయ్యాడు నీ అల్లుడు నాకిదంతా అప్పుడే జరిగిపోయింది ఈ తాలి బొట్టు నాకదాన్ని ఉంచుకొని ఊరికివెళ్దాం అనుకొన్నా మొగుణ్ణొదలి తాళినేం తెస్తావని అన్నాడు హనుమంతుడు తీసుకోమ్మా, దీన్ని ఏమైనా చెయ్యి"

ఇలా అంటూ చెన్నమ్మ మెడలో ఉన్న మంగళసూత్రాన్ని త్రెంపి తల్లి చేతిలో పెట్టింది

మాదవ్వకు హృదయం పిండినట్టయింది ఆమె "ఏం చేశావే?" అంది

మరుక్షణమె, అతను పై యుకతర్వాత దీన్ని తెంవడం తప్ప మరెదారి తెదను కొంది రైలు బయల్దె సమయం, ఏం వేయాలో తోవక లింగప్ప వైపు తిరిగి, "మరెలాగ? రఃమె రానంటొందే! రఃమొని, బిడ్డని వదలి నెను మాత్రం వచ్చి వేసేదేమిటి?" అంది

లింగప్ప రెండు క్షణాలు ఆలోచించాడు, "సరెనమ్మా మీరురైల్లో బయల్దేరండి నేను కార్ఖానా దగ్గరికి వెళ్ళి ఏం చెయ్యాలో చూస్తాను అన్నాడు

తల్లి, కూతురు, పసిబిడ్డా ఊరికి బయల్దెరారు

# పిన్నమ్మ

క్రిందటివారం నేను పురోహితుడితో పాటు శ్రీరామ్ ఇంటికి వెళ్ళాను వివాహం, నీతి, సామాజిక క్రౌర్యం మొదలైన మాటలు సహజంగానే మా మాటల్లో వచ్చాయి వయసు శ్రీమీదపడిన మగాళ్ళు, తక్కువ వయసున్న ఆడ పిల్లల్ని పెళ్ళాడే విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు శ్రీరామ్ తమకు తెలిసిన ఒక పెద్ద మనిషి నుంచి విన్న ఒక సంగతిని మాకు తెలియజేశారు

ఇక్కడే దగ్గర్లో నాకు ఈ మధ్య పరిచయమైన స్నేహితుడొకాయన ఉన్నారు ఆయన ఈ ప్రాంతం వాడుకాదు మాయిద్దరి మధ్యా పనులుండడంవల్ల నేను ఈ ఒక్క సంవత్సరంలోనే అనేక సార్లు వాళ్ళింటికి వెళ్ళాల్సి వచ్చింది మాట్లాడడానికని మేము లోపల ఒక గదిలో కూర్చునేవాళ్ళం మొదటిసారి నేను ఆ గదిలో ప్రవేశించినప్పుడే, ఎదురుగా గోడకు ఎత్తుగా తగిలించిన ఫోటో ఒకటి నా కళ్ళను ఆకర్షించింది అది ఇప్పటికి దాదాపు నలభై ఏళ్ళక్రితం వాడుకలో ఉండిన ఒక విధమైన ఫోటో పేపరుమీది చిత్రం గదిలో ప్రవేశించిన ఆ క్షణమే నా కళ్ళని ఆకర్షించిన చిత్రంలోని ఆ ముఖం ఆ తర్వాత నాకు ఒక వ్యక్తి లా ఆగదిలోనే కూర్చొని వున్నదేమో నన్నంతగా నిజమనిపించింది పదహారేళ్ళను మించని వయస్సులో ఉన్న అందమైన ఆ స్త్రీ ముఖం, అపూర్వ వ్యక్తిత్వాన్ని పొంది ఉన్నట్టుగా భావన కలిగేది అందువల్లే అది గదిలో తనదే అయిన ఒక స్థానాన్ని ఆక్రమించినట్టుగా అనిపించేది అది ఎవరి చిత్రమని అడగాలని ఉంది నాకు అయితే కొత్తలో ఇలాంటి ప్రశ్నల్ని అడగరాదన్న కారణం చేత మౌనం వహించాను మర్యాద కోసం ప్రశ్నను అడగడం మానుకొని, చర్చించాల్సిన విషయాన్ని మాట్లాడి వెనక్కి వచ్చేశాను వస్తూ ఆ చిత్రంలోని ముఖాన్ని నా మనస్సులో పదిలపరచుకొనివచ్చాను

"చాల అందమైన ముఖం మంచి ప్రాయంలో ఉన్న ముఖం అయినా వయసును మించిన ప్రౌఢత్వం ఆ ముఖంలో కన్పించేది కళ్ళు చిన్నవిగా కన్పించేవి, కాని నిజంగా చిన్నవి కావు కనురెప్పలు పొడువుగా ఉండడంవల్ల వెడల్పు తక్కువ ఉన్నట్టుగాను, కనుపాపలు చిన్నవిగాను ఉన్నట్లు కన్పిస్తాయి పెదవులు చాలముద్దుగా ఒకటిగా ఉంది, చూసేవాడి ఊహను బట్టి ఎక్కడో కొంచెం నవ్వినట్టు, లేదా నవ్వనట్టు, అదో చావముద్రలో ఉండేవి రెండుక్షణాలు చూస్తె స్పష్టంగా ఉన్న పెదవులేకాక, నాటి చివరలు అటు, ఇటు కొద్దిగా చావినట్టు కన్పిస్తాయి నవ్వు అవునా, కాదో అనే భ్రమకు చాచిన పెదవుల చార ముఖ్య కారణం దీనితోపాటు కళ్ళల్లో మందహాసపుతునక ఒకింత ప్రసరిస్తున్నట్టు తొస్తుంది మీరు చూస్తున్నట్టుగానే ఆ కళ్ళు మిమ్మల్ని చూస్తాయి మీరింకా వాటి పరిచయం చేసుకుంటూ ఉండగానే ఆ చూపు మీ మనస్సులో ప్రవేశించి మీ స్వభావాన్ని పసికట్టి ఉండవచ్చునిపిస్తుంది అంత తీక్షణమైన చూపు, అలాంటి ప్రశాంతమైన చూపు లయితె ప్రూరమూ కాదు, తీక్షణమూ కాదు తప్పుచేసిన వాళ్ళకు కూడా క్షమించే చూపు"

"ఇంటికి వచ్చినవాణ్ణి ఆ చిత్రాన్ని స్మరిస్తూ ఈ వివరాలనన్నిటిని మనస్సులో నెమరు వేసికొన్నాను మనస్సులో అనుకొంటున్నప్పుడు, ఇన్ని వివరాలని దాన్ని చూసిన రెండుమూడు సార్లలో, ఆరేడు క్షణాల్లో గ్రహించానని తెలిసి నాకు చాలా ఆశ్చర్యం వేసింది అన్ని విషయాల్లో నేను ఇన్ని వివరాలను గ్రహిస్తున్నానా? లేదనిపించింది అలాగయితే ఈ సందర్భంలో ఇన్ని వివరాలు నా మనస్సులో ఎలా ప్రవేశించాయి? అలాగే ఆలోచించాను ఇది ఆ చిత్రంలోని వ్యక్తిలో వున్న విశేష శక్తి అనుకున్నాను మళ్ళీ వెళ్ళినప్పుడు స్నేహితుణ్ని క్షమాపణ కోరి అయినా సరే ఆ చిత్రం ఎవరిదని అడగాలనుకొని నిశ్చయించుకొన్నాను

"ఆలోగానే మళ్ళీ ఆ మిత్రుణ్ణి చూడాల్సి వచ్చింది చూడడానికి వెళ్ళినప్పుడు నేను ఆ చిత్రంవైపే చూస్తున్నప్పుడు ఆ స్నెహితుడు తనకుతానుగా 'ఆ చిత్రం నా పినతల్లిది నా జీవితాన్ని రక్షించిన దైవం పెద్దింటి ఆడపడుచు చిన్నతనంలోనె కన్ను మూశారు" అన్నారు

"రెండు క్షణాలు మౌనంగా ఉంది "కన్ను మూశారు" అని గుచ్చెందుకు దాచాలి? ప్రాణం తీసుకొన్నారు ర౬ మాటన్న తర్వాత ఎలా ప్రాణంతీసుకొన్నారు, ఎందుకు అని అన్ని వివరాలను చెప్పాలి చెప్పకపోతె ఆమెను గురించి మీకు చెడ్డ అభిప్రాయం రావచ్చు ఆమె విషయం చెప్పడంలో నేను పూజించాల్సిన ఇద్దరు పెద్దల విషయంలో, చెడ్డగా చెప్పాల్సి ఉంటుంది అయితె నిజం చెప్పి, ఆ ఇద్దరికీ నేను చేసె అపరాదం తక్కువై అనాలి నిజం చెప్పకుండా మా పినతల్లి ఆత్మహత్య చేసుకొన్నారు అని మాత్రమే చేప్తే ఆమె విషయంలా నేను పెద్ద అపరాదం చేసినట్టవుతుంది" అన్నారు

"మీరు ఫ్రీగానే ఉన్నారా?" అని అడిగి నేను ఉన్నానని చెప్పగానే ఆయన తమ పినతల్లి కదను చెప్పారు

ఇలా శ్రీరామ్ తన స్నేహితుడి మాటల్లోనే అతని పినతల్లి చరిత్రను వివరించారు దాన్ని ఇక ముందు ఆ స్నేహితుడి మాటల్లోనే చెబుతాను

## 2

నేను నా తండ్రికి మూడో బార్య కొడుకును, మా తండ్రికి మా తల్లిని పెళ్ళి చేసుకొన్నప్పుడు దాదాపు నలభై సంవత్సరాలుంటుంది మా తండ్రిగారి జాతకం పత్నిఘాతక జాతకంలా ఉండేది ఆయన అందరిలాగానే చిన్న తనంలోనే ఒక పెళ్ళి చేసుకొన్నారు ఆ బార్య ఇంటికి వచ్చిన రెండేళ్ళ లోగానే మరణించింది మా తాతగారు బలవంతం చేసి మా నాన్నకు రెండో పెళ్ళి వేశారు ఆమె ముగ్గురు పిల్లల్ని ప్రసవించారు, పదిహేను సంవత్సరాలు కాపురం చేసి ఏదో జ్వరం వచ్చి మరణించారు తండ్రిగారు మలోపెళ్ళి చేసుకోవాలనే అనుకోలేదు అయితే ఇంతకు ముందే మా తాతగారు మరణించడంవల్ల, మా నాయనమ్మ ఇంటి యాజమాన్యం వహించారు "నీయింటిని మాసుకోవడానికి నాకేం గ్రహచారం? ఇంటికి ఒక లక్ష్మిని తెచ్చి బతకాలనుకొంటే బతుకు లేకపోతే అలాగే ఉండు నేను ర౬ వయస్సులో నీయింటి యజమాన్యం వహించలేను" అన్నారు నాలుగేళ్ళ తర్వాత

పెద్దకొడుక్కిపెళ్ళి చెస్తె ఆ కోడలు ఇంటిని చూసుకొంటుందని మా నాన్న ఆలోచించి నిర్ణయించారు. అయితే ఆ తల్లి నాలుగేళ్ళు ఆగాలి కదా! ఏమి చేయడానికీ తోచక మాతండ్రి శాస్త్రానికి అరటిచెట్టును పెళ్ళాడి, ఆ సంసారాన్ని పాలించి మా తల్లిని పెళ్ళి చెసుకొన్నారు

మేము ఊళ్ళో భూముల్ని ఇనాముగా పొందిన వాళ్ళం ఇంటి యజమాన్యానికి సంబంధించిన పని ఎక్కువగా ఉండేది ఇంటికి వచ్చిన కోడలు వయస్సు చేత చిన్న పిల్ల అయి ఉండవచ్చు అయితే సంసార బారం మాత్రం వయస్సును మించి వుండెది ఈ మాటని నెను ఇటీవల అనుబవంవల్ల చెప్తున్నాను ఆ కాలంలో ఈ బారం మరింత ఎక్కువగా ఉండిఉంటుంది మాతల్లి స్వాబావికంగా అంత దృఢమైన స్త్రీకాదు ఇంటికి రాగానే, "పెద్ద కొడుక్కి పెళ్ళి చేయండి, ఇంటికొక కోడలురానీ" అని బలవంతం చేయసాగారు తండ్రిగారు, "ఇంతచిన్న పిల్లవాడికి పెళ్ళి చేసేటట్టయి ఉంటే, నిన్నెందుకు తెచ్చుకోవాల్సి వచ్చింది" అని బార్యని ఎగతాళి చేశారు "ఇంటిపనికి ఆడమనిషి కావాలి అనే పెళ్ళి చేసుకొని నిన్ను తెచ్చుకోవాల్సి వచ్చింది" అని బార్యని ఎగతాళి చేశారు మాతల్లి "ఇంటిపనికి ఆడమనిషి కావాలి అనే పెళ్ళి చేసుకొని నన్ను తెచ్చుకొన్నారా? అలాగే కానివ్వండి చాకిరి చెయ్యడానికి ఇద్దరమూ ఉంటాము కొడల్ని ఒకతెను తీసుకురండి" అన్నారు రోజు మార్చి రోజు ఈ మాటను వింటున్న మాతండ్రి ఇక బరించలేక మా పెద్దన్నకు పెళ్ళి చేశారు

చెప్పడం మరచాను మా పెదతల్లి కన్న ముగ్గురు పిల్లల్లో ఈ ఒక్క పెద్దన్న మాత్రమే మిగిలాడు తక్కిన ఇద్దరు వరుసగా ఎనిమిదేళ్ళు, పదేళ్ళు పెరిగి మరణించారు

మాతల్లినన్ను ప్రసవించి, ప్రసవ సమయంలో అదేం అజాగ్రత్త జరిగిందో ఏమో కాని, ఒకటి రెండు నెలలుండి కృశించి కృశించి కన్ను మూశారు నేను మా వదినగారి బిడ్డనయ్యాను

మా వదిన నన్ను రెండేళ్ళు పెంచారు ఆమె కూడ వయస్సులో చిన్నవారు, అయినా ఇంటి యజమానురాలు నాయనమ్మ ఆమెను పెద్దావె,

ఎన్ని తెలిసిన స్త్రీ అన్నట్టుగానే దండించేవారట నాకు మాతల్లిగారి ముఖం జ్ఞాపకం రావడానికి సాధ్యమే లేదు చిన్న తనంలో తల్లిదే అని నేను తెలుసుకున్న ఒక ముఖం నా ముఖం దగ్గర ఉండడం, ఆ కంట్లోంచి నీళ్లు కారి నా మీద పడటం, నాకు జ్ఞాపకం ఉంది మా అన్న పల్లెటూళ్ళని దుష్టులతో సహవాసం చేసి తన ఆరోగ్యం పాడు చేసుకొన్నట్టు కన్పిస్తుంది ఆరోగ్యం పాడుచేసుకొన్న అతని భార్యగా మా వదినగారికి ఏదో రోగం వచ్చింది నాలుగు నెలలు క్షీణించి, రక్త హీనురాలైన పాండురోగిలా ఆమె కూడా కన్ను మూశారు

మా తండ్రి జాతకం పత్ని మారకం కావడం అటుండి, మా అన్న జాతకం కూడా భార్యను బలి తీసుకొన్న జాతకంలా తయారైంది నేనటు కన్నవాళ్ళని, పెంచినవాళ్ళని పొట్టన పెట్టుకొనే జాతకంలో పుట్టాననడం స్పష్టంగానే ఉంది పుట్టిన రెండు నెలల్లో కన్న తల్లిని పొట్టనబెట్టుకొన్నాను పిల్లాడికింకా మూడేళ్ళు లేవు, సంసారమంటే ఇష్టంలేని నాయనమ్మ తప్పితే ఇంట్లో మరో ఆడదిక్కు లేరు దాన్నెవరు చూసుకోవాలి?

కొద్ది రోజులకు ఇంటికెవరో బంధువులు వచ్చారు ఆ వివరాలన్ని నాకు జ్ఞాపకం లేదు ఎలాగో కొంత కాలం గడపడమయింది నాయనమ్మ మళ్ళీ పెళ్ళి చేసుకోమని మానాన్నని బలవంత పెట్టసాగింది కొడుక్కి పెళ్లి చేద్దామనుకొంటే "వాడు భ్రష్టపడ్డాడు కొంత కాలం అలాగే ఉండని కొంచెం బుద్ధి వచ్చిం తర్వాత పెళ్ళి చేద్దువుగాని" అన్నాడు మా తండ్రి ఇరకాటంలో పడ్డారు

పెళ్ళి మాట కొంచెం పుంటు పడటంతో మా నాయనమ్మ "నేను కాశీకి వెళ్ళిరావాలి ఈ సంసారంలో తగులుకొని ముసల్దాన్నయ్యాను నన్ను రైల్లో పంపించు కాస్త శక్తి ఉండగానే ఈ ఒక్క యాత్రనూ ముగించేస్తాను" అన్నారు

నాయనమ్మకు కాశీ యాత్ర అంత ముఖ్యం కాదు, కొడుకు పెళ్ళి చేసుకోవాలనేది ఆమె ఉద్దేశం మా తండ్రిగారికి కూడా ఇది తెలుసు అయితే చేసేదేమిటి? పెళ్ళి చేసుకోవాలి, లేదా చేసుకోనుపో, అనాలి. తల్లికి ఈ

విషయం చెప్పే ధైర్యం ఆ కొడుక్కి లేదు నలభై అయిదేళ్ళ వ్యక్తి ఒక చిన్న పిల్లని పెళ్ళి చేసుకోవడమనేది ఎప్పటికైనా సిగ్గు పడాల్సిన మాటే ఇప్పటిలాగా అప్పుడు అది నవ్వుల పాలు కాలేదు, అయినా అది చాలా మంది మెచ్చుకునే విషయం కూడా కాదు ఇలా ఆలోచించి, అలా ఆలోచించి తండ్రి చివరికి మా ప్రాంతం వదలి కొంచెం దూరంనుంచి కాస్త వయసున్న అమ్మాయిని తీసుకురావడానికి నిశ్చయించుకొన్నారు తమకు తెలిసిన కొంత మందికి తన ఉద్దేశాన్ని చెప్పి అక్కడక్కడా వాకబు చేయడం మొదలు పెట్టారు ఆరు నెలలు వెదకి ఒక అమ్మాయిని నిశ్చయించారు, ఆమెను పెళ్ళి చేసుకొన్నారు

కోడలు ఇంటికి వచ్చిన ఒకటి రెండు నెలల తర్వాత మా నాయనమ్మ కొడుకును ఆమెకు అప్పగించి కాశీకి వెళ్ళే బంధువులవెంట యాత్రకు బయల్దేరి వెళ్ళారు ఇంట్లో నేను, మా పినతల్లి, మా పెద్దన్న, మా నాన్న మాత్రం ఉండేవాళ్ళం

మా పినతల్లి ఇంటికి వచ్చిన రోజు నాకు బాగా జ్ఞాపకం ఉంది ఐదేళ్ళ పిల్లలకు ఆ వయస్సులో జరిగిన విషయాలు ఎంతవరకూ జ్ఞాపకం ఉంటాయో నాకు తెలిదు నాకు ఆ కాలంనాటి జ్ఞాపకాలు అంత ఎక్కువగా ఏమీ లేవు అక్కడొక విషయం, ఇక్కడొక విషయం మనస్సులో నిలిచాయి మధ్యలో జరిగినవన్నీ పూర్తిగా మాసిపోయాయి పెళ్ళికూతురు ఊళ్ళోని ఒక దేవస్థానంలో పెళ్ళి జరిగి, జమీందారు పెళ్ళాన్ని తీసుకొని వస్తాడని ఊళ్ళోని జనం కాచుకొన్నారు ఇంట్లోని పని మనిషి పిల్లలెవరో నాతో, "మీ తల్లి వస్తుంది" అని అన్నారు నేను 'ఆ' అన్నాను తల్లి రావడం అనేది నాకు చాల సంతోషకరమైన విషయం తల్లి ఎక్కడ అని ఇంటి తలుపు దగ్గిరికి నాలుగు సార్లు వెళ్ళి చూసి రావడం జరిగింది

మరోసారి వెళ్ళాలనుకొంటుండగానే, "అదిగో వచ్చారు!" అని అందరూ వాకిలి వైపు చూశారు నాయనమ్మ చుట్టుప్రక్కలున్న ముత్తయిదువలను పిలిపించుకొని, ఇంటికి వస్తున్న కోడలికి హారతి ఇవ్వడానికి ఏర్పాటు చేశారు తలుపు దగ్గర వేసిన పీట మీద మా నాన్న, పినతల్లి, ఇద్దరూ నిలబడున్నారు నేను చిన్న పిల్లవాణ్ణి అయినా మా నాన్నలో చలాకీతనం లేకపోవడం నాకింకా

జ్ఞాపకం ఉంది మా నాన్నయితె ఒక మారు చూశాను కాని, నా కళ్ళన్నీ కొత్తగావచ్చిన తల్లి వైపే ఉన్నాయి హారతి ఇస్తున్న సమయంలో ఆమె నా వైపు చూశారు మానాన్న "వాడె బిడ్డ" అన్నారు మా తల్లి అంతవరకూ ఎలాగో నిలుచున్నవారు నావైపు తదేకంగా చూశారు ఆ మొహం వికసించింది ఆమె పెదవుల్లో మీరు ఈ చిత్రంలో చూస్తున్నారుగా, ఇదే ఈ నవ్వు తల్లిని చూడని అనాథనయిన నేను తల్లి అనె ఒక ముఖం దగ్గరగా కన్పించేసరికి మొదటి సారిగా కన్నీరు కార్చాను ఇప్పుడు తల్లి ఒక పెద్ద వ్యక్తిగా, నన్ను కాపాడె మూర్తిగా దర్శనమిచ్చింది నా మనస్సు ఉప్పొంగింది నేను తల్లి దగ్గరికి పరుగెత్తాలి, ఎవరో నన్ను పట్టుకొని ఉన్నారు

హారతి ముగిసి వాళ్ళు ఇంటిలోపలికి వచ్చారు నేను "అమ్మా" అంటూ దగ్గరికి వెళ్ళాను ఆమె, "అమ్మ కాదు, పిన్నమ్మ అను" అన్నారు నన్ను ఎత్తుకొన్నారు

అక్కడే మా పెద్దన్న నిలుచుని ఉన్నాడు అతనూ ఒక కొడుకని ఈమెకు తెలీదు నేను, "అన్నా, పిన్నమ్మను చూడు!" అన్నాను

మా పినతల్లి అతని వైపు చూశారు ఎందుకో సంకోచించారు, తమలో తాము క్రుంగినట్టయిపోయారు తక్కిన విషయాలు నాకు జ్ఞాపకం లేవు అందరం లోపలి ఇంట్లోకి వెళ్ళాము పిన్నమ్మ ఇంటి యజమానురాలయ్యారు

పిన్నమ్మ రావడమే తరువాయి, ఇంటి వ్యవహారాలన్ని ఏదో విధంగా మునుపటి కంటె బాగా జరుగుతున్నాయనిపించింది ఉదయం లేవగానే ఆవు పాలు పిండి, కాచి, నేను లేచెసరికి నన్ను లాలించి, ముఖం కడిగి, సిద్ధంగా ఉంచిన పాలను ఇచ్చేవారు చూసుకొనే వాళ్ళులేక అనాధగా ఉన్న నేను ఈ ఒక్క మార్పువల్లే ఏదో సుఖం అనుభవించేవాణ్ణి అయితే, నా జీవితంలో జరిగిన మూడు మార్పుల్లో ఇదొకటి మాత్రమే తల్లి అనే జీవి దగ్గరలేక శూన్యమైన నా జీవితానికి, ఎప్పుడు పడితే అప్పుడు అమ్మా అని పిలవడానికి ఒక తల్లి ఆదరణ లభించింది నన్ను కన్నతల్లి అయివుంటే, నేను ఆ వయస్సులో ఆమెకంతగా దగ్గరివాణ్ణయ్యే వాడినికాను తల్లిని పోగొట్టుకొన్న నాకు కొత్త తల్లి రావడం వల్ల నేను అరవై గడియలు పిన్నమ్మతోనే గడిపేవాణ్ణి

ఆమె స్వభావం మరోలా ఉండి ఉంటె నేను నిరుత్సాహ పడివుండే వాడిని అయితే, పిన్నమ్మకు నేనెంత ఆత్రుతతో దగ్గరయ్యానో, అంతకంటె ఆతురతో నన్ను ఆమె దగ్గరికి తీసుకొన్నారు ఆరేళ్ళ పిల్లవాణ్ణి రఃమె లాలనలో మూడేళ్ళ వాణ్ణయ్యాను రుచి తెలుసుకొని పసిబిడ్డ చేయించుకునే శుశ్రూషలన్నింటిని, నేను రుచిని బాగా తెలుసుకొంటూ అనుభవించాను పిన్నమ్మ విసుగు చెందక నన్ను చంకలో పెట్టుకొని ఇల్లంతా తిరిగేవారు తాను పని చేస్తున్నా నన్ను పక్కలో కూర్చో బెట్టుకొనేవారు బియ్యం, కందిపప్పు, పెసరపప్పు మొదలైన ధాన్యాలని గాలిస్తూ, విసురుతూ నాకు అక్షరాలు వ్రాసిచ్చి, దిద్దమనేవారు భోంచేసిన తర్వాత గదిలో కూచుని నన్ను పక్కలో ఉంచుకొని తడుతూ నిద్రపుచ్చేవారు నిజం చెప్పాలంటే రఃమె గారాబం వల్ల నేను స్కూల్లో చేరడం ఆలస్యమైంది పిన్నమ్మ నన్నింత ప్రేమతో చూసుకోవడాన్ని గమనించి మా నాయనమ్మ చాల సంతోషపడింది మానాన్నకూ ఇది చాలా నెమ్మదిని కలిగించింది కొత్తలో ఒకరోజు ఆయన "బిడ్డ నిన్ను తల్లినై చేసుకొన్నాడు వాడు పుణ్యం చేసుకున్నాడు కాబట్టే నువ్వీ ఇంటికి వచ్చావు" అన్నారు పిన్నమ్మ ఏమీ మాట్లాడలేదు

ఇంటి వివరాలను నేనెక్కువగా చెప్పలేను అక్కడక్కడా జరిగిన ఒకటి రెండు విషయాలు జ్ఞాపకం ఉన్నాయి తక్కినవన్నీ చెరిగి పోయాయి జ్ఞాపకం ఉన్న ఒకటి రెండుమాటలవల్ల దాని ముందువెనుకలు ఏమయి ఉంటాయని మనస్సులో రూపొందించుకొంటాను మీరూ అలాగే చెయ్యాలి ఒక నెలరోజులు పిన్నమ్మ ఇంట్లో ఔదార్యంతో నడచుకొన్నారు నా తానాన్న ఆమె విషయంలో సంతోషంగానే ఉన్నారు కొద్ది రోజుల తర్వాత మా తండ్రికీ, పినతల్లికీ మధ్య ఏదో భిన్నాభిప్రాయం వచ్చినట్టనిపించింది నాన్న ఒకసారి "ఇదేమిటి నువ్వెప్పుడూ పిల్లవాడితో పాటే తిరుగుతూ ఉంటావు వాడి పాటుకు వాణ్నొదలు" అన్నారు పిన్నమ్మ, "తల్లి లేనిబిడ్డ, ఏదో నేను మంచిగా మాట్లాడతానని నా దగ్గరికి వస్తాడు వాణ్ణి పక్కకు నెట్టడమా ?" అన్నారు, నన్ను ఎప్పటిలాగానే తనతోపాటే తిప్పేవారు

ఒక రాత్రి నేనొక పడకమీద పడుకొన్నాను నా ప్రక్కలో పిన్నమ్మ పడక వేసి ఉంది దాని ప్రక్క మానాన్న పడక ఎప్పుడో నాకు నిద్రనుండి

మెలకువ వచ్చింది

మానాన్న, పినతల్లి మాట్లాడు కొంటున్నారనిపించింది నేను నిద్రలో ఉన్నప్పుడు మాటలు విని ఉండవచ్చు క్షణం తర్వాత మానాన్న లంటున్న మాటలు వినిపించాయి

"ఇదేమిటి నీ మొండితనం?" ఆయన ధ్వని కోపాన్ని సూచించింది కఠినంగా ఉంది

పిన్నమ్మ అన్నారు, "మొండితనమేమిటి?"

"మొండితనమా? ఇది మొండితనం కాక మరేమిటి? నేను నిన్నెందుకు పెళ్ళి చేసుకొన్నాను?"

"ఎందుకు పెళ్ళి చేసుకొన్నానని అడుగుతారెందుకు? పెళ్ళి చేసుకొన్న మీకు తెలిదా? నేనేమీ తెలియని పిల్లను మీరు సహించుకోవాలి

"పిల్లదానవా? అదెలాంటి పిల్లవు? పదహారేళ్ళయినా పసికందు అంటావేమిటి?"

"పసికందు కాకపోతే నాకేం వయస్సయిపోయిందా? నేను పుణ్యం చేసి ఉంటే మీ కూతురునయి పుట్టి ఉండేదాన్ని మీ యింట్లో కొడుకు ఉన్నాడు కదా, వాడి చెల్లెలుగా ఉండెదాన్ని మరో ఇంటి బిడ్డని, మీ చెయ్యి పట్టివచ్చాను తెలియని దాన్నని సహించుకోండి"

"సరే, సహించుకోండి, సహించుకొండి, అని నేవు సులభంగా అంటూ ఉండు నువ్వెమో బంకమట్టి బొమ్మాలాగ ఉండొచ్చు నేను "

పిన్నమ్మ తండ్రిగారి మాటల్ని అడ్డుకొన్నారు "పిల్లవాడు మేలుకొంటాడు. మళ్ళీ మాట్లాడుకొందాం పడుకోండి" అన్నారు

"ఆహా! నువ్విందుకే పిల్లవాణ్ణి ఇంతమచ్చిక చేసుకొన్నదనిపిస్తుంది అన్నిటికీ వాణ్ణి ముందుపెట్టుకొని నానోరు మూయిస్తున్నావు" అంటూ మానాన్న మాట ముగించారు.

ఇంకేం పోట్లాట జరుగుతుందా అని భయపడ్డనాకు కొంత ఊరట

కలిగింది నేను అరనిద్రలో "పిన్నమ్మ" అన్నాను "పిన్నమ్మ" "ఓ!ఏమిటినాన్న!"అన్నారు, నన్ను తట్టారు నేను మళ్ళీ నిద్ర పోయాను

అప్పుడు నాకీమాటలన్ని అర్థం కాలేదు వారు మాట్లాడుకొన్న మాటలన్ని ఇలాగే ఉన్నాయని నేను చెప్పలేను వయస్సు మళ్ళిన తర్వాత పినతల్లి విషయాన్ని స్మరిస్తూ మనస్సులో హత్తుకొని నిలిచిపోయిన జ్ఞాపకాలను విడమరచి చెప్తున్నాను ఇలా జ్ఞాపకం చేసుకొన్నప్పుడు, మనస్సులో నాటుకొన్న బావాలను విశ్లేషించి చూస్తే ఆ నాటి రాత్రి సంఘటనను సంబంధించి వాళ్ళ మాటల అర్థం ఏమయి ఉంటుందో నాకు అవగతమైంది పినతల్లి వచ్చిన కొత్తలో బార్యగా మా నాన్నతో సంసారం చెయ్యడానికి అంగికరంచలేదనిపిస్తుంది ఇలాంటి వాగ్వివాదాలు చాలసార్లు జరిగి ఉంటాయి ఒక సారి మాత్రం నా చెవిలో పడింది ఇది జరిగిన తర్వాత అంతకు ముందు నాకు అర్థంకాని ఒకటిరెండు సంగతులు ఠః వాగ్వివాదానికి సంబందించిన తరువాయి భాగం అని తెలిసింది

ఒక ఉదాహరణ, కొద్ది రోజుల తర్వాత పిన్నమ్మ నన్ను కూర్చో బెట్టుకొని అక్షరాలు దిద్దిస్తున్నారు మా నాన్నగారు వచ్చి, "నీవు పిల్లవాణ్ణి నీ కొంగుకు కట్టేసుకొని పాడుచేస్తున్నావు వాడు స్కూలుకు వెళ్ళని ఓనామాలు అక్కడ నేర్చుకొని వదితెయ్" అన్నారు

పిన్నమ్మ, " నాకు ఠఃయింట్లో పొద్దు పోవడమెలా? ఆపని ఠఃపని చేసిన తర్వాత నాకు విశ్రాంతి దొరికినప్పుడు వీడికి రెండక్షరాలు నేర్పిస్తాను వీడికి నేనేం చెడుపు చేస్తున్నట్టు?" అన్నారు

"ఆరేళ్ళ పుత్రాడు, ముప్పొద్దులూ పిన్నమ్మ, పిన్నమ్మ అని కొంగు పట్టుకొని తిరుగుతాడు కదా! ఠః వయస్సులో ఉన్న చుట్టు ప్రక్కల పిల్లలు ఇలాగే ఉంటారా?"

"ఇంకేంటి? కొద్ది రోజులే! ఆ తర్వాత మనం పిలిచినా పిల్లలు దగ్గరికి రారు"

మా తండ్రి ఊరుకున్నారు ఠః మాటల వల్ల నా కొక విషయం

స్పష్టమయింది, నేను, మా పినతల్లి ఇలా తోడుగా ఉండడం మా నాన్నగారికి ఇష్టంలేదు ఈ ఆలోచనతో పాటు మరో ఆలోచన కూడ నాకు వచ్చింది మా తండ్రిగారు పినతల్లిని ఎక్కువగా గద్దించెవారు దీనివల్ల నా మనస్సులో మరో ఆలోచన కలిగింది, పిన్నమ్మను నేను చూసుకోవాలి, పాపం, పిన్నమ్మ చాలమంచిది, నాకోసం తిట్లు తింటున్నది, ఏమైనా సరే నేనామెకు తోడుగా ఉండాలి

ఈ విషయాన్ని గురించి నేనింకెమీ చెప్పనవసరం లెదు మా నాయనమ్మ కాశికి వెళ్ళి వచ్చేలోగా ఇంట్లో నాన్నాగారికి, పినతల్లికి మధ్య ఎన్నోసార్లు వాగ్వివాదాలు జరిగాయి. వీళ్ళిద్దరి మధ్య నేను ఏంచెయ్యాలో తోచక తికమకపడ్డాను నాయనమ్మ ఊరికి వచ్చిన తర్వాత మానాన్న ఒకరోజు రాత్రి పడుకునే ముందు పిన్నమ్మతో, "పిల్లాడు నాయనమ్మ దగ్గర పడుకోని, వాడి పడక అక్కడ వేయ్" అన్నారు

పిన్నమ్మ " నెనియింటికి వచ్చింది పిల్లాడిని చూసుకోవడానికని వాణ్ణి నాయనమ్మ దగ్గర పడుకోబెట్టేటయితే నన్నెందుకు పిలుచుకొని రావాలి? పెళ్ళి చూపులు చూడడానికి వచ్చినప్పుడు మీరేం అన్నారు? ఒక చిన్న బిడ్డ ఉన్నాడు, వాడికి దిక్కులేదు, అని కాదా? చిన్న బిడ్డకు దిక్కుగా వచ్చాను నేను వాణ్ణి పెంచి పెద్ద చేస్తాను మీకు ఇదే కోరిక ఇద్దరం కలిసి వాణ్ణి పెంచి పెద్ద చేద్దాం" అన్నారు

"ఇదేమిటి నువ్వంటున్నది? పిల్లనడగటానికి వచ్చినవాళ్ళు నాలాగే సంసార హీనులవుతె ఇంకేం చెప్తారు? బిడ్డకు ఒక దిక్కు కావాలనే చెప్తారు ఇల్లు చూసుకోవడానికి అని చెప్తారు ఆ మాటనె పట్టుకొని ఆడుతారా ఏవరైనా?"

"నేనేం మాటలాడుతున్నానో నాకే తెలిదు ఆడరాని ఆటను నేనేం ఆడాను? మీరు పెద్దవాళ్ళు ఏమీ తెలీని పిల్లను పట్టుకొని సంసారం చేసిన పెళ్ళాంలాగ నడచుకోవాలంటే, నెనెలా నడచుకొనేది? నేనేం అనుభవించాను? ఆడుకునే పిల్లను, మీతో బాటు పీటమీద కూచుని సంసారం చేసే స్త్రీనయ్యాను నాకు ఆరేళ్ళ కుర్రాడు, చూడండి నాకంటె నాలుగేళ్ళ

పెద్దవాడయిన కొడుకొకడు ఉన్నాడు నేను చిన్న పిల్లనూ కాని, ముసలిదాన్ని కాను, రెండూ అవుతాను నా చెయిపట్టుకొన్న మీరు నా మీద కోపగించకోకండి మీ సూతులా, మీ కోడలో అన్న బావనతో దయతో చూసుకోంది"

"బాగుంది, నిన్ను నాయింటికి కోడలిగా తీసుకురావాల్సింది అంటున్నావా? మాటలు హద్దు మీరుతున్నాయ్"

"మీరు కోపగించుకోకండి వాడూ నాకూ కొడుకె వీడిలా వాణ్ణి కూడా కొడుకుగా చూసుకొంటాను మీ యింటావిడగా ఉంటాను మర్యాదగా కాపురం చేస్తాను మీరు మాత్రం కంకణంకట్టి, చేయి పట్టి తీసుకొచ్చినందుకు నేను కొంచెం వెనుక ముందాడిన మాటలను సహించండి

ఆ తర్వాతకూడ నెను అదె గదిలో పడుకునే వాణ్ణి అది తండ్రిగారిని ఇష్టం లేదనడం స్పష్టం, అయితె పిన్నమ్మ ఈ విషయంలో ఒక్కఅడుగు కూడ వెనక్కి వేయలెదు ఎందుకన్నది నాకు అప్పుడు తెలుసుకోవడం సాధ్యం కాలేదు ఇటీవల ఆలోచించాను, ఆ తర్వాత జరిగిన సంఘటనల సాయంవల్ల ఊహించాను మా తండ్రి నా ఎదురుగా మా పిన్నమ్మతో మాట్లాడడానికి జంకేవారు; నేను గదిలో ఉండగా ఇంతకంటె ఎక్కువగా మాట్లాడడానికి ఆయనకు సాధ్యమయ్యేదికాదు, అందువల్ల నన్ను బయటికి పంపించాలని ఆయన ఆలోచన ఆ కారణంచేతనే మా పిన్నమ్మకు నన్ను బయటికి పంపించడానికి ఇష్టంలేదు భర్త తనకు ఇష్టంవచ్చిన రీతిలో ఆమెపట్ల ప్రవర్తించడానికి వీలులేకుండా నెను పినతల్లికి రక్షగా ఉండేవాణ్ణి ఆ ప్రాణికి ఒక బిడ్డకావాలి, నేనే ఆ బిడ్డ అప్పటికి ఆమెకు భర్త అవసరం లేదు, ఆమెకు నేనే రక్ష ఇలా రెండు కారణాలవల్ల ఆమె ప్రాణం సంసారమనె సరోవరంలో తెలడానికి నన్ను బెండులా కట్టుకొంది

కొద్ది రోజుల్లో మానాన్నగారు మా గదిలో పడుకోవడం మానేశారు ఈ విషయం నాకు కొంత కాలందాకా తెలియలేదు. ఒకరోజు మద్య రాత్రిలో లేచి తలనొప్పి అనో, ముక్కునొప్పి అనో మా పిన్నమ్మను లేపాను

ఆమె లేచి దీపం వెలిగించారు తండ్రిగారి పడక ఖాళీగా ఉంది నేను, "పిన్నమ్మా, నాన్న ఎక్కడ ?" అని అడిగాను పిన్నమ్మ "ఎక్కడో బయటికెళ్ళారు వస్తారు," అన్నారు నేను "కేళిక చూడడానికా ?" అన్నాను మధ్యరాత్రిలో జనం ఇల్లువిడిచి వెళ్ళడం కేళికను చూడడానికని అప్పటి నా అనుభవం పిన్నమ్మ "కేళిక కాదు, ఏదో పని. నీవు పడుకో నాన్నా" అన్నారు నేను ఊరకుండిపోయాను, నిద్రపోయాను

నాలుగైదు నెలలు గడచి ఉంటాయి ఇంట్లో మా పినతల్లి మా పెద్దన్నకు పెళ్ళి మాట ప్రస్తావించారు మా నాయనమ్మ, "వాడు వట్టి పోకిరి వెధవ మొదటి పెళ్ళాం పుణ్యం చేసి కన్ను మూసింది వాడు పెళ్ళాన్నేం బతకనిస్తాడు ?" అన్నారు మానాన్న, "ఒక పెళ్ళాం పోయిందని నేను మరో పెళ్ళాన్ని తెచ్చుకొని సుఖపడుతున్నది చాలదా ? అంత అవసరమేమిటి ?" అన్నారు

విషయమేమిటో నాకు అర్థంకాలేదు ఏదో ఉండితీరాలి మా పినతల్లి రెండు మూడు నెలల్లో మా పెద్దన్న పెళ్ళి విషయం గురించి రెండుమూడు సార్లు ప్రస్తావించారు రెండు మూడు సార్లూ కూడా నాయనమ్మా, నాన్నా పెళ్ళి మాటని ఇలాగే తుంచివేశారు

ఒక రోజు రాత్రి మా పిన్నమ్మతో ఎవరో మాట్లాడుతూ ఉండడం నాకు అర నిద్దురలో విన్పించింది. పిన్నమ్మ ఏదో అన్నారు నాకు మెలకువ వచ్చింది మా పెద్దన్న మాటలు విన్పించాయి

"వెళ్ళండి, వెళ్ళండి, అంటున్నావు కదా ? నేనెందుకు వెళ్ళాలి ? మా నాన్నను తరిమావు నేను రావాలనే కదా ?"

"ఇంటికి పెద్దకొడుకు ఇలాంటి మాటలాడకూడదు నేను తల్లి అనే విషయం జ్ఞాపకం ఉండని ఇప్పుడు వెళ్ళండి బయటికి"

"తల్లి కొడుకుని పొండి, వెళ్ళండి, అంటారా ? కొడుకు గానే భావిస్తే పో, రా, అనాలి"

"మంచిది అలాగే అందాం, ఇప్పుడు బయటికి వెళ్ళొచ్చు"

పెద్దన్న వెళ్ళిపోయాడనుకొంటాను పిన్నమ్మ తలుపు మూసి గడియ పెట్టారు వచ్చి తన పడక మీద పడుకొన్నారు

నేను విన్న వాణ్ణయినప్పటికి పిన్నమ్మ, పెద్దన్న మాట్లాడిన మాటలవల్ల వీళ్ళిద్దరి మధ్య ఏదో పేచి వచ్చిందని గ్రహించాను కొన్ని వారాలు గడచిన తర్వాత ఒకరోజు మధ్యాహ్నం నేను నా పాఠం నేర్చుకుంటూ గదిముందు కూర్చున్నప్పుడు మా పెద్దన్న గదిలోపలికి వెళ్ళి పిన్నమ్మ ముందు నిలబడ్డాడు

పిన్నమ్మ "ఏమిటి?" అని అడిగారు

పెద్దన్న, "నాన్న ఆ స్త్రీతో సంబంధం పెట్టుకోవద్దన్న మాట నేను చెప్పేనువ్వు వినలేదు ఇప్పుడు విను, ఆ విషయం ఊరికంతా తెలిసిపోయింది" అన్నాడు

పిన్నమ్మ, "ఎవరేం చెప్పాలి, నేనేం వినాలి? ఆ మాటలన్ని ఈ ఇంట్లో మనకెందుకు? వాళ్ళ వాళ్ళకు తగినట్టుగా వాళ్ళుండాలి" అన్నారు లేచి గది నుంచి బయటికి వచ్చారు, ఏదో పని ఉన్నట్టుగా ఇంటి లోపలికి వెళ్ళారు

అప్పటికి నాకు రెండు విషయాలు తెలిశాయి మా నాన్నగారు పిన తల్లి మీద కోపగించుకొని ఆమెను నిర్లక్ష్యం చెశారు పెద్దన్న పినతల్లి విషయంలో ఆమె తనకంటె చిన్నవారనే కారణంచేత మర్యాద తప్పి ప్రవర్తించేవాడు ఆ తప్పు స్వరూపం ఏమిటని అప్పుడు నాకు అర్థం కావడం సాధ్యంకాలేదు ఈ మధ్య అర్థమైంది దాని స్వరూపం తెలియకపోయినా పిన్నమ్మ ఆ విషయం గురించి పెద్దన్న మీద చాల అసహనం పొందడం, పెద్దన్న దాన్ని లక్ష్యం చెయక పదేపదె ఆమెను విసిగిస్తూ ఉండడం, గమనించాను

ఆ సమయంలో ఈ విషయం నాయనమ్మ ముందు ప్రస్తావనకు వచ్చి, నాయనమ్మ మా తండ్రితో, 'ఇంటికొక ఇల్లాలుండాలని తీసుకొచ్చావు. తీసుకొచ్చిన పెళ్ళాంతో కాపురం చెయ్యాలి" అని చెప్పడం నాకు జ్ఞాపకం ఉంది మరోసారి నాయనమ్మ మా పెద్దన్నతో, "సవతి తల్లి చిన్నదయినా తల్లిరా బాబు నీ తల్లి, నినుకన్న తల్లి మళ్ళీ వచ్చిందని అనుకో ఇంటి

యజమానురాల పట్ల మర్యాదగా మసలుకో" అన్నారు ఈ మాటలకు సంబంధించి ముందు వెనుక మాటలు అంతగా నాకు జ్ఞాపకం లేవు

పోట్లాటకి కారణం ఏమిటని నేను తూర్పాని ఆలోచించిన సమయాలు ఉన్నాయి అలాంటి సమయంలో నాకు తెలిసింది ఇంతే మానాన్న మా పిన తల్లితో సంబంధం ఏర్పాటు చెసుకోవడానికి వెళ్ళినప్పుడు తనకు ఐదేళ్ళ పెళ్లి కొడుకు నెనొకణ్ణే ఉన్నానని చెప్పారు అయితే పద్దెనిమిదేళ్ళ వయసొచ్చిన పెద్ద కొడుకు ఉన్నడని చెప్పలేదు ఈ మాత్రానికె ఇంతటి మనస్తాపం ఎందుకు వచ్చిందొ నాకు అర్థం కాలెదు పెద్ద వాళ్ళ విషయాలు, నేను ఈ విషయంగా ఎక్కువ ఆలోచించలేదు

ఈ మధ్య నెను తగినంత పెద్దవాణ్ణయ్యానని నన్ను స్కూల్లో చేర్పారు ఎప్పుడూ నేను మా పినతల్లితో బాటు ఉండడం తప్పడంవల్ల, స్కూల్లో ఉన్న సమయం తప్ప తక్కిన సమయం అంతా మునుపటికంటె ఎక్కువగా నెను పినతల్లితో ఉండేవాణ్ణి పిన్నమ్మ నా విషయంలో ఒకరోజు కాని, ఒక్క క్షణంకాని విసుగు చెందేవారు కారు నేనంటే వట్టి ప్రేమ మూర్తి అయ్యారు ఆమె మనస్సుకు నేను పెరగనె లేదు ఆమె వచ్చినప్పుడు ఎలా ఉన్నానో అలాగే ఎన్నిరోజులు గడిచినా మూడేళ్ల బిడ్డనయ్యాను

ఇలా మరి కొంతకాలం గడిచింది ఐదారు నెలలు గడిచి ఉండొచ్చు మా తండ్రిగారు చాలరోజులు మా గదిలో పడుకొనేవారు అయితే పడక మాత్రం గదిలో ఒక చివర్లో ఉంటుండేది పిన్నమ్మ, నేను మరో చివర్లో పడుకొనేవాళ్ళము

ఒకరోజు రాత్రి నేను సగం నిద్రలో ఉన్నాను ఎవరో గదిలోకి వచ్చారు మా నాన్న అలా రావడం మామూలు అయితే ఆయన పరుపు మీద పడుకొనే ఉన్నారు. ఈ వారు వచ్చినవాళ్ళు మా పడక దగ్గరికి వచ్చారు పిన్నమ్మ అడుగుల చప్పుడు విని పడక మీద లేచి కూర్చున్నారు, "ఎవరు ?" అన్నారు

"నేను" అని జవాబు వచ్చింది, ధ్వని మా పెద్దన్నది.

పిన్నమ్మ, "ఎందుకిలా ప్రాణం తీస్తారు ?

మంచి మాటలతో దూరంగా ఉండండి సహించుకొని ఉన్నానని అతి చెయకండి", అన్నారు

"నేనేం అతి చేశాను? నువ్వెందుకు సహించాలి? ఎందుకీ మాటలు? నువ్వి ఇంట్లో అడుగుపెట్టినప్పుడు నన్ను చూశావు, కళ్ళు కిందికి దించావు నాన్న తాళి కట్టింది నాకోసమని అనుకో, నీకాళ్ళమీద పడి వేడుకొంటాను నామాటవిను"

"నారాయణ! నేనెలాంటి మాటలు వినాల్సి వచ్చింది! నేను వినడమే కాదు దేవుడులాంటి బిడ్డ నిద్రరాక ఈ మాటల్ని వినాల్సి వచ్చింది కదా? మీరేమో చెడిపోయారు పసిబిడ్డను కూడా చెడిపి కడుపునింపు కొంటారను కొంటాను అయిందికదా ఇక పదండి"

"ఇదేం మాటలు పదండి, పదండి, పదండి! నాయనమ్మ చెప్పిన మాటల్ని నీవు వినలేదా? మునియప్ప పెళ్ళాం ఈరన్నతో వెళ్ళిపోయిందని అంటే, ఈరన్న పెళ్ళాన్ని మునియప్ప పెళ్ళి చేసుకొన్నాడు, ఆమె మొగుడి దగ్గరికి పారిపోయింది, ఎవడో వెళ్ళి మరొకడి పెళ్ళాన్ని పెళ్ళి చేసుకొంటే ఆమె లేచిపోక మరేం చేస్తుంది అని నేనేం ఇప్పుడే అనడం లేదు నీవు ఊ అను అంతే బలవంతం లేదు"

కొడుకని ఇంతసేపు ఈ మాటల్ని విని ఊరకున్నాను ఇంటి పేరు చెడకూడదు నేను అరచానంటే అందరి మర్యాద పోతుంది తండ్రిని 'ఛీ' అంటారు కొడుకును 'ఛీ' అంటారు నన్ను 'ఛి' అంటారు

"అదే నేనూ చెప్పడం మా నాన్న కూడ ఒప్పుకొన్నారు "

"ఏం ఒప్పుకొన్నారు?"

"నిన్న నాయనమ్మతో చెప్పున్నారు ఆ ఆడదాన్ని తీసుకురావడమయింది కోడలుగా చేసుకోక నేనే పెళ్ళి చెసుకొన్నానని దానికి కోపం వచ్చిందనిపిస్తుంది చెడ్డ గడియలో సంబంధం చేసుకొన్నట్టయింది, అన్నారు నేను ఇక్కడికి రావడం ఆయనకు తెలుసు మీరిద్దరూ సుఖంగా ఉండమని పెదవి విప్పి చెప్పలేదు అంతే"

"బాగుంది తాను విష పరీక్ష వేయడమయింది ఇప్పుడు కొడుకును పంపించారా ? సరే వెయ్యండి నా నొసటి వ్రాసినట్టు అవుతుంది ఇప్పుడు మీరు నడవండి" క్షణం తర్వాత బిగ్గరగా "నడవండి " మళ్ళీ క్షణం వదలి మరింత బిగ్గరగా" ఊ నడవండి"

నేను పక్కమీదకి ఒరిగి "పిన్నమ్మ" అన్నాను పెద్దన్న వెళ్ళి పోయిన చప్పుడు విన్పించింది పిన్నమ్మ, ఏం బాబూ ? పెద్దన్న ఆడిన మాటలు నిద్రను పాడు చేశాయా ?" అన్నారు, నాకు బాగా కప్పి తాము పడుకొన్నారు

మరుసటి రోజు పిన్నమ్మ నువ్వు స్కూలుకు వెళ్ళ వద్దంది ఆ రోజంతా నన్ను వదలక నాతో పాటు ఉన్నారు, మునుపటికంటె ఎక్కువ శ్రద్ధతో చూసుకొన్నారు, అదెన్ని మార్లు నన్ను ఎత్తు కొన్నారో, ఏమో, నాకీ సమయానికి, ఇలా ఎత్తుకొన్నప్పుడు సిగ్గుపడడం మొదలైంది పిన్నమ్మకు నా మీద ఎక్కువ మక్కువ అయిందని నేను తెలుసుకొన్నాను మధ్యాహ్నం పిన్నమ్మ నా బట్టలన్నిటిని తెచ్చి ఒకచోట చేర్చారు, తమ దగ్గరున్న ఒక పెట్టెను ఖాళీ చేసి, బట్టలన్నిటిని అందులో ఉంచి, "ఇదు చూడురా బాబు, నీ గుడ్డలన్నీ ఇందులో ఉన్నాయి అక్కడా ఇక్కడా వెతకవద్దు తెలిసిందా ?" అన్నారు

నాకు ఒక పెట్టె దొరికిందన్న సంతోషం నేను "తెలిసింది పిన్నమ్మ" అన్నాను

పిన్నమ్మ "మా మంచి బాబు" అన్నారు, నన్ను దగ్గరికి తీసుకొని కౌగిలించుకొన్నారు, ముద్దు పెట్టుకొన్నారు, బుగ్గకు బుగ్గ తాకించి ఎంతసేపో అలాగే కూర్చుండి పోయారు

ఆమె నన్ను విడిచినప్పుడు ఆమె ఏడుస్తూ ఉండడం నాకు కనిపించింది నేను నా రెండు చేతులతో ఆమె రెండు చెంపల్ని తుడిచి, "ఎందుకు పిన్నమ్మా ఏడుస్తావు ? నాన్న తిట్టారా ?"

"లేదు నాన్నా నిన్ను వదలి వెళ్ళాలి అందుకొసమే ఏడ్చాను"

"ఎక్కడికి కెళ్ళాలి పిన్నమ్మా ?"

"ఎక్కడికో వెళ్ళాల్సివుంది నా బాబూ"

"నేనూ వస్తాను"

"వద్దమ్మా, నేనుండను చూడు, అప్పుడు నువ్వు అక్కడా ఇక్కడా వెతకి చూడదనే నీ గుడ్డలనన్నిటిని ఎవరికో చెప్పి ఉంచాను చూడు పొద్దు పొద్దున అన్నం తినాలి, స్నానం చెయ్యాలి, స్కూలుకు వెళ్ళాలి, బట్టలు వేసుకోవాలి, నేను ఉన్నాను అనేట్టుగానే నువ్వన్నీ చూసుకోవాలి తెలిసిందా?

"ఊ, ఊ, ఊ, ! నేనూ వస్తాను పిన్నమ్మా"

"చూశావా! నువ్విలా చేస్తే బంగారు కాదు రా కొంచెం తిండి తిందువుగాని" అంటూ పిన్నమ్మ మాట మార్చి నన్ను బొంచెం గదిలోకి తీసుకు వెళ్ళారు

సాయంత్రం నాన్న ఇంటికి వచ్చినప్పుడు నేను, "నాన్నా, నేనుకూడా పిన్నమ్మతో పాటు వెళ్తాను" అన్నాను ఆయన "ఎక్కడికిరా" అన్నారు నేను "ఎక్కడికో వెళ్తుంది కదా!" అన్నాను ఆయన నా వైపు తదేకంగా చూశారు, అదేమనుకొన్నారో కాని మౌనంగా ఉండిపోయారు

రాత్రి ఎప్పటిలాగ నేను, పిన్నమ్మ ఇద్దరమే పడుకొన్నాము నాకు బాగా నిద్రపట్టింది మెలకువ అయినప్పుడు బయట పక్షులు అరుస్తున్నాయి పిన్నమ్మ నా చెంపకు ముద్దిచ్చి నన్ను లేపారని గుర్తు ఎక్కడికో వెళ్తానని చెప్పి ఉండడం వల్ల, అప్పుడు బయల్దేరుతారో ఏమోనని నేను "పిన్నమ్మా నేనూ వస్తాను" అన్నాను

పిన్నమ్మ "వద్దు బాబూ పడుకో" అన్నారు నేను వినలేదు "ఊ" అంటూ మొండికేశాను ఆమె "పోనీ, ఊరికే ఉండు" అన్నారు, నన్ను పిల్చుకొని ఇంటినుంచి బయల్దేరారు మేము అప్పడప్పుడూ వెళ్తుండే బావులు రెండు ఉండేవి అందులో చిన్నది రామప్ప బావి మేమిద్దరం అక్కడికి వెళ్ళాం పిన్నమ్మ నన్ను అక్కడే బావికి కాస్త దూరంలో పడి ఉన్న బండమీద కూర్చో పెట్టి "ఇక్కడే ఉండు" అని బావికి వెళ్ళారు

పిన్నమ్మ బావికి వెళ్ళినప్పుడు నేను బండమీద కూర్చోవడం

అలవాటు నెరవేర్చుకున్నాను అయితే ఇంతపొద్దులో పిన్నమ్మ ఇక్కడికి వచ్చినప్పుడు నాకు జ్ఞాపకం లేదు తెల్లారుతూ ఉన్నా అది రాత్రె అని చెప్పవచ్చు కాసేపు చూచుని నేను బయపడుతూ "పిన్నమ్మా" అని గట్టిగా అరిచాను

పిన్నమ్మ మాట్లాడులేదు నేను మళ్ళీ, పిన్నమ్మా!" అంటూ మరింత బిగ్గరగా అరచాను

పిన్నమ్మ బావిలోపలినుంచి "వస్తున్నా, బాబూ" అన్నారు, ఒకటి రెండు నిమిషాల తర్వాత వచ్చారు

పిన్నమ్మ, "అందుకె నేను వద్దన్నది, మంచిది, రా, వెళ్దాం" అన్నారు

ఆమె చీర సగం తడిసింది స్నానం చెయ్యడానికి బావిలోనికి దిగి ఉంటారని బావించాను నేను "పిన్నమ్మా, నాకు బయం వేస్తోంది" అన్నాను

ఆ రోజంతా పిన్నమ్మ నన్ను మొదటి రోజులాగా చాల అప్యాయంగా చూసుకొన్నారు నన్ను వదలిపెట్టి వెళ్తున్న కారణంగానే ఆమె నన్ను ఇంత ఆప్యాయంగా చూసుకొంటున్నారని నాకు అనిపించింది ఆమె ఒక మారు నన్ను ముద్దు పెట్టుకొన్నప్పుడు, కంపిస్తున్న స్వరంతో "పిన్నమ్మా, పిన్నమ్మా నీవు వెళ్ళేటప్పుడు నన్ను కూడ పిలుచుకొని వెళ్ళు" అని వేడుకొన్నాను

"అయ్యో రామ! ఆ మాట వద్దు బాబూ మీ నాన్న, మీ అన్న పీడించింది చాలు నీవు కూడ నన్ను పీడించకు నా తండ్రి!"

పిన్నమ్మకు చాల నిస్పృహ కలిగిందనడానికి ఆమె గొంతే సాక్షి అయితే లక్షణంలో ఆమె మాట మాత్రం ఎప్పటిలాగానె ఆప్యాయతతో కూడి ఉంది "రానాన్న ఏమైనా ఆడుకో" అని ఆమె నన్ను ఇంటిముందు వదిలారు

ఆ రాత్రి మళ్ళీ మేమిద్దరమె గదిలో పడుకొన్నాం తెల్లవారగానే క్రిందటిరోజులా పక్షులు కూసే పొద్దులో నాకు మెళకువ వచ్చింది పిన్నమ్మ ముద్దు పెట్టుకొన్నందువల్ల కాదు, ఏదో మెలకువ వచ్చింది పిన్నమ్మ ఎందుకు నన్ను ముద్దు పెట్టుకోలేదు అని నేను ఆమె ప్రక్కకి తిరిగాను, పడక

మీద పిన్నమ్మ లేరు

గది చీకటిగానె ఉంది అందులో నేనొక్కణ్ణె ఉన్నానని తెలిసి నాకు మరింత భయం వేసింది నేను "పిన్నమ్మ అని బిగ్గరగా అరిచాను

సమాధానం లేదు నేను మరో సారి బిగ్గరగా అరచి, పడక వదలి భయంతో కళ్ళు మూసి కొని, తడుము కుంటూ తలుపు దగ్గరికి వెళ్ళి "పిన్నమ్మ, పిన్నమ్మా" అని గట్టిగా అరచాను

ఎవరూ బదులు పలకలేదు నేను బిగ్గరగా ఏడుస్తూ నిల్చున్నాను ఈలోగా నాయనమ్మ లోపలి ఇంట్లోంచి తలుపు తీసుకొని బయటికివచ్చి " ఎందుకు తల్లి బిడ్డడు ఏడుస్తున్నాడు? ఏమిటా? ఇక్కడికి రా" అని పిలిచారు

నేను కాస్త ధైర్యం తెచ్చుకొని ఆమె దగ్గరికి వేగంగా నడిచాను, "పిన్నమ్మ వెళ్ళిపోయింది" అని ఏడుస్తూ చెప్పాను

"వెళ్ళిపోయిందా? ఎక్కడికి వెళ్ళి పోయిందిరా? వస్తుంది, పెరట్లోకి వెళ్ళింది రా, వస్తుంది రా"

"లేదు వెళ్ళిపోయింది వెళ్ళిపోతాను అంది నేనూ వస్తానని చెప్పాను వద్దంది వదలి పెట్టి వెళ్ళి పోయింది" అంటూ ఏడుస్తూ రాగం తీశాను

నాయనమ్మ, "అలాగని చెప్పిందేమిట్రా?" అని అడిగి, "ఒరేయ్ రాముడూ, ఎవర్రా అక్కడా? మీ యజమానిని పిలుచుకురారా, వెంటనే" అంటూ అరిచారు రాముడు ఇంటి పని మనిషి పడుకొన్నవాడు లేచి వచ్చాడు నాయనమ్మ మాటలు విని వీధిలోకి పరుగెత్తాడు

నాయనమ్మ నన్ను లోపలికి తీసుకెళ్ళి తను పడక మీద పడుకోబెట్టి నా ప్రక్కలో కూచున్నారు కొద్ది నిముషాల తర్వాత నాకు నిద్ర పట్టిందేమో చూశారు నేను ఇంకా మెలకువతోనె ఉన్నాను "నిన్నే నమ్ముకొన్నాను నారాయణా, కృష్ణా" అన్న పద్యం చెప్పుకుంటూ ఆమె గోడకు ఒరిగి కూర్చున్నారు

కాసేపయ్యాక మా నాన్నగారొచ్చారు నా మాటలూ, నాయనమ్మ మాటలూ విన్నారు నేను జరిగిందంతా చెప్పా, క్రిందటిరోజు తెల్లవారుజామున జరిగిన విషయాన్ని కూడ చెప్పాను మానాన్న, "చూడమ్మా, నేను చెప్పాను నా జాతకం భార్యని మింగే జాతకం అని నువ్వు వినలేదు దీన్ని కూడ నువ్వు కళ్ళతో చూడాల్సి ఉందింది" అంటూ అరిచారు పనివాణ్ణి పిల్చుకొని ఆ బావి వైపు బయల్దేరారు

పిన్నమ్మ బావిలోపల ఉన్నారు, ఆమె అప్పటికే కన్ను మూశారు ఆమె తెల్లవారు జామున వెళ్ళలేదు రాత్రే నాకు నిద్రపట్టిన క్షణమే వెళ్ళి ఉంటారు

శవాన్ని బయటికి తీశారు, శవ సంస్కారానికి సిద్ధం చేశారు నన్ను అక్కడికి తీసుకొనివెళ్ళినప్పుడు నేను "పిన్నమ్మా" అని ఏడుస్తూ శవం మీద పడ్డాను ముఖానికి ముఖం ఆనించాను మొహం చల్లగా ఉంది ఎప్పూడూ నేను ఎక్కడ ఉంటె అక్కడే చూస్తున్న ఆకళ్ళు అప్పుడు ఎక్కడో ఒక్క ప్రక్కకి పెట్టబడి ఉన్నాయి "నువ్వు వద్దు" అన్నట్టుగా కళ్ళని ప్రక్కకి త్రిప్పేశారేమో అన్నట్టున్నాయి

పెద్దలు శవం మీదినుంచి నన్ను పైకి లాక్కున్నారు నా చేతో దర్భల్ని తాకించి కర్మలన్నిటిని చేసి ముగించారు మా పెద్దన్న ఆరోజు కన్పించనే లేదు చిన్నవాణ్ణయినా నాకు "పిన్నమ్మ చచ్చిపోయారు" అనే విషయం మనస్సుకు హత్తుకుంది నేను మళ్ళీ అనాధనయ్యాను

ఆమె చిత్రం ఇది పెళ్ళయిన కొత్తలో మామండలం మునసబుగారు మావూరికొసారి వచ్చినప్పుడు మా నాన్న, పిన్నమ్మల ఫోటో తీస్తానన్నారు ఆయనకు ఫోటో తీయడం వచ్చు వెళ్లినచోట్లలో మిత్రుల ఫోటోలను తీయడం ఆయనికి సరదా ఆయన మానాన్న పిన్నమ్మల ఫోటో తీస్తానని చెప్పినప్పుడు పిన్నమ్మ సిగ్గు పడ్డారు మానాన్న "నాతో పాటు నించొబెట్టుకొని ఫోటో తీయించుకో" అన్నారు పిన్నమ్మ కాసేపు అంగీకరించకపోయినా, ఆ తర్వాత సరేనని ఒప్పుకొన్నారు మునసబు మాయిద్దర్ని నిలబెట్టి ఒక ఫోటో తీశారు నేను పెద్దవాణ్ణయ్యాక పిన్నమ్మ ఫోటోని మాత్రమే పెద్దది చేయించాను దాని ప్రతి ఇది

## 3

శ్రీరామ్ చెప్పారు, "ఇప్పుడూ మీరు ఆ గ్రామాన్ని ఉంచుకొన్నారా?" అని నేను అడిగాను "పిన్నమ్మ మరణించడం మానాన్నగారికి చాలా తీవ్రమైన బాధ కలిగించింది ఈ ఊరు, ఈ ఇల్లు మాకు వచ్చి రాలేదని అమ్మగారు ఆ డబ్బులోనుండి ఈ ఇల్లు కట్టారు నేను పెరిగిందంతా ఆ అమ్మగా వచ్చిన డబ్బుతోనే" అన్నారు మీ మనస్సుకు బాధ కలిగించే సంగతిని మీ నోటితోనే చెప్పించినట్టయింది మన్నించండి" అని నేనన్నాను అతను, "ఆ బాధ ఈ విషయాన్ని చెప్పేటప్పుడు మాత్రమే కాదు, సర్వ కాలాల్లోను నాలోపల తిష్ట వేసి ఉంది అయితే దాంతోపాటు ఈమె నాతల్లి, ఒక దేవతా ప్రతిక, అన్న నమ్మకమూ నాలో భద్రంగా దాగి ఉంది ఆమె విషయంలో నాకు దుఃఖం కంటె ఆనందమే అధికం" అన్నారు నాన్న, నాయనమ్మ, పెద్దన్న ఏమయ్యారనే నేను అడగాలనుకొన్నాను కాని మాటలు మరి పొడిగింపబడతాయని ఊరుకుని అలాగే వచ్చేశాను

# సంజీవయ్యా కల

## 1

ఇది నలభై సంవత్సరాల క్రిందటి కథ. రంగప్ప పెళ్ళి, దీపావళి కథలని చెప్పిన తాతయ్యా కొత్తపల్లె శామప్పగారు ఆరోజుల్లోనే చెప్పిన కథ ఇది మా ఊరి సంజీవయ్యకు వచ్చిన ఒక కలలోని ఈ కథను, ఆ తాత పేరే ఉన్న రంగప్ప రత్నమ్మల కుమారుడైన శామన్న అయిన నేను, ఈ రోజు చెప్తున్నాను. అయితే కథని తాతగారు చెప్పిన తీరులోనే చెప్తున్నాను

## 2

కలలు అనేక రకాలు. ఒక్కోరకమైన కలకి ఒక్కొక్క విధమైన ఫలితం ఉంటుందని ఈ కలల విషయం తెలుసుకొన్నామని భావించేవాళ్ళు చెప్తారు. రంగప్ప పెళ్ళి సందర్భంలో నేను-శామన్న చెప్పిన నాలుగు మాటల్ని సరిగ్గా అలాగా చెప్పి నేర్పరి అనిపించుకొన్న ఈ మన శాస్త్రి ఉన్నా, ఇతను, ఎవరైనా కలల విషయాన్ని ఎత్తాడా చాలు, దాని ఫలితాలని గురించి ఒక ఉపన్యాసాన్నే ప్రారంభిస్తాడు. ఆకలైనట్టు కలవస్తే భోజనం దొరుకుతుంది. భోంచేసినట్టు కలవస్తే ఆకలవుతుంది డబ్బును మాసినట్టు కల వస్తే మంచిదవుతుంది. పెళ్ళి చేసుకొన్నట్టు కలవస్తే ఏదైనా విపత్తు సంభవిస్తుంది (ఈ విషయంలో మాత్రం కలకు వాస్తవానికి ఎక్కువ తేడా ఉన్నట్టు కన్పించదు) కలకన్నట్టు కలవస్తే నిజమవుతుంది ఉప్పు అని కల కంటె పులుపవుతుంది. ఇవే, ఇలాంటివన్ని స్వప్న ఫలితాలు. మొత్తం మీద దీనిముఖ్య సూత్రం ఇది స్వప్నంలో ఏమి జరుగుతుందో నిజ జీవితంలో దానికి విరుద్ధం జరుగుతుంది

ఇలా ఉండగా మావూరి సంజీవయ్యకి ఒక కల వచ్చింది

రః కథను వింటున్నవాళ్ళకు సంజీవయ్య పరిచయం అవసరం రంగప్ప ఇంగ్లీషు నేర్చుకుని వచ్చిన తర్వాత సంజీవయ్య, 'రంగప్పా, తెలుగులో పదహారు అంటాం కదా, దానికి సమానంగా ఇంగ్లీషులో ఏమిటి, చెప్పు, అన్నాడు రంగప్ప 'సిక్స్‌టీన్' అన్నాడు సంజీవుడు, 'సిక్స్‌టీన్ అంటే ఎంత' అన్నాడు రంగప్ప, 'పదహారు' అన్నాడు సంజీవయ్య 'అంతేనా అయ్యో' అన్నాడు రంగప్ప 'అదెందుకయ్యా అయ్యో' అంటావన్నాడు సంజీవయ్య, 'తెలుగులోని పదహారు, ఇంగ్లీషులోనూ పదహారే అయితే ఇంగ్లీషులో ఏమిటి ప్రత్యేకత? దాన్ని ఎందుకు నేర్చుకోవాలి ఇంత కష్టపడి' అన్నాడు

సంజీవయ్య విషయాన్ని ప్రస్తుతం మొదట్నుంచి చివరిదాకా చెప్పడానికి అవకాశం లేదు అలాగంటే అతను బుద్ధివంతుడే, పదహారు అంకె విషయం విని మీరు వాణ్ణి వెుద్దనుకోకండి మావూళ్ళో పుట్టి పెరిగి, మావూళ్ళోనే పక్వమైన బుద్ధి వాడిది మేమందరం ఎలాంటి బుద్ధిమంతులమో వాడు కూడా అంతే బుద్ధిమంతుడు పట్నం కొళాయి నీళ్ళను తాగినవాడు కాదు, బుద్ధి విపరీతం కావడానికి అవకాశం లేదు ఒక సారి నలుగురు వ్యక్తులెవ్వరో కూచుని మాట్లాడు కుంటూ "ఏమిటీ మాట? అన్నదమ్ములకు వయస్సులో ఆరు నెలలు తేడా ఉంటుందా?" అని ఎవరో అంటుంటే, అక్కడే ఉన్న సంజీవయ్య 'కవల పిల్లలుండొచ్చు కదా' అని అన్నాడు. చుట్టూ కూచున్న బుద్ధిమంతులు నలుగురూ ఆ మాటని అంగికరించారు. ఆ తర్వాత అందరికీ ఒకే సారి ఇలా ఉండడానికి వీల్లేదు అని మనసుకు నాటి ఒకరికొకరు 'ఎలాగయ్యా, ఎలాగయ్యా' అన్నారు సంజీవయ్య నవ్వి, 'మీ రేమంటారో చూద్దామని అలా ఉన్నాను అన్నాడు ఎంత చాకచాక్యంతో చూడండి అది ఎందుకు తప్పు అన్న విషయం నిజంగా వాడికి అప్పుడు తెలియలేదు అయినా అతను తన తెలివి తక్కువ తనాన్ని బహిర్గతం చెయ్యలేదు. ఆ తర్వాత నా దగ్గరికి వచ్చి నన్ను అడిగాడు, నేను చెప్పాను. అప్పుడు తెలుసుకొన్నాడు తనకు బుద్ధి లేదన్న విషయాన్ని తనకు చాల ఆప్తుడైన ఒక్కరికి మాత్రం తెలుపుకొన్నాడు, తక్కినవాళ్ళ దగ్గర చాల గంభీరంగా ఉండి మర్యాద నిలుపుకొన్నాడు దీన్నే తెలివితేటలనడం, మనకు తెలియని తనాన్ని ఇతరులకి బహిర్గతం చెయ్యకుండా ఉండడమే పాండిత్యం

తెలివితేటల విషయం వచ్చి ఈ సంగతి చెప్పాను ప్రస్తుతం సంజీవయ్య ఎలాంటి వ్యక్తో కొంతవరకు తెలిసింది ఇతనికి ఒకరోజు కలవచ్చింది కల అన్నంతమాత్రానికి యవ్వనంలో ఉన్న మీరు ఏదో సుందరమైన స్వప్నాలను జ్ఞాపకం చేసుకుని, సంజీవునికి కూడా ఇలాంటి కలే వచ్చిందని అనుకోకండి. నిర్మలమైన ఆకాశంలో గుంపుగా వచ్చే, విరిసిన మల్లెపూవులాంటి మబ్బులాగ కమ్మని నిద్ర మధ్య, ఉషస్సును చూసిన ప్రియుని ముఖంలా, ఇతనికి ఎలాంటి మోహమూ కన్పించలేదు ముఖమేమో కన్పించింది కాని అది ఇలా ఒక ప్రియుని ముఖం కాదు లేక ప్రేయసి ముఖం కూడా కాదు బెంగళూరులోని మంగలి నాగప్ప ముఖం అతనితో క్షౌరంచేయించుకొన్నట్టు సంజీవయ్య కలగన్నాడు ఇందులో ఉన్న సంగతి ఇంతే ఇది కూడ ఒక కథాలనా? అని అనుకొనేటట్టయితే ఇక ముందు మీరు ఈ కథను పట్టించుకోవాల్సిన అవసరం లేదు

సంజీవయ్యని గురించి ఈ కథకు సంబంధించి ఈ కలలో మొదటి ఘట్టం అతని చిన్నతనంలో సంభవించిన ఒక చిన్న సంఘటన అతను పుట్టినెంట్రుకల్ని సమర్పించడానికి తిరుపతికి వెళ్ళాల్సి వచ్చింది అక్కడ అతని తలను నున్నగా గుండు గీశారు అక్కడినుంచి వచ్చిన తర్వాత గారపని చేసే ఉస్మాన్ సాబ్, 'అమ్మా! ఈ అబ్బాయి మంచి ముసల్మాన్ పిల్లవాడులా ఉన్నాడు వీణ్ణివ్వండి, మాయింటికి పిల్చుకొని పోతాను' అన్నాడట సంజీవయ్య వాళ్ళమ్మ వెనక దాక్కున్నాడు పెద్దవాళ్ళు నవ్వారు, అయినా మాట మార్చారు పిల్లవాడు దాన్ని మరచిపోలేదు ఉస్మాన్ ఉన్నన్ని రోజులు పిల్లవాడికి అతనంటె భయం, ఇతను తనని ఎక్కడ ఎత్తుకొనిపోయి, గుండు గొరిగించి ముసల్మాన్‌గా చేస్తాడోనని భయం సంజీవయ్య ఈ భయం గురించి అప్పుడప్పుడు తన స్నేహితులతో చెప్పాడు కూడ అందులో ఎవరైనా ఇతణ్ణి భయపెట్టించాల్సి వస్తే, ఒరేయ్ సంజీవయ్యా, జాగ్రత్త, నీ జుట్టు ఊడబెరికి, నిన్ను ముసల్మాన్‌గా చేస్తాను' అనేవాళ్ళు ఈ భయం ఇతనికి పెద్దవాడయిన తర్వాత కూడ ఉండేది

ఒకసారి సంజీవయ్య బెంగుళూరు వెళ్ళినప్పుడు బెంగుళూరులోని క్షవర సమాచారం గురించి తెలుసుకొని వచ్చాడు తనతోపాటు బెంగుళూరును

బంగారాలాదుంపలు తీసుకెళ్ళాడు వ్యాపారం కుదిరిన తర్వాత షాహుకారు, రేపు డబ్బు ఇస్తాను ఒకరోజు ఉండమని చెప్పాడట మరుసటి రోజు షాహుకారింటికి వెళ్ళినప్పుడు ఇతనికి బెంగళూరు క్షవరం రీతి తెలిసింది బెంగుళూరు క్షవరం అంటే అంగట్లో మూడుకాసుల సామానుకు ఆరు కాసులు గుంజుతారు కదా! ఇదికాదు ఆయింట్లో షాహుకారు తమ్ముడు పడసాలలో హార్పుని క్షవరం చేయించుకొంటున్నాడట సంజీవయ్య షాహుకారు ఉన్నారా, అని అడిగాడు ఎక్కడికో వెళ్ళారు కూర్చోండి, వస్తారు అని జవాబిచ్చాడు సంజీవయ్య అక్కడై హార్పొని క్షురకుడు నాగప్ప పని తీరు చూస్తున్నాడు

నాగప్ప కుచ్చుమట్టలా వెంట్రుకలు గుచ్చిన కట్టనొకదాన్ని తీసుకొని, ఒక డబ్బాలో అదేదో తెల్లగా ఉన్న ఒక ముక్కమీద నీళ్ళతో పాటు వేసి రుద్దాడు అది నురుగు నురుగులా మారింది దాన్నిండా ఆనురుగును తీసుకొని నాగప్ప షాహుకారు తమ్ముడి ముఖానికి పూశాడు సంజీవయ్యకి ఇదేమిటో అర్థం కాలేదు ఆ మాటకొస్తే అప్పుడు నాక్కూడా తెలిదు అతను అలాంటి దృశ్యాన్ని ఊళ్ళో చూసింది ఒక సారే ఉస్మాన్ సాబ్ కొడుకు గార బిరాం సాబ్ పెద్ద పాత్రలో సున్నం తయారుచేసి సంక్రాంతి కాలంలో గోడకు పరకతో పూస్తాడు ఇక్కడ సున్నానికి మారుగా ఆ నురుగు; గోడకు బదులు ముఖం పరకకు మారుగా వెంట్రుకల కుచ్చుమట్ట సంజీవయ్య, 'ఇదేమిటి ఆశ్చర్యం! మొహానికి ఎందుకు సున్నం?' అని ఆలోచిస్తున్న సమయంలో నాగప్ప కత్తి కరారు సంజీవుడి కంటికి ఆకత్తి సుమారు ఒక మూర ఉన్నట్టుగా కన్పించింది మొదట్లో ఈ సంగతంతా చెప్పినప్పుడు సంజీవయ్య 'ఒక మూర కత్తి' అని చెప్పాడు మేము నమ్మలేదు కత్తి తీసి నాగప్ప తాను పూసిన సున్నాన్నంతా క్షవరం చేసేశాడు ఇలా ఐదారు సార్లు చేసేసరికి మొహం మీదున్న వెంట్రుకలన్ని పోయాయి తలముందు భాగం క్షవరం చెయ్యడం అయిపోయింది ఆ తర్వాత నాగప్ప లేచి నిల్చున్నాడు సంజీవయ్యకి, 'ఇదేం కర్మ, క్షవరం చెయ్యడానికి లేచి నిల్చోవడందేనికి?' అని ఆలోచించాడు ఇతనిలా ఆలోచిస్తున్న వేళలో నాగప్ప షాహుకారు తమ్ముడి తల వెనక భాగంలో సున్నం పూసిందే తడవు అక్కడకూడా క్షవరం చేశాడు

మొదట్నుంచి చివరిదాకా సున్నం మాత్రం బాగా ఖర్చయింది సున్నం రాయడం, దాన్ని కత్తితో గీకి వేతికి అంటించుకోవడం దీన్నిప్పుడు క్షవరం అంటారు సంజీవయ్య దీన్నంతా గమనిస్తూనే ఉన్నాడు

షాహుకారు తమ్ముడు లేచి వెళ్ళిపోయిన తర్వాత సంజీవయ్య క్షురకుడి దగ్గర అతను చేసే పని గురించి కాసేపు మాట్లాడాడు ఆ సంభాషణా సారాంశం ఇలా ఉంది.

"అయ్యా, మీ పేరేమిటి?"
"నాగప్ప"
"క్షురకులా?"
"నేనింత సేపు చేసిందేమిటయ్యా?"
"సరిసరి ఆయన మూతికి సున్నం – ఆ నురుగు – పూసిందెందుకు?"
"క్షవరం సులభంగా చెయ్యాడానికి"

ఇలా ప్రశ్నించిన తర్వాత చివరికి సంజీవయ్యకి తెలిసిన సంగతి ఇది- షాహుకారు తమ్ముడు ఆ క్షవరానికి నాలుగణాలు ఇచ్చాడు (సంజీవయ్య ఈ విషయం విన్నప్పుడు 'అబ్బా' అన్నాడు) నాలుగణాలు ఇచ్చిన వాళ్ళకి మాత్రమే క్షవరం చేస్తానని నాగప్ప శపథం ఏమీ చెయ్యలేదు ఎనిమిదణాలు ఇచ్చేవాళ్ళకూ క్షవరం చేస్తాడు, రెండణాలు ఇచ్చే వాళ్ళకూ క్షవరం చేస్తాడు ఇక ఎవ్వరూ దొరకక్పోతే ఒక అణా ఇచ్చేవాళ్ళను వెతికి పట్టుకొనికూడ క్షవరం చేస్తాడు అయితే అందరికీ ఒకే విధంగా క్షవరం చెయ్యడు. నాలుగణాలకు ఆరోజు షాహుకారు తమ్ముడికి క్షవరం చేసినట్టుగానే చేస్తాడు అదే సామాను, అదే విదేశీ కత్తి విదేశీ కత్తి అంటే మధ్య పల్లం, పదును కాస్త తక్కువ. మొహంమీది వెంట్రుకలు సరిగ్గా పోవు మొరటు వెంట్రుకలు ఎండాకాలంనాటి గడ్డివేర్లలాగ నిలుస్తాయి అలా నిలిచినా పెద్ద మనుష్యులయిన వాళ్ళు అడ్డు చెప్పరు వాళ్ళ ఇష్టప్రకారమె కొద్దిగా వెంట్రుకలు వదలి క్షవరం చేస్తాడు

బెంగళూరులో ఎవరైనా పెద్ద మనుష్యులా కాదా అని తెలుసుకోవాలంటే వాళ్ళు క్షవరం చేయించుకొన్న రోజున వాళ్ళ తలచూస్తే చాలు. ఈ తలను

ఎలా చూడాలంటారా? వాళ్ళు క్షవరం చేసుకొనె రోజును గమనించి, వాళ్లు ఇంటినుంచి బయటికి వచ్చినప్పుడు, దగ్గరకు వెళ్ళి "అయ్యా మీ తల మీదున్న టోపీని తీయండి" అని అడగడం, వాళ్ళు తీస్తే చూడడం లేకపోతే? ఏమీ చేయడానికి వీలుకాదు

అయినా పెద్ద మనుష్యులయినవాళ్ళు క్షవరం చేసుకునేటప్పుడు తలలో వెంట్రుకలు బోడయి ఉండకూడదు ఎక్కువగా డబ్బు ఇచ్చేటప్పుడంతా మొహం మీదా, తలమీదా మురికి ఎక్కువ కావడం పద్ధతి నాలుగణాల వాళ్ళ కంటే ఎనిమిదణాలవాళ్ళ కది అధికం ఒక రూపాయి ఇస్తే సబ్బు పూసి ఊరకే సబ్బును మాత్రం తీయాలి, వెంట్రుకల్ని తీయకూడదు, అని నాగప్ప స్నేహితుడొకాయన అతనికి చెప్పాడట అయితే నాగప్పకు ఒక రూపాయి తల ఇంతవరకూ దొరకలేదు ఎనిమిదణాల తల కూడా తక్కువే. వాళ్ళకూ ఇలాగే సబ్బు పట్టించడం. రెండణాల వాళ్ళకు నాసిరకం సబ్బు. ఒక్కఅణావాళ్ళకు వట్టి నీళ్ళు మాత్రం. ఒక్కఅణా వాళ్ళకు నిల్పుకునేది లేదు రెండణాల వాళ్ళకి నిలబడడం, నిలబడకపోవడం అనేది మనిషి మొహం చూసి ఇచ్చేది రెండణాలే అయినా దర్జా ఎక్కువున్న మనిషయితే సగం నిల్పుని క్షవరం చేయడం. దర్జా ఉన్నవాడో కాదో అన్న విషయం తెలుసుకోవాలంటే, ముందువైపు క్షవరం చేశాక తలని వంచడానికి చేత్తో కొద్దిగా అదమడం; తల వంచితే మంచిది; బాగా వంచి కూర్చునే వాళ్ళకు వెనుక వైపుకూడా క్షవరం చేయడం తలను వంచక అడ్డు చేస్తే, తానే లేవడం, లేచి వెనుక వైపు క్షవరం చేయడం.

కొంతమంది పెద్ద మనుష్యులు కత్తి కొనలో క్షవరం చేస్తే తాము చాల నయమూ, నాజూకుతనమూ ఉన్న మనష్యులమని చూపించుకోవడానికి ఊరకనే "ఊఊ" అని ధ్వని చేస్తారు అలాంటివాళ్ళకు కత్తి వెనుక వైపునుండి క్షవరం చేయడం ఉంది వెంట్రుకలేమో పోవు; అయితే నొప్పి కలగకుండా ఉంటే చాలు, అదే పెద్ద మనుష్యుల క్షవరం హూహూ అంటూ అతినాజూకు తనం చూపించే వాళ్ళు కూడా ఒక్కొక్కసారి, "ఏమయ్యా ఇది? క్షవరం చేస్తే వెంట్రుకలు కొంచెం కూడా పోలేదు" అని తగాదా చేస్తారు క్షవరం చేస్తే వెంట్రుకలు పోవాల్సిన అవసరం లేదు, సబ్బు పోతేసరి, అని వాళ్ళకు నచ్చ

చెప్పాలి వాళ్ళు ఒప్పుకోకపోతే, అప్పుడు, "అయ్యాగారు! అందరూ ఇలాగే క్షవరం చేయించుకొనేది," అని చెప్తే "అలాగా అలాగవుతే ఉండని," అని వాళ్ళు ఊరకుండి పోతారు

ఇంగ్లీషువాళ్ళు చేసుకునే ఈ క్షవరం పేరు కరాపు నాగప్ప ఇంగ్లీషు వాళ్ళకు కూడా క్షవరం చేస్తాడు వాళ్ళ మొహం మీది వెంట్రుకలు మన ముఖంమీది వెంట్రుకలలాగానే ఉంటాయి, రంగులో కొంచెం తేడా అంతే ఇంగ్లీషువాళ్ళ దగ్గర సారాయి కంపు వాళ్ళకు కొంచెం కూడా నొప్పి కలగకూడదు నొప్పి కలిగితే అసలైన ఇంగ్లీషువాళ్ళు "డ్యాం బిగార్" లనే వాళ్ళట నాగప్పకు "డ్యాం బిగార్, డ్యానిగార్" అన్న పదాల అర్థం తెలియదు అయితే అవి మంచి మాటలు కావని నాగప్ప అభిప్రాయం

సంజీవయ్య నాగప్ప దగ్గర ఈ విషయాలనన్నిటిని తెలుసుకొని, ఊరికి వచ్చిన తర్వాత చాల రోజుల దాకా ఈ మాటలే చెప్పేవాడు బెంగుళూరు క్షవరం పిచ్చి బాగా పట్టింది ఈ పిచ్చి ఇతని కలకు సంబంధించిన రెండో ఘట్టం

మావూళ్ళో క్షవరం చేయించుకోవడమంటే కొంచెం కష్టమైనపని దిన, వార, నక్షత్ర నిబంధన ఒక కారణం మంచిరోజు దొరికినా మంగలి దొరక్కపోవడం మరోకారణం అయినా ఎవరైనా మావూరికి వచ్చిచూస్తే ఎంతమందికో పుత్రోత్సవం కాబోతున్నది కదా అనుకొంటారు అంతమంది దీక్ష కోసం వెంట్రుకలు పెంచినవాళ్ళలాగ ఉంటారు పాడ్యమి నాడు చేయించుకోవచ్చు, అయితే మంగళవారం విదియనాడు అన్న చేయించుకొంటారు తదియ గురువారం, అన్నకు మంచిది కాదు శుక్రవారం భార్యకు అశుభం శనివారం చేయించుకో కూడదు. ఆదివారం షష్ఠి సోమవారం సప్తమి లేదా అష్టమి మంగళవారం అసలు పనికిరాదు బుధవారం ఏకాదశి, గురువారం అమావాస్య. శుక్రవారం పౌర్ణమి ఇలా క్షవరం చేసుకోవడానికి సరయిన రోజు లభించడం కష్టమయినందువల్ల మావూళ్ళో అది ఆలుమగల మధ్య సరసానికి విషయంగా తయారైంది "మునియప్ప వచ్చాడట కదా, క్షవరం చేయించుకో కూడదు' అని భార్య

చెప్తే సరసుడైన భర్త, తనకు క్షవరం చేయించుకోవడానికి రోజు బాగా లేదని చెప్పి, క్షణం తర్వాత 'నీవు కాస్త గర్భిణీ అవుతే ప్రతి నెల రః కష్టం తప్పుతుంది' అనాలి భార్య అయిన వ్యక్తి ఆమె వయస్సు, స్వభావం, ఆ క్షణంలో ఆమె మనః ప్రవృత్తి, వీటిని బట్టి 'ఇంతవయసొచ్చినా రః పోకిరి మాటలు పోలేదు కదా' అని కాని, 'మీరు కాస్త భరించెటట్టయితే నేనుకొంచెం గర్భిణి అవుతాను' అనికాని, 'మంచిమాటన్నారు, భార్య గర్భిణీ అయిందని భర్త దీక్ష వహించడం ఉంది భర్త దీక్ష వహించాలని భార్య గర్భిణీ కావడం ఉందా ? అనాలి

ఎప్పుడైనా మంచిరోజు ఉంటే క్షురకుణ్ణి సంపాదించడం కష్టం మావూరికి ఇద్దరు క్షురపులు – మునియప్ప, గిరియ మావూళ్ళో వీళ్ళకి డబ్బిచ్చే వాళ్ళెవ్వరూ లేరు ఏమయినా సంవత్సరానికోసారి పంట నూర్పిడి సమయంలో పనివాళ్ళకి ఏడాది ఆదాయం ఇచ్చేస్తారు మునియప్ప తండ్రిగారికాలం బాగానే ఉండేది ఎప్పుడూ ఇంతే ఆ కాలం మంచిది రః కాలం చెడ్డది అంతేకాకుండా మునియప్ప తండ్రి ఆ కాలానికి తగ్గ మనిషి పైగా ధాన్యం అంత వెల ఉండేదికాదు ధర్మం బాగుండేది, పంటలు బాగా పండేవి ఇవ్వాల్సిన దాన్ని బాగా ఇస్తుండేవారు ఆ తర్వాత ధర్మం తక్కువయింది, ధాన్యం పండడం తక్కువ కావడం వల్ల ఇవ్వడం తక్కువైంది ఇవ్వడం తక్కువ కావడం వల్ల ధర్మం తక్కువైంది ఇలా విషచక్రం చుట్టుకొని ఇప్పుడు దరిద్రానికి కాస, మొదలు లేకపోయింది

రః మాటల సారాంశం ఏమిటంటే మునియప్పకు మా ఊరివాళ్ళిచ్చే ధాన్యం ఏ మాత్రం సరిపోదు ఇలా ఎప్పుడైనా రోజు బాగుందని తెలియగానే ఒకరు కాకపోతే మరొకరు ముందే వెళ్ళి అతనికి తెలియజేయాలి అతను, 'నువ్వు నాకు ఇచ్చిన దానికి నేను పొద్దున్నే లేచి వచ్చి నీ గడ్డం గీస్తూ కూర్చోవాలి కదా ?' అనేవాడు 'అలాగంటే ఎలాగయ్యా! మేము నమ్ముకొన్నది నిన్నే నువ్వు మా చెయ్యివదిలేస్తే మా కెవరున్నారు ?' అని వేళ్ళనాలి. 'చెయ్యివదలక పోవడమేమిటి నువ్వు నా చేయి వదల్లేదా ? కల్లంలోనికి నేను వచ్చినప్పుడు చేయి వదలడం ఎందుకు జ్ఞాపకం రాదు ?' అని వాడు అడగాలి

జానెడు గడ్డి, మూరెడు వేరు పొలంలో పండేదేమిటి? రాగులు పది బస్తాలు పండేచోట నాలుగు బస్తాలు పండుతాయి పంటని బాగం చేసి ఇటు ప్రక్క ఒక ముప్పావువంతు, అటు ప్రక్క ఒకముప్పావు వంతు బస్తా, మిగిలిన దాంట్లో విత్తనాలకని పక్కకు పెట్టి, తక్కినదాంట్లో దేవుడికి, అడుక్కునేవాళ్ళకి, పాలేరుకూ ఇవ్వాలి దేవుడు రాలేదు కదా, అతని భాగం ఇవ్వకపోతే పరవాలేదని అనడానికి వీల్లేదు పూజారి వచ్చాడు దేవుడికి తక్కువ చేయకండి అని చాల శ్రద్ధతో బుద్ధి చెప్తాడు సోమరులకు ఇవ్వకపోయి అడుక్కునేవాళ్ళకివ్వాలి ఇవ్వకపోతే తిట్టు కొంటూ పోతారు ఐదు బల్లల్లో మిగిలిన మూడు బల్లల్లో పనివాళ్ళకిచ్చేదేమిటి? మునియప్ప వచ్చి 'ఏమయ్యా ఎంతయింది?' అని అడిగేవాడు రైతుకు కళ్ళెర్రబడేవి పొలం వీడిదే అయినట్టుగా పంట ఎన్ని బస్తాలు పండింది అని అడుగుతున్నాడని మునియప్ప మాటకు బదులు జవాబు లేదు, ఏది, వేయి' అని మునియప్ప సంచిని పట్టేవాడు రైతు చాటెడు రాగులు తీసి అందులో వేసేవాడు చాటెడు రాగులంటే చేటనిండుగా రాగులని కాదు చేట క్రింది పెట్టి, రైతు రాగులరాశిని పిల్లల్ని మృదువుగా తలతట్టి నిమిరేటట్టుగా, చేట తట్టి పైకి ఎత్తుగా రాశిలా చేసేవాడు అతనికి తాను పండించిన రాగులండి ఎక్కువ ప్రీతి తాను కనిపెంచిన పిల్లల మీద ఎలాంటి మమకారముంటుందో అలాగ అయితే రాగులంటే, పిల్లలకి ఒక తేడా పిల్లలమీద వాళ్ళని కనిపెంచిన వాళ్ళకి మాత్రమే ప్రేమ రాగుల మీద దాన్ని పండించినవాడికున్న మమకారం లాగనే పండించని వాడికి కూడ ప్రీతి ఉంటుంది మునియప్పకు చేటెడు రాగులు సరిపోవు రాగుల మీద అతనికున్నా అభిమానం చాటెడు రాగులతో తృప్తి పడేది కాదు అతను 'ఏమయ్యా చేట క్రింద పెట్టేశావు' అనేవాడు 'ఏమయ్యా, ఇంకా కావాలా?' అని రైతు అడిగేవాడు 'ఉండని వెయ్యి, నీవు యజమానివి, పొలందున్ని పండించే వాడివి నీవు ఇవ్వకపోతే నా గతేం కాను' అని మునియప్ప అనేవాడు 'అదంతా అలా ఉండనియువయ్యా, రానురాను పంట దిగుబడి తక్కువవుతూ ఉంది మీరగడగడమేమో ఎక్కువవుతూ ఉంది? అని రైతు బదులిచ్చేవాడు అలా ఇలా మునియప్ప మరో చాటెడు రాగులు సంపాదించుకానేసరికి తలప్రాణం

తోకకు వచ్చేది ఇదంతా మునియప్పకు బాగా జ్ఞాపకం క్షవరం చేయమని పిలవడానికి వచ్చినప్పుడు 'పొలంలో రః నయుగారపు మాటలెక్కిడికి వెళ్లాయి' అన్న బావనలో ఇవన్నీ జ్ఞాపకం వస్తుంటాయి' పిలవడానికి వెళ్ళినవాళ్ళకి కూడ రః జ్ఞాపకాలు ఉంటాయి అందువల్ల వాళ్ళు ఇతనితో మెల్లగా 'ఉండనీ, రా, ఇంతకీ నువ్వు నాదగ్గరికి వచ్చి నాకు కొంచెం రాగులు కావాలని అడిగితే, ఇవ్వడానికి పొలమె కావాలా ఏమిటి, ఇప్పుడు మాత్రం నేను లేదంటానా ఏమిటి? రా' అని చెప్పి వచ్చేవాళ్ళు అతను ఆరోజు వస్తాడో రాడో అన్న అనుమానం అతను ఆ రోజు రాకపోతే, మళ్ళీ ఒక నెలరోజులో, రెండు నెలలో, క్షవరం చేయించుకోవడానికి మంచిరోజు దొరకదు

ఏదో విధంగా అతను ఆరోజు వచ్చాడే అనుకోండి ప్రతి ఇంటికీ అతనే వెళ్ళడానికి వీలుకాదు క్షవరం చేయించుకొనేవాళ్ళలో పెద్ద మనుష్యులు కొంతమంది, చిన్న మనుష్యులు కొంతమంది చిన్న మనుష్యులంతా చావడి దగ్గరికే వచ్చి క్షవరం చేయించుకునే వాళ్ళు అంటే అది కోతిమూతి సాయబు కోలారులో జరిపే సెషన్ కోర్టులాంటిది మునియప్ప అక్కడికి వచ్చి కూర్చుంటే ఊళ్ళో వాళ్ళకి సంబరం ఎందుకని? వెళ్ళి పిల్చేవాడు ఒకడయితే, క్షవరం చేయించుకునే వాళ్ళు ఇరవైమంది అందరూ వచ్చి రచ్చబండ మీద కూర్చొని మాటాడుకొంటూ, మునియప్ప ముందు కూచుని చర్చిస్తున్న వాడి క్షవరం ఎప్పుడవుతుందా అని ఎదురుచూసేవాళ్ళు, క్షవరం ముగిసిన వెంటనే వాళ్ళ వాళ్ళ యోగ్యతకు తగినట్టుగా మునియప్ప 'పక్కకు పదా' 'తావీవయ్యా' 'అయ్యింది కదా', 'ఏది జరుగు' అనేవాడు ఎవరయినా ఒకరు 'ఏయ్, ఇక్కడచూడు, వెంట్రుకలు వదిలి పెట్టావు' అంటే, ఇతను 'చాల్లే, నీకెవరు పిల్లనిస్తారు' అని కత్తితో అలా అనేవాడు ఇలా ఒకరి తర్వాత ఒకరు అతని సెషన్ ముందు హాజరు కావాలి మన రైతు బిడ్డలయితే ఫరవాలేదు బిరాం సాహెబ్ అయితే సావకాశంగా కూర్చునేవాడు (బిరాంసాహెబ్ ఉస్మాన్ సాహెబ్ కొడుకు) తక్కిన వాళ్ళకవుతే మునియప్ప కత్తి సగం తల మాత్రమే ప్రయాణం చేసేది. సాహెబ్ వస్తే తలపూర్తి కత్తి ఆడేది. బిరాం సాహెబ్‌ను చూసి మునియప్ప 'ఇక వచ్చాడయ్యా రః

సాయుబూ, ఎంత సేపటికీ క్షవరం కాదు' అనేవాడు ఇతను 'వదిలేయ్ మునియప్ప, నేను గడ్డం వదలుతాను, వీళ్ళు జుట్టు వదలుతారు అంతా ఒకటే అవుతుంది' అనేవాడు తలో, గడ్డమో, ఠః వచ్చిన గుంపంతా పని ముగించుకొని బావి దగ్గరికి వెళ్ళేటప్పటికి మిట్ట మధ్యాహ్నమయ్యేది

సంజీవయ్య తల్లి పండు ముసల్ది ఇంకా బతికుంది అందువల్ల అతని తోటి వాళ్ళకు క్షవరం చేయించుకొనే మంచి రోజు ఇతనికి సరిపోయేది కాదు ఆమె 'ఒరేయ్ నాయనా, నివు క్షవరం చేయించుకో నేనొక ముసలి ఎపేనుగుని చస్తే వచ్చే నష్టం ఏమిటి, చేయించుకో బాబు' అనేది తల్లి ఎంత చెప్పినా అతను అలాంటిరోజున క్షవరం చేయించుకొనేవాడు కాడు 'నీవు నన్ను కని పెంచి నందుకు బాగా సార్థకమైంది' అని చెప్పేవాడు ఒకవేళ అతను చేయించుకొంటానన్నా పెళ్ళాం వదిలేది కాదు 'ఇదేమిటి ? ఠః రోజు క్షవరం చేయించుకుంటే, అత్తగారికి మంచిదికాదు మూర్ఖుల్లా చేయించుకొనేరు అని గుర్తు చేసేది పైగా మునియప్పకూ, సంజీవయ్యకీ ఠః మధ్య అంతంతగానే ఉంది అంటే సంజీవయ్యకి మునియప్పను చూస్తే కొంచెం భయం సాధ్యమైనంతవరకూ అతను గిరియప్ప దగ్గరే క్షవరం చేయించుకోవడానికి ప్రయత్నించేవాడు గిరియప్ప సమాచారం ప్రస్తుతం వద్దు మరెప్పుడైనా ఒకసారి చెప్తాను సంజీవయ్యకి మునియప్పని చూస్తే భయం ఎందుకంటే, ఒకసారి సంజీవయ్య షాహుకారు అంగట్లో మునియప్ప ఏదో వస్తువులు కొని డబ్బు ఇవ్వడంలో జాప్యం చేశాడు సంజీవయ్య చేత ఖచ్చితంగా డబ్బు ఇవ్వాలని షాహుకారు చెప్పి పంపాడు అతను వెళ్ళి మునియప్పను 'డబ్బు ఇవ్వాల్సిందిగా గట్టిగా అడిగాడు అందుకు అతను ' కానీ, నీ పని పడతాను' అన్నాడు సంజీవయ్య మనస్సులో ' డబ్బేమిటి వీడబ్బ సొత్తా ? యజమానికివ్వాల్సిన డబ్బివ్వమంటే వీడికెంత కోపం ? వీడు నన్నేం చేస్తాడు ? క్షవరం చేయనని అంటాడు అంతేకదా వీడు వద్దే వద్దు' అనుకొన్నాడు ఆ తర్వాత ఒకసారి మునియప్ప 'రా సంజీవా' అని మామూలు కంటే ఎక్కువ ఆప్యాయంగా క్షవరం చేయించుకొందువుగాని అని పిలిచాడు సంజీవయ్య వెళ్ళి కూర్చొన్నాడు క్షవరం చెయ్యడమంతా ముగిసి ఇక పైకి లేవడానికి సిద్ధమవుతున్న సమయంలో మునియప్ప 'హత్తెరి, నిన్ను సాయుబును

చేసేస్తాను చూడు' అని ఇతని జుట్టు గట్టిగా పట్టుకొన్నాడు అతను తమాషాకి అలా అన్నాడు ఇతను చాల పిరికివాడని మునియప్పకు బాగా తెలుసు సంజీవయ్యకి గుండె బద్దలయింది మునియప్ప జుట్టు పట్టుకొన్నాడో లేదో సంజీవుడు ' అయ్యో, అయ్యో' అంటూ అరచాడు అక్కడ గుమికూడిన వాళ్ళంతా 'ఏమయ్యా ఇది ?' అన్నారు ఆ తర్వాత ఏదో సమాధానం చెప్పి ఇద్దర్ని పంపించివేశారు అయితే మునియప్ప చేసిన ఈ తమాషా సంజీవయ్య మనస్సులో అలాగే నిలిచిపోయింది

ఇది జరిగిన కొద్ది రోజులకా సంజీవయ్య బెంగళూరులో నాగప్ప చేసే క్షవరం చూసి వచ్చింది ఆ సమయంలో ఒక మంచిరోజు మునియప్ప ఊళ్ళో వాళ్ళకు క్షవరం చేశాడు ఆ రోజు సంజీవయ్య కూడ క్షవరం చేయించుకోవడానికి కాచుకుని కూచున్నాడు ఒకడి క్షవరం అయింది మరొకడిదయింది ఇంకొకడి దయింది అందరిది అయింది అయితే సంజీవయ్య క్షవరం మాత్రం కాలేదు చివరికి ఇతను ఇంకా వేచి ఉండడం చూసి 'ఇక నావల్లకాదు, మరొక రోజు వస్తా'నని అడపం చుట్టుకొని పైకిలేచాడు సంజీవయ్య 'ఇదేమిటి మునియప్ప, నన్ను వదిలేశావు కదా' అన్నాడు మునియప్ప 'నేను క్షవరం చేస్తే నువ్వు భయపడతావు, గిరియప్ప దగ్గరే చేయించుకో' అన్నాడు సంజీవయ్య చేయించుకోకుండానే వచ్చేశాడు. క్షవరం చేయించుకోకుండానే, చేయించుకొన్న దాని కంటే ఎక్కువ సమయం గడిపి భోంచేశాడు

క్షవరం చేయించుకోవడానికి వేచి ఉన్న సమయంలోనే గార బిరాంసాహెబు సంజీవయ్య యజమాని ఇంట్లో సున్నం పూస్తున్నాడు దాన్ని సంజీవయ్య చూస్తూనే ఉన్నాడు ఇక్కడ గారవేయాలనో లేక అక్కడ సున్నం చాలదనో అతను చెప్పి ఉండాలి ఇతను ఏదో జవాబు ఇచ్చి ఉండాలి అదేదో ఇతని తలలో నిలిచిపోయింది

ఇలా ఉండే ఆరోజో లేక మరుసటి రోజో సంజీవయ్యకి కొద్దిగా జ్వరం వచ్చింది సంజీవయ్యకి కాస్త జ్వరం వచ్చినా గాబరా ఎక్కువ ఆ జ్వరంలో రాత్రి ఇతనికి కలవచ్చింది

ఇతను క్షవరం చేయించుకోవడానికని చావడి దగ్గర కాచుకొని ఉన్నాడు మునియప్ప వచ్చి కూర్చున్నాడు కాసేపట్లో బెంగుళూరు నుంచి నాగప్ప వచ్చి తాను కూడా క్షవరం చేస్తానన్నాడు, ఊళ్ళోవాళ్ళని పిలిచాడు ఎవరో వచ్చి 'చేయించుకో, సంజీవప్పా' అన్నారు ఇతను ఆలోచిస్తున్నాడు నాగప్ప ఇతను ఉన్న స్థలానికి వచ్చి ఎదురుగా కూర్చున్నాడు అడపం విప్పాడు 'కుచ్చుమట్టు' తీశాడు ఇతని ముఖానికి సున్నం పూయడం మొదలు పెట్టేశాడు సంజీవయ్య ఈ క్షవరం గురించిన ఆనందమేమిటో ఆలోచిస్తున్నాడు నాగప్ప మొహం బిరాం సాహెబు మొహం అయింది అతను 'ఇదిగో నిన్ను ముసల్మానుని చేశాను' అని అరిచిందే తడవు ఇతని జుట్టు పట్టు కొన్నాడు

సంజీవయ్య 'ప్రాణం కావాలంటే తీసుకో నా జాతి వదిలేది లేదు' అని అరచిందే తడవు ఎగిరి గంతేశాడు

ఎగిరి గెంతడంలో సంజీవయ్యకి మెలకువ వచ్చింది మెలకువ అవుతే ఏమయింది? జుట్టును నిజంగా ఎవరో పట్టుకునే ఉన్నారు ఇతను 'ఒరేయ్ వద్దు, వద్దు నీకు పుణ్యం ఉంటుంది నన్ను నా జాతి నుంచి చెరచవద్దు' అంటూ బిగ్గరగా అరచాడు

సంజీవయ్య భార్య 'అయ్యో ఎందుకిలా అరుస్తారు కాసేపు ఉండండి జ్వరం తగ్గిందేమోనని చూడడానికి వచ్చి, జుట్టు విడిపోయి ఉండడాన్ని చూసి ముడి వేయాలని నేను జుట్టు పట్టుకొన్నాను? అంది

సంజీవయ్యకి ఈ పాటికి తాను నిద్ర పోతున్నట్టు తెలిసింది తన జుట్టు పట్టు కొన్నది తన భార్య, నాగప్ప కాదు, బిరామ్ సాహెబు కూడా కాదు అని తెలుసుకొన్నాడు అతను అరవడం మానేసి నిశ్చింతగా పడుకొన్నాడు

మరుసటి రోజు మన శాస్త్రిగారిని స్వప్న ఫలాన్ని అడిగితే శాస్త్రిగారు 'ఊళ్ళో వాళ్ళందరూ గుండు గియుంచుకోనీ, నీ జుట్టుకు భయం లేదు' అన్నాడు కలలో ఎవరో పట్టు కొన్నట్టుగా కనిపించడం, నిజంగా భార్య జుట్టు పట్టుకొని వుండడం ఇదంతా స్వప్న శాస్త్రం సత్యమనేదానికి సాక్ష్యం

అయితే మన శాస్త్రికి ఇవన్నీ స్ఫురించవు తక్కిన విషయాలన్నీ నిజమో, అబద్ధమో కాని శాస్త్రి చెప్పిన మాట మాత్రం నిజమైంది నేను ముసలి వాణ్ణయ్యాను, సంజీవునికీ వయస్సవుతూ వస్తోంది, అయితే అతని తలలో ఇప్పటికీ ఆ పది వెంట్రుకల చిన్న ముడి మాత్రం భద్రంగా ఉంది

## 3

తాతగారయిన శామన్నగారు చెప్పిన పాత కథకు, మనవణ్ణే శామన్న నయిన నేను మరో రెండు కొత్త విషయాలను చేరుస్తాను తాతగారి సంజీవయ్య ఇప్పుడు ఊరికంతా సంజీవయ్య అయ్యాడు మునియప్ప కొడుకు మునిస్వామి ఇప్పుడు మా క్షురకుడు అతను సంజీవయ్యని మర్యాదగా చూస్తాడు అతనితో పరాచక లాడడానికి వలను కాదు దీనికి ముఖ్యకారణం ఏమిటంటే, ఇప్పుడు మా ఊళ్ళో మునిస్వామిని పిల్చేవాళ్ళు నాలుగైదు మంది మాత్రమే సంజీవయ్య వాళ్ళల్లో ఒకడు మంచి రోజంటూ మునిస్వామి తానే వస్తాడు, చావడిలో కూర్చోడు, ఇంటికే వస్తాడు అతన్ని అడిగేవాళ్ళెవరూ లేరు అందరూ అశుభ దినమే మాదావరానికి వెళ్ళి అందంగా క్రాపు చేయించుకొని వచ్చేవాళ్ళే మునిస్వామి వీళ్ళని చూసి 'ఏమయ్యా, ఎక్కడ చేయించుకొని వచ్చావి క్రాపు? డిసెంట్ హేర్‌లోనా, లేక మెజస్టిక్ హేర్‌లోనా' అని అడిగేవాడు `Decent Hair Cutting Saloon, Majestic Hair Cutting Saloon' అని వీటి అర్థం ఇవి మాదావరంలో ఉన్న రెండు మంగలిషాపులు ఇవిరెండూ ఎదురెదురుగా ఉన్నాయి 'Decent Hair' మొదట ఆరంభమైంది తలుపు మీదున్న బోర్డులో మొదటి పంక్తిలో పెద్ద అక్షరాల్లో మొదటి రెండుపదాలను, రెండో పంక్తిలో చిన్న అక్షరాల్లో `Cutting Salon' అన్న పదాలని వ్రాశారు ఆ తర్వాత వచ్చిన పోటీదారుడు ఇదే విధంగా బోర్డు వ్రాయించాడు `Decent Hair' కు మారుగా 'Majestic Hair' అని Cutting Saloon అని Cutting Saloon అనే వ్రాయించాడు ఏమయితేనేం మాదావరంతో పాటు కొత్తపల్లె కూడా, "మేమూ నాగరికమైన గ్రామాల వాళ్ళయే క్షౌర శాలలకు కూడా ఇంగ్లీషు పేర్లు పెడతాము" అనుకొన్నట్టు తయారైంది ఇదేమయినా మన

సంజీవయ్యకు వచ్చిన స్వప్న ఫలమేమోనని నాకు ఒక్కొక్క సారి సందేహం వస్తుంది సంజీవయ్యనే ఒకసారి ఈ విషయం అడిగాను అతను "కావచ్చు, కాదని ఎలా చెప్పేది' అన్నాడు క్షణం తర్వాత 'కాకుండాను పో వచ్చు, అవునని ఎలా చెప్పేది' అన్నాడు దీని తర్వాత మాట్లాడడానికేముందని ? నేను ఊరకుండి పో యాను

# కుక్క బ్రతుకు

చీను నిన్నటి రోజు నాతో అన్నాడు 'మను మన పెళ్ళిమాట ప్రస్తుతానికి ఎత్తవద్దంటుంది' అని

నేను లీలా ఆలోచించి వీళ్ళిద్దరూ సుఖంగా ఉండాలని చేసిన ఏర్పాట్లన్ని వ్యర్థమయ్యాయి ఈ భాగ్యానికి ఒక ఏడాది కాలం కాచుకోవాల్సి వచ్చింది

నేను చీనూని 'ఎందుకలా చెప్తోం'దని అడిగాను అతను 'అలాంటి చెప్పుకోదగ్గ కారణం ఏమీ లేదని అన్నాడు, ఒక క్షణం వదలి 'భైరూకు నన్ను చూస్తే పడదు, అందువల్ల వద్దంది' అన్నాడు

నాకు చాల ఆశ్చర్యం వేసింది "ఇదేమిటి చీను! 'నాకు ఇష్టమే, అయితే నా కుక్కకు ఇష్టం లేదు, అందువల్ల నేను పెళ్ళి చేసుకోను' అంటుందా?" అన్నాను

చీను "నీవు కోప్పడవద్దు అన్నయ్య లీలాతో మాట్లాడు, ఆమె అంతా చెప్తుంది" అన్నాడు

ఇంటికిరాగానె లీలాని "ఇదేమిటి, మను అంటున్నది నిజమేనా? తన కుక్కకు చీనూను చూస్తే పడదని అందుకోసం తాను అతన్ని పెళ్ళి చేసుకోనంటోందట" అని అడిగాను లీలా, "ఆ విషయం, రెపు చెప్తాను" అంది

నాకు మళ్ళీ విసుగుపుట్టింది "బాగుంది వేర్వరితనం. మాతను మనస్సుంది, అయితే భైరూ వద్దంటోందని ఈ పెళ్ళి ఆగిపోవాలా? ఛీ

నిర్ణయాన్ని మనూ చేసి, చీను అంగికరించి, నీవు కూడ ఒప్పుకొంటున్నవా? అని అడిగాను

లీలు, "నేను నెర్పరిని కాను లెండి, మగవాళ్ళు మీరు నేర్పరులు కాస్త ఓపిక పట్టండి రేపు మీరే చెప్తారుకాని" అంది

## 2

నేను, చాము, చీను చిన్నప్పట్నుంచి జతలో పెరిగిన పిల్లలం, కలిసే చదువుకొన్నాము చదవడానికని బెంగళూరు వచ్చినప్పుడు చాము వాళ్ళక్కయ్య సుబ్బమ్మ ఇంట్లోనే ఉండిపోయాడు అక్కయ్య అంటే తోడబుట్టిన అక్కయ్య కాదు, పెదతల్లి కూతురు సుబ్బమ్మ భర్త జన్నప్ప అదృష్టవంతుడు చామరాజపేటలో ఉండేవారు చాము దగ్గరే ఉండాలని నేనూ, చీనూ వాళ్ళింటి దగ్గరలోనే ఒక గదిని అద్దెకు తీసుకొన్నాము జన్నప్ప సుబ్బమ్మలకు మను పెళ్ళి మాట వచ్చేసరికి జాతకం చూపించారు చామూ జాతకం అంతగా కలిసిరాలేదు, చీనూ జాతకం దానికంటె కాస్తనయం, అన్నిటికంటె బాగా కలిసివచ్చింది నా జాతకం మనూని నేనే పెళ్ళి చేసుకొంటానో లేక చీనూనే పెళ్ళాడుతాడేమో అన్నంతవరకూ వచ్చింది అయితే చామూ సుబ్బమ్మకు తమ్ముడు; మేము కాస్త దూరపు సంబంధం ఎవరో జ్యోతిష్యులు కన్పించి "జాతకం మొదట్లో చూసింది తప్పు. చామూ జాతకం, మనూ జాతకం బాగా సరిపోతుంది" అన్నారు ఆ తర్వాత చామూనే మనూని పెళ్ళి చేసుకొన్నాడు

లీలా, సరూ, మనూ స్నేహితు రాండ్రు నేను లీలాని పెళ్ళి చేసుకొన్నాను; చీనూ సరూని పెళ్ళి చేసుకొన్నాడు మనునే తన స్నేహితురాండ్రని ఒప్పించి, భర్త స్నేహితులయిన మమ్మల్ని గృహస్థుల్ని చేసింది

ఏడాదిపాటు మేమెంతా సంతోషంగా కాలం గడిపామో చెప్పడానికి వీలుకాదు. మా చనువు, మా సరసం, మా సంతోషం వాటి సొబగే సొబగు అయితే రఃలోగా, చాము కొంత బాధ పడ్డట్టు కన్పించింది. నేనూ చీనూ మను దగ్గర చనువుగా మాట్లాడితే చాలు మొహం మాడ్చుకునేవాడు.

తాను మాత్రం లీలా దగ్గర, సరూ దగ్గర చనువుగానే మాట్లాడేవాడు నేను కాని, చీనూ కాని మనూని పెళ్ళి చేసుకోవాల్సి ఉండినవాళ్ళన్న భావన అతనిలో ఉండడంవల్ల ఇలా చామూ అసమాధానం పొంది ఉంటాడని పిస్తుంది అయితే మాకేం కావాలి? మను సుఖంగా ఉండడమే మాకు ముఖ్యం అని నేనూ, చీనూ మాట్లాడుకొని, ఆ తర్వాత చామూ ఇంట్లో ముందులా చనువుగా ఉండడం తగ్గించాము

## 3

పెళ్ళయిన మూడేళ్ళకి సరూ మొదటి కాన్పులో కన్ను మూసింది చీనూ ఒంటరి వాడయ్యాడు దాదాపు ఇదే సమయానికి సుబ్బమ్మ కూడ మరణించింది అందువల్ల జన్నప్పను చూసుకోవడానికని చాము, మను ఆ యింటికే వచ్చేశారు అప్పటికే చామూకు ఏదో అజీర్ణ సంబంధమైన వ్యాధి వచ్చింది నాలుగు రోజులు పథ్యం ఉంటే వ్యాధి నయమవుతుందని డాక్టరు అన్నాడు అయితే చామూ, పాటించలేదు. కారం తక్కువ వేయించి ఇంట్లో చారు చేయించుకొనే చాము హోటలుకు వెళ్ళి రెండు ప్లేట్లు పకోడా తినివచ్చేసేవాడు బుద్ధిలేనివాడు కాడు, అయితే బతికేదారి వదిలాడు రెండేళ్ళలో కన్ను మూశాడు

మూడు జంటలుయిన మేము సంతోషంగా జీవించాలని అనుకుంటే, ఇక్కడ చీను, అక్కడ మను ఒంటరి వాళ్ళయ్యారు నాలుగు నెలల తర్వాత నేను లీలాకు చెప్పాను, "మనమేమీ పాతకాలపు మనుష్యులంకాము, మనూ చీనూని పెళ్ళి చేసుకోని నువ్వు ఆమెకు చెప్పు" అని చీనూకి నేనే చెప్పాను చీను, "అలాగే కాని, అన్నయ్య" అన్నాడు మను, " కాస్త ఆగండి" అందట, "వద్దు" అనలేదు జన్నప్పతో ఈ విషయం ప్రస్తావిస్తే ఆయన కూతుర్ని అడిగి, కాస్త ఆగితేమంచిది కదా, అన్నారు. దానికేముందిలే అని నేనూ ఊరకుండిపోయాను

సంవత్సరం తర్వాత మా గ్రహచారానికి జన్నప్ప కూడా కళ్ళు మూశారు ఆయింటికంతా మనూ ఒక్కతే అయిపోయింది. ఆమెను చూసుకొనేవాళ్ళెవరంటే ఒక కుక్క ఈ భైరు.

నాలుగు నెలలు గడిచిన తర్వాత నేను మళ్ళీ లీలాతో "రెండేళ్ళు ఆగాము, ఇప్పుడు పెళ్ళి చేసుకోని, మనూతో చెప్పు" అన్నాను

"కాని చూద్దాం, కాస్త ఆగండి, చూద్దాం" అంటూ ఉండి, చివరిగా మను ఠః నిర్ణయానికి వచ్చింది

రాత్రి పడకమీద పడుకొన్నప్పుడు నాకు, "అరే, ఠః కుక్క ప్రభావం చూశావా, ఇదేమిటి విచిత్రం" అనిపించింది

భైరూ ఒక జాతి టెరియర్. చామూ మరణించిన నెలలో జన్నప్పదాన్ని ఇంటి కాపలా కోసమని తీసుకొచ్చాడు. దానికి మనుమీద చాల విశ్వాసం, ఎప్పుడూ ఆమె దగ్గరే కూర్చుని వుంటుంది ఆమె కూడా దాన్ని చాల కనికరంతో చూసు కొంటుంది అయినా ఠః నిర్ణయం కాస్త అతిగానే ఉన్నట్టు నాకు అనిపించింది

## 4

ఉదయం కాఫీ తాగిన తర్వాత లీలు, "కాస్త మను ఇంటికి వెళ్ళొద్దామా" అంది బయల్దేరాం దార్లో చీనూ ఇల్లు లీలు "చీనూను పిలవండి" అంది నేను ఒక క్షణం లోపలికి వెళ్ళి అతన్ని పిలిచాను. చీనూ తలుపు దగ్గరికి వచ్చి లీలాతో "నేను రావడం అవసరం లేదు కదా?" అన్నాడు. లీలు "వస్తే మంచిది మీ అన్నకు తెలుస్తుంది" అంది.

ముగ్గరం జన్నప్ప ఇంటికి వెళ్ళాము తలుపు దగ్గిర నిలబడి లీలు "మనూ" అంటూ పిలిచింది భైరు ముంగిట్లో కూర్చుంది ఆనందంతో తోక ఆడిస్తూ తలుపు దగ్గిరికి వచ్చింది, చీనూను చూసి గట్టిగా మొరగడం మొదలు పెట్టింది లీలా దాన్ని బుజ్జగిస్తూ సమాధాన పరచింది మను బయటికి వచ్చి మమ్మల్ని లోపలికి వదలనన్నట్టుగా అడ్డంగా నిలబడింది చాలసేపు సమాధాన పరచిన తర్వాత ఊరకే ఉండిపోయి, లీలు ప్రక్కల్లో వచ్చి కూర్చుంది ఆ తర్వాత చీనూ లోపలికి వచ్చి మాతోపాటు కూర్చున్నాడు

మను లోపలి కెళ్ళి కాఫీ తీసుకురమ్మని చెప్పి వచ్చింది కాఫీ వచ్చేదాకా మేము లోకాభిరామాయణంగా ఏదో నాలుగు మాటలు మాట్లాడుకుంటున్నాము.

కాఫీ తాగిన తర్వాత చీనూ లేచి, "ఇక నేను వెళ్ళొచ్చుగా" అని లీలాని అడిగాడు "అలాగే" అంటూ ఆమెతల ఊపింది

చీను పైకి లేవగానే భైరు గుర్రుమంది అయితే అతను ఒయలుదేరడాన్ని చూసి సమాధానపడింది

## 5

కాసేపు ఆమాటా ఈమాటా మాట్లాడుతూ లీలా మనూతో "చూడుమనూ, ముసలి ఎంటమనిషి నిన్ను లోపలికి పిల్చినట్టుంది" అంది ముసలామె పిలవలేదు కేవలం, మను కాసేపు లోపలికి వెళ్ళాలని లీలు చేసిన ఉపాయం

మను లోపలికి వెళ్ళిన తర్వాత లీలునాతో, "ఇక్కడికి రండి, ఎదురుగా కూర్చోండి, భైరు కళ్ళు ఎంత బాగున్నాయో కాస్త చూడండి" అంది

ఇదేమిటి ఈమె ఇలా అంటోందని నాకనిపించింది. అయితే ఏదో ఉద్దేశంతోనే చెప్తోందని నాకు తెలుసు. వెళ్ళి ఎదురుగా కూర్చున్నాను భైరు కళ్ళని చూశాను.

భైరూ లీలు ఒళ్ళో తలపెట్టుకొని తదేకంగా నన్నూ చూస్తోంది.

కళ్ళను చూడగానే నాకు ఈ కళ్ళను ఎక్కడో చూసినట్టనిపించింది. బాగా తెలిసిన కళ్ళు, అయితే ఏకళ్ళో నాకు స్ఫురించలేదు "సరిగ్గా చెప్పలేను, ఏదో బాగా తెలిసిన కళ్ళల్లా ఉన్నాయి" అన్నాను

లీలా "నిజంగానా" అంది. నేను "నిజంగానే" అన్నాను

ఆపాటికి మను తిరిగి వచ్చింది లీలు ఆమెతో "మీ అన్నయ్య భైరు కళ్ళు తనకు తెలిసిన ఏవో కళ్ళల్లా ఉన్నాయని అంటున్నారు" అంది

మను ఏదో చెప్పినట్టనిపించింది, మాటలు విన్పించలేదు. మేము వేరే విషయాలేవో మాట్లాడి లేచి ఇంటికి బయల్దేరాము

## 6

మధ్యాహ్నం టీ త్రాగే సమయంలో లీలా ఒక ఫోటో ఆల్బం తెచ్చి నా పక్కన్లో కూర్చుని, దాన్ని తిరగేస్తూ "మీరు, భైరూ కళ్ళు ఎవరో కళ్ళలాగా ఉన్నాయన్నారు కదా, ఎవరి కళ్ళలాగో, చూసి చెప్పండి" అని అడిగింది నేను, "ఏ మనిషి కళ్ళు కుక్కకళ్ళల్లా ఉన్నాయని చూసేది! ఇదేం పని?" అన్నాను

"ఉండని, చూడండి" అంటూ లీలు ఒక ఫోటో చూపించింది అది చీనూ ఫోటో, "దీనిలాగే ఉన్నాయా?" అంది నేను తదేకంగా చూశాను "లేదు" అన్నాను.

ఆమె మరొక ఫోటో చూపించింది "దీనిలాగున్నాయా" అని అడిగింది అది నా ఫోటో, "కాదని నేను అనుకుంటున్నాను నీవు అవునని అనవు కదా" అన్నాను. లీలు నవ్వి, "నాకూ అలాగే అనిపిస్తోంది" అని చెప్పి ఇంకొక ఫోటో తీసి, "దీనిలాగున్నాయా?" అని అడిగింది తీసుకొని చూశాను పుణ్యాత్మా! అదే చూపు "ఔనుకదా" అన్నాను అది చామూ ఫోటో

లీలా నవ్వింది ఇలా అంది, "చూశారా, దీని కోసమే నేను ప్రస్తుతం ఈ పెళ్ళి వద్దంటున్నది జన్నప్ప కుక్కపిల్లని తెచ్చినరోజే మనూకి ఈ కళ్ళిలా ఉన్నాయని మనస్సుకి హత్తుకుంది అందువల్లే ఆమె మనం ఈ పెళ్ళి ప్రస్తావన తెచ్చినప్పుడంతా కాస్త ఆగండి అంటోంది తాను ఊహించింది తప్పేమోనని ఒకరోజు నన్నడిగింది 'దీనికళ్ళు నీకు తెలిసిన ఎవరికళ్ళలాగైనా ఉన్నాయా' అని నేను చూశాను, 'అవును' అన్నాను 'ఎవరికళ్ళలాగా' అని అడిగింది నేను 'చెప్పను' అన్నాను 'నేనే చెప్తాను' అంది, చెప్పింది. మూడురోజుల క్రితం భైరూను గట్టిగా పట్టుకుని చీనూకు కూడ చూపించింది చూసిందే తడవు అతను కూడ "అవును" అన్నాడు ఎవర్నిదని అడిగితే 'చెప్పను' అన్నాడు. అతనితో నేనుమరోలాగ చెప్పాను; ఒప్పుకొన్నాడు"

నేను ఊరకున్నాను లీలా, "ఈ ఫోటో తీసిన సందర్భం జ్ఞాపకం ఉందా?" అని అడిగాను.

నేను "ఇది నేను తీసిందా?" అన్నాను. లీలా, అవును ఆ రోజు

మనమంతా లాల్‌బాగ్ తోటకు పిక్నిక్ వెళ్ళినప్పుడు కాస్త మనస్తాపం వచ్చి చాము చాల కోపగించుకున్నాడు ఆ తర్వాత అతన్ని సమాధాన పరచడానికి మీరు ఫోటో తీసే ఉపాయం చేశారు" అని జ్ఞాపకం చేసింది

అవును, నిజం నాకు జ్ఞాపకం వస్తోంది "అవును, అతన్ని ఆరోజు ఒప్పించడం కష్టమైంది చీను ఏదో తప్పుగా మాట్లాడి అతనికి కోపం తెప్పించాడుకదా?"

"అన్న మాటలో తప్పులేదు చామూకు అది తప్పనిపించింది ఆ రోజు ఏమైందంటే ఎవరో ఒక భర్త తన పెళ్ళాం విషయంలో ఎప్పుడూ అనుమానం పడుతూ ఉంటాడని, మాటల మధ్యలో అతను అనడం జరిగింది చీనూ, "మగడన్నవాడు మగకుక్క పెళ్ళాన్ని ఆడకుక్క అని భావిస్తాడు, ఆలామగల బతుకు కుక్క బతుకు' అన్నాడు, సరూ, మనూ నవ్వారు చామూకు చాలకోపం వచ్చింది చీనూ తననే, మనూని మనసులో పెట్టుకొని ఈ మాట అన్నాడని అతను గ్రహించాడు"

"సరే, ఇక ఈ కళ్ళ చూపు ఆ కళ్ళ చూపులా ఉందని మీరు ముగ్గురూ ఈ పెళ్ళి వద్దంటారా" అని నేను అడిగాను

"ప్రస్తుతం ఈ పెళ్ళి చామూకు అంగీకారం లేదని మను అనుకొంటోంది"

నేను: "చీనూ ఇంటికి సరూ ఆడపిల్లిలావచ్చి అతన్ని ఒంటరిగా ఉండమని మ్యావ్ అనలేదు కదా"

లీలం "సరూ ఆడపిల్లిలా వస్తే చీనూని మళ్ళ పెళ్ళ చేసుకో అంటుంది"

నేనూ: "కాదూ? ఆడవాళ్ళు మీరు చాల ఉదార స్వభావం ఉన్నవాళ్ళు!"

లీలం: "మగడైనవాడు తనని గురించే ఆలోచిస్తే భార్య భర్తను గురించి కూడా ఆలోచించాలి కదా!"

"అలాగేయితే మీరు ఆడవాళ్ళు చామూనే భైరూగా వచ్చాడని అంటారా?"

"ఆ విషయంలో"

"బాగుంది, అంటే ఆ రోజు ఉదయం నీ ఒళ్ళో తల పెట్టుకొని పడుకొంది చామూ అంటావా?"

"మగవాళ్ళు అనడం తప్పు ఆడవాళ్ళు ఇలా చేయవచ్చు కదా!"

"చేయకపోతె దారిలేదు కదా? కుక్కయినా అది నన్ను రక్షించుకొ అంటే రక్షించుకోకుండా ఎలా ఉండడం?"

"ఇదేమిటి లీలా, మీరంతా నిజంగా చాము కుక్కగా పుట్టి వచ్చాడని అనుకొంటున్నరా?"

"ఇది ఎవరి మాటా కాదు; జన్మకు సంబంధించిన మాట, విశ్వాసం మాట కూడా కాదు మన మనస్సుకి ఆ పెళ్ళి అనేది ఏమనిపిస్తోందో, అదే మాట ఆమెకు ఇప్పుడు పెళ్ళి వద్దనిపిస్తోంది"

"ఎందుకని?"

"భర్త అయిన వాడి ప్రేమస్మృతులు మరో ఆలోచనని రాకుండా చేస్తాయి"

"ఉన్నన్ని రోజులు ప్రాణం పిండి చచ్చిన తర్వాత పీడించే ఆ స్మృతుల్నే నీవు ప్రేమ అంటావా?"

"ప్రేమకాకపోతే ప్రాణం ఎందుకు పిండుతారు, ఎందుకు వెంటాడుతారు సంతోషపరచేదే ప్రేమే, దేన్ని చేసేది ప్రేమే. అది పొట్టలోనికి వెళ్ళిన అన్నం ఇది గొంతులో చిక్కుకొన్నది"

"ఆహా!"

నేను ఆలోచించాను లీలా అన్నమాటలు నిజమనిపించింది అయితే మనూ, చీనూ ఒంటరిగా ఉండడం వద్దనిపించింది

నేనన్నాను "భైరూని ఇక్కడికి తీసుకొని వచ్చేయ్"

లీలా అంది "నేనప్పుడే ఆ ఆలోచన చేశాను మనూ వద్దంటోంది ఎందు కన్నాను, మీరు అలా మగలు సంతోషంగా జీవించండి అంది"

నేను, "అలాగంటే? భైరూని ఇక్కడికి తీసుకొని వస్తే నీవూ చామూతో చనువుగా ఉంటావని నేను అపార్థం చేసుకొంటాననా?" అన్నాను

"కాదు, కాదు, మీకలాంటి ఆలోచన లేదని మనుకు తెలుసు అయితే తన మనస్సుకి సమాధానం లేక పోతుందని ఆమె సందేహం"

నేను, "ఇంతకీ నేను పై కోర్టు అని అపీలు చేస్తే, వాళ్ళ తీర్పునే నివు ఖాయం చేశావు" అన్నాను

లీలా, "ప్రస్తుతానికి ఔను" అని చెప్పి తన పనిలో నిమగ్నురాలయింది.

మరేమీ తోచక నేను ఊరకుండిపోయాను.

# ఆంగ్ల నౌకా క్యాప్టన్.

ప్రపంచ మహాయుద్ధం జరిగే రోజుల్లో ఒకరోజు నేను పూనా వెళ్ళడానికి కాస్త దూరంలో ఉన్న రైల్వే స్టేషన్‌లో రైలెక్కాల్సివుంది అప్పుడు నేను రక్షణ శాఖలోని ఆడిట్ విభాగంలో ఉద్యోగం చేస్తుండేవాణ్ణి ఒక పుటలోని లెక్కల్ని చూసి ఆఫీసుకు బయల్దేరాను నేను స్టేషన్ సమీపించేసరికి రైలు బయల్దేరే వేళయింది ఏదో ఒక రైలు పెట్టెలో కూర్చోకపోతే రైలు తప్పిపోయేటట్టుంది వెంటనే వెళ్ళి ఒక పెట్టెలో కూర్చున్నాను

ఆ పెట్టెలో మరొక ప్రయాణికుడు మాత్రం ఉన్నాడు అతనొక తెల్లవాడు అక్కడ హ్యాంగర్లకి తగలేసిన షర్టు, టోపీ చూడగానే అతను నౌకాదళంలో పనిచేసే ఒక అధికారి అని అర్థమయింది బ్యాడ్జిలను బట్టి చూస్తే అతనొక క్యాప్టన్ అన్న విషయం స్పష్టమైంది

క్యాప్టెన్ టీ తీసుకుంటున్నాడు అతనికి రెండు ప్రక్కలా సీటు మీద బిస్కట్లు, బ్రెడ్, జామ్, వెన్న మొదలైన అల్పాహారాలు ఉన్నాయి ఎదురుగా ఉన్న టీపాయి మీద రెండు, మూడు పింగాణీ ప్లేట్లు, అక్కడే ఒక విస్కీ సీసా, ఒక సోడా సీసా ఉన్నాయి సీసాలను ఓపన్ చేసి వాటినుంచి విస్కీని, సోడాను తీసుకొన్నట్టు కన్పిస్తోంది

నేను హఠాత్తుగా పెట్టెలో ప్రవేశించగానే క్యాప్టెన్ నా వైపు చూశాడు, కాస్త కంగారు పడ్డట్టనిపించింది ఒక్క క్షణం ఆగి తన ఎడమవైపున్న పొట్లాలను తన వైపుకు లాక్కొని నాకు స్థలం చేసిచ్చి, "మన్నించండిసార్ నేను చాల స్థలం ఆక్రమించుకొన్నాను, మీకు ఇబ్బందిగా ఉందేమో" అన్నాడు

నేను 'అబ్బే అలాంటిదేమీ లేదు క్యాప్టెన్‌గారు, ఈ స్థలం నాకు చాలు' అని చెప్పి నేను వెళ్ళి తలుపు దగ్గరి మూలలోని సీటుమీద కూర్చున్నాను

మరు క్షణంలో రైలు బయల్దేరింది, కాసేపట్లో వేగం పుంజుకుంది నేను కిటికీ నుంచి బయటికి చూస్తూ ఆలోచించుకుంటూ కూర్చున్నాను

క్యాప్టన్ కూర్చున్న వైపు నేను మొహం పెట్టక పోయినా, నేను మాత్రం అతను నా వైపు ఒకటిరెండు సార్లు కుతూహలంతో చూస్తున్నట్టు గుర్తించాను యుద్ధానికి పూర్వం ఆంగ్లేయులు - అంటే ఇతనొక ఆంగ్లేయుడని నా విశ్వాసం - ఇతని జనం ఒక భారతీయుడు తమతోపాటు ఒకే పెట్టెలో కూర్చుంటే ఆంగ్లేయుల మర్యాదకు లోటని భావించేవాళ్ళు ఇతని చూపుల్లో ఆ అసహన లక్షణం లేదు, నిజంగానే ఆదరం కన్పిస్తోంది

నేను, 'మన ఆంగ్లప్రభువుల ప్రవర్తనలో ప్రపంచ మహాయుద్ధం ఇంతటి మార్పునంటూ తెచ్చింది' అని అనుకున్నాను అయితే నా అంతట నేను మాట్లాడించి అతనితో పరిచయం పెంచుకునే ఉద్దేశం నాకులేదు

కొద్ది నిమిషాల తర్వాత క్యాప్టెన్ మహాశయుడు విస్కీసీసా బిరడా తీసి కొంచెం విస్కీ గ్లాసులోనికి పోసుకొని దానికి కాస్త సోడా కలిపాడు తన పానీయాన్ని సిద్ధం చేసుకుంటూ మధ్యలో "నేను కాస్త తాగుతాను, మీకేమీ అభ్యంతరం లేదుకదా? ఫలహార వేళ అవుతున్నా దీన్ని నేను భోజనంలాగానే స్వీకరిస్తున్నాను" అన్నాడు

నేను "మరేం ఫరవాలేదు క్యాప్టెన్‌గారు మీరేం చేసినా నా అభ్యంతరం లేదు" అన్నాను

"అయ్యా, మీరెంత మంచివారు యుద్ధంలో పాల్గొంటున్న మాలాంటి వాళ్ళు సమయం దొరికినప్పుడు కాస్త సుఖపడడానికి అవకాశం ఉండాలన్న విషయం మీకు తెలిసినట్టుగా కన్పిస్తుంది"

"ఔను, మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను"

"అయ్యా మన్నించాలి మీరు నన్ను నేరుగా క్యాప్టెన్ అని పిలిచారంటే, మీరు మా అధికారుల బ్యాడ్జిలను గుర్తించ గలిగారన్నమాట"

"ఔను, నాకు వాటి పరిచయం ఉంది నేను సైన్యంలోని ఆడిటింగ్ విభాగంలో పని చేస్తున్నాను గోదాముల్లో ఆ బ్యాడ్జిలుంటాయి, నాకు వీటి విషయం తెలుసు"

"అయ్యా నాకూ మీ దేశం గురించి, మీ ప్రజల్ని గురించి కొన్ని విషయాలు తెలుసు మొదట్నుంచి నాకూ భారతీయులంటే చాల ఇష్టం మీరు చాల శక్తి సామర్థ్యాలు ఉన్నవారు మీ వ్యక్తిత్వం మీద నాకు చాల గౌరవం"

"సంతోషం క్యాప్టన్‌గారూ"

"అవునండి, ఒక మాటలో చెప్పాలంటే, నేను చూసినంతవరకూ ఇప్పుడు ఖచ్చితంగా చెప్పగలను మీ ప్రజలు దేవుడు సృష్టించిన ఏ ఇతర ప్రజలకంటె కూడ బుద్ధి విషయంలో తక్కువ కాదు"

ఆ పాటికి క్యాప్టన్ తన ఫలహారం ముగించాడు పక్కల్లో ఉన్న పొట్లాలను తీసి ఒక చెక్కపెట్టెలో వేసి, గ్లాసులో మరికొంత విస్కీ సోడా పోసుకొని ఆ సీసాలను మూసి బుట్టలో పెట్టుకొన్నాడు, సీటు మీద ఒక మూల్లో ఒరగి కూర్చున్నాడు

"మా ప్రజలో మీరు ఎవరిని గురించి అంటున్నారు?" అని నేనడిగాను

"పట్వర్ధనులు, వాళ్ళతో పాటున్నవారు"

"ఓహో మీరు పట్వర్ధనుల్ని గుర్తించగలరా? నేనొక పట్వర్ధనుణ్ణని మీరు గుర్తించారు కదా?"

"పట్వర్ధనులు కాకపోతే వాళ్ళ అన్నగారో లేక తమ్ముడో నండి మీ నుదుటిమీదున్న గుర్తు, మీ తలపాగ, ఇవి చాలు మిమ్మల్ని గుర్తించడానికి".

"అవును మీరనుకొన్నది సరైంది. నేను పట్వర్ధన వంశీయుణ్ణే కాను, అయితే మీరన్నట్టుగా వాళ్ళలో ఒక గుంపుకు చెందినవాణ్ణే అయితే మొహం మీద ఆ గుర్తును ఆ తల పాగాను ఇప్పుడు మహారాష్ట్ర జనుల్లో

చాలమంది భాగ్యవంతలు ఉపయోగిస్తారు"

"సరే, అయితే మీరు వట్టి భాగ్యవంతలైన మహారాష్ట్రీయ మహాత్ములుకారు, బ్రాహ్మణులు"

"అవును, ఠః విషయం మీకెలా తెలుసు?"

"ఎలాగయితేనేం, నాకు తెలుసు,"

క్యాప్టన్‌గారు నాతో మాట్లాడుతూనే విస్కీ త్రాగడం ముగించారు నాతో "మన్నించాలండి నేను పొగత్రాగితే అభ్యంతరం లేదు కదా" అని అడిగాడు

నేను "నాకలాంటి అభ్యంతరం లేదు క్యాప్టన్‌గారు, తప్పక పొగ త్రాగండి" అని బదులు చెప్పాను

"అయ్యా, చాల మంచిది మీరు పొగ త్రాగకపోయినా ఇతరులు పొగ పీల్చడానికి అనుమతించడం మీ సౌజన్యాన్ని తెలియజేస్తుంది

"అది అంత పెద్ద సౌజన్యమని నేను చెప్పలేను మా ప్రభువులు ఏది చేసినా మేము అడ్డు చెప్పలేము ఇప్పడిదంతా మాకు అలవాటయిపోయింది అంతెందుకు మాలో చాలమంది వీటిని అలవాటు చేసుకొన్నాము".

"అది నిజమేనండి, మీ ప్రజలిలా చేయడం అన్యాయం మీరు వేయిచెప్పినా జీవితంలో గాంధి మార్గమే ఉన్నతమయిన మార్గం".

"అలాగంటారా క్యాప్టన్? అంటే నేనొక గాంధేయుణ్ణి కాదని మీకనిపిస్తుందను కొంటాను".

"అది సరే గానీ మీరు ప్రభుత్వంతో సహకరిస్తున్నారు అయితే నేను గాంధిమార్గం అని ఎందుకన్నానంటే భారతీయుల అత్యుత్తమమైన జీవిత విధానాన్ని గురించి మీకు తెలియజెయ్యాలని. దీనికంటె ఉత్తమమైన విధానం ఎక్కడా వికాసం చెందలేదని నా అభిప్రాయం"

"మీ ఠః మాటలవల్ల నేను చాల గర్వపడాలి అయితే మీరు భారతదేశ పక్షపాతి అయిన ఆంగ్లేయులు ఆంగ్లేయుడనే చెప్ప నక్కరలేదు,

స్కాట్లన్స్ కావచ్చును లేదా ఐరిష్ కావచ్చును"

"లేదండి, నేను ఆంగ్లేయుణ్ణే"

"అవును, మీరు మాట్లాడే తీరును బట్టి నేను మిమ్మల్ని అలాగే ఊహించాను మీలో చాల మందికి, భారత దేశంలోని అనేక మంచి గుణాలను గుర్తించే దృష్టి ఉందన్న విషయాన్ని తెలియజేశారు"

"అవునండి, నేనూ అలాంటి వాళ్ళలో ఒకణ్ణే భారతీయుల్ని నేను ఎంతగా పరిశీలిస్తూ వచ్చానో అంతగా వారి విషయంలో ప్రేమ గౌరవాలు అధికం అవుతూ వచ్చాయి"

"నౌకా విభాగంలో క్యాప్టన్‌గా పని చేసే వ్యక్తికి మా దేశ ప్రజల జీవన విధానపు లోతుల్ని గమనించే అవకాశం అధికంగా ఉండదు"

"మీ కలా అనిపిస్తుందా సార్? చూడండి మా నౌకలో నా చేతి కింద మీ దేశపు యువకులు పది మంది ఉండేవారు ఈ నేలపై ఇంతకు మును పెన్నడూ ఇలాంటి పది మంది యువకులు పుట్టి ఉండడం వాళ్ళ విషయం నాకు బాగా తెలుసు ఆ అనుభవం ఆధారంమీద చెప్తున్నాను ఈ పదిమంది యువకులకంటే ఉత్తములైన పదిమందికి ఏ దేశం కాని ఎప్పుడైన కానీ జన్మనిచ్చి ఉండదు"

"మీ పాలిటికి వచ్చిన అనుభవం చాల బాగున్నట్టుంది క్యాప్టన్ మీ నౌక ఏది?"

"నౌక ఇప్పుడు లేదండి, నేను అదృష్టవశాన ప్రాణంతో తీరాన్ని చేరుకున్నట్టుగానే ఆ యువకులూ ప్రాణంతో బయట పడిఉండాలని నా ఆశ నా నౌకపేరు.. వారం రోజుల క్రితం మా జపాన్ శత్రువులు దాన్ని బాంబులతో పేల్చి పొడి పొడి చేశారు పత్రికల్లో మీరా విషయాన్ని చదివే ఉంటారు కదా?"

"ఆహా! మీరా నౌక క్యాప్టన్ గారా? ఆ నౌక మన యువ అధికారులకి శిక్షణ నిస్తున్న నౌక కదా? పగతో కాల్చివేశారని చదివిని తర్వాత మాకు చాల

అసహ్యం వేసింది నౌకలో ఉన్న వాళ్ళంతా మరణించినట్టుందన్న వార్త పత్రికలో వచ్చింది కదా ?"

"మరణించారు నిజమే మరణించారనుకొన్న వాళ్ళలో నేనొకణ్ణే చావునుంచి బయటపడి వచ్చాను నాలాగే మరికొంతమంది ప్రాణాలతో బయటపడి రావాలని కోరుకుంటున్నాను"

"మీరు ప్రాణంతో బయటపడ్డారు కదా క్యాప్టన్, అదే మాకు సంతోషం"

"ఆ యువకుల విషయం గురించి తెలిసేదాకా నాకు సంతోషం లేదు సార్ నేను తీరం చేరిన రేవు ఆఫీసులో చెప్పివచ్చాను, నా నౌకలోని వాళ్ళు ఎక్కడ ఏ తీరం చేరినా సమాచారం అందినా వెంటనే నాకు తెలియజెయ్యాలని సమాచారం అందడం ఆలస్యం కాకూడదని నేను రేవు ఉన్న ఊళ్ళోనే ఉండిపోవాలని ఆలోచించాను అయితే నేను నేల వదలి రెండేళ్ళకంటే ఎక్కువ కాలం నీళ్ళ మీదే ఉండాల్సి వచ్చింది నా భార్యని చూడాలనిపించింది, అందుకా బయల్దేరివచ్చాను"

"క్యాప్టన్ భార్య పూనాలో ఉన్నారా ?"

"అవునండి, మాలో అనేక సంసారాలు ఇప్పుడు ఏదో ఓ కంటోన్మెంటులో కాపురం ఉంటున్నాయి నా భార్య ఈ నాలుగేళ్ళుగా పూనా కంటోన్మెంటులో ఉంటోంది"

"పాపం, ఆ ఆడబడచు రెః రెండేళ్ళ తర్వాత నయినా మిమ్మల్ని చూడడమనేది సంతోషించదగ్గ విషయం"

"అది నిజమేమండి ఒకర్నొకరు చూడాలనుకోవడం మాకు ఆనందాన్నిచ్చే సంగతి"

"అంతేకదా మరి "

"నా భార్యది చాల మెత్తని స్వభావం చాల మంచిదండి ఒక సారి కాదు, పదిసార్లు కాదు నేను నానౌకలోని నాగదిలో పడకమీద పడుకొని

ఆమెనే తలచుకుంటూ కాలం గడిపాను"

"అది సహజమే కదండి"

"అవునండి మీకు జీవితం గురించి బాగా తెలుసుకనక దీన్ని ఊహించుకోగలరు"

"అలాగే, క్యాప్టన్, ఒంటరిగా ఉన్న స్త్రీ తన భర్తను తలచుకొంటుంది భర్త తలచుకొనేది వందలసార్లు భార్య తలచేది అన్ని ఇన్ని సార్లు కాదు, సర్వ కాలం!"

"కావచ్చునండి, అయితే స్త్రీకి ఈ కష్టం భర్తకు ఉండినంతగా ఉండదు కదా?"

"అంటే?"

"శరీరాల భేదం ఆశను నిగ్రహించుకొనే శక్తిలో వ్యత్యాసాన్ని తెస్తుంది కదా? మగవాడికి ఇది చాల కష్టం"

"సందేహం లేదు మా పురాణాలన్నిటిలోను కోర్కెల్ను లొంగిపోయిన మునుల చరిత్ర ఉంది అయితే స్త్రీకి కూడా ఇది కష్టపరిస్థితే ఆమె బాధని మగవాడు తెలుసుకోలేడు అంతే!"

"దీన్నేనండి నేను మీ చాతుర్యం అనేది మీరిలా అన్న తర్వాత నాకు కూడా ఇది నిజమనిపిస్తుంది అయినా నా ఆశ నన్ను సమాధి చేసినట్టుగా, ఒక స్త్రీ ఆశ ఆమెని సమాధి చేస్తుందని నేను ఊహించను ముసుగులో గుద్దులాట ఎందుకండి నేను మీ ముందు అంగీకరిస్తున్నాను చాల సార్లు నాకు కోరికనుంచి విముక్తి దొరక్క నిలువలేక పోయాను చివరికి దాన్నుంచి విముక్తి పొందాను"

"ఎలా అని నేనడగను"

"అడిగే అవసరం లేదు తెలిసిన విషయమే"

"సరే, ఇది మీ తీరు మరో తీరు వ్యక్తి, దాన్ని మరో రీతిలో అనుభవిస్తాడు"

"నిజమండి, అయితే నేను తెలుసుకున్నది ఇంతమాత్రం ఈ తీరు అక్రమం ఆ తీరు అపరాధం సేవకుడితో చనువతో ఉండడం సులభమనిపించవచ్చు అయితే దాని వల్ల సంభవించే అనర్థం అధికం పనివాళ్ళ ముందు మర్యాద పోతుంది అధికారిగా ఉన్నవాడు అధికారం చూపించడానికి వీలుకాదు"

"అది తప్పదు లెండి అయితే పై అధికారులే తమలో తాము నీతి తప్పడం ఉంటుందని విన్నాను"

"అవునండి, అయితే అది నా నౌకలో సాధ్యం కాలేదు నా దగ్గర పని నేర్చుకోవడానికి వచ్చిన యువకులు ఆ పది మంది పది రత్నాలు వాళ్ళు స్వతంత్రంగా బతికే రోజుకు ఏ మంచి చెడ్డలు చేస్తారో అది వాళ్ళ నుదుటిరాత నా దగ్గర నేర్చు కోనేటప్పుడు వాళ్ళని తప్పుదారికి ఈడ్వడం అనేది నేర్పించే వాని లక్షణం కాకూడదు ఇలా చేసేవాడు గురువన్న పదానికి కొత్త అర్థం ఇచ్చి నట్టవుతుంది"

ఇలా అంటూ క్యాప్టన్ మహాశయుడు పరిహాసప్రాయంగా కొద్దిగా నవ్వాడు నేను "మీ సంకోచం ఉన్నత స్వభావులకే ఉంటుంది క్యాప్టన్" అన్నాను

"ఈ మంచి మాట మీరన్నందుకు కృతజ్ఞుణ్ణి అయితే మీరు ఆ కుర్రాళ్ళని చూసివుంటే ఈ సంకోచం ఎంత సహజం అన్న విషయాన్ని గుర్తించేవారు"

"మీ జపాను శత్రువులు ఇలాంటి నౌక నౌకదాన్ని ఎలా కాల్చారు? అధికారుల శిక్షణ కోసమని ఉంచిన నౌకను కాల్చడమనేది నియమోల్లంఘున కదా? మీరు దీన్ని ముందుగా ఊహించలేదు కదా?"

"నా నౌక శిక్షణనిచ్చే నౌకేనండి, అయితే ఇలాంటి నౌకలు మరి మూడున్నాయి. భారతదేశ నౌకాదళం పెద్దది కాదు అందువల్ల మా శిక్షణ నౌకకు కూడ పని తగిలింది మన సముద్ర తీరం ఒక భాగాన్ని కాపలా కాచే జవాబ్దారి మా నౌక పాలికి వచ్చింది ఇది కూడా నేర్చుకోవాల్సిన పనే పని

నేర్పిస్తూ పని నేర్చుకుంటూ నేనూ నా యువ శిష్యులూ మా నౌకని మన దేశం నీళ్ళలో ఉత్తరం నుంచి దక్షిణానికీ, దక్షిణ దిశనుంచి ఉత్తరానికీ అపాయం లేకుండా చాల దర్పంతో నడిపాము చాల పెద్దపని చేస్తున్నామనిపించింది ఒక రోజు ఉదయం కళ్ళు తెరిచేసరికి ఒక జపాన్ రాక్షస నౌక అల్లంత దూరంలో సముద్రం మీద కనిపించింది. మేము తీరాన్ని కాపలా కాయడమనేది ఇలాంటి ఒక రాక్షస నౌక ఎదురు పడేంతవరకు మాత్రమె అది వచ్చిందంటే మాపని ముగిసినట్టే మా నౌక దానితో ఢీ కొనడమంటే వృధకాయుడితో పసిపాప ఎదుర్కొన్నట్టుగా ఉంటుంది. 'అరే! ఇప్పుడేం చేయాలి' అని నేను ఆలోచిస్తున్నాను. జపాని క్యాప్టన్, వెంటనే లొంగి పోండి, లేకపోతే మీ మీద బాంబులు వేస్తాం అని వార్త పంపాడు లొంగిపోవడమా? బహుశా ఇదే సరయినదనిపించింది నాతో పాటున్న ఆ పది మంది యువకుల్ని ఎందుకు బలి ఇవ్వాలి? నేనొక్కడనే అయివుంటే నా శౌర్యం చూపించే ఆలోచన చేసి ఉండేవాణ్ణి ఈ దేశం తన బిడ్డల్ని నాకు అప్పజెప్పింది వీళ్ళని, ఈదేశ మాత కోసం రక్షించడం నా కర్తవ్యం"

"మీ కిలా అనిపించిందా?"

"అవునండి అందువల్ల నేను వెంటనే సమాధానం చెప్పలేదు ఆలోచించడానికి కాస్త సమయం ఇవ్వండి, సమాధానం చెప్తాను, అన్నాను వెంటనే యువకులతో చర్చలు జరిపాను"

"చర్చలు జరిపి బాంబ్ వేయించుకోవడమే సరియైందని నిశ్చయించుకొన్నారు"

"మీ ఊహ సరి అయిందే, నా యువకుల్లో ప్రతి ఒక్కడూ యుద్ధాన్ని చూస్తుండడం ఇదే మొదటి సారి, ఇందులో ఓడిపోయాం అని అనిపించుకోవడం మాకిష్టం లేదు' అన్నారు నేను 'సోదరుల్లారా, బాంబ్ పడిందంటే, మనమందరం చావడం ఖాయం, మరచిపోకండి, అన్నాను. వాళ్ళు, ఓడి పోయాము, దాసులవుతాము, చచ్చేదాకా మా నుదుటి మీద ఓటమి పట్టీ కట్టుకుని తిరుగుతాము అని అనడం కంటే చావడం మేలు అన్నారు. జపాన్

వాళ్ళు మళ్ళీ సంజ్ఞ చేసి ప్రశ్నించగా మేము, ఓటమిని అంగికరించడం మాకిష్టంలేదు, మీయిష్టం వచ్చినట్టు చేసుకోండి, అన్నాము".

"అన్నదే తడవుగా శత్రువులు బాంబు వేశారా"?

"మరో సారి, మర్యాదగా, ఇదే చివరి సారిగా చెప్పున్నారా అని అడిగి, అవునన్న తర్వాత, బాంబు వేశారు అంతకు ముందు మేము మా ప్రధాన కార్యాలయానికి సంజ్ఞల ద్వారా పరిస్థితిని తెలియజేశాము మా విషయంలో వాళ్ళు అన్ని ఆశల్ని వదలుకొన్నట్టుంది బాంబ్ పడుతుందని ఊహించిన మేము మాకున్న అన్ని జాగ్రత్తల్ని వహించి వీలయినంత మందిని రక్షించడానికి పూనుకొన్నాము బాంబ్ పడింది అదేమంత శక్తివంతమైన బాంబయి ఉండదు. అయితే మమ్మల్ని హతమార్చడానికి అంత పెద్ద బాంబు అక్కర్లేదు ఈ అల్ప శక్తివంతమైన బాంబు కూడా మమ్మల్ని చంపడానికి అనవసరం నౌక ముక్కలు ముక్కలై, మునిగి తేలింది చెప్పడానికి పేరు లేకుండ అయిపోయింది బాంబు ధ్వంసం చెయ్యడం అయ్యాక నేను అటూ ఇటూ చూడాొచ్చునన్న సమయానికి నా దగ్గర్లో ఒక కట్టెమాను తేలుతూ ఉండడాన్ని చూశాను, దాన్ని గట్టిగా పట్టుకొని తక్కినవాళ్ళ గతేమిటి అని చుట్టూ కలయచూశాను

"ఇలాంటి సమయాల్లో ఉపయోగించడానికి మీకు రక్షణ కవచాలు ఉంటాయి కదా?"

"అన్ని సమయల్లోనూ ఉండవండి నౌకలో ఉన్న ప్రతివాడికి ఒక మంచి కవచం ఉండడం అపురూపమైన సంగతి అన్ని నౌకల పరిస్థితి అంతే నా నౌక పరిస్థితి ఇంతకంటే కొంచెం హీనం"

"నాకు తెలిసినంతవరకూ ఒక నౌకను ఇలాంటి పనికి నియమించి పంపించడానికి ముందు అందులో ఇలాంటి అవసరమైన పరికరాలన్ని ఉన్నాయని నిపుణులు ధ్రువికరించి ఉంటారు"

"అదేమో సరేనండి, అయితే క్యాప్టన్ అయినవాడు కాని లేదా నౌకలోని ఎవరో ఒకరు ప్రధాన కార్యాలయానికి చాలా కావలసినవాడు కాని లేదా

ప్రభుత్వ దృష్టిలో ముఖ్యమైన వ్యక్తి కాని కానట్టయితే సామగ్రి ఎంత ఉండాలో అంత ఉండక పోవడం అనేది సహజం లెక్కకు సామానులన్నీ ఉంటాయి అయితే అన్ని సామాన్లు ఉపయోగానికి రావు"

"మీ ప్రధాన కార్యాలయానికి మీ మీద అంత అభిమానం లేదని మీ అభిప్రాయమా క్యాప్టన్?"

"ఆ విషయం నేను మాట్లాడడం బాగుండదండి"

"అయినా వాళ్ళు మిమ్మల్ని క్యాప్టన్ పదవికి ఎక్కించారు కదా?"

"ఎక్కించారండి, నేను సేవ చేసి ఈ పదవిని అధిరోహించాను. నాకు కావాల్సిన వాళ్ళలో ఒకరు పై అధికారంలో ఉన్నప్పుడు నేను క్యాప్టన్ అయ్యాను. నిజంగా నేను క్యాప్టన్ కావడానికి కారణం నాకు మీ ప్రజలమీద ఉన్న అభిమానం, ఈ యువకులకు శిక్షణ నివ్వడానికి సామర్థ్యం ఉండడం. క్యాప్టన్ అయ్యాను, కొద్ది రోజుల తర్వాత పై అధికారిగా మరొకరు వచ్చారు, నేను దిక్కు లేని వాణ్ణయ్యాను"

"మీ ప్రధాన కార్యాలయానికి మీరు దిక్కు లేని వారయ్యారని అనిపించలేదా?"

"నేనలా అనలేను అయితే జపాన్ ఎంత క్రూర దేశమో తెలిసిన వాళ్ళు నా ఈ చిన్ని నౌకను కాపలా కోసం నియమించడం నిర్దాక్షిణ్యము"

"ఇలా మీరిక్కడా, మీ యువకుల ఎక్కడో చచ్చి బ్రతికి నీళ్ళలో తేలుతుంటారా?"

"అవునండి. నాకు తల కొంచెం తిరిగినట్టనిపించింది తక్కినవాళ్ళకి ఇంకా ఎక్కువ కష్టమయి ఉంటుంది. కట్టె మానును ఒక చేత్తో పట్టుకొని మరొక చేతిని ఊపుతూ, నేను నాతోటి వ్యక్తుల్ని, తీరం వైపు ఈదడానికి ప్రయత్నించండి, అని సైగ చేశాను. నేను ఆ దిక్కుగా కదలనారంభించాను బాగా ఎండెక్కింది; దాన్ని సహించి స్పృహ తప్పి మునగకుండా ఉండడం నాకు సాహసమనిపించింది"

"చివరికి తీరం చేరారు"

"దాదాపు రెండురోజుల తర్వాత చేరానండి అనుభవం ఉన్న నావికుడికి ఇదేం కొత్త కాదు

'x' రేవు దక్షిణ దిశకి రెండు మైళ్ళ దూరంలో నేను తీరం చేరాను అక్కడ కన్పించిన జనుల్ని ఈ ప్రదేశం ఏదని అడిగాను వాళ్ళు కాస్త రొట్టె నీళ్ళు ఇచ్చి దారి చూపించారు ఆ త్రోవ వెంబడి 'x' రేవు కార్యాలయం చేరాను

"కార్యాలయం వాళ్ళకి మీరు ప్రాణాలతో బయట పడి రావడం సంతోషాన్ని కలిగించి ఉంటుంది"

"అయి ఉండాలండి అయితే ఎవరూ సంతోషం వ్యక్తం చెయ్యలేదు జరిగిన సంగతుల్ని వ్రాసివ్వమన్నారు వ్రాసిచ్చాను నా భార్యను చూడడానికి పూనా వెళ్ళాలన్నాను వాళ్ళు కావలసిన పేపర్లను తయారు చేసి నన్ను పంపించారు"

"సరే అంత ఉపకారమైనా చేశారు కదా ఎలాగో మీరు ఇప్పుడు పూనా కొంతకాలం విశ్రాంతి తీసుకొని హాయిగా చేరుకొని ఉండవచ్చు".

"ఉండవచ్చునండి, అయితే ఇది ఇలా జరుగుతుందని ఖచ్చితంగా చెప్పడానికి వీల్లేదు క్రిందటి సారి నేను రెండేళ్ళపాటు సముద్రం మీదుండి వెనుతిరిగి వచ్చాను అయినా ఏమిటి! ఒక వారం గడవకముందే, నన్ను మళ్ళీ నీళ్ళలోకి త్రోశారు ఇదెలానండి అని అడిగితే యుద్ధకాలం సౌకర్యాలు చూడడానికి అవుతుందా, అనేవారు మనవాళ్ళెవరైనా మన వెన్ను తట్టి నిలిచేవారుంటే సరే. లేకుంటే తలవంచి చెప్పినట్లు చెయ్యడమే మంచిది".

"మీ ఆంగ్లేయుల్లో మీలో మీరు ఎలాంటి పక్షపాతవైఖరి లేక నడుచుకొంటారని మా అభిప్రాయం క్యాప్టన్ గారూ"

"స్వామీ, మీరు తెలిసినవాళ్ళు. మీకు చెప్పాల్సిందేముంది? మీరనుకొంటారు, మేమంతా అన్యోన్యంగా ఉంటామని మేమనుకొంటాం,

మీరంతా ఐకమత్యంతో మెలగుతారని నిజానికి మాలోనూ అంతే, మీలోనూ అంతే; జనం ఇరవై గుంపులుగా బ్రతుకుతారు నిష్పక్షపాతమన్ని గుంపుల లో లేదు మిగిలిన దాంట్లో ఇది నాది, ఇది వేరే ఉండనే ఉంది "

"ఈసారయినా మిమ్మల్ని మళ్ళీ వెంటనే నీళ్ళ మీదికి వదలరని ఆశిస్తాను మీకు కాస్త విశ్రాంతి, నెమ్మది కావాలి"

"దీంతో పాటు నాకు నా భార్యతో పాటు కలిసి ఉండే సుఖం కావాలి రేపు నా జీవితంలో చాల సుఖప్రదమైన రోజు".

"రేపా క్యాప్టన్? మీరిదే రాత్రి పూనా చేరుకొంటారు కదా?"

"అవును స్వామీ అయితే ఈ రోజే నా భార్యను చూసి పీడించడం ఇష్టం లేదు".

"ఆమెకు మీరొస్తున్నట్టు తెలుసుకదా?"

"లేదండి నేను వస్తున్నానన్న సంగతి చెప్పి పంపి ఉంటే, ఆమెకు నిరీక్షా వ్యాకులతని ఎక్కువ చేసినట్టయ్యేది ఎన్ని గంటల క్షోభండి, ఒకరు రావడానికి మరొకరు ఎదురు చూడడమనేది! అందుకని నేనిలా ఆలోచించాను నేనీ రాత్రి కంటోన్మెంట్ చేరుతాను· రేపు ఉదయం లేచి నేను వచ్చిన విషయాన్ని కబురుచేసి ఒక పావుగంట వదలి, ఆమె ఉన్న స్థలానికి వెళ్తాను ఇలా చేయడంవల్ల ఆమెను ఆరుగంటలు ఆలస్యంగా చూస్తాను. అంతే ఆమె మనస్సుకి కాస్త కష్టం తగ్గించినట్టవుతుంది"

"న్యాయమైన మాటండి క్యాప్టన్‌గారూ మీరు చూపించే ఆదరం ఉత్తములైనవారు చూపించేది పూనాలో ఉండేరోజుల్లో నేను మిమ్మల్ని మళ్ళీ చూడొచ్చు కదా? ఇన్ని కష్ట సుఖాలను చవిచూసినవాళ్ళ మీరు ఈ పరిచయం ఇంతటితో ఎందుకు ఆగిపోవాలి?"

"ఒప్పుకొన్నాను నేను మిమ్మల్ని కలుసుకొంటాను"

"సంతోషం మీ కిష్టమైన విందును ఇవ్వాలని నా కోరిక దీనికి అనుకూలమైన స్థలం మా క్లబ్బులోనే మీరక్కడికి వస్తే చాలమంచింది

నాతోపాటు మరికొంతమంది ఉంటారు, వాళ్ళను కూడ మీరు చూడొచ్చును మీలాంటి పెద్ద మనుషుల్ని చూడడం వాళ్ళకు కూడ ఆనందాన్ని కల్గించే విషయం "

"తప్పకుండా నండి"

నేను క్యాప్టన్‌గారికి మాయింటి చిరునామా, ఆఫీసు చిరునామా ఇచ్చి మా క్లబ్ ఉన్న ప్రదేశం గుర్తుల్ని వివరించాను మా రైలు పూనాకు మధ్య రాత్రి చేరింది అక్కడ ఒకరి కొకరు నమస్కారం చెప్పుకొని మేము వెళ్ళాల్సిన మా స్థలాలకు బయల్దేరాము

బయల్దేరేముందు నేను చివరి సారిగా "మీరు తప్పకుండా కలుసుకోవాలి క్యాప్టెన్‌గారు" అన్నాను. ఆయన తప్పకుండా కలుసు కొంటాను" అన్నాడు అలాగయితే "రేపుకాదు, ఎల్లుండి వస్తారా?"

"వస్తానండి"

## 2

మూడో రోజు అతను వచ్చే సమయానికి ఆయనకు రుచించే మంచి ఫలహారం ఇవ్వాలి, సంవత్సరమంతా నీళ్ళ మీద తేలుతూ, ఎండిన రొట్టె కొరుక్కుతినే కష్టజీవి, నేల మీద నడచే రోజుల్లో అయినా మంచి భోజనం చేయనీ, అని నేను మాక్లబ్బు బట్లరుకు చెప్పి ఆయన ఫలహారానికని రెండు మంచి పదార్థాలను చేయించాను సాయంకాలమంతా వేచి కూర్చున్నా క్యాప్టన్ రాలేడు ఇకరారని భావించి బట్లరుకు ఫలహారానికి ఖర్చయిన డబ్బునిచ్చి, దాన్ని నీయిష్టం వచ్చినట్టు వాడుకో అని చెప్పి నేను ఇంటికి తిరిగి వచ్చేశాను

ఆ మరుసటి రోజు గడిచింది మరుసటి రోజు మరుసటి రోజుకూడ గడిచింది. క్యాప్టన్ గారి జాడలేదు ఏమయి ఉంటాడోనన్న సందేహం నాకు కలిగింది రఃయనకి కానివాళ్ళు ఆయన్ని మళ్ళీ నీళ్ళ మీదికో లేక మరో ఊరికో పంపించివేశారా? లేదా ఆయన భార్య మరెక్కడికైనా వెళ్ళి ఉంటే రఃయన కూడా ఆమెకోసం అక్కడికి వెళ్ళాల్సి వచ్చిందా? కారణం ఏదైనా

ఉండని, నేను రావడానికి వీలుకాదని ఆయన నాకొక ఉత్తరం రాసి ఉండాల్సింది.

ఎందుకో ఆయన రాలేదు ఎందుకు రాలేదని తెలుసుకోవడానికి వలనుకాలేదు. అందువల్ల నేనా విషయాన్ని ఆలోచించడం మానేసాను

## 3

ఐదో రోజు నేను నా ఆఫీసు నుంచి తిరిగి వస్తున్నాను ఇంటికి సగం దారి వచ్చేటప్పటికి కాస్తదూరంలో ఎదురుగా ఆయనలాగానే ఉన్న ఒక వ్యక్తి నడచుకొని వస్తున్నట్టు గమనించాను ఆయనే ఉండొచ్చుననుకొనే లోపుగా ఆయనే అనేది నిర్ధారణ అయింది కారునిలిపి, క్రిందికి దిగి నేను క్యాప్టన్ దగ్గరికి వెళ్ళాను

"నమస్కారం, క్యాప్టన్‌గారూ"

క్యాప్టన్ తలెత్తి చూశాడు. అరక్షణం ఆయనకి నేను గుర్తు దొరికినట్టు లేదు; అయితే ఇది అరక్షణం మాత్రమే, అదయిన క్షణయే ఆయన "మీరా నండి? నమస్కారం" అన్నారు

"అవునునేనే. వస్తానన్న మీరు రాలేదు ఏదో అనానుకూలమయిందని నేననుకొన్నాను అందరూ క్షేమమేకదా?"

ఈ ప్రశ్న సామాన్యంగా అడగాల్సిందే అయితే ఇప్పుడు నేనా ప్రశ్నని కేవలం మర్యాదకోసం అడగలేదు క్యాప్టన్ మహాశయుని మొహం మీద ఏదో దుఃఖఛాయలు కన్పట్టం వల్ల అడిగాను

"లేదండి, క్షేమమని చెప్పలేను. ఆ కారణం చేతనే నేను రాలేకపోయాను"

"మీ గృహిణి సుఖంగా ఉన్నారు కదా? ఆ మాత్రం చెప్పండి తక్కిన విషయాలు నాకవసరం లేదు"

"అయ్యా, నా వల్ల మీ మనస్సుకు నొప్పి కలగకూడదనే ఉద్దేశంతో నేను దూరంగా ఉండిపోయాను అయితే మళ్ళీ రెండు రోజులు ఆలోచించిన

తర్వాత, మిమ్మల్ని చూడాలా వద్దా అన్న విషయాన్ని దేవుడికి వదలిపెట్టెయ్యాలనిపించింది అందువల్ల రః రోజు రః దారి వెంబడి వచ్చాను. మిమ్మల్ని చూసేలా చేశాడు దేవుడు అందువల్ల నాగురించి ఇంత ఆసక్తి చూపిస్తున్న మీతో అన్ని సంగతులు చెప్పాలనివుంది నాక్కాస్త సమయం వెచ్చించగలరా?"

"తప్పకుండా క్యాప్టన్, క్లబ్బుకు వెళ్దామా?"

"వెళ్దాం"

క్లబ్బుకు వెళ్ళి ఒక చెట్టు క్రింద రెండు కుర్చీలు వేయించి కూర్చోని, క్యాప్టెన్‌గారికి కాస్త తినుబండారం, విస్కీ-సోడా, నాక్కాస్త పళ్ళ రసం తెమ్మని ఆర్డరిచ్చాను

విస్కీని కొంచెం కొంచెం సేవిస్తూ క్యాప్టన్ అన్నారు "మీరు బాగా తెలిసినవారు, జీవితం గురించి ఎరిగినవారు అని నేనారోజు అన్న మాటలు మీకు జ్ఞాపకం ఉన్నాయా? మనం రైల్లో వస్తూ ఉన్నప్పుడే నాకిది అవగతమైంది, అయితే మీరెంత బుద్ధిమంతులు, జీవితాన్ని ఎంతగా చదివినవారు, అన్న విషయం నా అనుభవానికి వచ్చింది, ఆ మరుసటి రోజు మాత్రమే"

"ఎలా?"

"ఆ రాత్రి నేను అతిథి గృహంలో ఉండి మరుసటి రోజు సిద్ధమై నేను వచ్చానన్న వార్తని భార్యకు చెప్పి పంపాను ఆమె నేను వ్రాసిపెట్టుకొన్న చిరునామాలో లేదు ఆస్పత్రిలో ఉంది"

"అయ్యో! చాల అనారోగ్యంతోనా?"

"అవునండి చెప్పడం మరచాను ప్రసూతి ఆస్పత్రిలో"

"అలాగా"

క్యాప్టన్ మహాశయుడు ఇష్టం లేకనే ప్రయత్న పూర్వకంగా మాట్లాడుతున్నాడు ప్రసూతి ఆస్పత్రి అనగానే నా ప్రాణం కలుక్కుమంది అయితే నేను

కంగారు పడ్డట్టు పైకి కన్పించ నివ్వలేదు

"మగ వారికెలాగో అలాగే స్త్రీకి కూడ ఒంటరి జీవితం చాల కష్ట తరమని మీరు ఆరోజు సెలవిచ్చారు"

"ఆ విషయంలో సందేహం లేదు"

"నీళ్ళ మీద నౌకలో భర్త ఆకలితో ఉన్నట్టుగా! ఆకలిగొన్న ఒంటరి మగవాళ్ళు నేలమీద ఆమె చుట్టు నిలబడితే ఆమెస్థితి ఆ భర్త స్థితికంటే ఎక్కువ అపాయకరమైన పరిస్థితికి దారి తీస్తుంది"

"ఇది సత్యమని నేను చెప్పగలను"

"నాకప్పుడు తెలియలేదండి ఈ మూడు రోజుల్లో తెలిసింది నాతోటి ఇద్దరు ముగ్గురు అధికారులు క్రిందటి సారి నేను తీరం చేరగానే ప్రయత్న పూర్వకంగా నన్ను మళ్ళీ ఒక వారం రోజుల లోగానే నీళ్ళ మీదికి పంపించారు ఈ అధికారుల్లో ఒకడివల్ల నా భార్య కష్టాలకు గురయింది"

"క్యాప్టన్ గారూ, మీ పట్ల నాకు చాల సానుభూతి కలుగుతోంది"

"అయ్యో, మీది విశాలమైన మనసు"

ఇలా అంటూ క్యాప్టన్ రెండు క్షణాలు మౌనంగా కూర్చున్నాడు నేను, "ఈ మాటల్ని చెప్పడం మీకు కష్టంగా ఉంది ఇప్పుడింత మాత్రం చాలు మరో విషయం గురించి మాట్లాడుకుందాం" అన్నాను

"ఒక సలహా చెప్తాను, అయితే మొహమాటం వద్దు ప్రారంభించడమైంది, ముగించేస్తాను మనసు నుంచి బరువుదించినట్టవుతుంది"

"మీ యిష్టం అయితే ఇలా మాట్లాడడం వల్ల మీ మనసుకు బాధ కలుగుతుందేమో"

ఓహో, బాధ మాట అలావుండని, ఆ నిర్భాగ్యురాలు నాగతేమిటని బాధపడుతుంటే నా నౌక మీద బాంబ్ పడిందన్న వార్తని చదివింది ఈ దుర్వార్త విన్న వెంటనే అకాల ప్రసవమైంది. ఆమె బ్రతికి బయట పడడమే ఎక్కువ పుట్టిన బిడ్డ ఒక గంటలోగానే కన్ను మూసింది"

"ఇప్పుడిక ప్రాణం భయంలేదుకదా?"

లేదనిపిస్తుందండి అయితే ఆమె, ఇక మేమిద్దరం భార్యభర్తల్లాగా కాపురం చేయడం సాధ్యమా అన్న విషయంలో సందేహిస్తోంది"

"అలాగా"

"నేను ఆస్పత్రికి వెళ్ళి తనని చూడాల్సిందిగా ఆమె పదే పదే ఒత్తిడి చేసి చెప్పి పంపించింది వెళ్ళి పడక ప్రక్కన నిల్చున్న నాతో హ్యారి, నేను నీ విషయంలో తప్పుగా ప్రవర్తించాను, మన్నించు, అంది నేను మౌనంగా ఉన్నాను ఆమె, 'చెప్తే నమ్మడం కష్టం, అయితే సత్యమని ప్రమాణం చేస్తాతను, నేను సదా నీ మీదనే అనురక్తురాలుగా ఉన్నాను, అయితే ఇప్పుడు ఏమి చెప్పినా ఏమీ ప్రయోజనం, నన్ను మన్నించి మళ్ళీ చేరదీసుకో అని నేను చెప్పడంలేదు, నా నడత సరిగా లేదని తెలిసి విడాకులు తీసుకొని, నాకంటే మంచి స్త్రీని పెళ్ళాడు" అంది ఈ స్త్రీ విషయంలో నాకు చాల జాలి కలిగిందండి. ఈమెకు ఏం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు. ఆమె, హ్యారి, వెనుకటి ప్రేమ చిహ్నంగా నాకు ఒకే ఒక ముద్దివ్వు, ముద్దిచ్చి వెళ్ళిపో', ఈ దాంపత్యం ఇంతటితో ముగియని, అంది"

క్యాప్టన్ చాలసేపు మౌనంగా కూర్చున్నాడు ఆ తర్వాత అన్నాడు "నాకు చాల అసహ్యం వేసిందండి ఎలా నడచుకోవాలో నాకు తోచలేదు ముద్దివ్వమని అడిగింది సరే నాకు ముద్దిచ్చే మనస్సులేదు ఈమె విషయంలో నాలో కనికరం పొంగి పొరలింది అయితే దాన్ని అణచి పెట్టుకొనే రీతిలో, నేను ఇంత చులకనయ్యానా అన్న ఆగ్రహం నాలో అధికమైంది ఆమె విన్నపం నా చెవిని పడలేదన్నట్టుగా మౌనం వహించి నేను, నీకు త్వరగా ఆరోగ్యం చేకూరని, నెల్, మళ్ళీ మాట్లాడుకుందాం, అని చెప్పి బయల్దేరాను"

"అది సరే క్యాప్టన్, మీ మనసుకు చాల బాధ కలిగినట్టుంది వట్టి మాటలతో సమాధానం చెప్పడం నాకిష్టం లేదు ఎలాంటి కష్టంవచ్చినా సహించు కోవాలన్న విషయం మీకు తెలుసు"

"సహించుకొంటున్నానండి, ఏంచెయ్యాలో నిర్ణయించుకోలేక నాలుగరోజులు తికమకపడ్డాను ఒక గంట క్రితం విషయం తెలియగానే నేను మీ దగ్గరికి వచ్చి మీ సలహా తీసుకొని ఉండడం బాగుండేదని పించింది"

"అలాగయితే నేను మీకు ఎదురుగా వచ్చింది మంచిదయింది"

"తప్పకుండానండి, ఆ విషయంలో సందేహం లేదు"

"నేనెలా మీకు సహాయపడగలనో చెప్పండి"

"నేనేం చేస్తే బాగుంటుందని మీకనిపిస్తుంది?"

"అలా కాదు మీకేం చెయ్యాలనిపిస్తుందో దాన్ని నాకు చెప్పండి అలా చేస్తే బాగుంటుందేమో ఆలోచిద్దాం"

"చులకనయ్యానన్న కోపం ఇంకా నా మనస్సులో పై చేయిగానే ఉందండి అయితే ఈ బుద్ధితో నిర్ణయానికి రావడం సరికాదని లోపల ఏదో హెచ్చరిస్తోంది అందువల్లే నేను ఇక్కడికి వచ్చింది జరిగిన సంగతిని నెమ్మదిగా ఆలోచించి వివేకంతో నిశ్చయించే పెద్దలు మీరేం చేయమంటారో, నాకు తెలియాలి"

"క్యాప్టన్‌గారూ, మరొకరు కష్టాల్లో చిక్కుకొన్నప్పుడు వివేకంతో వ్యవహరించడం పెద్ద పనికాదు. మీకు జరిగిన విధంగానే నా జీవితంలో జరిగి ఉంటే నేను మీలా వ్యవహరించి ఉండేవాణ్ణని చెప్పలేను మా దేశీయుల్ని మీ యిష్టం వచ్చినట్టు పొగడండి, ఈ విషయంలో ఈ దేశంలోని మేము పాశ్చాత్యులయిన మీకంటే చాల కఠిన హృదయులం"

"అది సాధ్యమేనండి"

"నిర్ణయం తీసుకోవంలో ఆగ్రహానికి లోనుకాకూడదన్న సిద్ధాంతం నాకు పూర్తిగా సమ్మతం మీ కనికరం, దయ, మీరెంత మంచి వాళ్ళో చెప్తుంది దాంతో పాటు అవి మరొక సంగతిని కూడ చెప్తాయి కదా? మీ గృహిణి చాల ఏళ్ళు అత్యంత పతివ్రతా మూర్తిగా ప్రవర్తించారు"

"నిజమేనండి"

మగవాడు కేవలం మగవాడులా ప్రవర్తించక, ఒక మనిషిగా ఆలోచిస్తే, ఒక స్త్రీ చేసిన తప్పు ఒక మగవాడు చెసిన తప్పుకంటే అధికం కాదు నేను క్రిశ్చియన్ కాదు, అయినా తప్పుగా ప్రవర్తించిందని ఒక స్త్రీని తీసుకు వచ్చి ఎదుట నిల్చితే క్రీస్తుగురువు ఇచ్చిన ఉపదేశం గొప్ప ఉపదేశం అనినాకు ఎల్లవేళలా అనిపిస్తుంది"

"సరేనండి, అయితే మీరనడం నేను నా బార్యని "

"అవును అది నా అభిప్రాయం"

"మంచిదండి, రేపు ఉదయం ఆస్పత్రికి వెళ్ళి, ఎప్పటిలాగానే జీవిద్దామని నా భార్యతో చెప్తాను"

"చెప్పండి, క్యాప్టన్ ఇంతకు ముందు మీరు పెద్దమనుష్యులుగా బ్రతికారు ఈ మాటను చెప్పి ఆ పెద్దతనానికి కిరీటం పెడతారు"

"మీ వల్ల నాకు చాల మంచి జరిగిందండి"

## 4

ఇది జరిగిన నాలుగు వారాలకు నాకు బొంబాయినుంచి క్యాప్టన్ మహాశయుడు రాసిన ఒక ఉత్తరం వచ్చింది క్యాప్టన్ నెలరోజులపాటు బొంబాయిలో ఉన్నారట ఆయన భార్య ఈ మధ్య బొంబాయిలో ఉన్నారట "మేము పూనాకు వెను తిరిగి వచ్చిన తర్వాత తప్పకుండా మిమ్మల్ని కలుస్తాము" అని క్యాప్టన్ ఆ ఉత్తరంలో వ్రాశాడు

నేను మళ్ళీ ఆయన్ని చూడలేదు

# కాకిలోకం

నూతన వసంతంనాటి ఉదయం, అందమంటే అది అందం రాత్రి కాస్త జోరుగానే వర్షం పడ్డ మూలంగా ఉదయం చల్లగా ఉంది గాలి బాగా ఆహ్లాదాన్ని కల్గిస్తోంది పగలు జున్ను పాలలా ఉంది నేను నాగదిలో కిటికీ దగ్గర కూర్చుని ఒక పుస్తకం తెరచి, ఒక క్షణం చదువుతూ, రెండు క్షణాలు బయటికి చూస్తూ ఇలా ఆనందంగా కాలం గడుపుతున్నాను

మా యింటి ముందున్న కాస్త నేలలో నాలుగు చెట్లున్నాయి అందులో ఒకటి అశోక వృక్షం కాస్త పొడుగ్గా ఉన్న కొమ్మ మీద ఉడుత కూర్చుని రఃలవేస్తున్నట్టుగా అరుస్తోంది ఉడుత చేస్తున్న రః ధ్వని నాకు బాగా పరిచయం అయినా ఉదయకాంతి చాల అందంగా ఉండడంవల్ల రః స్వరం కూడ చెవికి బాగా ఇంపుగా ఉంది ఆ ప్రాణి అలా అరచినప్పుడల్లా తోక కదలుతూ ఉండడం నేను కూర్చున్న చోటుకి స్పష్టంగా కన్పిస్తోంది

క్షణం సేపు ఉడుతను చూసి నేను మళ్ళీ పుస్తకం వైపు కళ్ళు త్రిప్పాను ఆ సమయానికి సరిగ్గా అశోక వృక్షం మీద మరో వైపునుంచి ఒక పక్షి స్వరం ఇంపుగా విన్పించింది ఆ స్వరాన్ని అంతకు ముందెప్పుడూ నేను వినలేదు ఏదో కొత్త స్వరంలా అనిపించింది గానం మృదువుగా, ఇంపుగా ఉంది అందులో ఐదారు స్వరాలు ఒకదానితో ఒకటి అతుక్కొన్న రీతిలో అందంగా ఉన్నాయి నాకు ఆశ్చర్యం వేసింది నాకు యాభైఏళ్ళకుపైగా ఉన్నాయి, అయినా మాయింటి చెట్టు మీదికి వచ్చే రః పక్షిధ్వని ఇంతకు ముందెప్పుడూ నా చెవిని పడలేదే! ఇందుకేమనాలి!

పక్షిని చూద్దామని నేను స్వరం వస్తున్న వైపు దృష్టి సారించాను పక్షి

కన్పించలేదు స్వరం మళ్ళీ విన్పించింది ఆ స్వరం ఇదే స్థలంనుంచి వస్తున్నదని తెలిసింది అయితే అక్కడ తదేకంగా చూశాను కాని గాయకుడు కన్పించలేదు

అదే సమయానికి మా ఆవిడ ఎందుకో నాగదిలోకి వచ్చింది నేనామెకి ఆ పక్షి విషయం తెలిపాను, దాని గానం ఎంతో ఇంపుగా ఉంటుందని చెప్పాను ఆమె, "అవును, ఆ పక్షి ఇక్కడికి క్రిందటి సంవత్సరమే వచ్చింది ఈ మారు మళ్ళీ వచ్చింది మరి చిన్న పిట్టంటే చిన్న పిట్ట బాగా అందంగా ఉంది" అన్నది

నేను, "అది ఇప్పుడు ఆ ఆకుల మధ్య ఉంది చూద్దామంటే కన్పించడం లేదు" అంటూ చెట్టుకు ఒక వైపు వేలు చూపించాను.

మాయింటావిడ, "అవును, అది కన్పించడం లేదు ఆకులో ఆకై కలసిపో యి ఉంటుంది" అని చెప్పి నా ప్రక్కన నిల్చుని నేను చూపించిన వైపు తదేకంగా చూసింది

క్షణం తర్వాత, "అదిగో, అక్కడే ఉంది మనకు అటువైపుగా కూర్చుంది ఆ చిన్న కొమ్మ చివర్లో, పచ్చగా ఉన్న చోట తెల్లగా కన్పిస్తోంది కదా! అదిగో దానిమీద" అంది

అవును! అది అక్కడ కూర్చుంది ఆమె చూపించకనే దాన్ని గుర్తించి చూసేంతటి చూపు నాకు లేదంతే అదేమిటి నిజంగా అది ఒక పక్షి అనేంత పరిమాణం ఉన్న ప్రాణికాదు పేరుకు ఒకపక్షి సృష్టిలో ఇదెంత విచిత్రమైన ప్రాణి ఈ ప్రాణి ఒక పరిపూర్ణమైన పక్షి అయినా దానిమొత్తం పరిమాణం నా చేతి బొటన వ్రేలికంటె ఎక్కువగా లేదు చుట్టూ ఆకులు, వాటి మధ్య ఇదొక ఆకు పరికించి చూస్తే మాత్రం అదొక సుందరమైన, పేరులేని, ఏదో ఓ రకపు రంగున్న ఆకుమీద, కేసరి బంగారు, నీలం రంగున్న గీతలు ప్రక్క ప్రక్కగా ప్రకాశిస్తుండం కన్పించింది

నేను, "దీన్నేమని పిలుస్తారు" అన్నాను మా ఆవిడ, "నాకు తెలిదు" అంది

ఆమెకేమిటి, నిజంగా ఎవరికీ తెలిదు మనం కాకికి పేరుపెట్టాం, చిలుకకు పేరు పెట్టాం, కోకిలకు, గోరువంకకూ ఒక్కొక్కదానికి ఒక్కొక్క పేరు పెట్టాము పక్షి జాతిని గురించిన మన ఆసక్తి ఇంతకంటే హద్దు దాటలేదు మన దృష్టికి రాని పక్షి అందంగా ఉండొచ్చు, ఇంపుగా పాడొచ్చు, అయినా వాటికి మన దృష్టిని ఆకర్షించే యోగ్యతరాదు

వసంతం నడుస్తున్న కొద్దీ ఈ చిన్ని పిట్ట మా చిన్న తోటకి మళ్ళీ మళ్ళీ రావడం కన్పించింది అది మళ్ళీ వచ్చేసరికి ఒకటిగా రాలేదు ఒక ఆడా, మగా జతగా వచ్చాయి ఈ ఆడా, మగా ఈ సంవత్సరం ఒకటిగా ఉండటానికి నిశ్చయించినట్టు కనిపించింది, తమ సంసార సుఖానికి మాయింటి ఆవరణం యోగ్యమైన స్థలమని ఎన్నుకొన్నట్టనిపించింది వీటి ఈ నిర్ణయంవల్ల నాకు సంతోషం కలిగింది

కొద్ది రోజులు గడిచాయి ఎన్ని వారాలు గడిచాయని నేను ఖచ్చితంగా చెప్పలేను ఒకరోజు మా ఆవిడ తోటలో నిల్చుని, "ఇక్కడికి వచ్చి ఈ పక్షి గూడును చూడకూడదా", అని నన్ను పిల్చింది పక్షిగూడు అనగానే సహజంగా చెట్టుమీద ఎక్కడో ఎత్తులో ఉందని నేను భావించాను నేను "పక్షి గూడును చూసి ఒరిగేదేమిటి" అన్నాను ఆమె, "వచ్చి చూస్తేగా తెలిసేది ఈ ప్రాణి తన పిల్లలకోసమని ఎలా సిద్ధం చేసిందో ఆ రోజు పాడింది కదా ఆ చిన్నారి, దానిగూడు, గోడ చెంత రెండు డాలియా చెట్ల కొమ్మలకి ఉయ్యాల కట్టింది" అంది.

నేను వెళ్ళి చూశాను గూడు చాల చిన్నది, ఒక పిడికెడంత ఉంది దాని బయటి భాగాన్ని పలచగా ఉన్నా, బిగువైన ఏదో నార్లతో అల్లినట్టుగా ఉంది అల్లిన రెండు నార్లతో అటూ, ఇటూ దాన్ని అక్కడ గోడ ప్రక్కల్లో జతగా పెరిగిన రెండు డాలియా పూల చెట్ల మధ్య రెమ్మలకు కట్టింది గూటి లోపలి భాగంలో సున్నితమైన, మృదువైన, ప్రత్తి మెత్త ఉంది దానిమీద రెండు చిన్న గ్రుడ్లున్నాయి

గూటికి ఒక వైపు దాని నోరు, డాలియా చెట్టు ఆకులు రెండు దాన్ని మరుగు పరుస్తున్నాయి

గూడు అంతగా భద్రమైందేమీ కాదు అయినా అది ఎండకూ, గాలికీ గ్రుడ్లకీ మాత్రం హాని కలుగకుండా కాపాడడానికి యోగ్యంగా ఉంది నేలకు చాల దగ్గర్లో ఉండడంవల్ల, అది చాల భద్రంగా ఉందని చెప్పడానికి వీల్లేదు అయితె ఒక పక్షి ఇలా నేలకి ఇంత దగ్గర్లో గూడు కట్టిందని ఊహించడం అసాధ్యం అందువల్ల దాని నెల తగినంత సురక్షితమైందనె చెప్పొచ్చు

గూడు ఇక్కడ ఉందని ఒక పిల్లికి కాస్త తెలిసినా గ్రుడ్ల కథ ముగిసినట్టే! అయితే పక్షులు ఈ అపాయాన్ని లెక్కించక పో వడానికి కారణం ఉండాలి చెప్పుకో దగినంత భద్రంగా లేని ఈ గూడు మరెక్కడో ఉండడంకంటె ఇక్కడ ఉండడమే క్షేమమని పించింది అశోక వృక్షంమీదనో, పనసచెట్టు మీదనో, సంపెంగ చెట్టు మీదనో ఎత్తులో గూడుకట్టి ఉంటే దానికి గాలివల్ల ఎక్కువ అపాయం ఉండేది దానికి తోడు కోతుల గుంపు దాన్ని పెరికి పారవేసే అపాయం మరింత అధికంగా ఉండేది మా యీ చెట్లమీద కాకులు గూళ్ళు కడతాయి రెండు మూడు వారాల కొకసారి కోతులగుంపు వచ్చినప్పుడు ఇక్కడ జరిగే రభస ఇంతంతకాదు ఆ దాడిలో బయల్దేరే అరుపులు, కేకలు, కలవరం, చెప్ప శక్యం కాదు

మా చిన్నారి పక్షి గూటికి ఇలాంటి అపాయమేది లేదు

ఇదయిన కొద్ది రోజుల తర్వాత మా ఆవిడ నాతో, గూటిలోని రెండు గ్రుడ్లలో ఒకటి ఎలాగో జారి క్రిందపడి పగిలిపో యిందని, మరో గ్రుడ్డు జాగ్రత్తగా ఉందని చెప్పింది

తండ్రిపక్షి, తల్లి పక్షి గూటికి కాసేపయినా వచ్చిపో తుండేవి అయితే అవి వచ్చిపో యె వెళలు మాకు తెలిసేవి కాదు పైగా అవి రెండూ జతగా రావడం మాకెప్పుడూ కనపడలేదు తండ్రికాని, తల్లికాని ఒక్కొక్కమారు వచ్చి అశోక వృక్షం మీద ఒక కొమ్మమీద కూర్చొని గూటివైపు చూస్తుండడం అప్పుడప్పుడు కన్పిస్తుండేది

వసంత కాలారంభంలో చాల ఇంపుగా పాడిన పక్షి ఈ రోజుల్లో పాడినట్టుగా మాకు విన్పించలేదు

మళ్ళీ కొద్దిరోజులు గడిచాయి ఎన్ని రోజులని నేను చెప్పలేను ఒక రోజు మధ్యాహ్నం నేను గదిలో పడుకొన్ని సమయంలో మా చుట్టు వున్నా కాకులు భయంకరమైన కోలాహలం చేస్తుండడం నాకు విన్పించింది మాయింటి పనస చెట్టు మీద ఒక కాకి గూడు కట్టింది ఆ కారణం చేత పదిహేను, ఇరవై రోజులుగా అక్కడ దాని దర్బారు అంత ఇంతా కాదు పనస మొక్కని నాటిని వాళ్ళము మేము, పెంచిన వాళ్ళము మేము, అయినా మేము దాని దగ్గరికి వెళ్ళడాన్ని ఆ కాకి సహించేది కాదు వెలలేని తన గ్రుడ్డునో తోడులేని తన పిల్లనో ఏమైనా చేయడానికినే మేము అక్కడ తిరుగుతుంటామని ఆ ప్రాణి ఊహ ఆ పదిహేను రోజుల్లో ఒకరోజు నేను ఆ పనస చెట్టు క్రిందున్న బండమీద కూర్చొని ఉంటే, కాకి ఎగిరొచ్చి నా తలమీద తన్ని పారిపోయింది

"ఆ చెట్టు మీద నా గూడుంది, ఆ గూట్లో నా గ్రుడ్లున్నాయి ఆ చెట్టు దగ్గరికి రావడానికి నాకు తప్ప మరొకరికి ఏ అధికారం ఉంది?"

ఆ రోజు మధ్యాహ్నం కాకులు లేపిన ఆ భయంకర కోలాహలాన్ని నేను విని "పనస చెట్టు దగ్గరికి కోతుల గుంపు వస్తున్నాయొ" నని అనుకొన్నాను. నేను లేచి వెళ్ళి చూడలేదు

కోలాహలం అధికమైంది చుట్టు ప్రక్కలనుంచి వచ్చిన కాకులు ఒక సైన్యంలా చేరి తమ కర్ణకఠోర కర్కశ ధ్వనులతో భీకర ఘోష చేస్తున్నాయి ఆ ఘోషలో క్షోభ, క్రోధం, ద్వేషం నిండి కన్పిస్తోంది

చెవులు చిల్లులు పడే ఆ ఘోష ఎంత సేపయినా నిలిచిపోక కొనసాగుతూ ఉండడం వల్ల నేను సంగతేమిటని చూడడానికి పడకమీదనుంచి లేచి పడసాలలోకి వచ్చాను

పనస చెట్టు కొమ్మమీదినుంచి ఒక కాకి, మా యింటి బయటివైపు గోడకు అటుప్రక్క నేలమీద ఒక వైపుకు జోరుగా ఎగిరింది కావు కావు మంటూ అరుస్తూ, అక్కడ దేన్నో ముక్కుతో పొడిచి, ఇటు సంపంగి చెట్టు మీదికి ఎగిరొచ్చింది క్షణం తర్వాత ఇంకో కాకి సంపంగి చెట్టు మీది నుంచి అదే విధంగా, అదే చోటుకి ఎగిరింది, అదే విధంగా పొడిచింది, అదే విధంగా

అరిచింది ఎగిరి మరో వైపుకి వెళ్ళి కూర్చుంది తక్కిన కాకులూ చుట్టూ ఉన్న చెట్ల మీద కూర్చొని తమ కూతలతో వీటికి మేళం సమకూర్చాయి

నేలకి ఎగిరిన కాకులు దేన్ని పొడిచాయి? ఇది నాకు తెలియలేదు ఏమిటీ ఇవెందుకిలా అరుస్తూ విసుగు పుట్టిస్తున్నాయని నేను చుట్టూ కలయ జూశాను ఎదురింటి సంపంగి చెట్టు మీది ఒక కొమ్మ మీద మారెండు చిన్నారి పక్షులు రెండూ కూర్చొని ఉండడం కన్పించింది అవి ఆ కాకులు పొడిచిన నేల వైపు చూస్తున్నట్టు నాకనిపించింది

ఆ సమయానికి మా ఆవిడ ఇంట్లోంచి బయటికి వచ్చింది, చెట్ల దగ్గరికి వెళ్ళి కాకుల్ని బెదరించి తరిమింది గోడమీద ఒరిగి అవి ఎగిరి పొడిచిన స్థలాన్ని చూసింది

పడసాలనుంచి నేనామెను "ఏమిటది" అని అడిగాను

ఆమె "చిన్న పక్షి పిల్ల, కాకులు దాన్ని చంపేశాయి" అంది

పసికూన రెక్కలొచ్చాయి ఎగిరి చూద్దామని బయటికి వచ్చిందేమో? తల్లి తండ్రి దాన్ని రమ్మని బయటికి పిలిచాయేమిటో? సంగతేమిటి మరి? ఇలాంటి ప్రయత్నం అపాయకరమనే విషయం పక్షి పిల్లకు తెలియకపో వచ్చు. పెద్దవైన తల్లి దండ్రులకి తెలిసుండాలి కదా!

నాకు భరించరాని దుఃఖం నోరు మెదపడానికి కాలేదు అలాగే కాకుల మీద పట్టరాని కోపం నేను చిన్నవాడినయివుంటే బహుశః పనస చెట్టెక్కి ఆ కాకి గూటిని ధ్వంసం చేసి, గ్రుడ్లను పారేసి, పగ తీర్చుకొని వుండేవాణ్ణి

పాపిష్ట జంతువులా! రః చిన్ని పక్షి చిన్నారిని ఈః పిశాచాలు చంపాల్సిన అవసరం ఏమొచ్చింది? తమ ధ్వనిలాగా కఠోరం కాని ధ్వని, లోకంలో ఉండడం వద్దంటున్నాయా ఏమిటివి!

తమకంటే గుణవంతుడంటే మనుషులకి వాడిమీద ద్వేషం పక్షుల కూడ మనుష్యులలాగా ఉండవచ్చును

నీకు పుణ్యం ఉంటుంది పాడవద్దు, కావుకావు మనే కేకవాలు విజయం వేగానికీ, శక్తికీ లభిస్తుంది, మరో గుణం అవసరం లేదు పాట పాడే చిన్నారి పక్షికి లోకంలో స్థానం లేదు స్థానం ఏదయినా ఉంటే అది కాకులకు మాత్రం పరిమితం కాస్త మిగిలితే అది కోతులకు అవసరం

ఇలా మనసులో చేదును మింగుతూ నేను ఎదురింటి సంపెంగ చెట్టు వైపు తిరిగి చూశాను చిన్నారిపక్షి తల్లి, తండ్రి కూర్చొన్న చోటే కూర్చొని ఉన్నాయి వాటి కళ్ళు నేల మీద తమ పసికందు చచ్చిపడ్డ స్థలాన్నే చూస్తున్నాయి ఆ చూపుల్లో నిరాశ చోటు చేసుకొంది అవి దుఃఖతప్త హృదయంతో శూన్యంలో మునిగి పోయాయి

మా ఆవిడ ఈలోగా కళ్ళు తుడుచుకొంటూ ఇంట్లోకి వెళ్ళింది నాక్కూడా ఏడవాలనిపించింది పక్షుల నిరాశ, హృదయ శూన్యత, నా జీవితాన్ని, నా హృదయాన్ని ఆవరించింది

# నాలుగో అధ్యాయం

నా ఆప్తులైన శ్రీ నిరంజన్, శ్రీ కస్తూరి, సౌభాగ్యవతి, వాణి తమ ఒక్కొక్క అధ్యాయంలోనూ మొత్తం కధని చెప్పారు ఇది చివరి అధ్యాయం

విశ్వనాధయ్య రిటైర్డు శిరస్తదారు ఆయన భార్య సావిత్రమ్మ కొడుకు ప్రసాద్ దామోదర్ లోయలో కొత్తగా ఉద్యోగంలో చేరాడు కూతురు గిరిజ బి ఏ, పాసయింది, పెళ్ళికి ఎదురుచూస్తోంది తండ్రి, ప్రసాద్‌ని ఇటువైపు పిలిపించుకొని అతనికి పెళ్ళి వేయాలని, కూతురుకు ఒక పెళ్ళి కొడుకును వెదకాలని, అనుకుంటున్న సమయంలో ప్రసాద్ తాను రేవా అనే పంజాబీ అమ్మాయిని ఇష్టపడినట్టుగా చెల్లెలికి ఉత్తరం వ్రాశాడు ఈ సంబంధాన్ని తప్పించాలని తల్లిదండ్రుల ప్రయత్నం గిరిజా స్నేహితురాలు మీనాక్షి చాల అందంగా ఉంటుంది ఈమెని తనకొడుక్కి చేసుకుంటే బాగుంటుందని విశ్వనాధయ్యగారి ఆలోచన

చదువు ముగించి పనిలో చేరిన కొడుకు ప్రసాద్, తండ్రి రిటైర్డు కాగానే తాను సంసార బాధ్యతల్ని చేపట్టాల్సినవాడు, పెళ్ళికాని చెల్లికి ఉత్తరం వ్రాస్తూ, తాను పెళ్ళి చేసుకొనే ఉద్దేశాన్ని తెలిపాడే తప్ప, తన ఎత్తు పెరిగి పెళ్ళీడుకువచ్చిన చెల్లికి ఒక వరుణ్ణి చూసే మాట మాత్రం ప్రస్తావించలేదు, ఇది ఇతని కర్తవ్యం కాదా? విశ్వనాధయ్యగారి తలలో ఈ ప్రశ్న సహజంగానే తలెత్తింది

తల్లి మనస్సులో, కొడుకుకు అతడు కోరుకున్న అమ్మాయి కోడల వుతుందన్న సంతోషంతోపాటు, ఆమె ఏదో దేశం అమ్మాయన్న కాస్త చింత కూడ ప్రవేశించింది

గిరిజ ఠః కాలం అమ్మాయే అయినా ఆమె తలలో కూడ ఒక ఆలోచన తళుక్కు మంది "అందరూ అంతే, తమ పని తాము చూసుకొంటారు ప్రసాద్ తనకోసం రేవాను చూసుకొన్నాడు నాకోసం ప్రసాద్ ఏ ఆలోచనా చేయలేదు కదా!"

ఆ రోజు సాయంకాలం విశ్వనాధయ్య కాయగూరలు తీసుకు రావడం కోసం మార్కెట్‌కు బయల్దేరారు గిరిజా వసారాలో కూర్చుని ఎప్పటిలాగానే నవల చదువుకుంటోంది ఎవరో వచ్చినట్టయి, తలుపుగుండా వస్తున్న వెలుతురు కనుమరుగైంది

గిరిజా కళ్ళెత్తి చూసింది పరిచయంలేని యువకుడు అధునాతన దుస్తులు ధరించిన కొత్తరకం వేషం కాల్గేట్ లేదా మ్యాక్లీన్ ఉపయోగించినట్టుగా ప్రకాశించే పళ్ళు దాని మీద ఆ వయస్సుకు అధికంగా పెరిగాయని చెప్పదగ్గ దట్టమైన మీసాలు

గిరిజ తల ఎత్తి చూసే సరికే యువకుడు నవ్వుతూ చూస్తున్నాడు అమ్మాయి తల ఎత్తగానే, "నమస్కారమమ్మా, ఇది విశ్వనాధయ్యగారి ఇల్లే కదా?" అని అడిగాడు

మంచి కంచు కంఠం గిరిజ లేచి నిలబడింది ఆప్యాయంగా చూస్తూ "అవును" అంది

"ఆయన ఇంట్లో లేనట్టనిపిస్తుంది"

"లేరు"

యువకుడు క్షణం సేపు నిలబడి వెనుతిరిగే ప్రయత్నం చేశాడు ఆలోగా సావిత్రమ్మ లోపల్నుంచి వచ్చారు. "ఎవరు కావాలట గిరిజా?" అని అడుగుతూ వచ్చి కూతురు చెంత నిల్చుంది

యువకుడు, "నేను ఇక్కడే Air Craft Factory లో ఉద్యోగంలో ఉన్నానమ్మా. నా పేరు శర్మ మా స్నేహితుడొకాయన ఠః ఇంటి యజమానిగారిని కలవవలసిందిగా నాకు పని అప్పగించారు అందుకని

వచ్చాను" అన్నాడు

గిరిజా, "మా నాన్నకు Air Craft లో అకౌంటెంట్, గికౌంటెంట్ పని దొరికిందేమో?" అని అడిగింది

ఆ ప్రశ్నకు సగం కారణం కుతూహలమయితే, వచ్చిన వ్యక్తిని ఆపాలన్న ఆశ మరో సగం కారణం

భర్తకు మరికొంత డబ్బు చేతికి వచ్చే యోగం ఉంటే ఎందుకు వద్దనాలి అనే ఆలోచనలో ఉన్న తల్లి "మార్కెట్టుకు వెళ్ళారు, ఆలస్యంకాదు, వచ్చేస్తారు, కూర్చొంటారా?" అని అడిగింది

యువకుడు కాస్త ఆలోచిస్తున్నట్టనిపించింది వెంటనే ఒక నిర్ణయానికి వచ్చి, "లేదు, మళ్ళీ వస్తాను" అని నమస్కారం చేసి వెనుదిరిగాడు

సావిత్రమ్మ, "పిల్లవాడెవరో బాగున్నాడు మనవాడయి ఒప్పుకుంటే, మీ నాన్న ఆ ఇల్లు అమ్మి అయినా పెళ్ళి చేస్తాడు జాతకంలో ఉండాలి కదా!" అంది

గిరిజ ఏమీ చెప్పలేదు ఆమెకు తల్లి అన్నమాటలు సరిగానే తోచాయి

విశ్వనాథయ్య మార్కెట్టునుండి రాగానే సావిత్రమ్మ యువకుడు ఆయనని వెతుక్కుని వచ్చిన విషయాన్ని చెప్పింది

"పేరు 'శర్మ' అని చెప్పాడా?"

"అవును"

"కన్నడం మాట్లాడాడా?"

"ఊ"

గిరిజ, "అయితే ఆ కన్నడం అదేదో పరసీమదన్నట్టుగా ఉంది నాన్న" అని మాటల్ని కలిపింది

విశ్వనాథయ్య,"Air Craft లో అన్ని ప్రాంతాలకు చెందిన వాళ్ళున్నారు 'శర్మ' పంజాబు నుంచి మదరాసుదాకా ఎక్కడైనా సరే విన్పించే పేరు పనిదొరికిందని వస్తారు, నాలుగు బాషలనా నేర్చుకుంటారు కన్నడం ఏమిటి, వాళ్ళ ఇంట్లో మాట్లాడే భాషని కూడా పరసీమ భాషగా చేసేస్తారు"అన్నారు

గిరిజకి ఈ మాటలేవి ముఖ్యంగా కనపడలేదు ఎదురెదురుగా నిల్చున్న ఆ కాసేపూ ఆ యువకుడు తనను అతి కుతూహలంతో చూస్తుండడం ఆమె గమనించింది అతని ఆ చూపు ఆమెకు రుచించింది అందువల్లో, లేదా దాని జ్ఞాపకం వల్లో ఆ సాయంకాలం ఆమెకు చాల బాగున్నట్టనిపించింది

తనకు నచ్చిన నవలలోని నాయకుడు ఈ నవ్వుముఖం యువకుడే అయితే ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు

పడుకోవడానికి ముందు తల్లి "మళ్ళీ వస్తానన్నాడు ఎప్పుడువస్తారని అడగాల్సి ఉండింది మరచిపోయాము వచ్చినప్పుడు ఇంట్లో లేకపోతే ఇబ్బందవుతుంది" అన్నారు

"పనివుంటే వస్తాడు" అన్నారు విశ్వనాథయ్య

"అదిసరే, అయినా ఉదయం ఇంట్లోనే ఉంటే మంచిదికదా"

"ఎవరో పొడుగయిన యువకుడు వచ్చాడని నన్ను ఒకరోజంతా ఇంట్లో బంధిస్తావా ఏమిటి?"

"బంధిస్తే తప్పేముంది? మనస్సుకు నచ్చిన భార్య, ఎదదాకా పెరిగిన కూతురు, దాంతోపాటు ఈ చెర ఎంత పుణ్యం చేసుండాలి?"

"నా పుణ్యానికేముంది? పుణ్యమంటే నీదే గుండెల దాకా పెరిగిన కూతురు! తల ఎత్తు పెరిగిన కొడుకు, ఆ కొడుకు ఈ కూతురి విషయం తలకు పట్టించుకోలేదు! దీనికంటే ఏదిపుణ్యం?"

అయినా మరసటి రోజు విశ్వనాథయ్య బయటికి ఎక్కడికీ వెళ్ళలేదు. సాయంకాలం వెనుకటి రోజు వచ్చిన అదే సమయానికి ఆ యువకుడు

వచ్చాడు అతనితో పాటు ఇంచు మించు అతన్నే పోలిన మరో యువకుడు

విశ్వనాథయ్యగారు వీళ్ళు రావడాన్ని దూరంనుంచె చూసి తలుపు దగ్గర నిలుచున్నాడు "నమస్కారం రండి నిన్న వచ్చారట కదా! నేను ఇంట్లో లేను" అన్నారు

యువకుడు, "అవును వచ్చాను, మరెదో పనిఉండడంవల్ల, వేచిఉండడానికి వీలులేక పోయింది నా పెరు శర్మ ఇక్కడ Air craft లో ఉన్నాను" అన్నాడు

"సంతోషం, లోపలికి రండి, కూర్చోండి మీ స్నేహితులనుకొంటాను"

"ఇతను నా కజిన్ ఈయనకూడ Air craft లోనే ఉన్నారు"

వసారాలో ఉన్న కుర్చీలమీద అందరూ కూర్చొన్న తర్వాత విశ్వనాథయ్య, కాస్త కాఫీ ఇస్తావా?" అని ఇంట్లో ఉన్న భార్యని అడిగారు సావిత్రమ్మ, 'తెస్తున్నా' అన్నారు

ఈలోగా మీనాక్షి గిరిజాని వెదుక్కొంటూ వచ్చింది వసారాలో కూర్చున్న మగవాళ్ళను చూసి కాస్త, అయితే ఈ కాలం అమ్మాయి కావడం వల్ల చాల స్వల్పంగా బిడియపడుతూ తల తగ్గించి లోపలికి వెళ్ళింది వయస్సు మళ్ళిన విశ్వనాథయ్యగారికే అందంగా కన్పించిన యువతి యువకులకు మరింత అందంగా కన్పించడంలో ఆశ్చర్యం లేదు.

క్షణం తర్వాత విశ్వనాథయ్య, "మమ్మల్ని చూడాల్సిన పని ఏముంది? నాకు మీ పరిచయం లేదు" అన్నారు

"నా పరిచయం మీకు లేకపోయినా మీకు మా తండ్రిగారి పరిచయముంది హొల్గెరి వెంకటరామయ్య మీతో పాటు చదువుకొన్నారట"

"అవును, ఆయన అబ్బాయా మీరు?"

"అవును, ఇక్కడ ఉద్యోగం దొరకలేదని మా తండ్రిగారు మొదట బొంబాయికి, అక్కడినుంచి పంజాబుకు వెళ్ళారు ఇక్కడి పేర్లు అక్కడ విచిత్రంగా కనపడడంవల్ల శర్మ అనే పేర్తో అక్కడే ఉద్యోగంలో స్థిరపడిపోయారు మేమూ అక్కడే పెరిగాము "

"అక్కడ పెరిగినవాళ్ళు కన్నడం బాగా మాట్లాడుతున్నారు కదా ?"

"ఇంట్లో మాత్రమే కన్నడం మీకు కాస్త విచిత్రంగా కన్పించవచ్చు అయితే తల్లిదండ్రులతో కన్నడంలోనే మాట్లాడి మా భాషను మేము నిలబెట్టుకొన్నాము"

"చాల సంతోషం, వెంకటరామయ్య, నేను అన్నదమ్ముల్లా పెరిగాము అయితే ఆయన పెద్ద అధికారి అయ్యారు ఇటువైపు రానేలేదు ఎవరితోను జాబులూ జవాబులూ కూడ పెట్టుకోలేదు"

"ఆయనదాక పెద్ద కథ రిటైరు అయ్యాక ఇక్కడికే రావాలని నిర్ణయించుకొన్నారు "

"ఇప్పుడాయన రిటైరయ్యారనుకొంటాను కదా ?"

"రిటైర్ అయ్యారు. అయితే సలహాలిచ్చే ఇంజనియర్‌గా దామోదర్ ప్రాజెక్టులో పనిచేస్తున్నారు "

"దామోదర్ ప్రాజెక్టులోనా మా ప్రసాద్ అక్కడే పనిచేస్తున్నాడు "

ఇక్కడ మాట్లాడు కొంటున్న విషయాలనన్నిటిని గిరిజా, మీనాక్షి తలుపుచాటునుండి వింటున్నారు

లోపలినుంచి సావిత్రమ్మగారు, "రః కాఫీ తీసుకెళ్ళి అక్కడ ఇచ్చిరామ్మా" అన్నారు ఒక నిమిషంలో గిరిజా ఒక గ్లాసు, మీనాక్షి ఒక గ్లాసు కాఫీ తెచ్చి అతిధుల ముందుంచారు

మీనాక్షి లోపలికి వెళ్ళి మరో గ్లాసు కాఫీ తెచ్చి విశ్వనాథయ్యగారి ముందుంచింది గిరిజా తండ్రితో "ఈమె మన మీనా, నాన్న" అంది విశ్వనాథయ్య, "మీ మీనా మంచి అందగత్తె" అన్నారు

అమ్మాయి సిగ్గుపడింది. యువకులు మర్యాద పాటిస్తూ మెల్లగా నవ్వారు.

కాఫీ రావడంతో ఆగిపోయిన మాటల్ని విశ్వనాథయ్య మళ్ళీ

కొనసాగించారు "మా అబ్బాయి ప్రసాద్ దామోదర్‌లో ఉన్నాడు మన వెంకట రామయ్యగారు అక్కడ ఉన్నారని తెలిసిఉంటే ఆయన్ని చూడమని చెప్పి ఉండేవాణ్ణి" అన్నారు

"ప్రసాద్ మా అందరికీ తెలుసు ఒక సారి నేను శనగలు "

"మీరూ శనగలు"

"అవును చెప్పడం మరచాను నా కజిన్ ఇతని పేరు శనగలు ఒక నెలరోజులు సెలవు తీసుకొని మేమిద్దరం అక్కడికి వెళ్ళాం అక్కడ ఆయన పరిచయం అయింది మీ అబ్బాయి టెన్నిస్ చాల బాగా ఆడతారు"

విశ్వనాథయ్య ఆ విషయం ప్రస్తావించడానికి ఇష్టపడలేదు ఆ టెన్నిస్ వల్లే కదా తమ ఒక యువరాజు రేవా సుందరిని చూసి తన బాధ్యతనంతా మరచి పోయింది

"ఓహో అలా పరిచయం అయ్యాడనే మమ్మల్ని చూసి పోవడానికి వచ్చారన్న మాట"

"అవును, మొన్ననే దామోదర్‌నుండి ఇక్కడికి వచ్చాము అక్కడ మా తండ్రిగారు ప్రసాద్ పూర్వాపరాలు విచారిస్తే మీ యిద్దరి బాల్య స్నేహం జ్ఞాపకం వచ్చింది ఆయన మిమ్మల్ని చూడమని, ఒక ఉత్తరం మీకు ఇవ్వమని మాకు చెప్పారు" అంటూ యువకుడు విశ్వనాథయ్య చేతికి ఒక ఉత్తరం ఇచ్చాడు విశ్వనాథయ్య, "కంటిద్దాలు నాదగ్గర లేవు దీన్ని చదువు గిరిజా" అన్నారు గిరిజ వచ్చి ఉత్తరం చదివింది

బాల్య స్నేహితుడి ఉత్తరంలో ఇలా వ్రాసివుంది

My dear Viswanathaiah,

" I am sure you will forgive my not calling you 'Mr Viswanathaiah' We have not been in touch with each other But we were too familiar with each other at college to permit of my not using Mr to you even after this length of time

"'My son Mohan who brings this letter will tell you everything about me''

"'Your son has already written to you for blessings for his marriage with my daughter Reva This letter is for asking you to give your daughter Girija in marriage to my son

"'I know the anxieties of a father of a daughter come to marriageable years Your son relieved me of this anxiety and proposes to relieve you also if you agree

"'Reva and Mohan's mother died four years ago She told me when leaving us that the children should be settled in life soon I have no clear idea whether there is or is not a 'God' But if these children are settled as it appears they will be, I shall not object to anyone saying that it was all God's decree

"'Please give my respects to your wife I saw her just once the day you married her She was then half the size that my daughter Reva is now May she and you be always happy!

Yours sincerely

Venkataramaiah

ఉత్తరం విన్న విశ్వనాథయ్యగారికి ఎంత సంతోషమయ్యిందో చెప్పాల్సిన అవసరం లేదు

ఆయన, "చాల సంతోషం మోహన్‌ప్రసాద్ చెల్లెలి విషయం పట్టించుకోకుండా తానొక అమ్మాయిని చూసుకొన్నాడని నేను వ్యధ చెందాను, అయితే అతను ఆ తప్పు చేయలేదు వాడిని కన్న పుణ్యం మిమ్మల్ని ఇక్కడి వరకూ వచ్చేలా చేసింది" అన్నారు

ఈలోగా మీనా ఉత్తరంలోని విషయాన్ని సావిత్రమ్మగారికి చెప్పింది

"మరి వీడు ఆ అమ్మాయి పంజాబీ అని వ్రాశాడా?"అన్నారు

గిరిజ "ఆ ఉత్తరం చివర్లో ప్రసాద్ నాలుగు మాటలు నాకోసం వ్రాశాడమ్మా అందులో ఆ మాట అన్నాడు"

"ఏమని?"

"ముద్దు గిరిజా, రేవా పంజాబీ అన్నది తమాషాకి ఆ విషయం అమ్మగారికి తెలుపు నీ రాబిన్‌హుడ్‌ని పంపించాను నీ మీనుకు శనగలు నావాతేమో అడుగు

"ప్రసాద్"

"మళ్ళీ వ్రాస్తున్నాను సౌ తల్లిగారికి మరో సారి ధైర్యం చెప్పు రేవా తల్లి నాటికి నూరుపాళ్ళు కర్నాటక ఆడపడుచు"

"ప్ర"

గిరిజా పట్టరాని నవ్వును ఎలాగో ఆపుచేసుకొని ఉత్తరం చదివి ముగించి, చేతో నోరు మూసుకుని లోపలికి వెళ్ళింది

మోహన్, "ప్రసాద్ నన్ను ఇక్కడికి పంపించడమే కాదు, మీ అమ్మాయి నన్ను ఇష్టపడతారన్న విషయాన్ని ఆమె నోటినుంచె తెలుసుకున్న తర్వాతనె తక్కిన విషయాలు మాట్లాడమన్నాడు దయచేసి ఇందుకు తగిన ఏర్పాటు చేయాలి" అన్నాడు

ఇంటి యజమానురాలు తలుపు చాటునుంచి, "అమ్మాయిని తెచ్చుకొనెవాళ్ళు అమ్మాయిని ఇష్టపడాలనుకొనేది నిజం అమ్మాయి అబ్బాయిని ఒప్పుకోక ఏంచెస్తుంది? ఎవరి చెతికిప్పినా అక్కడికి వెళ్తుంది,"అన్నారు

మోహన్ "తన చెల్లెలి విషయంలో ఇలా జరగకూడదనే ప్రసాద్ మొండితనం అతని చెల్లెలు నలుగురిముందు నన్ను ఒప్పుకొన్నానని స్పష్టంగా చెప్పాలని చెప్పిపంపాడు దానికి సాక్షిగా నెను మా శనగలను తీసుకొచ్చాను"

మోహన్, శనగలు ఇద్దరూ నవ్వుతున్నారు

విశ్వనాథయ్య, "కేవలం సాక్షిగా ఎందుకు? ఆయనకూ పెళ్ళికాలేదు

మీనా తల్లి దండ్రులు మరో మూడు నిముషాల్లో ఇక్కడికి వస్తారు ఏమంటారు శనగలు గారు?" అని అడిగారు

మోహన్ గిరిజగారు తన స్నేహితురాలును పొగడుతూ అన్నకు ఉత్తరం వ్రాశారు ఇలాంటిదేదైనా జరుగుతుందేమోనని శనగలు నాతో పాటు వచ్చాడు"

లోపల ఆడపిల్లలు నవ్వుతున్నది విన్పించింది విశ్వనాథయ్య, "రావమ్మా గిరిజ, మోహనరావుకు, వారిని ఇష్టపడ్డానని చెప్పు" అని కూతుర్ని పిలిచారు

గిరిజా వచ్చి వీళ్ళ ఎదురుగా నిలబడి, "అబ్బాయి అమ్మాయిని ఒప్పుకొన్నానని మొదట చెప్పాలి కదా నాన్న?" అని ప్రశ్నించింది

మోహన్, "నిన్నటిరోజు నిన్ను చూసినప్పుడే ఇష్టపడ్డాను అందువల్లే ఈ రోజు ఇక్కడికి వచ్చాను లేకపోతే వచ్చేవాడిని కాను" అన్నాడు

విశ్వనాథయ్య, "అయితే ఈ ఉత్తరం?" అని అడిగారు

మోహన్ "దాన్ని నాన్నకు వెనక్కి పంపించేవాణ్ణి"

"చెల్లెలి పెళ్ళి కూడా తప్పించి?"

"అది వాళ్ళిద్దరికీ సంబంధించిన విషయం"

సావిత్రమ్మ "అన్ని కలసివచ్చినప్పుడు కాని మాటను ఎందుకంటారు? ఒక అడుగు వేసి మీనా తండ్రిగారిని పిలవకూడదా?" అన్నారు

విశ్వనాథయ్య లేచి తలుపు దగ్గరికి వెళ్ళారు గిరిజా లోపలికి వెళ్ళింది

మోహన్‌తన కజిన్‌తో "ఏరా నోరే విప్పలేదు? వచ్చానంగానే మీనాను ప్రేమించి, ప్రేమించ బడ్డావా?" అని అడిగాడు

శనగలు "నలుగురు మాట్లాడే మాటల్ని నీవొక్కడివే మాట్లాడుతుంటే నేనెందుకు నోరు విప్పాలి?"

"నీవింత మెత్తగా ఉంటె నీ మీనా నిన్ను ఏంచేస్తుందో నాకు తెలుసు"

"ఏం చేస్తుందో చెప్పు"

"ఏంచేస్తుందా? ఏం చేస్తుందా? నీవు శనగలుఃవయినా నిన్ను వేయించకనే మింగేస్తుంది"

"అలాగా? అయితె నీ గిరిజ నిన్నేం చేస్తుందో తెలిసే ఉండాలి"

"ఏమంటున్నావు?"

"నీవు శర్మ (O) నిన్ను ఒలిచేస్తుంది"

"శర్మ, చర్మ శ చ యోరభేదః"

లోపల అమ్మాయిలు గొల్లుమని నవ్వడం విన్పించింది సావిత్రమ్మ "ఏమిటే ఇలా నవ్వుతున్నారు?" అని అడిగారు

అదే సమయానికి విశ్వనాథయ్య మీనా తండ్రితో పాటు లోపలికి వచ్చారు

# దివాణం ఆచార్యులు

నూట ముప్పయి సంవత్సరాల క్రితం మిత్రుడయిన సాలిగారి తాతగారు బ్రహ్మశ్రీ రామచంద్రాచార్యులు సిరిగుంద రాజభవనంలో దేసాయి కుమారుడికి అక్షరాభ్యాసం చేసిన గురువులుగా ఉండెవారు

ఆచార్యులు సదాచార సంపన్నులె కాక, సాంప్రదాయికులైన వైదికులు వీరి సదాచారాన్ని మెచ్చుకొనే దేసాయిగారు వీరిని కుమారుడికి విద్యా గురువులుగా ఉండమని ప్రార్థించి, నియమించారు రాజమందిరంలో ఈ సంప్రదాయం అతి ప్రాచీన కాలంగా వస్తోంది ఆచార్యులు కూడ ఈ సంప్రదాయాన్ని ప్రశంసించారు ఆచార్యులు పండితులే అయినా కుమార దేసాయికి పిల్లలకు చెప్పే పాఠాలను సంతోషంగా చెప్పేవారు భవిష్యత్తులో ప్రభువయ్యే ఆ బాలకుడు, తన మూలంగా గుణవంతుడు, విద్యావంతుడు కావడానికి భగవంతుడు అనుగ్రహించాలని ప్రార్థిస్తూ, కర్తవ్యాన్ని నిర్వహించేవాడు

ఆచార్యులు పాఠం నేర్పించడం, శిష్యుడు నేర్చుకోవడం అనే ఈ బాంధవ్యానికి సంప్రదాయం ఒక నిర్దిష్ట రూపాన్నిచ్చింది కుమారుడు ప్రతిరోజూ స్నానం ముగించుకొని, పుస్తకాలను తానె పట్టుకొని గురువుగారింటికి రావాలి అతనితో పాటు సేవకుడు ఆచార్యులు ఆరోజు సంసారాన్ని నిర్వహించడానికి కావాల్సిన నైవేద్య సామగ్రిని నాలుగు తట్టలలో తీసుకురావాలి శిష్యుడు గురువుగారికి సాష్టాంగ నమస్కారం చెసి వీటిని అప్పగించాలి ఆ తర్వాత పాఠం మొదలయ్యేది శిష్యుడు సామగ్రి అప్పగించకనే పాఠం చెప్పించుకోడు ఆచార్యులు ఆరోజుకు సరిపడే సామగ్రిని తప్ప అధికంగా స్వీకరించరు తన ధర్మాన్ని నిష్ఠతో పాలించే బ్రాహ్మణుడికి ఇలా

ఆశలేకపోవడం ప్రథమ లక్షణం ఆచార్యులు దీన్ని తుచ తప్పక పాటించుకొంటూ వచ్చారు

ఆ రోజుకు తగినంత సామగ్రి వచ్చిన తర్వాత, ఆచార్యులగారింటికి ఎవరైన అతిథులు వస్తే, ఈ విషయాన్ని ఇంటివాళ్ళు రాజమందిరానికి చెప్పి పంపేవారు ఎంతమంది వచ్చారో అంతమందికి కావలసిన సామగ్రిని మాత్రం తెప్పించుకొనేవారు

వీళ్ళు అధికంగా అడగరు వాళ్ళు అధికంగా పంపడం కూడ జరగదు

కుమార దేసాయి విద్యాభ్యాసం ముగిసిన తర్వాత కూడ, ఆచార్యులు తమతోపాటు ఉండవలసిందిగా పెద్దలు కోరారు రాజమందిరానికి చెందిన పిల్లల్ని విద్యావంతులుగా చేయమని విన్నవించుకొన్నారు కుమారదేసాయికి పాఠం నేర్పుతున్న రోజుల్లో ఆచార్యులవారి సన్నిధికి ఎలా సామగ్రిని పంపించేవారో, అలాగే ఆ పద్ధతిని కొనసాగించారు ఈ విధంగా ఆచార్యులవారు దివాణం ఆచార్యులయ్యారు ఆయన ఇల్లు దివాణంలో ఒక బాగం ఉయింది

దెసాయిగారు మరణించిన తర్వాత కుమారదేసాయి ప్రభువయ్యాడు తండ్రి చూపిస్తున్న భక్తి గౌరవాల కంటే ఎక్కువగా తనకు విద్య నేర్పించిన గురువుగారి మీద బక్తి ప్రపత్తుల్ని చూపించి ఆచార్యులవారిని ఉన్నత రీతిలో గౌరవించాడు

ఒకరోజు ఆచార్యులవారి యింటినుండి సేవకుడువచ్చి, అతిథులిద్దరు ఎక్కువగా వచ్చారని, వాళ్ళకు సామగ్రి అవసరమని తెలిపాడు సామగ్రి ఇంటికి చేర్చారు దెసాయి, "మా గురువుగారికి ఇలాంటి సందర్భాల్లో అనుకూలంగా ఉండడానికి ఏదయినా ఏర్పాటు చేయాలి" అనుకున్నాడు గురువుగారితో ఈ విషయంగా సమయం చూసి ప్రస్తావించాలనుకొన్నాడు

మళ్ళీ రెండుసార్లు ఇలా జరిగిన తర్వాత దేసాయి తన తల్లితో ఈ విషయం ప్రస్తావించాడు ఆమె "మీ నాన్నగారెప్పుడో దీని గురించి ఆలోచించారు ఆచార్యులవారు నిరాకరించిన తర్వాత ఆ విషయం

వదలుకొన్నారు నీవు కూడ అడుగు, అభ్యంతరం లేదు అయితే బలవంతం చేయువద్దు రోజుకు కావలసిన సామగ్రికంటె ఎక్కువగా తనయింట్లో ఉండకూడదన్న అభిప్రాయం ఆయన నియమమనిపిస్తుంది ఆ నియమాన్ని మనం భంగ పరచకూడదు" అన్నారు

మరోసారి ఆచార్యులవారింటికి అతిథులకోసం సామగ్రిని అడగడా వచ్చిన సందర్భంలో దేసాయి ఆ విషయం గురించి ఆచార్యులతో ప్రస్తావించారు

"మీరు నాకు అక్షరభ్యాసం చేసిన గురువుగారు, మా తండ్రిగారితో సమానులు మీలాంటి పెద్దలు మాకు తోడుగా ఉండడమే మా అదృష్టం ఇలాంటి పెద్దల్ని దేసాయి వంశంలో నిస్సహాయులుగా ఉంచుకొని వుండడం మాకు చాల విచారాన్నిస్తున్నది రాజమందిరంలోని సంపద మీ గృహంలోనూ ఉండాలి, అందుకు మీరు అనుగ్రహించాలి "

ఆచార్యులు, "రాజమందిర సంపద మాయింట్లోకూడా ఉండాలంటే ఇప్పుడున్న ఏర్పాటే బాగుంది మరేం చేసినా ఇంత సమంజసంగా ఉండదు" అన్నారు

దేసాయి, "దేవుడి దయవల్ల మాకు కావలసినంత భూమి ఉంది మీరు అంగీకరిస్తే మీకు కావలసినంత నేలను దానంగా వ్రాసిస్తాను రాజమందిరానికి ధాన్యం వచ్చినట్టుగానే తమ గృహానికి కూడ ధాన్యం వస్తుంది దాన్ని మీయింట్లోనివాళ్ళు ఉపయోగించవచ్చు కావలసినప్పుడంతా ఇక్కడికి చెప్పి పంపి పావు, అరపావు ధాన్యం తెప్పించకొనే అవసరం ఉండదు" అన్నాడు.

ఆచార్యులు "నా గృహం నా ఆచార వ్యవహారాలకు, పూజా పురస్కారాలకు సంబంధించింది, భోజన విషయంలో అది రాజమందిరానికి చెందింది మీ ఉగ్రాణమంతా నాదేగా నాకు దేనికీ కొదువలేదు"

దేసాయి "అయితే చెప్పి పంపించేంతవరకూ గడవనంతటి ఒట్టిదిగా ఉండాలా ఇల్లు?"

ఆచార్యులు "ఈ విషయాలనన్నిటిని ఒక సారి మీ తండ్రిగారితో విన్నవించాను ఆయన అంగీకరించారు ఆ మాటల్నే మళ్ళీ చెప్పమంటే చెప్తాను"

దేసాయి "అవశ్యం చెప్పండి, నాకూ తెలిసినట్టవుతుంది"

ఆచార్యులు చెప్పడం మొదలు పెట్టారు

"చూడండి ప్రభూ, నేను వైదిక బ్రాహ్మణుణ్ణి నాకొక ఆదర్శం ఉంది. అదేమిటంటే, ప్రతిరోజు భోజనానికి సరిపడే ఆహార సామాగ్రిని ఆరోజు మాత్రమే సంపాదించుకోవాలి దానికంటె ఎక్కువగా ఇంట్లో ఉండకూడదు. ఇది ఏనాడో మా పూర్వికులు చేసుకొన్న ఆదర్శం పాటించడం కుదరదని ఈ ఆదర్శాన్ని అందరూ వదలిపెట్టేశారు నాపుణ్యం, మీ తండ్రిగారు నన్నిక్కడ నియమించుకొన్నప్పుడు ఈ కట్టుబాటుకు అంగీకరించారు. అప్పటినుంచి నా నియమానికి భంగం వాటిల్లకుండా నిర్భయంగా జీవనం సాగుతోంది మీరు కూడ మనస్సు చేస్తే నా నియమం కొనసాగుతుంది, లేకపోతే నియమ భంగం అవుతుంది, మళ్ళీ అనేక విషయాల్లో సమస్యలు ఎదురవుతాయి"

"సమస్యలేమిటి ?"

"ఇప్పుడు చూడండి, నాకు భోజన విషయంగా ఎలాంటి చింతలేదు రాజమందిరంలో లక్ష్మి తాండవిస్తోంది నా యిల్లు అందులో చేరిపోయింది మీరు నాకు భూమి ఇస్తారు మీరు పంపిస్తున్న సామగ్రికి నాలుగింతల ధాన్యం రావచ్చు, అయితే ఇతర సరుకులమాటేమిటి ? దానికి కూడ మీరు నేలనిస్తారు దాన్నంతా చూసుకోవాలి, చూసుకొనేవాళ్ళెవరు ? మీ మనుష్యులే చూసుకోవాలి అలా చేస్తే రాజమందిరానికి చెందింది ఎక్కువ భూమి, గురువుగారికి చెందింది తక్కువ భూమి అని విడదిసినట్టవుతుందే కాని, నాకు సౌకర్యం ఎక్కువకాదు, మీకు తొందర తప్పింది కాదు"

"సరే"

"ఇప్పుడు ఒక సంవత్సరం వర్షం రాకపోయినా నేను నిశ్చింతగా కూర్చుంటాను రాజమందిరానికి ఏం జరుగుతుందో నాకూ అదే జరుగుతుంది నా భూమి వేరుగా ఉంటె ఏం చేయాలో దిక్కుతోచని స్థితి ఏర్పడుతుంది పంట పండకపోతే, రాజమందిరానికె చెప్పి పంపించాల్సి వస్తుంది నేను అర్థించడమూ తప్పదు, మీరు ఇవ్వడమూ తప్పదు"

"నిజమే"

"సాగుబడిదార్లు తొందరపెట్టనిదే ఊరకే ఉండరు ధాన్యం ఇంటికిరాదు ఇప్పుడది మీయిద్దరికీ సంబంధించిన విషయం నా భూమి అని తెలిసిందంటె ఆ తొందర, ఆ కష్టం, నాలుగింతలు ఎక్కువవుతుంది దీనికి సరియైన కట్టుబాటు చేయమని నేను మీకు చెప్పాలి మీ కరణం, మీ మునసబు, మీ గుమాస్తా ఆ విషయంగా లెక్కలు చూసి పరిష్కరించాలి ఇప్పుడు నాకిలాంటి తొందరకాని, చింత కానిలేదు భూమినాదయితే నేనొక లౌకిక సంసారినవుతాను పాలేర్లతో వ్యవహారం చేసేవాడినవుతాను ఇదంతా జరిగితే గురువుకుండ వలసిన గురుస్థానం పోయినట్టే పేరుకు గురువు, నడత వ్యాపారం చేసే సంసారిది"

"నిజమే కదా!"

"తెచ్చిన ధాన్యంలో పొట్టు ఉంటే జగడం వచ్చినధాన్యం ఎండి తక్కువవుతే చింత ఎన్ని వడ్లు దంచారు, ఎంతబియ్యం వచ్చింది, దీనికంతా ఏర్పాటు చేసుకోవాలి, లెక్కలు చూసుకోవాలి అనుభవంలేదు, అరవాల్సి ఉంటుంది ఇంట్లో ఇదంతా జరుగుతుంటే నేను వేదాంతం గురించి చింతన చేయడం సబబుగా ఉంటుందా?"

"అది నిజమేనండి"

"చివరిగా ఒక మాట చెప్తాను. హాస్యం చెస్తున్నట్టుగా ఉంటుంది కాని హాస్యం కాదు. ఇప్పుడు మీ సరుకుల గదిలో ఎలుకలు, పందికొక్కులు వాటికి కావలసినన్ని ధాన్యం తింటుంటాయి అవి ఎంత ధాన్యం తింటున్నాయి? నాకూ, దానికీ సంబంధంలేదు. ఒక వేళ సంబంధం ఉందనుకో, నేనూ అవి

తినడంలో బాగస్వాములం, మీతో  మీ సంపదను అనుబవిస్తున్నవాళ్ళం అంటే ఇప్పుడు నేను అవి ఒకపక్షం, మీరు మాఎదుటి పక్షం  బూమి నాది, దాన్యం నాయింట్లో ఉందని, అనుకుందాం, అవి నాయింట్లో జొరబడతాయి, పాలు పంచుకొంటాయి  అవి ఒక పక్షం, నెను ఎదురుపక్షం  మీ నౌకర్లువాటి పోరును తప్పించుకోవడానికి ఏమెమీ చేస్తారో వాటినన్నింటిని నేను కూడ చేయాలి  రాజ బవనంలా ఇవన్ని జరగాలి, విధి లేదు, గురువుగారింట్లో ఇదంతా  జరగాలా ?"

దేసాయి నవ్వారు  "ఒప్పుకున్నాను గురువుగారు, ఇప్పుడున్న ఏర్పాటే కొనసాగనీ"  అన్నారు

ఆచార్యులిలా అన్నారు, "ప్రబూ! సంతోషం మీరు ఒప్పుకుంటారన్న ధైర్యం నాకు ఉంది  అందువల్లనే ఇన్ని మాటలు చెప్పాను  అంతే కాకుండా దేనివల్ల నాకు మరో  ప్రయోజనం కూడా ఉంది  దాన్ని పోగొట్టుకోవడానికి నాకు ఇష్టం లేదు  దాన్ని కూడ మీకు చెప్పాలి "

"తప్పక  చెప్పండి"

"చూడు నాయనా! మీరు రోజూ భోజనం చెయడానికి కూర్చొన్నప్పుడు, ఆచార్యుల వారింటికి వంట సామగ్రి వెళ్ళిందా అని రాజమందిరంలోని వాళ్ళను అడుగుతారు  రోజూ కాకపోయినా, వారానికి మూడు రోజులు అడుగుతారు  అవునా ?"

"అవును, ఆ విషయం మీకు తెలుసా ?"

"తెలుసు, మీ మనుష్యులు చెప్తారు, మెము మిమ్మల్ని బాగా చూసుకుంటున్నామని యజమానికి చెప్పమని అప్పుడప్పుడు ప్రాధేయపడుతుంటారు  అంటే దేసాయి అప్పుడప్పుడు మమ్మల్ని గురించి విచారించుకొంటుంటారు, మెము వీళ్ళ అన్నం తింటున్నామన్న కృతజ్ఞత, మమ్మల్ని ఇలా చూసుకుంటున్న  ఇల్లు సుఖంగా ఉండాలని భగవత్ప్రార్థన ఇది మమ్మల్ని అహంకారానికి లోను కాకుండా చేస్తుంది, మా మనస్సుల్ని ప్రసన్నంగా ఉంచుతుంది  భూమి మాది, ధాన్యం మాది, సంవత్సరానికోసారి

వస్తుంది, అని అనుకుని మీరు మమ్మల్ని మరచినా వద్దనను మీ కళ్ళు, మీ మనస్సు, మా వైపు తిరగాల్సిన అవసరం లేదు"

"ఇదెక్కడైనా ఉందా?"

"లేదనుకోండి మీరు సజ్జనులు, ఇలా జరగదు అయితే నేను? మా ఇంటివాళ్ళు, మా అన్నం మేము తింటాం, వీళ్ళ పెద్దరికం ఏమిటి? అని మేము మిమ్మల్ని నిర్లక్ష్యం చేయవచ్చు అన్నంపెట్టిన చేతుల్ని మరచి మేము ఏ శుభాన్ని కాంక్షించాలి? మనిషి మనిషిగా ఉండిపో వచ్చు, అహంకరించి ఉండలేదు అందులోను బ్రాహ్మణుడినని అనుకొని బ్రాహ్మణుడు అహంకారానికి లోనవుతే చండాలుడవుతాడు వాడికి దుర్గతి వాడి పెద్దలకు స్వర్గలోకపుచ్యుతి"

"శివాశివా"

"అందుకే చూడండి, మీ తండ్రి నా మాటను ఆ రోజు అంగీకరించారు మీరు కూడా ఆయన మాటను ఆదరించండి నేనూ మీ వాడిగానే ఉంటాను రోజూ దేవుడి ముందు మీ పేరు చెప్తాను మీరూ నన్ను మీ వాడిగా చూస్తు ఉండండి రోజు నాగురించి వాకబు చేయండి, గీతాచార్యుల 'పరస్పరం భావ యంతః శ్రేయః పరమ వాప్స్యథ' అన్న వాక్యాన్ని సార్థకం చేయండి"

దేసాయి గురువుగారి మాటను పాటించారు ఆచార్యులు చివరిదాకా తన వ్రతాన్ని పాలించారు

# చీమల లోకం

పెద్దరాణి కౌసల్యాదేవికి సంతానం కలగక పోవడంవల్ల దశరధ మహారాజు సుమిత్రాదేవిని రెండవరాణిగా చేసుకొన్నాడు ఆమెకు కూడా సంతానం కలగక పోవడంతో కేకయరాజు అశ్వపతి కూతురైన కైకేయిని తన మూడవ రాణిగా చేసుకోవడానికి దశరద మహారాజు అతని దగ్గరికి వెళ్ళాడు

అశ్వపతి రాజు "దశరదుడు చక్రవర్తి ఇతనికి ఇద్దరు భార్యలున్నారు, కాస్త వయస్సు కూడ అయింది అయితే ఏమిటి? ఇద్దరికీ పిల్లలు లేరు ప్రభువయిన వాడి వయస్సు ఎంతయినప్పటికీ ఫరవాలేదు తన కూతురు కడుపులొ పుట్టే బిడ్డ చక్రవర్తి అవుతాడు అందువల్ల అశ్వపతికి రః సంబంధం సమ్మతమే అయినా అతను దశరధుణ్ణి ఒక మాట అడిగాడు "మీ చక్రవర్తి పదవి నా కూతురు సంతానానికే లభిస్తుంది కదా?"

దశరధుడు, "నాకు వేరే పిల్లలు లేరు మీ కూతురుకు జన్మించే కొడుకే చక్రవర్తి కావాలి" అన్నాడు

ఇలా భవిష్యత్తులో దశరదుని తర్వాత కాబోయే చక్రవర్తి విషయంగా ఒప్పందం కుదుర్చుకొని కేకయరాజు దశరధుడికి తనకూతురునిచ్చి వివాహంచెశాడు

వివాహం జరిగిన నాటి సాయంకాలం రాజమందిరంలోని ఉద్యానవనంలో మామా అల్లుళ్ళు వెన్నెల్లో కూర్చుని కొంత సమయాన్ని సల్లాపాలతో గడిపారు ఎదురుగా వసిష్ఠ మహర్షి, జాబాలి మహర్షి, సుమంత్రుడు ఉచితాసనాల మీద కూర్చున్నారు

ఏవో మాటల మధ్య జాబాలి కేకయరాజుతో "తమకు ఒక ఋషి

వర ప్రభావం వల్ల అన్ని జీవరాశుల మాటలూ అర్థమవుతాయని విన్నాము, ఈ విషయం తెలుపగలిగితే దయతో మేమువినడానికి అనుగ్రహించాలి" అన్నారు

వసిష్ఠ మహర్షి, " ఆ విషయం అడగవద్దు దాన్నివింటే రాజుగారి ఆయుస్సు క్షీణిస్తుందని అంటారు" అన్నారు

కేకయరాజు, "వినండి, అడ్డులేదు నేను ఇతర జీవరాశుల భాష తెలుసని చెప్పడంవల్ల ఆయుస్సు క్షీణించదు ఒక జీవి ఏదేదో చెప్తున్నప్పుడు నాతోపాటు ఉన్నవారు అది ఏమి చెప్పిందని అడగకూడదు అడిగినా, నేను చెప్పకూడదు అలా చెప్తే ఆయుస్సు క్షీణిస్తుంది" అన్నాడు

వసిష్ఠ మహర్షి, "ఈ వివరాలు మాకు ఇంతవరకు తెలియవు అందువల్ల ఏలినవారు జాబాలి మహర్షి ప్రార్థనను అనుగ్రహించవచ్చు" అన్నారు

కేకయరాజు, "జాబాలి మహర్షులు ఏమి తెలుసుకోవాలను కొంటున్నారు?"అని అడిగాడు

జాబాలి, "ఏలినవారికి ఇతర జీవరాశుల భాష అర్థమవుతుందన్న విషయాన్నే తెలుసుకోవాలి అది తెలుసుకోవడమయింది ఇప్పుడవి ఏమన్నాయో, తాము అర్థం చేసుకొన్న విషయ స్వరూపం ఏమిటో, తాము చెప్పగలిగితే తెలుసుకోవాలని నా ఆకాంక్ష అని అన్నాడు

కేకయరాజు ఇలా అన్నాడు "ఈ జీవి ఈ క్షణం ఇలా అందని చెప్పకూడదు అయినా జీవరాశుల భాషవల్ల వాటి జీవన విషయంగా తెలుసుకొన్న సంగతుల్ని చెప్పడానికి ఎలాంటి అడ్డూలేదు తపస్వి ఈ వరాన్ని అనుగ్రహించిన ఉద్దేశం, నాకు ఒక అద్భుత శక్తిని ప్రసాదించి ప్రజల్ని ఆశ్చర్యపరచే మనుష్యుడిగా చేయడంకాదు, ఆ భాషవల్ల విషయాలను తెలుసుకొని జీవితాన్ని చక్కదిద్దుకోవాలనేదే ఇది నాకు సిద్ధించింది ఆ వరంవల్ల నాకు చాల ప్రయోజనం కలిగింది

"ఉదాహరణకు, నాకు చీమల విషయం, వాటి భాషను తెలుసుకోవడంవల్ల గ్రహించి, కొన్ని వివరాలను చెప్పవచ్చు. వీటి విషయంగానే నాకూ, నా రాణికీ వివాదం జరిగింది ఈ విషయం మీ చెవిని కూడ పడి ఉంటుంది"

కేకయరాజు అన్నాడు "ఒక సారి నేనూ, ఆమె ఇలా కూర్చుని ఉన్నప్పుడు రెండు చీమలు ఏవో మాట్లాడుకొన్నాయి. నేను నవ్వాను ఆమె, అదేమిటి అలా నవ్వుతారు, అంది నేను, చీమల మాటల్ని విని నవ్వు వచ్చింది "అన్నాను" ఆమె, ఆ మాటేమిటి, అన్నారు నేను దాన్ని చెప్పకూడదు అన్నాను, చెప్తే నేను చావాల్సి ఉంటుంది అన్నాను ఆమె, మీరు నన్ను అపహాస్యం చేసి నవ్వి దాన్ని మూసిపెట్టడానికి ఇలా అంటున్నారు, మీరు చావడం అబద్ధం, చెప్పండి అన్నారు ఎంత సమాధాన పరచినా ఆమె అంగీకరించలేదు చెప్పక పోతే నేను ప్రాణం వదలుతాను, అన్నారు గురువుల్ని అడిగాను ఆయన, ఆమెకు పరిజ్ఞానం తక్కువ, ఈ బెదరింపును లెక్క చేయక, వీలు లేదు చెప్పను, నీ యిష్టం అని అక్కడికే ఈ విషయం వదలి పెట్టమని సలహా ఇచ్చారు ఆమె ప్రాణం వదలుతానని పట్టుబట్టింది ఈ విషయాన్ని మళ్ళీ గురువుగారికి నివేదిస్తే ఆయన, ప్రాణం వదలుతాను అనే శపదాన్ని నెరవేర్చుకోవడానికి చాల మార్గాలున్నాయి, ఒక సంవత్సరకాలం నీకు మొహం చూపించకుండ, నిన్ను చూడక, నీనుండి దూరమై ఉండనీ, అది దీనికి సమమవుతుంది, అన్నారు రాణిగారు ఇలా చేయాల్సి వచ్చింది "

దశరదుడు, "లేదు, ఈ విషయం మేము వినలేదు" అన్నాడు

కెకయరాజు ముందుకిలా కొనసాగించాడు "చీమల్లో మనలా ఉన్నట్టుగానే అనేక జాతులు ఉన్నాయి పెద్ద చీమనుండి చిన్న చీమదాకా పరిమాణంలో వంద రెండువందల రకాలు ఉండవచ్చు ఒకదానిలాగా మరొకటి లేదు ఇవి సామాన్యంగా వేర్వేరు గుంపులుగా జీవిస్తాయి

"సాధారణంగా ఇవి ఒకదానిలో ఒకటి పొందికతో జీవిస్తాయి పోట్లాడుకోవు ఒక జాతి చీమ మరో జాతి చీమను చూసినప్పుడు పరస్పరం

స్పర్శించుకొని స్నేహాన్ని అభిలషిస్తాయి విశ్వాస పూర్వకంగా మాట్లాడుకొంటాయి "

దశరథుడు "నిజంగానా? ఇది చాల ఆశ్చర్యకరమైన సంగతి"

కేకయరాజు "చాల ప్రేమతో నడుచుకొంటాయి ఒకటి మరొకదాని జీవితంలోని కష్ట సుఖాలను గురించి విచారించుకొంటాయి చెప్పే సమాధానాన్ని కుతూహలంగా వింటాయి

"కొన్ని అతి చిన్న సమాజాలుగా ఉంటాయి, వంద రెండువందల చీమలుండవచ్చు. కొన్ని అతి పెద్ద సమాజాలు, పదివేల చీమలు ఒక గూట్లో నివసిస్తాయి

"ఇలాంటి బహుసంఖ్య కలిగిన జాతి గూడు అతి విస్తారంగా ఉంటుంది అందులో పలు బాగాలుంటాయి కొన్ని విధులుంటాయి ఈ సముదాయపు సంఖ్య విస్తారమై గూడు చాలకపోతే కొన్ని చీమలు వలస పోతాయి, దగ్గరలోనే ఒక గూడు చేసుకొంటాయి

"అక్కడికి వెళ్తూ అవి ఇక్కడి నుంచి తమకు కావలసిన ఆహారాన్ని తీసుకొని వెళ్తాయి అక్కడికి వెళ్ళి స్థిరపడ్డ తర్వాతకూడ తల్లి గూటితో సంబంధం ఉంచుకొని కొన్ని అప్పుడప్పుడు అక్కడికి వెళ్ళివస్తాయి, ఇక్కడినుంచి కొన్ని వాటివెంట కొత్త గూడుకు వెళ్ళి తిరిగి వస్తాయి

"స్నేహంగా వర్తించే జాతులలాగానే పోట్లాడుకునే జాతులు కూడా ఉంటాయి అప్పుడా జాతి శక్తివంతమైనదైతే ఎదుటి పక్షాన్ని కొట్టి ఓడించి తమ దాసులుగా చేసుకొంటాయి ఇవి ఓడిపోయి మరో మార్గం లేక వాటికి అణగి మణగి ఉంటాయి ఆ గూటిలో సేవకుల కర్తవ్యాన్ని నిర్వర్తిస్తాయి

"'ఏ గూళ్ళో అయినా ఇలాంటి పని చేసే గుంపు ఒకటుంటుంది రాణి చీమ గూటి తల్లి, అది ఏపని చేయదు కొన్ని మగ చీమలు, కొన్ని ఆడచీమలు, ఈ రెండూ కానివి అధిక సంఖ్యలో ఉంటాయి వీటిని కన్య చీమలనవచ్చు వీటి అంగ నిర్మాణం స్త్రీకి చెందింది, అయితే ఇవి ప్రౌఢావస్థను పొందవు జీవించినంత కాలం గూడుకోసం శ్రమించడం వీటి పని

"తక్కిన చీమల్లో కొన్ని సైనికులుగా ఉంటాయి వీటి తలకొండి పెద్దది వీటికి బలం కూడా ఎక్కువే పోట్లాడాల్సి వచ్చినప్పుడు పోట్లాడి గూటిని రక్షిస్తుంది తక్కిన సమయాల్లో గూడును కాపలా కాయడం వీటి కర్తవ్యం

"గూళ్ళలో వీటి జీవితం ఒక సమిష్టి కుటుంబ జీవనంలా ఉంటుంది అందులోనూ అధిక సభ్యులున్న కుటుంబం రీతి కన్పిస్తుంది ఏ చీమ అయినా తనకెంత ఆహారం కావాలో అంత మాత్రమే స్వీకరిస్తుంది ఒక దానినుంచి మరొకటి ఆహారాన్ని లాక్కోవడమనేది గూడు మొత్తం మీద కన్పించదు

"కొన్ని చీమలు కొన్ని సమయాల్లో మంచి ఆహారం లభిస్తే తమ శక్తికి మించి తినివస్తాయి వీటికి రెండు పొట్టలు ఉంటాయి ఒకటి ఆహారం నిలువ చేసే ఉగ్రాణం మాత్రం రెండోది నిజంగా ఆ చీమ పొట్ట ఇలా అధికంగా ఆహారం తిన్నప్పుడు ఈ చీమలు కొంత భాగాన్ని తమ నిజమైన పొట్టలోనికి మ్రింగుతాయి చాల భాగాన్ని ఉగ్రాణంలో నిల్వచేస్తాయి. గూటికి వచ్చి దాన్ని కొంచెంకొంచెంగా బయటికి తీసి తమతోపాటు ఉన్న చీమలకు పంచిపెడతాయి

"చీమలు కొన్ని క్రిమికీటకాల శరీరం నుంచి స్రవించే ద్రవాలను సేవించి, అవి రుచిగా ఉన్నాయని, వాటిలో పోషక పదార్థాలున్నాయని తెలుసుకొన్నాయి. అందువల్ల అలాంటి క్రిమికీటకాలను తెచ్చి గూటిలో ఉంచుకొని, వాటిని పోషించి, వాటి ద్రవాన్ని సేవిస్తాయి. ఈ క్రిమికీటకాలు చీమలకు గోవుల్లాంటివి

"చీమలు మనలాగ వ్యవసాయం చేస్తాయి. వాటికి ఒక విధమైన బూజు ఆహారం ఆ బూజు ఒక విధమైన ఆకుమీద పెరుగుతుంది. ఇవి ఆ ఆకుల్ని తెచ్చి గూట్లో ఉంచుకొని బూజును పెంచి దాన్ని తింటాయి . . ."

ఈ విషయాలనన్నిటినీ విని దశరథ మహారాజుకు చాల ఆశ్చర్యం వేసింది అతను, "మీరు చెప్పున్నదంతా వట్టి కల్పన అనేంతటి ఆశ్చర్యకరంగా ఉన్నాయి మా గురువుగారికి ఏమనిపిస్తోంది?" అని వసిష్ఠుని వైపు చూశాడు

వసిష్ఠ మహర్షి, "ఇవి ఏవి ఆశ్చర్యకరమైన విషయాలు కావు సృష్టికర్త ఎన్నో రకాలయిన జీవరాశుల్ని సృష్టించాడు ప్రతి జీవిలోను వాటి జీవనానికి తగిన విధంగా బుద్ధిని, ప్రవృత్తుల్ని ఉండేలా చేశాడు ఇతర జీవుల్లో బుద్ధి తక్కువ, ప్రవృత్తులు అనేకం మనుష్యునిలో బుద్ధి అధికం, ప్రవృత్తులు అల్పం మనం ఆలోచించి మంచి చెడ్డల్ని పరిశీలించి నిర్ణయించడాన్ని చీమలు సహజమైన ప్రవృత్తితో చేస్తాయి, తేడా ఇంతే" అన్నాడు

కేకయరాజు, "అది సత్యం చూడండి, ఒక సారి కరువు వచ్చినప్పుడు నేను నాదేశ ప్రజల్లోని శ్రీమంతులతో మీ దగ్గర ఉన్న ధాన్యాన్ని మీకు మీరుగా పేదలకు పంచిపెట్టాలి లేదా నా బలవంతానికి మీరు పంచిపెట్టాలి లేదా ప్రజలు మీమీద పడి ఆ ధాన్యాన్ని మీనుండి దోచుకోవాలి వీటిలో మీకేది ఇష్టం అన్నాను వాళ్ళు తమకుతాముగా ధాన్యం పంచిపెట్టారు చీమ దాన్ని సహజంగా చేస్తుంది మనిషి ఆలోచనా ఫలితంగా చేస్తాడు" అన్నాడు

క్షణంతర్వాత ఇంకా ఇలా అన్నాను "ఇప్పుడు చెప్పినదాంట్లో మూడు పాళ్ళు మంచి విషయాలే అయితే ఈ మంచి ఒక తూకం, ఇంతే సత్యంగా ఈ జీవితంలో దాస్యం లాగ కొన్ని దుష్ట అంశాలు ఉన్నాయి అతి దుష్టమయిన ఒక సంగతిని చెప్పి ఈ విషయాన్ని ముగిస్తాను"

"వీటిలో ఒక జాతి మరో జాతిని పూర్తిగా నాశనం చేసే సందర్భం కూడ ఒకటుంది

"చీమల్లో గండు చీమల జాతి ఒకటుంది మరొకటి చిన్న చీమల జాతి గండు చీమల జాతి రాణి తన సంసారాన్ని చూసుకొంటూ ఉంటుంది. దీని గూట్లో సౌకర్యాలు అధికం చిన్న చీమలజాతి రాణి ఈ సౌకర్యాలను చూస్తుంది గూటిని తనవశం చేసుకోవాలని నిశ్చయించుకొంటుంది ఒక రోజు అది గండు చీమలజాతి గూడుకు వస్తుంది దాని వాసన వేరు ఇక్కడి రక్షకులైన చీమలు దానిమీద పడతాయి అది అటుఇటు పరుగెత్తి మధ్యకు వచ్చి ఈ గూటి రాణి వీపు మీద పడిపోతుంది

"ఈ గండుచీమల రాణి శరీరం వాసన ఘాటుగా ఉంటుంది

కొత్తరాణి శరీరం వాసన ఈ వాసనలో కలిసిపోతుంది కొత్తరాణి ఏమయిపోయిందో రక్షకభటులైన చీమలకు తెలియదు అందువల్ల అవి ఊరకుండి పోతాయి పెద్దరాణికి ఈ చిన్నరాణి ఏమయిందో తెలియక అది కూడ మౌనంగా ఉండి పోతుంది

"కొత్తరాణి మెల్లగా తనకొండితో పెద్దరాణి మెడను తెంపడం మొదలు పెడుతుంది కొద్ది కొద్దిగా త్రెంపి మూడురోజుల్లో దాన్ని చంపేస్తుంది దాని స్థానంలో అదే నిలబడుతుంది ఈ సమయానికి దానికి పెద్దరాణి శరీరం వాసన వచ్చి ఉంటుంది గూటిలోని చీమలు ఇది వేరే రాణి అనే విషయాన్ని పసికట్టలేకపోతాయి ఇది పిల్లల్ని చేస్తూ చేస్తూ గూటినిండా తన సంతానాన్ని నింపుతుంది ఇంతకు ముందున్న రాణి సంతానం మరణిస్తే ఇక గూట్లో కొత్త రాణి సంతానం మాత్రమే మిగులుతుంది పెద్దరాణి ఊసుకూడ మిగలదు"

కెకయరాజు పెద్దరాణి, చిన్నరాణి అని ప్రస్తావిస్తున్నప్పుడు దశరథుడి అంతర్యంలో ఏదో ఒక విధమైన వ్యాకులత ఏర్పడింది ముఖం వివర్ణమయింది దీన్ని సుమంత్రుడు గమనించాడు అతను వసిష్ఠుడి వైపు చూశాడు ఆయనకూడ దీన్ని గమనించినట్టు అతనికి అనిపించింది అతను మాట మారుస్తూ "మేము రేపు ఉదయం బయల్దేరవచ్చుకదా మహారాజా!" అని అడిగాడు మాటల్లో చీమల మాట మరచారు

రాత్రి సుమంత్రుడు వసిష్ఠులతో "కెకయరాజు ఆ పెద్దరాణి, చిన్నరాణి విషయాలను చెప్పకుండా ఉండాల్సింది" అన్నాడు

వసిష్ఠులు, "చెప్పడంవల్ల చెడ్డేమీ జరగలేదు ఆక్షణం చక్రవర్తుల మనస్సుకు కష్టమనిపించినా, భవిష్యత్తులో రాణుల మధ్య ఎలాంటి వైషమ్యం కలగకుండా చూసుకోవడం ఆయనధర్మం అని కాబోయే కొత్త మామగారు పరోక్షంగా చెప్పినట్టయింది ఇది మంచిదే" అన్నారు

సుమంత్రుడు, "ఈ మాటను ఈయన మొదటే చెప్పివుంటే రాజుగారు ఈ రాణిని తెచ్చుకోకపోదురు" అన్నాడు

వసిష్ఠులు "అది సాద్యమె కాదు జరగాల్సింది జరిగింది జరగాల్సింది జరుగుతుంది దాన్ని వేరువేయడం గతంలో సాద్యంకాలేదు ప్రస్తుతం సాద్యంకాదు, బవిష్యత్తులోను సాద్యంకాదు విది చెతిలో మనుష్యుడు ఒక చీమకంటే ఎక్కువ కాదు మానవలోకం, చీమలలోకం రెండూ వెర్వేరు కాదు" అన్నారు

# కొత్తరకం దాంపత్యం

చాలసంవత్సరాల క్రితం నేను, మా బాబాయి, నా చెల్లెలు, ఆమెభర్త శ్రీ రామస్వామి నలుగురూ కలిసి రమణ మహర్షి దర్శనంకోసం అరుణాచలంలోని ఆయన ఆశ్రమానికి వెళ్ళాము అదే సమయానికి ప్రఖ్యాత ఆంగ్లరచయిత సామర్సెట్ మామ్ వచ్చారు నేను సామర్సెట్ గారు రచించిన ఒక చిన్న కథని, ఒక నవలని, ఒక నాటకాన్ని అంతకు ముందే చదివాను కథ, నవలలకంటె నాటకం నాకు చాలనచ్చింది నాకు ఇష్టమైన నాటక రచయిత ఇలా యాదృచ్ఛికంగా కన్పించడం నాకు చాల సంతోషం కలిగించింది నేనే ఆయన దగ్గరికి వెళ్ళి మాట్లాడించి పరిచయం చేసుకొన్నాను ఆయనది చాల సరళమైన వ్యక్తిత్వం తాను తెల్లవాడినన్న అహంకారాన్ని ఆయనెప్పుడూ పొందనట్టు నాకు అనిపించింది తాను ఒక గొప్ప రచయిత అనే భావం ఆయనమాటల్లో కన్పించింది అన్నిటిని మించి ఆయన భావకుడన్న విషయం ఇతనితో మాట్లాడిన కొద్ది సేపటికే స్పష్టమయింది నాకు ఇలాంటి వాళ్ళంటే ఇష్టం అందువల్లె మా ఇద్దరి మధ్య కొన్ని విషయాలను గురించిన చర్చ సహజంగానే జరిగింది అందులో ఒకటి పెళ్ళిని గురించిన ఆధునిక భావాలు ఈ భాగంలో ఆ చర్చల వివరాలను తెలియజేస్తాను

నా చెల్లి జయమ్మ చదువుకొన్న యువతి కొన్ని కథలను కూడ వ్రాసింది రామస్వామి ఇంజనియర్‌గా ఉన్నాడు ఆయనకూ సాహిత్యం మీద అభిరుచి ఉంది దేవుడి దయవల్ల వీళ్ళ దాంపత్యం ఆదర్శ దాంపత్యంగా వుంది జయమ్మ సరసురాలు ఇతరులు కఠినంగా మాట్లాడనంత వరకూ నవ్వుతూ ఉంటుంది, గలగలా మాట్లాడుతూ ఉంటుంది రామస్వామి

మాట కారికాడు అయితె ఠః ఉమ్మాయి మాట్లాడుతూ ఉంటె అతనికి వినాలన్న ఆసక్తి హెచ్చు వీళ్ళిద్దరూ ఇలా అన్యోన్యంగా ఉండడాన్ని చూసినవాళ్ళు ఇదొక మంచి జంట, బార్యాబర్తలిద్దరూ సంతోషంగా ఉన్నారనిపిస్తుంది అదేమిటో కాని అందరికీ ఇలాంటి జంటను చూడాలంటె సంతోషం ఉమ్మాయి నా చెల్లెలు కావడం నాకు గర్వ కారణం మాకు పరిచయమైన కొద్ది సేపట్లోనే నెను మామ్‌గారికి మా బాబాయి, చెల్లెలు, రామస్వామి గార్ల పరిచయం చేశాను చెల్లెలు కదా రచయిత్రి, రామస్వామి సాహితి ప్రియుడు అని తెలిపాను ఆయన చాల సంతోషంతో వాళ్ళను పలకరించాడు ఇలాంటి వాళ్ళ పరిచయం తనకు కలగడం తన అదృష్టమన్నారు

మరుసటి రోజు మేమిద్దరమే కూర్చుని మాట్లాడుకొంటున్నప్పుడు మామ్, "నన్ను మీరు అపార్థం చేసుకోకండి మీ చెల్లెలిది, శ్రీ రామ స్వామిగారిది ప్రేమ వివాహం కదా?" అన్నారు

నేను, "అంటే, పెళ్ళికి ముందే సరససల్లాపాలు జరిపి పరస్పరం ఇష్ట పడ్డవాళ్ళని మీరు అడుగుతున్నరా?" అన్నాను

మామ్ "అవును"

నేను "సల్లాపమేమీ జరలేదు పరస్పరం ఇష్ట పడ్డారంతే మాలో ఇది సంప్రదాయం పెద్దలు పరస్పరం అంగీకరించిన తర్వాత అమ్మాయి, అబ్బాయి ఒకరొకరు చూసుకొంటారు ఇద్దరూ ఒప్పుకుంటే పెళ్ళి జరుగుతుంది వాళ్ళ అదృష్టానికి తగినట్టుగా భార్య భర్తలు చాల సుఖంగానో లెక సామాన్యంగానో జీవిస్తారు వీళ్ళిద్దరూ చాల సుఖంగా జీవిస్తున్న అపురూపమైన ఒక జంట"

మామ్ "నిజంగానే ఇలా పొందికతో జీవించడం ఎక్కడైనా అపురూపమే మాలో కొంతకాలం దాకా పెళ్ళనేది మంచి వ్యవస్థగానే ఉండేది అయితే ఇటీవలి కొంతకాలంగా చెడిపోయింది"

నేను "దానికి కారణం ఏమిటి?"

మామె ఇంతకు ముందు పురుషుడు తప్పుదాల్లో నడుస్తున్నప్పుడు స్త్రీ సహించుకొని ఉండాలన్నది సూత్రంగా ఉండేది ఇది హద్దు మీరి, స్త్రీ సహించుకోవాల్సిన అవసరం లేదన్నంతవరకు వచ్చింది ఆ తర్వాత పురుషుడితో పాటు స్త్రీ కూడా సమానంగా స్వాతంత్ర్యం కావాలన్న వివాదం బయల్దేరింది ఈవివాదం ప్రస్తుతం స్త్రీ ఏదైనా తప్పు చేస్తే పరిజ్ఞానం ఉన్న మగవాడు సానుభూతితో వర్తించాలన్న సూత్రం రూపుదిద్దుకొంది ఈ సూత్రం వరకె ఇది తప్పు కాదు నా భార్య అన్నంత మాత్రానికి ఆ స్త్రీ మనస్సుకు సంకెళ్ళను బిగించడం వీలు కాదు అయితె సంకెళ్ళు లెవన్నంత మాత్రం చేత స్త్రీ, నేను నామనస్సు పయనించె మార్గంలోనే వెళ్తాను అని అంటె, భర్త ఎంతటి పెద్ద గుణం ఉన్నవాడయినా, అంతటి దుఃఖానికి లోనుకావల్సి వస్తుంది మన విజ్ఞ సమాజం ఇలా ఈ విషయంలో దారి తప్పిందని నాకనిపిస్తుంది"

ఈలోగా మా బాబాయి మేము కూర్చున్న చోటికి వచ్చారు మామ్‌గారికి నమస్కారం చెప్పి మాతోపాటు ఆయన కూర్చున్నారు మామ్ ప్రతి నమస్కారం చేసిన తర్వాత నేను, "ఇలాంటి మనుష్యులు ఉన్నారా ఏమిటి?" అని అడిగాను అందుకాయన ఇలా చెప్పడం మొదలు పెట్టారు

## 2

"చెప్తాను వినండి. నాకొక స్నేహితుడు ఉన్నాడు ఆయన చాల బుద్ధిమంతుడు " (మా బాబాయితో, "మా స్నేహితుడి సంసారంలో తలెత్తిన కష్టాలను గురించి చెప్తున్నాను ఇక ముందు నేను చెప్పే మాటలవల్ల మా సంభాషణా స్వరూపం మీకు తెలుస్తుంది) "ఆయన చాల బుద్ధిమంతుడు బీదవాడుగా పుట్టి బాగా చదివి, ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడవుతూ, విద్యార్థి వేతనాన్ని సంపాదించి శ్రీమంతులకు మాత్రం అనుకూలంగా ఉన్న విశ్వవిద్యాలయాల్లో సీటు సంపాదించుకొన్నారు అక్కడ కూడ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడు కావలసింది చదువు ముగించకుండానే రచయితగా స్థిరపడడానికి వెనుదిరిగి వచ్చేశాడు తర్వాత షేక్స్‌పియర్, కీట్స్ మొదలైన అగ్ర గణ్యా కవులను గురించి లోతుగా అధ్యయనం చేసి

పండితులకు కూడా తెలియని అనేక విషయాలను లోకానికి తెలియ జేశాడు జీవితంలో గెలుపంటె ఏమిటో రఃయునవె అడగాలన్న స్థాయికి ఎదిగి తోటి రచయితల మన్ననలను పొందాడు

"విశ్వ విద్యాలయంలో చదవడం చాలించి బయటి ప్రపంచంలో అడుగు పెట్టి రచనలు చెస్తున్న సమయంలో రఃయునకు చిన్న కదల రచయిత్రిగా పెరుపొందిన ఒక మహిళతో పరిచయం ఏర్పడింది ఆమె న్యూజిలాండ్ లో పుట్టి పెరిగి ఇంగ్లండు వచ్చింది చిన్నతనం నుండె సమాజ సంస్కరణ భావాలను అలవాటు చేసుకొని స్వతంత్ర రీతిలో బ్రతకడాన్ని ఆమె నేర్చుకొంది విద్యాభ్యాసం కొసమని ఇంగ్లండుకు వచ్చి మళ్ళీ న్యూజిలాండ్ వెళ్ళి పోయింది ఆమెకు జీవితం రుచించక పోవడంతో తల్లి దండ్రుల అనుమతి పొంది తిరిగి ఇంగ్లండుకే వచ్చింది అంతకు ముందు అక్కడ వివాహ ప్రసక్తి కనబరచకుండ ఒక యువకుడితో సహవాసం చేసిందట ఇది తెలిసి ఆమె తల్లిదండ్రులు వ్యథ చెందారు సరె, ఇంగ్లండులోనే ఆమె సుఖంగా ఉండేటట్టయితే ఉండనీ అని వాళ్ళు అభిప్రాయపడ్డారు తండ్రి రఃమెకు సంవత్సరానికి నూరు పౌండ్లు ఖర్చుకోసం పంపడానికి అంగికరించాడు ఇంగ్లండులో రఃమె తనలాగానే న్యూజిలాండ్ నుంచి వచ్చిన ఇద్దరు యువకుల్ని చూసింది వాళ్ళిద్దరు అన్న దమ్ములు అన్నను అంతకు ముందే చూసిందట అతన్ని ప్రేమించింది కూడ ఇక్కడ రఃమె అతన్ని ప్రేమించలేదు, తమ్ముణ్ణి ప్రేమించింది అందులో ఏ ఒక్కర్తూ రఃమెను వివాహం చేసుకొంటామని అన్నవారు కాదు తండ్రి పంపిస్తున్న నూరుపౌండ్లు రఃమెకు చాలక కష్టం అనుభవించింది ఒక సంగీతకారుడు రఃమెను పెళ్ళి చేసుకొంటానన్నాడు రఃమె ఒప్పుకొంది ఆ రాత్రి అతను రఃమె పొందును కోరాడు రఃమె తిరస్కరించింది. విరసం ఏర్పడింది మూడు రోజుల్లో రఃమె అతన్ని వదలి వెసింది, ఇంటినుంచి బయటకు వచ్చింది ఇలా జీవితం గడుపుతున్న కాలంలో రఃమె నేను మొదట చెప్పిన ఆ మన మిత్రుడు, విశ్వవిద్యాలయం చదువుమాని రచయితగా స్థిరపడిన అతను, అతణ్ణి చూసింది, వీళ్ళ పరిచయం పెరిగింది

"మన ఈ మిత్రుడు చాల సరళ స్వభావం ఉన్నవాడు మంచి మనస్సున్న మనిషి స్త్రీకి స్వాతంత్ర్యం ఉండాలని కాంక్షించే వ్యక్తి ఈమెను ఆయన బాగా ఇష్ట పడ్డాడు ఆయన ఉండడానికి ఒక గదిని వెతుకుతున్న సమయంలో, ఈమె సూచన మేరకు ఈమె ఉంటున్న ఇంట్లోని ప్రక్క గదిలోకి వచ్చి చేరాడు వీళ్ళిద్దరి మధ్య బాగా విశ్వాసం ఏర్పడింది రోజంతా ఇద్దరూ తమ పనుల్లో నిమగ్నులై, సాయంకాల తమ తమ గదులకి వచ్చిన తర్వాత, జతగా కూర్చుని సమయం ఎంతయిందో కూడ తెలియక ఎన్నో విషయాలను మాట్లాడుకొనేవారు ఒకరోజు ఆమె ఇతన్ని, "నీవు నన్ను నీ ప్రేయసిగా ఎందుకు చేసుకోకూడదు?" అని ప్రశ్నించింది అతను, "అది చాలపెద్ద తప్పవుతుంది కదా?" అని ప్రశ్నించాడు ఈమె "అలా అవడం సాధ్యమే" అంది ఇక ఆ మాటని వదలివేసింది తనకు తానుగా అడిగినా ఇతనిలా అన్నాడని ఆమె అతని విషయంలో కోపం తెచ్చుకుంది ఈమె భర్త ఉన్న స్త్రీ అతనేం చెయగలడు? తనను వదలిపెట్టి విడాకులు ఇవ్వమని భర్తకు చెప్పింది ఆమెను ఇబ్బంది కలిగించాలనే ఉద్దేశంతో అతను వెంటనే అంగీకరించలేదు, మౌనంగా కాలం వెళ్ళబుచ్చాడు రెండేళ్ళ తర్వాత కొర్టునుండి విడాకుల తీర్పునుపొంది ఈమెను వదలివేశాడు ఆ తర్వాత వీళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొన్నారు

"ఈ సమయానికి నా మిత్రుడికి అతనికి తగినట్టుగా ఒక మంచి పని దొరికింది ఆయన ప్యారిస్‌లోనే పనిచేయాలి వీళ్ళిద్దరూ ప్యారిస్ వెళ్ళారు అక్కడ భర్త స్నేహితుడొకాయన ఉన్నాడు భర్త ఈమెకు అతని పరిచయం గావించారు నాలుగు రోజుల్లో ఈమెకు ఆ స్నేహితుడి మీద మనసు కలిగింది భర్త ఈ విషయం గమనించాడు ఆధునిక సమాజంలో ఇలాంటి సందర్భాల్లో భర్త అడ్డు చెప్పకూడదు ఈయన చెప్పలేదు ఈ మధ్యలో ఈయన ఉద్యోగానికి కాస్త ఆటంకం ఏర్పడి ఆయన ఇంగ్లండుకు రావలసి వచ్చింది ఇద్దరూ తిరిగివచ్చారు కొద్ది రోజుల తర్వాత ఈమె భర్తతో ఆ స్నేహితుడి దగ్గరికి వెళ్తానని చెప్పింది అతను దుఃఖించి ఉండాలి అయినా అతను వెళ్ళవద్దనలేదు సరే అన్నాడు ఈమెను పంపించారు ఈమె

ప్రొవ్సు వెళ్ళింది ఆ స్నేహితుడితో నాలుగు రోజులు గడిపి, ఆ జీవితానికి రోసి, నేను తిరిగి వచ్చేస్తున్నానని భర్తకు టెలిగ్రాం పంపింది

"వెనుతిరిగి వచ్చిన తర్వాత రఃయున ఆమెను రెవులో మాశాడు ఊరికి పిలుచుకొని వచ్చాడు వస్తూ ఆమె, నేను నీకోసం రాలేదు, వేరే ఎక్కడా ఉండడానికి స్థలం లేదు అందువల్ల నీతో ఉంటాను, అంది భర్త చాల బాధ పడ్డాడు

"రఃమె తన డబ్బును జాగ్రత్తగా ఖర్చు పెట్టేది కాదు తండ్రి ఇప్పుడామెకు రెండవందల యాభయి పౌండ్లు పంపిస్తున్నాడు రఃమెకు జీతం వచ్చేది అయినా రఃమెకా డబ్బు చాలదు తాను అడగకనే భర్త రఃమెకు డబ్బులివ్వాలని రఃమె అనుకుంది అతనలా చేయలేదు పిసినారి కావడంవల్లో కాక మరేకారణం చేతనో చెప్పలేం

రఃమెకు కోపం వచ్చింది ఒక సారి రఃమె ఒక కథను పంపించి, అచ్చు వేయించమంది దానికి తాను డబ్బు పంపిస్తానని కూడ చెప్పింది ఇలా వీళ్ళిద్దరి మధ్య విరసం రోజురోజుకు ఎక్కువకాజొచ్చింది

"రఃలోగా రఃమె క్షయవ్యాధికి గురయింది అందువల్ల ఇతర విషయాల మీద రఃమె మనస్సును కేంద్రికరించలేదు

"వ్యాధిగ్రస్థురాలు ఒక క్షయరోగుల ఆస్పత్రికి వెళ్ళడం మంచిదని డాక్టరు చెప్పారు ఆమెకు ఇష్టం లేదు భర్తను అడిగింది అతను సరేనన్నాడు

కొద్ది రోజుల తర్వాత ఆమె ఒక సహాయకురాలిని వెంట పెట్టుకొని ఆసుపత్రికి వెళ్ళింది ఆ సహాయకురాలు సేవకురాలే కాదు స్నేహితురాలు కూడ రఃమె ఆమెపట్ల కఠినంగా ప్రవర్తించేది అయినా ఆమె సహనం చూపి దీన్ని లక్ష్య పెట్టేది కాదు యజమానురాలయిన తన స్నేహితురాలును చాల శ్రద్ధతో, ఆసక్తితో చూసుకొనేది వీలయినంత వరకు ఆమె మంచి చెడ్డల్ని చూసుకొన్నది

"నాలుగేళ్ళు ఇలా ఉండి రచయిత్రి కన్ను మూసింది ఆ జీవితకథ అంతటితో ముగిసింది

వెనుక భర్త ఎటువంటివాడు సరయిన రీతిలో నడుచుకోలేదని తెలుసుకొని కుదుర్చుకున్న ఒప్పందం ఒక దాంపత్యంలో ఈ రూపం దాల్చింది

## 3

కొన్ని క్షణాలు మేమెవ్వరం ఏమీ మాట్లాడలేదు ఆ తర్వాతనేను, "ఇదంతా జరిగిన సంగతి అని మీరన్నారు లేకపోతే ఇలా సహించే భర్త ఒకడు ఉంటాడని నేను నమ్మి ఉండేవాడిని కాను" అన్నాను

బాబాయి, "వెనుకటి రోజుల్లో ఇలాంటి స్త్రీలు ఉన్నట్టుగానే నేటి కాలంలో ఇలాంటి పురుషులు ఉన్నారు భర్త ముఖ్య మనే సమాజంలో పత్ని, పత్ని ముఖ్యం అనుకొనే సమాజంలో పతి సహించుకొంటారు ఈ రెండింటికీ మనస్సే కారణం అన్నారు

# చట్టీ కారుడి తల్లి

కొన్నేళ్ళ క్రితం హుబ్లి నుండి బెంగుళూరుకు రైల్లో ప్రయాణం చేస్తూ నేను రెండవతరగతి పెట్టెలో కూర్చున్నాను అప్పటికా అందులో ముగ్గురు ప్రయాణికులు కూర్చున్నారు ఆ రైలు సాయంకాలం దావణగెరెకు వెళ్ళి ఉదయానికి బెంగుళూరు చేరుకుంది పెట్టెలో ఆరు బెర్తులు ఉన్నాయి లందులో ఒక బెర్తు ఖాళీగా ఉండడంచూసి కూర్చున్నాను

రైల్లో కూర్చున్న ఆ ముగ్గురు ప్రయాణికులు 'ఆంగ్లో ఇండియన్ జాతివాళ్ళు వీళ్ళ పట్ల మన ప్రజలు సామాన్యంగా తిరస్కార భావంతో వర్తిస్తారు నెను పుత్రవాడిగా ఉన్నా రోజుల్లో వీళ్ళను చట్టీకారులు అని పిలిచేవాళ్ళం ఇది తమిళ పదం చట్టీ అంటె షరాయి, కోటు, ఇంగ్లిష్ హ్యాట్, బూట్ చేరిన వస్త్ర సముదాయం సాధారణంగా వీటిని ధరించే వాళ్ళు ఆంగ్లేయులు వీళ్ళను పరాయివాళ్ళు, తెల్లవాళ్ళు అనడం వ్యవహారం తెల్లవాళ్ళు కాకపో యినా వాళ్ళలా దుస్తులు దరించిన ఠః ప్రజలు మనదేశపు నిస్సహాయ స్త్రీలు ప్రసవించిన ఆ తెల్లవాళ్ళ పిల్లలు వీళ్ళు చట్టీకారులు

వట్టీ కారుడంటేనే చులకనగా చూడడానికి ముఖ్య కారణం ఇదే ఠః పిల్లల్ని కన్న ఆంగ్లేయుల్లో చాలమంది వీళ్ళని తమపిల్లలుగా పరిగణించలేదు ఆ తల్లి మనదేశపు ఒక ఆడపడుచు ఆమెజాతి ఏదయినా, ఇలాంటి శిశువును కన్న తర్వాత సమాజంలో ఠఃమె చివరి స్థానాన్ని పొందినట్టే స్త్రీగా పుట్టిన పాపానికి తల్లికావాలి తల్లయిన పాపానికి తలదింపుకోవాలి ఎలాగో జీవితాన్ని గడపాలి సమాజంలో ఇలాంటిపిల్లల స్థానం ఎలాంటిదో, చెప్పాల్సిన పనిలేదు

ఆంగ్ల ప్రభుత్వం ఇలాంటి పిల్లల విషయంలో ఆసక్తి వహించి ఠః ప్రజల విద్యకోసం అంతో ఇంతో కృషి చేయడంవల్ల ఠః ప్రజలు కొద్దో గొప్పో విద్యావంతులయ్యేవారు రైల్వే శాఖలో చాలవరకు టికెట్ కలెక్టర్, గార్డ్ మొదలైన ఉద్యోగాలను ప్రభుత్వం ఠ. ప్రజలకు కేటాయించి, వీళ్ళలో చాలమందికి జీవనోపాధిని చూపెట్టింది అయితే కన్న తండ్రి గాలికి వదలి పెట్టగా ఆధారంలేని తల్లి చేతిలో పెరిగిన ఠ. ప్రజలు తమ నడవడికల్లో ఏమాత్రం, వినయం పెంచుకోలేదంటే ఆశ్చర్య పడాల్సిన అవసరంలేదు వీళ్ళలో టికెట్ కలెక్టర్‌గా ఉన్నవాళ్ళు వచ్చీరాని ఇంగ్లీషు మాట్లాడుతూ, ప్రయాణీకుల నుండి అన్యాయంగా డబ్బు గుంజేవాళ్ళు తక్కినవాళ్ళు కూడ ఇలాంటి జీవితాన్నే గడుపుతూ, దేశంలోని ఇతర ప్రజలతో సంబంధం పెట్టుకోకుండా తమదే అయిన ఒక ప్రత్యేక సమాజాన్ని నిర్మించుకొని జీవనం గడుపుతున్నారు

ఠః జాతి ప్రజలలోని కొంత మందిని నేను నా చిన్నతనం నుంచి చూస్తున్నాను వీళ్ళు తాము వేరే అనే విధంగా దూరంగా నిలబడేవారు వీళ్ళలో కొంతమందిని పని నిమిత్తం కలుసుకొన్నప్పుడు కూడా ఇలాగే ప్రవర్తించేవారు

రైలుపెట్టెలో ఉన్న ముగ్గుర్లో ఒకతను ఏదో చెప్తుంటే మిగిలిన ఇద్దరు వింటున్నారు ఆ ఇద్దర్లో ఒకడు కాస్త వయసయినవాడు ఒకడు యువకుడు వాళ్ళు మాట్లాడు కొంటున్నది ఇంగ్లీషులో అని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు ఆ ఇంగ్లీషు వీళ్ళదే అయిన ఒక రకమైన ఇంగ్లీషు నేను వీళ్ళ మాటల్ని లక్ష్యం చేయక నా అంతట నేను ఒక పుస్తకం చదువుతూ కూర్చున్నాను పదినిమిషాల తర్వాత నేను కూర్చున్న బెర్తుమీద కాళ్ళు చాచుకొన్నాను

క్రిందమూడు బెర్తులున్నాయి రాత్రికి నేను న్యాయంగా పైనున్న ఒక బెర్తుమీదికి వెళ్ళాలి ప్రస్తుతం నేను కూర్చున్న బెర్తుమీద కాళ్ళు చాచగానే ఠః ముగ్గుర్లో యువకుడయినవాడు నా వైపు అదోలా చూశాడు

దీన్ని గమనించి నేను, "I shall take one of the upper berths when

you gentlemen spread your beds on these berths" (మీరు ఈ బెర్తుల మీద పడుకొన్న తర్వాత నేను పై బెర్తు మీదికి వెళ్తాను) అన్నాను

"Oh, no, Sir, you are welcome to use that berth one of us will go up We are all youger" (అయ్యో వద్దండి, మీరు అదే బెర్తుమీద ఉండండి మాలో ఎవరైన ఒకరం పై బెర్తు మీదికి వెళ్తాము మేమందరం మీకంటే చిన్న వాళ్ళం) అన్నారు

నేను, "Really? How good you are! thank you very much" (అలాగా? మీరు చాలమంచివాళ్ళు, నాకు ఉపకారం చేశారు) అన్నాను వీళ్ళలో కూడ వినయం ఉందనుకొన్నాను పుస్తకం వైపు చూపు మళ్ళించాను

ఒక నిమిషం తర్వాత నాతో మాట్లాడిన వ్యక్తి చెప్పిన ఒక మాటను విని ఎదుటివ్యక్తి "Your mother did this!" (మీ తల్లి చేసిందే ఇది) అని అడిగాడు

ఇతను, "Yes, she did She told the Superintendent 'if you push these boys to a strike you will be merely telling your superiors that you cannot manage things When I tell these fellows anything reasonable they always obey They will surely do so if you order anything reasonable Don't ask them to starve That is not reasonable Guarantee them a full meal as you do to yourself and they will answer your whistle, Would you believe it? He said 'you speak sense, Mrs Whiton Tell them not to think of a strike I shall see what I can do to meet their present difficulties? My mother asked us to be patient and wait for three days We waited The superintendent ordered the opening of a fair price store in the colony The trouble blew over "

("అవును ఆమె చేసింది ఆమె సూపరింటెండెంటుతో 'మీరు ఈ యువకుల్ని సమ్మె చేయకుంటే దారిలేదు అనేంతగా బాధించారు మీ పై

అధికారులకు మీరు పనిని సక్రమంగా చెయలేని అసమర్థుడు అనే విషయాన్ని తెలియజేస్తున్నారు అంతెందుకు? న్యాయంగా చెప్తే వీళ్ళు తప్పక వింటారు అలాంటి న్యాయంగా ఉన్నపనిని మీరు ఏది చెప్పినా వీళ్ళు చెస్తారు సగం పొట్టకు తిని ఊరకుండమని శాసించకండి అది న్యాయంకాదు మీరు కడుపునిండా తింటున్నట్టే వీళ్ళు కూడా కడుపునిండా తినేలా చూసుకోండి మీ కను సైగల్లో వీళ్ళు మెలగుతారు' అన్నారు మీరు నమ్ముతారో లేదో సూపరింటెండెంట్, 'శ్రీమతి వీట్సన్ మీరిలా అడగడం సమాంజసంగా ఉంది యువకులతో సమ్మె చేయకండని చెప్పండి వాళ్ళ సమస్యల్ని నివారించడానికి నేను ప్రయత్నిస్తాను' అన్నారు మా తల్లి మాతో మూడురోజులు ఓపిక పట్టండని చెప్పింది మేము సరే అన్నాము సూపరింటెండెంట్‌గారు మావాడలో వాకా దుకాణాన్ని తెరిపించాడు మా సమస్యలు తీరాయి

ఎదుటి వ్యక్తి 'మదర్ (తల్లి) అనగానె నా దృష్టి వీళ్ళ మాటల వైపు మళ్ళింది నేను అతను చెప్పినదంతా విన్నాను ఇతను ఇతని అనుచరులు సమ్మెను వేయాలనుకుంటున్న సమయంలో ఇతని తల్లి సూపరింటెండెంటును కలపి మాట్లాడివాళ్ళ సమ్మె చెయడాన్ని తప్పించిందని తెలుసుకొన్నాను కార్మికులవాడలో ఇలాంటి బుద్ధిమంతురాలయిన స్త్రీ ఉండడం నాకు సంతోషం కలిగించింది నేను "క్షమించండి, మీరు పని చేస్తున్న సంస్థలో మీరందరూ సమ్మె చేయాలనుకొన్నప్పుడు దాన్ని మీ తల్లి తప్పించారని అంటున్నారు కదా!" అని అడిగాను మేమిద్దరం ఇంగ్లీషులోనే మాట్లాడుకొన్నాము ఇక్కడ దాని అర్థం చెప్తున్నాను ఇక ముందు తెలియ జేసే విషయాలన్ని నేను ఇతనితో, ఇతని స్నేహితులతో మాట్లాడిన విషయాలను అలాగే తెలియజేస్తున్నాను

అతను "ఔనండి" అన్నాడు

"మీ మాటల మధ్య ప్రవేశిస్తున్నాను ఇది అనుచితం నన్ను మన్నించండి తప్పని తెలిసినా రెండుమాటలు మాట్లాడాలనిపిస్తోంది కారణం మీ తల్లిగారిని గురించిన ఈ విషయం చాల ఆసక్తికరంగా ఉంది ఎంతకాదన్నా మీ తల్లి ఒక అసాధారణ స్త్రీ అసాధారణమేమిటి,

అపూర్వమయిన స్త్రీ అన్నా సరిపోతుంది"

"నిజమేనండి మా తల్లి సామాన్య స్త్రీ కాదు మీరు అన్నట్టుగా ఖచ్చితంగా ఆమె అపూర్వ ప్రతిభగల స్త్రీ తమరు వినేటట్టయితే ఆమెను గురించి కొన్ని విషయాలను నేను మీకు వివరించగలను"

నేను "అలా వేయడం మీ మాటల మధ్య నేను ప్రవేశించినట్టవుతుంది" అన్నాను

ఎదుటి వ్యక్తి, "అలా ఏం లేదండి మేము నిజంగా అతని తల్లి విషయం అడుగుతున్నాము ఆమె ఎలా ఇలాంటి సమస్యల్ని పరిష్కరించిందనే విషయాన్ని మా మిత్రుడు తెలియజేస్తున్నాడు అందువల్ల మధ్యలో మీరు ప్రవేశించినట్టుకాదు అదే విషయం ముందుకు కొనసాగుతుంది," అన్నాడు

నేను, "అలాగయితే నాకు ఇలాంటి అపూర్వ స్త్రీని గురించి వినడం సంతోషంగా ఉంది అందులోనూ, ఆ విషయాన్ని తెలియజేస్తున్న మీరు ఆమె కొడుకు కావడం అదృష్టంగా భావిస్తున్నాను అలాంటి తల్లికి తగిన కొడుకుగా మీరు ఉండడం నాకు మరింత సంతోషాన్ని కలుగజేస్తున్నది" అన్నాను

అప్పుడాయన ఎన్నో విషయాలను తెలియజేశాడు వాటిలో కొన్నిటిని ఇక్కడ తెలియజేస్తాను

## 2

ఇతని తండ్రికి మదరాసులోని రైల్వే వర్క్‌షాపులో పని జీతం కూడ తగినంతగా వచ్చేది వీళ్ళ తల్లి దండ్రులకి వీళ్ళు ముగ్గురు అన్నదమ్ములు, ఒక చెల్లి ఉండేది మంచి సంసారం ఇలాంటి సందర్భంలో ఏదో చెడు సహవాసంవల్ల ఇతని తండ్రి దారి తప్పాడు త్రాగుబోతయ్యాడు అతను అంతకుముందు కూడా తాగేవాడు అయితే దానికి ఒక హద్దు ఉండేది ఇప్పుడా హద్దు దాటిపోయింది ఇంటి ఖర్చులకు డబ్బులేదు ఇతని తల్లి ఇంటి ఖర్చులకోసం డబ్బు అడిగి అడిగి విసిగి వేసారి పోయింది నాలుగు నెలల తర్వాత ఒకరోజు భర్తతో "నాకు డబ్బిస్తావా? లేక ఈ పిల్లల్ని నువ్వే

చూసుకొంటావా?" అని అడిగింది అతను "ఇవ్వక పోతే నేవేం చేస్తావు?" అన్నాడు ఆమె, "నేను వేరె దారి ఏదైనా చూసుకొంటాను" అంది "నన్ను నా పిల్లల్ని వదలిపెట్టి?" "అవును, ఇల్లు నీది, పిల్లలు నీవాళ్ళు, వాళ్ళను చూసుకోవడానికి నన్ను పెట్టుకొన్నావు నేను చూసుకొన్నది చాలని నీవు చెప్తె నేను వెళ్ళి పోతాను" భర్తకు కాస్త బుద్ధి వచ్చింది రెండు నెలలు జీతంలో సగం ఇంటి ఖర్చుల కోసం ఇచ్చాడు మూడో నెల ఇవ్వలేదు ఇతని తల్లి "సగం జీతం ఇంటి ఖర్చుకు ఇవ్వకపోతే నేను ఇక్కడ ఉండను మీ ఆఫీసుకు వస్తాను మీ సూపరింటెండెంట్‌కు చెప్పి, జీతం రోజు సగం జీతం నాచేతికి, తక్కిన సగం నీ చేతికి ఇచ్చేలా చూస్తాను" అంది అతను ఇది తన మర్యాదకు లోటు అన్నాడు ఆమె "అది సరే, అయితే పిల్లలు కడుపుకు తిండిలేక చస్తారు, లేదా భిక్షమెత్తడానికి బయల్దేరితేను నీ మర్యాద మిగులుతుందా?" అని ప్రశ్నించింది మాట మాట పెరిగి చివరికి ఆమె కోరినట్లె డబ్బు ఇవ్వడానికి ఏర్పాటయింది

నాలుగేళ్ళు గడిచాయి తల్లి పిల్లల్ని స్కూలుకు చేర్పింది చదువుకొన సాగేలా చూసింది రెండేళ్ళ తర్వాత పెద్ద కొడుకును తండ్రి వర్క్‌షాప్‌లో పని నేర్చుకోవడానికి వదలిపెట్టింది నాలుగేళ్ళ తర్వాత అతనికి ఒక ఉద్యోగం వచ్చేలా చేసింది ఆ సంవత్సరం తాగుబోతు భర్త మరణించాడు

భర్తకు చెందిన ఫండ్ డబ్బు మొత్తం చేతికి వచ్చింది అయితే నెల నెలా వచ్చె జీతం లేకుండా పోయింది ఫండ్ డబ్బును వడ్డీకిచ్చింది దాని మీద వచ్చె వడ్డీతోను, పెద్ద కొడుకుకు వచ్చె చిన్న పాటి జీతంతోను సంసారం గడపాలి ఆమె తన రెండో కొడుకయిన ఇతన్ని పిలుచుకొని అనాధాశ్రమం యజమాని దగ్గరికి వెళ్ళింది తాను విధవ, పెద్ద కొడుకు జీతంతో సంసారం గడవదు, ఈ అబ్బాయి స్కూలుకు వెళ్ళాలి, ఇంకో అమ్మాయి కూడ ఉంది, తమకేదైనా సహాయం చేయమని వేడుకొంది అతను, "ఇది అనాధ బాలలకోసం ఏర్పడ్డ సంస్థ, పోషకులు ఉన్న పిల్లల్ని మేము ఇందులో చేర్చుకోము" అన్నాడు ఈ తల్లి "ఈ అబ్బాయి ఒక్కడే వచ్చి తనకెవరూ గతిలేదని చెప్పివుంటే మీరేం చేసేవారు?" అని అడిగింది

"విచారించి ఎవరూ లేరని తెలుసుకొన్న తర్వాత చేర్చుకొనేవాళ్ళం" "ఎవరూ లేరని తెలుసుకొంటామన్నారు?" "ఎవరూ లేరని ఇతను చెప్పాలి ఇతను మా బిడ్డని చెప్పేవాళ్ళు ఎవరూ ఉండకూడదు" "సరే అయితే వీడూ నేను ఒక్కొక్క అబద్ధంచెప్తే మీ సహాయం పొందడానికి అర్హులవుతాము ఇప్పుడు మేము నిజం చెప్తున్నాము కనుక మీరు సహాయం చేయడానికి సాధ్యం కాదు" ఆయన నవ్వారు "మీరు సాధారణ స్త్రీ కారమ్మ మూడు రోజులు వదలిపెట్టేరండి ఏం చేయాలో ఆలోచిస్తాను"అన్నాడు మూడు రోజుల తర్వాత వెళ్తే, "అనాథ కాదు, 'దరిద్రుడ'ని ఇతన్ని చెర్చుకోవడానికి అనుమతి తీసుకొన్నాను అలా చెరుస్తారా?" అని అడిగాడు ఆమె, "దరిద్రులమయ్యాము అలాగని చెప్పుకొంటే తప్పేమిటి? మీ యిష్టం వచ్చినట్టు పిలవండి సహాయం చేయండి" అంది కుర్రవాడు చదువుకోవడానికి ఏర్పాటయింది ఇతను ఆ స్కూల్లో చదువుతూ వారంలో రెండు రోజులు తల్లి దగ్గరికి వస్తూ పోతూ చదువు కొనసాగించాడు

ఒక సారి వీళ్ళ పరిచయస్తులలో ఒకడితో ఆమె తన కష్టాన్ని చెప్పుకుంది అతను "మీరు చూడడానికి అందంగా ఉన్నారు మీకు ఇంత కష్టం రావాల్సింది కాదు" అన్నాడట ఆమె "మళ్ళీ పెళ్ళి చేసుకోమంటున్నారా? ఈ పిల్లలతో నేను వస్తానంటే ఎవరైనా నన్ను పెళ్ళి చేసుకొంటారా?" అంది అతను, హా, హూ అంటూ అస్పష్టంగా ఏదో అన్నాడు ఆమె, "ఇలాంటి విషయాలను మూసి పెట్టడంలో ప్రయోజనం లేదు విప్పి చెప్పాలి అలా విప్పి చెప్పలేనివారు ఇలాంటి విషయాలను ప్రస్తావించకూడదంది క్షణం తర్వాత, "నేను మీ సోదరి అని భావించి నాకేం చెప్పవచ్చో అది చెప్పండి నేను కూడ మీ సోదరి అయివుంటె ఏమి చెప్పేదాన్నో నేను దాన్ని చెప్తాను నేనున్నా ఈ పరిస్థితిలో నా పిల్లలు నా విషయంగా సిగ్గుపడనట్టుగా నడచుకోవడం నా ఉద్దేశం ఈ నా వయస్సులో నేను సుఖాన్ని ఆశించడం లేదు సుఖాన్ని ఇవ్వగలనని కూడ నేను అనుకోవడం లేదు ఏమంటారు? అంది ఆ వ్యక్తి నోరు మెదపక వెళ్ళిపోయాడు

ఒక సారి ఇతని వదిన ఇతని తల్లి విషయంలో అవివేకంగా

మాట్లాడింది అందుకామె కొడలిని గట్టిగా మందలించింది ఆమె భర్తతో వాదీలు చెప్పింది అతను తల్లితో "నీవు ఊరకె ఉండమ్మా, నువ్వొక ముసల్దానివి" అన్నాడు ఇతనూ ఆ సమయంలో అక్కడే ఉన్నాడు ఇతని తల్లి, 'అరె నా కన్నకొడుకా, నన్నిలా అనడానికి సిగ్గులేదా? నేను ముసలిదాన్నే పదిమందిని కన్నదాన్ని ఇంకా కన్యగా ఉంటానా? ముసలిదానిగా ఉంటానా?" అని రవికె విప్పి, తన స్తనాలను చేత్తో పట్టుకొని, ముందుకు లాగి "అందుకొ ఈ నా రొమ్ములు వ్రేలాడుతున్నాయి ఇది వ్రేలాడడానికి కారణం నీకు తెలుసా? నీవు, నీతోపాటు పుట్టిన పిల్లలు ఈ రొమ్ము పాలను త్రాగి పెరిగారు అందుకే ఇవి వ్రేలాడుతున్నాయి ఇందుకని నీవు నాకు మర్యాద చూపిస్తావా? లేక ఇదొక అపరాధమని అవమానం చేస్తావా?" అంది ఆ కొడుకు పరుగునవచ్చి ఈమె ఎదురుగా మోకాళ్ళ మీద కూర్చుని, "అమ్మా, తప్పు చేశాను, క్షమించు" అని వేడుకొన్నాడు

ఇతను పై మాటలు చెప్పి ఇలా అన్నాడు "నాకూ చాల బాధ కలిగిందండి, నేను కూడ ఏడ్చాను నేనూ, మా అన్న, ఇక మీదట ఎప్పుడూ తల్లిని ఇలాంటి మాటల్ని అనకూడదని ప్రమాణం చేశాము తల్లి "నాకు కోపం లేదయ్యా, నీవు బాధపడకు నాకు కావలసింది ఇంతే, నేను తల్లిగా సరిగ్గా నడచుకొన్నాను మీరు పిల్లలుగా సరిగా నడచుకోండి ఇంకేమీ నాకు అక్కర్లేదు" అన్నారు

మంచి పిల్లలుగా బ్రతకడం నేర్చుకోండని ఈమె వీళ్ళకు మొదటినుంచీ చెప్పిన పాఠం కష్టకాలంలో ఉన్న నాలుగు పైసలతో సంసారం జరపాల్సి వచ్చినప్పుడు, ఈ తల్లి ఆ రోజుకు అవసరమైన భోజనాన్ని సమకూర్చి, పిల్లలనందర్ని పిలిచి కూర్చోబెట్టి, వండిన వంటకాన్ని వాళ్ళకు పంచిపెట్టేది తనకోసం ఏమీ మిగుల్చుకొనేది కాదు ఖాళీ కంచాన్ని వాళ్ళ ముందుంచుకొని కూర్చునేది "మీరు నలుగురూ మీరై మీరు ఎంతిస్తారో అంత ఇవ్వండి అదే నా బాగం" అనేది పిల్లలు తమ తమ వంతును ఆమె కంచంలో ఉంచేవారు అది కొన్ని సమయాల్లో సరిపోయేది, కొన్ని సమయాల్లో సరిపోయేది కాదు తల్లి ఇంకాస్త పెట్టండని పిల్లల్ని ఎప్పుడూ అడిగేదికాదు

పిల్లలు తమలో తాము మాట్లాడుకొని ఒకరుకాక పోతే మరొకరు, తల్లి చాలు చాలు అనేంతవరకు ఇక కాస్త తీసుకో, ఇక కాస్త తీసుకో అని అనాలని మాట్లాడుకొన్నారు

ముగ్గురు మగ పిల్లలూ పెరిగి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు పెళ్ళి చేసుకొని సంసారం చేస్తున్నారు ఒకడు మదరాసులో, మరొకడు హుబ్లిలో, ఇతడు బెంగుళూరులో పని చేస్తున్నాడు కూతురికి కూడ వివాహం జరిగింది, ఆమె కూడ సుఖంగా ఉంది అయితే ఈ తల్లి ఎవ్వరితోను ఉండడానికి ఇష్టపడలేదు "నా చేతకాని రోజు మీ దగ్గరికి వస్తాను" అంది బెంగళూరులో ఇతని ఇంటికి దగ్గర్లో ఒక అద్దె గది తీసుకొని జీవనం గడుపుతోంది

## 3

ఇతను మరికొన్ని వివరాలను కూడా చెప్పాడు అతడు చెప్పిన విషయాలను విన్న తర్వాత అదొక వ్యక్తి ఆత్మకథ అన్నట్టనిపించింది నేను "మీ తల్లి ఒక అపూర్వమైన స్త్రీ అనే విషయం నిజం శ్రీ " అని అతని పేరు మరచిపోవడంవల్ల కాస్త తడబడ్డాను అతను, విల్సన్, అండీ అన్నాడు నేను, "విల్సన్‌గారు, ఆమె స్థిర మనోభావం మీకూ కాస్త వచ్చినట్టనిపిస్తుంది" అన్నాను. ఆయన, "కృతజ్ఞుణ్ణి నేను తల్లికి తగ్గ కొడుగ్గా ఉండాలని ఇష్టపడేవాడని" అన్నారు నేను "మీరలా అనుకోవడం చాల న్యాయంగా ఉంది నిజంగా మీరు నన్ను అపార్థం చేసుకోకపోతే నాకు ఆమెను చూడాలని ఉంది" అన్నాను అతను "మాతల్లి దీన్ని ఒక గౌరవంగా పరిగణిస్తుంది" అన్నాడు తన చిరునామా ఇచ్చాడు

అతని ఇంటికి నేను వెళ్ళలేదు ఆ తల్లిని చూడలేదు మా మధ్య జరిగిన సంభాషణను వ్రాసి పెట్టాలనుకొన్నాను అయితే రాయలేదు

## 4

ఈమారు నా కంటె వయస్సులో పెద్దవాడయిన ఒక మిత్రుడు అనారోగ్యంతో ఆస్పత్రిలో కొద్దిరోజులు ఉండాల్సివచ్చింది నేను ఆయనను చూడడానికి ఆస్పత్రికి చాల సార్లు వెళ్ళాను ఆస్పత్రిలో ఒక ఆంగ్లో ఇండియన్

నర్స్ ఆయన్ని చూసుకొనేది ఆమె చాల గుణవంతురాలిగా కనిపించింది తన కర్తవ్యాన్ని అతి శ్రద్ధతో నిర్వహించేది ఆరోగ్యం కుదుటపడి మిత్రుడు ఆస్పత్రి నుండి డిస్చార్జైనా అతన్ని ఇంటికి తీసుకురావడానికి నేను ఆస్పత్రికి వెళ్ళాను

అప్పుడు కూడ ఆ నర్స్ అక్కడే ఉంది ఆయన "మీరు నన్ను చాల బాగా చూసుకొన్నారు, నెల్లి మీరు చాలా మంచివారు వీడ్కోలిస్తున్న సమయంలో నేను మీకు నా ఒకానొక కూతురుకు చెప్పేటట్టుగా, మీరు మంచి భర్తను సంపాదించి, సుఖ సంసారం చేసి, సంతానం పొందాలని ఆశీర్వదిస్తున్నాను" అన్నారు

ఆ అమ్మాయి "కృతజ్ఞురాలిని మీ ఆశీర్వాదం ఫలిస్తుంది నేను సుఖంగా జీవిస్తాను అయితే ఒకటి మాత్రం జరగదు నాకు మంచి భర్త లభించదు నేను పిల్లల్ని కనను" అంది

"ఎందుకిలా అంటారు?"

"ఎందుకంటే మన సమాజంలోని యువకులు పెళ్ళి చేసుకొనే వయసు వచ్చేసరికి తప్పక త్రాగుబోతులవుతారు నేను పెరిగిన వాతావరణంలో నాకు త్రాగుబోతులంటే అసహ్యం అందువల్ల నేను పెళ్ళి చేసుకోవడమనేది సాధ్యం కాదు"

మిత్రుడు, "మీ మాటలు నాకు చాలా బాధ కలిగిస్తున్నాయి" అన్నారు నేను "మీరింత త్వరగా నిరాశ చెందకూడదు తల్లి మీ సమాజంలో కూడ త్రాగుబోతు కాని యువకుడు ఉండే ఉంటాడు" అన్నాను ఆమె "అది నిజమేనండి, అయితే అతన్ని పట్టుకోవాలంటే బాగా వెదకాల్సి వస్తుంది" అంది

నేనూ నా మిత్రులూ వెళ్ళి బండిలో కూర్చున్నాము బయల్దేరుతూ నేను "మీపేరేమిటమ్మా?" అని అడిగాను

"నెల్లి" అంది

"అది మీ పేరు, మరి మీ యింటి పేరేమిటి?"

"విట్‌సన్ అండి"

"విట్‌సన్" పేరు వినగానే నాకు రైల్లో ప్రయాణంచేసిన ఆ చట్టీకారుడు స్మరణకు వచ్చాడు నేను "ఎంత ఆశ్చర్యం! కొన్నేళ్ళ క్రితం హుబ్లినుండి వస్తూ రైల్లో ఈ పేరున్న ఒక గృహస్థుణ్ణి చూశాను అతను మీకు బంధువవుతాడా?" అన్నాను

"జ్యాక్ విట్‌సన్ అనే పేరండి? ఇక్కడి రైల్వే వర్క్‌షాప్‌లో ఫోర్‌మన్‌గా ఉన్నవారా?"

"అవును"

"ఆయన నా తండ్రి"

"నాకు చాల ఆశ్చర్యం వేసింది ఆమె నాయనమ్మ విషయం తెలియజేసి ఈమె అతనికూతురే అని నిశ్చయించుకొన్నాను అలాంటి నాయనమ్మకు ఇలాంటి మనుమరాలు ఉండడంతో ఆశ్చర్యం లేదనిపించింది ఇంటికి వస్తూ ఈమె తండ్రి నాకు చెప్పిన సంగతులన్నిటిని స్నేహితులకు చెప్పాను ఇప్పుడు మీకూ చెప్పాను

# కుచేలుడి భాగ్యం

"శ్రీ కృష్ణుడంతటి ప్రభువు స్నేహితుడై ఉండగా మీరిలా ఉపవాసాలతో ఎందుకు కాలక్షేపం చేయాలి? వెళ్ళి ఆయన్ని చూడండి ఇచ్చినదాన్ని తీసుకురండి హాయిగా భోజనం చేసుకుని ఉందురు గాని"

సుధాముడి భార్య ఆయనతో ఈ మాటల్ని ఇంతకు మునుపు వందసార్లు చెప్పింది ఆ రోజు చెప్పింది నూటొక్కసారి

ఇంతకు మునుపు నూరుసార్లు అతను "ఈ ఉపవాసాలతో కాలక్షేపం చెయడం అనేది మా పెద్దలు మొదట్నుంచి ఆచరిస్తూ వచ్చిన కులధర్మం దాన్ని నెనెందుకు విడనాడాలి?" అని అన్నాడు అయితే ఆరోజు మాత్రం అలా అనలేదు ఆయన భార్య క్రిందటి రొజు రాత్రి భోజనం లేకనే పడుకొంది తన వ్రతం కోసం ఈ అమాయకురాలు కృశించి మరణించడం భావ్యంకాదను కొన్నాడు అందుకే ఆ రోజ "అలాగే వెళ్ళి చూస్తాను" అన్నాడు

భార్యకు ఎక్కడ్డ లెని సంభ్రమం ఆమె "వెళ్తూ వట్టి చేతుల్తో వెళ్ళడం బాగుండదు" అంది తాను పనుల్లో సహాయం వెస్తున్న ప్రక్కింటి శ్రీమంతుల ఇంటికి వెళ్ళి కొద్దిగా అటుకుల్ని తెచ్చి, భర్త కొంగులో కట్టి "వెళ్ళిరండి" అంది

సుధాముడే కుచేలుడని చెప్పాల్సిన పనిలేదు ఆయనమీదున్న ఉత్తరియం పాతదెకాదు బాగా మాసిపోయింది కూడ అందువల్లే ప్రజలు ఎప్పటినుంచో ఆయన్ని కుచేలుడని పిల్చేవారు కుచేలుడన్న పేరు సార్థక నామధేయంగా మారింది, అతని పేరు సుధాముడనే విషయాన్నే లోకం పూర్తిగా మరచిపోయింది

మిత్రుణ్ణి చూడడానికి బయల్దేరిన తర్వాత మార్గ మధ్యంలో నడుస్తున్న కొద్దీ, శ్రీ కృష్ణుడికి తన జ్ఞాపకం ఉంటుందో ఉండదో అన్న సంశయం కుచేలుడికి ఏర్పడ సాగింది ఈ సంశయం ఎంత దాకా చోటు చేసుకొన్నదంటే శ్రీ కృష్ణుడి నగరం ద్వారకను ప్రవేశించగానే "ఇదేమిటి ఈ పిచ్చి? రాజయిన కృష్ణుడు నన్నెలా జ్ఞాపకం ఉంచుకొని ఉంటాడు? మౌనంగా ఇంటికి వెళ్ళిపోవడం మంచిది" అనిపించింది

## 2

కుచేలుడు ఇలా అనుకుని నిలబడ్డాడు నిలబడ్డాడు కాని వెనుదిరిగి వెళ్ళడానికి మనసొప్పలేదు కృష్ణుణ్ణి గురించి ఇలా ఆలోచించడమా? అంతేకాదు వెనక్కి వెళ్ళిపోతే పెళ్ళాం తననేమంటుంది? ఆమె కృష్ణుణ్ణి చూసింది కాదు అయినా ఆమెకు కృష్ణుడు తన భర్తను ఎప్పుడూ తలచుకొంటున్నాడనే నమ్మకం ఉంది తాను కృష్ణుణ్ణి చూసినవాడు తనకు ఇలాంటి సందేహమా?

కృష్ణుడు రాజకుమారుడే అయితే అతను రాజ కుమారుడన్న అహంకారంతో ఎప్పుడు ప్రవర్తించాడు? అన్న బలరాముడు అతనితో ఎన్నో సార్లు అందరితోను అంత చనువుగా ఎందుకు వర్తిస్తావని ఆక్షేపించాడు. కృష్ణుడు దానికి సమాధానంగా "అన్నయ్యా, నేను బాగా గమనించాను వాళ్ళ చర్మంకూడా నీ చర్మం, నా చర్మంలాగానె ఉంది చెట్టు బెరడుతో చేయలేదు"

"చర్మం వేరని ఎవరన్నారు? పులి, పాము, పక్షి చర్మం కూడా ఇంచుమించు ఇలాగే ఉంటుంది"

"అంటే నేను పులి, పాము, పక్షి నాలాగానే అన్న విధంగా ప్రవర్తిస్తాను నీవు సహించు కోవాలి"

అన్న కిలాంటి జవాబిచ్చిన శ్రీ కృష్ణుడు నేడు మరోలా ప్రవర్తిస్తాడా? ఛీ ఛీ అలా అనుకోవడం పాతకం

ఇలా అనుకుంటూ సుధాముడు అడుగు ముందుకు వేశాడు అలాగే

అతని మనస్సుకు ఇలా నటుకున్న తట్టింది "ఊరికే వెనుదిరిగి వెళ్ళిపోతే భార్య మరి కొంత కాలం అన్నంలేక పడుకోవాల్సి వస్తుంది"

ఆయనకు స్వయానుభవంలో తెలుసు కడుపు నిండితే చాలు ఐశ్వర్యంతో పనిలేదు ఆకలి పొట్టతో పడుకుంటే నిద్రరావడం కష్టం మళ్ళీ అతనికి ఇలా అనిపించింది కృష్ణుడు మరచిపోయాడే అని అనుకుందాం, అందులో ఆశ్చర్యం ఏముంది? కృష్ణుడు అందరిలాంటి వాడయ్యాడు ఒకవేళ కృష్ణుడు మరవకపోతే కృష్ణుడు కృష్ణుడే

వెంటనే అతని మనస్సు కృష్ణుడు అందరిలాంటివాడా? ఎలాంటి ఆలోచన? కృష్ణునిలాగ ఎవరూ ఉండరు కృష్ణుడు ఎవరిలాగాను కాదు కృష్ణుడు కృష్ణుడే

ఇలా ఆలోచించి నిశ్చయించుకొన్న తర్వాత మనస్సు తేలికపడి నగరంలో ప్రవేశించాడు

## 3

అతను ఊళ్ళో ప్రవేశించగానే సరిగ్గా ఎదురుగా ఒక ఊరేగింపు వస్తోంది మధ్యలో ఒక చిన్న తేరులో ఒక శిశువు కూర్చుంది దానిచుట్టూ చాలమంది నడచి వస్తున్నారు అదేదో పండుగలా ఉంది

సుధాముడు ఒక ప్రక్కగా నిలుచున్నాడు అప్పుడతనికి కృష్ణుడు ఆ తేరు ప్రక్కగా నడచి వస్తుండడం కనిపించింది అలాగే కృష్ణుడు కూడ తనను చూసినట్టనిపించింది

చూశాడా? గుర్తించాడా

ఇలా అనుకుంటుండగానే 'అన్నయ్య' అని కృష్ణుడు పిలవడం ఇతనికి విన్పించింది రెండు క్షణాల్లో కృష్ణుడు ఇతని దగ్గరికి రావడం కూడ జరిగిపోయింది రాగానే ఇతన్ని ఆలింగనం చేసుకొని "ఇప్పుడే వస్తున్నావా" అని అడిగి, "రా ఆ శిశువును ఆలయంలో వదలి ఇంటికి వెళ్దాం" అని ఇతన్ని లాక్కొని మళ్ళీ తేరు దగ్గరికి వచ్చాడు

ఊహించని విధంగా శ్రీకృష్ణుడు తనపట్ల అక్కర చూపించడంతో సుధాముడు ఆనందంలో తన్ను తాను మరచిపోయాడు శ్రీకృష్ణుడు తన చెయిపట్టుకొని ఉండక పోయినట్టయితే క్రింద పడిపోయేవాడే కృష్ణుడే సుధాముణ్ణి దగ్గరికి లాక్కొని తనతోటివారితో, "ఈయన సుధాముడు, గురుకులంలో మా అన్నయ్య" అన్నాడు ఊరేగింపు పది అడుగుల్లో ఆలయం చెరుతుంది కృష్ణుడు తనతోటి వారితో "మీరు లోపలికి వెళ్ళి పూజ చేయిస్తుండండి నేను ఇతన్ని ఇంట్లో వదలిపెట్టి మళ్ళీ వస్తాను" అనిచెప్పి ఇతనితోపాటు ఇంటివైపు బయల్దేరాడు

సుధాముడు "రాజా, మీరు పూజ ముగించి రండి, ఆ తర్వాత నగరుకు వెళ్దాం" అన్నాడు.

కృష్ణుడు· "రాజు కాదు కొంచెం అన్నయ్యా,, రండి కాదు రా"

శ్రీరాముడు "అలాగే, పూజముగించుకొని రా"

కృష్ణుడు "ఆ, అలా అన్నావ్ బాగుంది అయితే నేను లేకపోతే పూజకే లోపం రాదు నీవు దూరంనుంచి వచ్చావు నిన్ను చూసుకోవడం కూడ పూజలాంటిదే గురుదేవుల మాట నీకు జ్ఞాపకం లేదా ? అతిథి దేవోభవ"

కుచేలుడు తనలో ఇలా అనుకొన్నాడు "అవును కృష్ణుడిలా ఎవరూ ఉండరు కృష్ణుడు ఎవరిలాగానూ కాదు"

కొద్ది నిమిషాల్లో వీళ్ళు ఒక ఇంటి ముందుకు వచ్చారు ఇంటిముందు ఒక రాజస్త్రీ ఉండడాన్ని చూశాడు వీళ్ళను చూసి ఆమెలోపలికి వెళ్ళింది కూడా గమనించాడు ఈమె బహుశా కృష్ణుడి రాణి కావచ్చునేమోనని అనుకున్నాడు శ్రీ కృష్ణుడు, "ఆమె రుక్మిణి, మన రాకను చూసి ఆమె లోపలికి వెళ్ళింది" అన్నాడు

సుధాముడు మనస్సులో, "అలా లోపలికి వెళ్ళడం సమంజసంగా ఉంది భర్తతోపాటు ఎవరో వస్తుంటే అక్కడ నిల్చుండడం బాగుండదు కదా!" అనుకున్నాడు

ఒక్క క్షణంలో ఆమె బంగారు పాత్రను పట్టుకొని మళ్ళీ తలుపు దగ్గరికి వచ్చింది

రఃలాగా వీళ్ళు కాస్త ముందుకు వెళ్ళారు శ్రీకృష్ణుడి రుక్మిణితో, "గురుకులంలోని మా అన్నయ్యను గురించి నీకు చెప్పాను కదా ఎప్పుడో ఒకసారి వస్తారని కూడా చెప్పాను ఇదిగో వచ్చారు" అని అన్నాడు

దేవి నవ్వుతూ "ఆయనే వస్తారని ఊరకుంటే ఇలాగే జరిగేది చెప్పి పంపివుంటే ఎప్పుడో వచ్చి ఉండెవారు;' చూడాలని ఆశ, చెప్పి పంపలేదు, వారిదేమి తప్పు?" అంది

కృష్ణుడు "అన్ని తప్పులునావే, నాకు తెలుసు అయినా మా అన్నయ్య ఇక్కడ ఉండేదాకా ఆ తప్పుల్ని ఎత్తి చూపించుకు అతనికి ఆ తప్పుల్ని వినడం కష్టంగా ఉంటుంది"

రుక్మిణి, "అన్ని తప్పులూ మీకే ఎందుకని నేను ఒక తప్పును మీద వేసుకొన్నాను కదా" అని అంటూ దగ్గరికి వచ్చింది

"మీరు పిలిపించక పోయినా బావగారే జ్ఞాపకం చేసుకొని వచ్చారు. అదే సంతోషం" అంటూ కుచేలుడి కాళ్ళ మీద నీరు పొసింది. నెల మీద పడ్డ నీటిని తలమీద ప్రోక్షణం చేసుకుంది"

శ్రీ కృష్ణుడి "దీన్నే ఆడవాళ్ళ బుద్ధి అంటారు నా తలమీద రెండు చుక్కలు వేసి ఉంటే ఎవరు వద్దనేవాళ్ళు" అన్నాడు

రుక్మిణి, "భర్త తన్ను తక్కువగా చేసికోవచ్చు భార్య భర్తను, మీరు తక్కువనడానికి వీలవుతుందా?" అంది అతని మీద కూడ నీళ్ళను ప్రోక్షణం చేసింది

ఆ తర్వాత అందరూ లోపలికి వెళ్ళారు

4

కృష్ణుడు మిత్రుణ్ణి పరుపుమీద కూర్చోబెట్టాడు "అన్నయ్యకు వేరే

బట్టలు ఇవ్వు" అని రుక్మిణితో చెప్పాడు ఆమె పంచనీ, ఉత్తరీయాన్ని తెచ్చింది కృష్ణుడు స్నేహితుడి మీదున్న వస్త్రాలను తీసివేసి కొత్త బట్టల్ని ధరింపచేశాడు ఈలోగా రుక్మిణి లోపలికి వెళ్ళి రెండు బంగారు కంచాలలో ఫలహారాన్ని తెచ్చి వీళ్ళ ముందుంచింది

కృష్ణుడు మిత్రుడి వస్త్రాలను విప్పే సమయంలో ఉత్తరీయం కొంగులో ఒక ముడి ఉండడం చూశాడు ఇదేమిటంటూ ఆ గంటు విప్పాడు కృష్ణుడి మందిరాన్ని, వాళ్ళు ధరించిన వస్త్రాలని, వాళ్ళు తనకిచ్చిన పట్టు వస్త్రాలని, ఎదురుగా ఉంచిన బంగారు పళ్ళాలలోని ఫలహారాన్ని చూసి కుచేలుడి మనస్సుకు తన భార్య పంపించిన ఆ అటుకుల్ని ఒక పదార్ధంగా ఎంచడానికి సాధ్యం కాలేదు కృష్ణుడు గొప్పవ్యక్తి, కృష్ణుడు ఆ అటుకుల్ని చూసి హాస్యంచేయడు అని అతని మనసుకు తెలుసు అయితే రుక్మిణీ దేవి! రాజకుమారి, కృష్ణుడి పట్టపురాణి, ఈ ఐశ్వర్యానికి యజమానురాలు నవ్వక ఊరకుంటుందా? అని అతని అంతర్యం క్రుంగిపోయింది "అందులో ఏమీలేదు ఆముడి విప్పకు" అని తాను కృష్ణుణ్ణి ఆపాలి ఆపమని మనస్సు కూడ చెప్తోంది అలా అనడానికి నోరు రాలేదు ఆపడానికి చేతులురాలేదు కృష్ణుడు ముడి విప్పాడు ఆ రెండు పిడికిళ్ళ అటుకుల్ని చేతికి తీసుకుంటూ "ఏం అన్నయ్యా, వదినె నాకు పంపించిన అటుకుల్ని ఇవ్వడం మరచావా?" అన్నాడు ఒకిన్ని అటుకుల్ని నోట్లో వేసుకొన్నాడు "ఆహా, ఎంత తీయగా ఉన్నాయి" అన్నాడు

"తియ్యగా ఉన్నాయని అన్నీ మీరే తినకండి" అంటూ రుక్మిణి భర్త చేతినుంచి మిగిలిన అటుకుల్ని తీసేసుకుంది తాను కొన్ని అటుకుల్ని నోట్లో వేసుకుని "వీటిని తీసి ఉంచుతాను ఆ తర్వాత మళ్ళీ ఇస్తాను" అని మిగిలిన అటుకుల్ని ఒక గిన్నెలో వేసి ఉంచింది

శ్రీరాముడికి ఇదంతా సౌజన్యం కొసం వారలా ప్రవర్తిస్తున్నారని తెలుసు ఎలాగో ఆ అటుకుల వల్ల అవమానం జరగకుండా పరిసమాప్తి కావడం అతనికి సంతోషం కలిగించింది

ఆ తర్వాత శ్రీ కృష్ణ కుచేలులు ఫలహారం తీసుకొన్నారు కృష్ణుడు

రెండు సార్లు తన స్నేహితుడి చేతిలోని ఫలహారం ముక్కను తీసుకొని, తాను కొంత తిని, రుక్మిణీ దేవికి కొంత ఇచ్చాడు దాన్ని దేవి ప్రసాదంలా గౌరవ భావంతో స్వీకరించింది

సుధాముడు తాను ఊహించనంతటి ఆనంద సాగరంలో తేలిపోయాడు కృష్ణుడు ఎదురుగా ఉండడం వల్ల మనస్సును అదుపులో పెట్టుకో గలిగాడు రఃమె ఎంతటి సరళ సామ్రాజ్ఞి అని ఆశ్చర్యం చెందాడు ఇంతటి సుఖాన్ని పొందడానికి తానొక్కణ్ణే వచ్చానే, భార్య కూడ వచ్చి ఉంటే ఎంతబాగుండే దన్న కొద్ది పాటి అసంతృప్తిని అనుభవించాడు

5

కృష్ణుడి గురుకుల వాసపు స్నేహితుడు వచ్చాడని బంధువులందరూ ఒక్కరొక్కరుగా వచ్చారు సుధాముడికి ఎక్కడ లేని మర్యాదను చూపించారు శ్రీకృష్ణుడు వాళ్ళలో ఒక్కరికి సుధాముడని తన ముద్దుల అన్న అని, మరొకరికి శ్రద్ధావంతుడైన విద్యార్థి అని, మరొకరికి అచ్చమైన గురుభక్తుడని, ఇంకొకరికి అపారమైన గురుపత్ని శుశ్రూషకుడని పొగడి చెప్పాడు, ఒకరితో, గురుకులంలో రః మిత్రుడు తాను చిన్నవాడనే కారణంగా తన పనులన్ని చేసి పెట్టేవాడని, భోజనానికి ఆలస్యం అయితే విడిదికి వెళ్ళి ఒకింత ఫలహారాన్ని తెచ్చిచ్చి చూసుకునేవాడని, తెలియజేశాడు ఇలాంటి పొగడ్తలని వినడం సుధాముడికి ఇది మొదటిసారి ఇది అతనికి చాల సంకోచాన్ని తెచ్చి పెట్టింది అయితే చేసేదేమిటి? విధిలేదు అతను మిత్రుడి ప్రేమవాత్సల్యాలనే సుఖాన్ని అనుభవిస్తూనే రః సంకోచం వల్ల అతి కష్టాన్ని అనుభవించాడు

కృష్ణుడు మరుసటిరోజు ఇతన్ని అన్న బలరాముడి మందిరానికీ, తల్లిదండ్రుల భవనానికీ పిలుచుకొని వెళ్ళాడు వాళ్ళు ఇతన్ని చాల ఆప్యాయంగా పలకరించారు

కృష్ణుడి ఇతర భార్యల్లో సత్యభామాదేవి తప్ప అందరూ ఇతడు ఉన్న చోటుకే వచ్చి నమస్కరించి ఆశీర్వాదాలను పొందారు సత్యభామాదేవి మాత్రం పెద్దలు మా భవనానికి వచ్చి నమస్సుల్ని స్వీకరించి ఆశీర్వదించ

వలసిందిగా చెప్పి పంపింది సుధాముడు ఆమె భవనానికి వెళ్ళి ఆశీర్విదించి వచ్చాడు

ఇలా తనను అందరూ అతిగా గౌరవిస్తుంటే తానెంతటివాడో అన్న విషయం కూడ మరచిపోయాడు ఒక్కక్షణం అతనికి ఇదంతా వట్టి నటన అనిపించింది. అయితే ఏమిటి, నటన ఎలాంటిదయినా నిరాకరించడానికి వీలు లేదు కదా

ఒక రోజుండి మరుసటిరోజు భార్య కోరికని తెలిపి ఊరికి వెళ్ళాలనుకొనివచ్చిన ర: అనాధుడు, ఇంతగా వీళ్ళు తనని గౌరవిస్తుంటే, తన భార్య తనను ఎందుకిక్కడికి పంపించిందో కృష్ణుడికి చెప్పలేక పోయాడు రేపు చెప్తే సరిపోతుంది మరునాడు చెప్పుదాం అనుకుంటూ ఆ విషయం చెప్పడాన్ని ఒక్కొక్క రోజే దాటవేస్తూ వచ్చాడు. వారం గడిచింది ఇతను ఆ విషయం చెప్పలేదు శ్రీ కృష్ణుడు కూడ ఇతను ఊరికి వెళ్ళిపోవాలన్న విషయం గురించి ఏమీ తెలియనట్టు ఉండిపోయాడు

రోజూ తెల్లవారగానే పుష్కరిణికి వెళ్ళి స్నానం చేసివచ్చేవారు ప్రజలురావడం, వాళ్ళతో మాటలు, పూజ, భోజనం, కాస్త విశ్రాంతి మధ్యాహ్నం పాచికలాట సాయంకాలం సంగీతం, నృత్యం, ఆ తర్వాత పూజ, భోజనం, సల్లాపం, నిద్ర శ్రీరాముడు రాజమందిరంలో అనుభవిస్తున్న సుఖ సంతోషాలతో తేలియాడుతూ తనను తాను మరచిపోయాడు

ఆ పాచికలాట తీరో ? ఇతనికి ఆ పాచికలాట గురించి అంతగా తెలియదు కాని మొదటి రోజ మొదటి ఆటలోనే శ్రీ కృష్ణుణ్ణి ఓడించాడు రుక్మిణీదేవి ప్రక్కల్లో కూర్చుని వీళ్ళ ఆటని చూస్తూ, కృష్ణుణ్ణి తమాషా చేస్తూ, సుధాముణ్ణి ప్రోత్సహిస్తూ, స్నేహితుడే గెలవడానికి సహాయపడింది చివర్లో "చూడండి బావగారు! మీతో మొదటి ఆటలోనే ఓడిపోయిన మీ తమ్ముడు, ఇన్ని రోజులయినాతోకానీ, నాతోడి కోడళ్ళతోగాని ఇలా ఎన్నడూ ఓడిపోలేదు" అంది

కృష్ణుడు "మగవాడు మగవాడితో ఓడిపోవచ్చును స్త్రీలతో ఓడిపోతే మూర్ఖుడని అనరా ?"

రుక్మిణి, "న్యాయమె, ఎంత మగవాడితో ఓడిపోయినా ఇంట్లో భార్యతో ఓడిపోలేదన్న కీర్తి ఒక్కటే చాలదా మనిషికి?" అంది ముగ్గురూ నవ్వారు

# 6

ఇలా ఒక నెల రోజులు గడిచాయి, రెండు నెలలు గడిచాయి, మూడు నెలలు గడిచాయి, నాలుగు నెలలు గడిచాయి కృష్ణుడి ఇతను ఊరికి వెళ్ళే విషయం గురించి మాట్లాడనే లేదు చివరికి ఒకరోజు సుదాముడు రుక్మిణీదేవితో, "నేను రేపు ఊరికి వెళ్తాను, యజమానికి చెప్పి నాకు అనుజ్ఞ ఇప్పించండి" అన్నాడు దేవి "ఇంకా రెండు రోజులుండి వెళ్ళకూడదా మీది అతి కష్టపు జీవనం నాలుగు రోజులు తమలాగే మీరు సుఖంగా ఉండాలని మీ మిత్రులు మౌనంగా ఉన్నారు మీరిక్కడ ఎన్నిరోజులు ఉంటే ఆయనకు అంత సంతోషం" అంది

శ్రీ దాముడు, "అది నిజమే, అయితే నా భార్య రోజూ నేను వస్తానని ఎదురు చూస్తుంటుంది రోజూ నిరాశ చెందుతూ ఉంటుంది నేను మీ భోజనం చేస్తూ సుఖంగా ఉన్నాను అక్కడ ఆమె మా భోజనం చేస్తూ కష్టాల్లో ఉంది" అన్నాడు

దేవి, "మీ మిత్రులకు చెప్తాను, రేపు మీ ఊరికి వెళ్దురుగాని" అంది కృష్ణుడు రాగానే అతనికి విషయం తెలిపింది

కృష్ణుడు, "న్యాయమే కదా, అన్నయ్య నాతోపాటు ఉండమనడంలో నేను వదినగారి పరిస్థితిని చూడాల్సి ఉంది కదా? అన్నయ్య రేపు ఊరికి బయల్దేరనీ" అన్నాడు

సుధాముడికి చాల సంతొషం కలిగింది ఇక ఊరికి బయల్దేరవచ్చు?

ఊరికి వెళ్ళ వచ్చు సరే భార్య చెప్పి పంపిన పనిమాటేమిటి?

ఇలా ఆలోచించి అతనొక నిర్ణయానికి వచ్చాడు "మా బ్రతుకు మాది. ఆ జీవన విదానాన్ని మార్చమని మిత్రుడిని ఎందుకు అడగాలి? అతనే

ఏమయినా అడిగితే చెప్పవచ్చు వెనుగా ఈ మాటను ప్రస్తావించడం ఉచితం కాదు"

కృష్ణుడు తనకు తాను ఏమీ అడగలెదు ఇతనూ అతనికి ఏమీ చెప్పలెదు

7

మరుసటి రోజు లేచి శ్రీరాముడు శ్రీకృష్ణుడితో, "రాజా! నేను ఈ వస్త్రాలతో ఊరికి వెళ్ళలేను, నా పాత వస్త్రాలు ఎక్కడ?" అని అడిగాడు శ్రీకృష్ణుడు వాటిని తెచ్చి ఇచ్చాడు శ్రీరాముడు తానంతవరకు ధరించిన రాజ వస్త్రాలను తీసి వేసి, తన దరిద్రపు పాత వస్త్రాలను ధరించి ఊరివైపు బయల్దేరాడు

కృష్ణుడు అతనితో పాటు కొంత దూరం నడిచాడు దార్లో చిన్న ఏటి దగ్గర నిలబడి, "దేవి నీకు దీన్ని ఇవ్వమని చెప్పింది" అని దార్లో ఆకలయితే తినడానికి ఆకులో కట్టిచ్చిన భక్ష్యాల పొట్లం ఇచ్చాడు ఇతను ముందుకు నడిచాడు శ్రీకృష్ణుడు ఇతను కనుమరుగయ్యేంతవరకూ ఇతన్ని చూస్తూ నిలబడి, కనబడక పోగా వెనుదిరిగి వెళ్ళిపోయాడు

అతను భవనం చేరుకోగానే దేవి, "మిత్రుడికి హెచ్చరిక మాటలు చెప్పారా?" అని అడిగింది

కృష్ణుడు, "లేదు నోరు రాలేదు, అతని అంతర్యం అతన్ని కాపాడకపోతే నా హెచ్చరిక మాట కాపాడుతుందా అనిపించింది ఊరకుండిపోయాను" అన్నాడు

దేవి "పోని లెండి మీరు మంచి చేస్తే మంచి అవుతుంది ఆ స్వభావంలో కీడులేదు, మీరు చెప్పివుంటే, చెప్పాం, సరే, అనేవాళ్ళం చెప్పక పోయినా జరిగితే వాళ్ళదే ప్రేరణ, వాళ్ళదే భాగ్యం, అవుతుంది" అంది

శ్రీ కృష్ణుడూ ఏమీ చెప్పలేదు అతని కళ్ళలో నీరు కమ్మినట్టయింది అతని పెదవులు అదిరాయి అతను రుక్మిణితో, "అవును" అని సంజ్ఞ చేసి తన భావాన్ని కప్పిపుచ్చడానికి ముఖాన్ని మరో వైపు త్రిప్పాడు

# 8

సుదాముడు తన ఊరుచేరుకున్నాడు తన వీధిలో ప్రవేశించాడు తన ఇంటి వైపు చూశాడు. అక్కడ తన కుటీరం కన్పించలేదు ఇంతకు ముందు గుడిసె ఉన్నచోట ఒక దివ్య మందిరం ఉంది దాని ముందు భాగం శ్రీకృష్ణ రుక్మిణీ దేవిగారల భవనం ముందు బాగంలాగా ఉంది ఇదేమిటి? నిజమా? భ్రమా?

ఇదేమిటని ఎవరినైనా అడగాలి దగ్గర్లో ఎవరూ కనపడలేదు సరే అంటూ ముందుకు నడిచాడు భవనం వాకిట్లో ఒక యువతి కనిపించింది ఆమె పట్టు వస్త్రాలు ధరించింది ఆమె చేతిలో ఒక బంగారు బిందె రూపం వేరు లేకపోతే రఃమె రుక్మిణియే అన్నట్టుంది

సుధాముడు ముందుకు వెళ్ళి ఆస్త్రీతో, "నమస్కారం" ఇక్కడ మా కుటీరం ఉంది, కన్పించడం లేదు ఇంటావిడ ఎక్కడ?" అని అడిగాడు

"ఆ స్త్రీ నవ్వింది, ఇదేమిటి ఇలా మాట్లాడుతున్నారు? ఆ ఇంటావిడ నేనే అని తెలియడం లేదా?" అంది

సుధాముడు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు ఆమె చెప్పింది చెవులకు విన్పించింది ఈ స్త్రీ తన భార్యే అయితే ఇదేమిటి ఈ ఇల్లు?

భార్య దగ్గరకు వచ్చింది కాళ్ళమీద నీళ్ళు పోసింది "మీరు అక్కడికి వెళ్ళి ఉండిపోయారు మూడు రోజులకు మీ స్నేహితుల మనుష్యులు వచ్చారు ఈ ఇల్లు కట్టడం మొదలు పెట్టారు నెల రోజుల్లో ముగించారు దాని నిండా వాళ్ళ ఇంట్లో ఉన్న వస్తువులలాంటివి నింపారు. ఇంటిని సిద్ధం చేశారు యజమాని అక్కడే నాలుగు రోజులుండి వస్తారని మా అయ్యగారు చెప్పి పంపారు చింతించవద్దు అన్నారు గుడిసెని రాజభవనం చేశారు నన్ను రాణిలా ఉండమన్నారు చెప్తే వినలేదు మాకిదంతా సరిపడదు "అక్కడ మా అయ్యగారి ప్రకారం యజమాని రాజ వస్త్రాలు ధరించారు మీరు దేవిగారి వస్త్రాలు ధరించాలి అని అమ్మగారు చెప్పిపంపారు" అన్నారు సరే నన్నాను. ధరించాను చూడండి, ఈ బంగారు బిందె ఇంటినిండా ఇలాంటి సామాన్లే ఉగ్రాణం అంతఃపుర ఉగ్రాణమయింది" అంది

సుధాముడికి ఈమె చెప్తున్న ఒక్కొక్క మాటా ఒక విచిత్రంగా కన్పించింది ఇంటిలోనికి వెళ్ళగానే "మన గుడిసె ఎక్కడ?" అని అడిగాడు

"అదిగో ఆ మూలలో, తూర్పు వైపున"

సుదాముడు, "మా కొంటెవాడు ఎప్పుడూ ఇదే ఆట ఆడేవాడు ఇలా చేస్తానని నాతో ఒక్కమాట చెప్పకూడదా? చెప్తే, నేను వద్దంటానా అలా చెప్పడం వద్దని చేసి చూపించడమేనా? చేసేశాడు సరే, మిత్రుణ్ణి అడుగు, అడుగు అని పీడించేదానివి కదా, ఇప్పుడు తృప్తి అయిందా? లేదా?" అన్నాడు

భార్య, "తృప్తికాక మరేమిటి? ఈ చేయిమీకు రెండుపూటలా కడుపునిండుగా అన్నం పెట్టె పుణ్యం చేయని అని కోరుకున్నాను మీ మిత్రుడు ఈ మాటను నెరవేర్చాడు" అంది

సుధాముడు "మంచిదయింది, నీ ఆశ నెరవేరింది నా ఆశ ఒక్కటి మాత్రం ఉంది దేవుడి దయవల్ల అది కూడ నెరవేరాలి"

"ఏమిటా ఆశ"

"అంతఃపురం నిర్మించిన ఆ మహానుభావుడు నా గుడిసెని అలాగే ఉంచాడు మిత్రుడి ప్రేమకు గుర్తుగా ఈ అంతఃపురాన్ని, అందులో నిన్నూ చూసుకుంటూ, పెద్దలకాలం నుంచి వచ్చిందని నేను ఆ గుడిసెలో బతకడమే నా ఆశ"

సుధాముడి భార్యకు ఇతని ఉద్దేశం స్పష్టం కాలేదు అది ఆమెకు తర్వాత తెలిసింది శ్రీరాముడు రాజమందిరాన్ని వద్దనలేదు అయితే తన గుడిసెని వదలుకాలేదు రెండింటిని తన ఇంట్లోనే చూశాడు రెండింటిలో తన గుడిసెని కొద్దిగా ఎక్కువ ఇష్టమైన ఇంటిగా చేసుకొన్నాడు

## 9

సుధామునినుండి ఈ సమాచారం తెలుసుకొనేందుకు శ్రీ కృష్ణుడు ముందే ఏర్పాటుచేశాడు సమాచారం అందుగానే రుక్మిణీ దేవితో, "అన్నయ్య గుడిసెను వదలలేదని సమాచారం అందింది" అని చెప్పాడు దేవి, "అది ఆయన భాగ్యం" అంది

# మంత్రోదయం

(కర్మయోగం కడపటిరోజు)

మహర్షి వామదేవ ద్వైపాయన ఆరుణాయ ఆరోజు నూరేళ్ళ జీవితాన్ని పూర్తి చేసుకొంటారని చుట్టూ ఉన్న ఆశ్రమాలలోని వాళ్ళకు వార్త వ్యాపించింది భక్తితో కొంతమంది, కుతూహలంతో కొంతమంది, అసూయతో మరికొంతమంది, మహర్షి దర్శనం చేసుకొందామని, ఈ పండు ముదుసలి ఈ రోజు ఎలా జీవిస్తాడో చూద్దామని, ఒక్కొక్కర్తూ, ఇద్దరూ, నలుగురూ జట్లు జట్లుగా తమ ఇష్టం వచ్చిన వేళల్లో ఆయన ఆశ్రమానికి వచ్చారు

వామదేవ మహర్షి మహాజ్ఞాని, మహాయోగి, అన్ని తెలిసినవాడని అందరూ అనుకొంటారు అయితే ఆయన ఎప్పుడూ నోరు విప్పి నాలుగు మాటలు మాట్లాడినవారు కారు, ఎవరికీ ఉపదేశం చేసిన వారూ కారు

ఆరుణాయ వంశంలో పుట్టి చిన్న తనంలోనే తండ్రి సాన్నిధ్యంలో తత్వోపదేశం పొంది, వామదేవుడు ఆ రోజుల్లో అంతా తెలిసిన వాడనే పేరు సంపాదించాడు తండ్రి గతించినప్పుడు ఆయన ఆశ్రమం యాజమాన్యాన్ని స్వీకరించాల్సివుంది, అయితే ఆయన అలా చేయలేదు ఆశ్రమాన్ని చూసుకొనే బాధ్యతని తమ్ముడికి అప్పగించి తాను తపశ్చర్యలో కాలం గడిపారు

ఈ తపశ్చర్యలో అధికభాగం ఆశ్రమం పనుల్ని చూసుకోవడం, ఆశ్రమాధిపతి తన తమ్ముడు ఉపదేశం చేసే స్థలంలో అన్ని వసతులను చూసుకోవడం, ఆశ్రమంలో కాపురం ఉంటున్న ప్రజల, పశువుల, పక్షుల, లేళ్ళ యోగక్షేమాలను చూసుకోవడం; సాయంకాలం అందరూ విశ్రాంతి తీసుకొన్న తర్వాత, తాను కూడ విశ్రాంతి తిసుకొని, ఉదయం అందరికంటె

ముందుగా లేచి ఆశ్రమ సేవకులను లేపి, దైనందిన కార్యక్రమాలను వేయించడం

ఎన్నో సంవత్సరాలు ఇలా సేవ చేసి వామదేవుడు ఒకరోజు ఆశ్రమాధిపతి అయిన తమ్ముడి దగ్గరికెళ్ళి "వశిష్ఠాశ్రమానికి వెళ్ళిరావాలనుంది, వెళ్ళొస్తాను" అని తెలిపి తానొకడే వెళ్ళిపోయాడు ఆశ్రమాధిపతి తన అన్నతో పాటు మరో ఇద్దరు యువకుల్ని తోడుగా పంపించాలని ఆలోచించాడు అన్న ఇందుకు సమ్మతించలేదు "వాళ్ళు నన్ను చూసుకోవడం అలా ఉండని, నేనే వాళ్ళని చూసుకోవాల్సి వస్తుంది, శుశ్రూషకులను గురించి ఆలోచించవద్దు నేనొక్కణ్ణే వెళ్ళొస్తాను" అన్నాడు

ఎన్నేళ్ళు ఆయన వశిష్ఠాశ్రమంలో ఉన్నాడో, యాత్రలు చేస్తూ ఏయే స్థలాలను దర్శించాడో ఎవరికీ తెలీదు దాదాపు పన్నెండేళ్ళు గడిపి అతను తమ్ముడి ఆశ్రమానికి వెనుదిరిగి వచ్చాడు

వెనుదిరిగి వచ్చినరోజు ఆయన్ని చూసినవాళ్ళకి ఒక విషయం బాగా జ్ఞాపకం ఉంది. ఎప్పుడూ తేజస్సుతో ప్రకాశించే ఆయన మొహం ఆరోజు సూర్యమండలంలా జ్వాజ్వల్యంగా కన్పించింది పన్నెండేళ్ళ తర్వాత వచ్చిన ఋషి అంతకుముందు వెళ్ళేటప్పుడు చేస్తూ వదలిపెట్టే పోయిన పనుల్లో మళ్ళీ నిమగ్నుడయ్యాడు అదేవృద్ధసేవ, అదేగోసేవ, అదేగోసేవ అదే వృక్షపాలన, అదే లతా రక్షణ, అదే లోకపూజ మొదలైన కార్యక్రమాలను ఆరంభించాడు

మరికొన్ని సంవత్సరాల తర్వాత తమ్ముడయిన ఆశ్రమాధిపతి ఇహలోక జీవనాన్ని ముగించాడు అప్పుడు కొంతమంది వామదేవుడే ఆశ్రమ యజమాన్యాన్ని స్వీకరించవచ్చని అనుకొన్నారు వామదేవుడు తమ్ముడి కొడుకుకు యజమాన్యాన్ని అప్పగించి ఒక సంవత్సరకాలం అతనితోపాటుండి, ఎప్పటిలాగానే ఆశ్రమ సేవ ఆరంభించాడు ఆ తర్వాత దగ్గర్లో ఉన్న వనంలో ఒక పెద్ద మర్రి చెట్టు ప్రక్కల్లో ఒక కుటీరాన్ని నిర్మించుకొని, కొడుకు సమ్మతిని పొంది అక్కడ నివసించడం మొదలుపెట్టాడు.

ఇది ఎన్నో సంవత్సరాల నాటి మాట; ఈ సంఘటన జ్ఞాపకం

ఉన్నవాళ్ళు ఆ చుట్టు ప్రక్కలున్న ప్రదేశంలో చాల కొంతమంది మాత్రమే మహర్షి తమ్ముణ్ణి చూసినవాళ్ళు ఇద్దరో ముగ్గురో మహర్షి పుట్టింది చూసినవాళ్ళు ఎవరూ లేరు

మహర్షి జీవితం అదోరకమైన విచిత్ర జీవితం తనదే అయిన ఆ ఆశ్రమంలో ఆయన తనకు తోడుగా ఇద్దరిని మాత్రం ఉంచుకొన్నాడు వాళ్ళని శిష్యులని అనడానికి లేదు ఎందువల్లనంటే మహర్షి వాళ్ళకు కనీసం ఒక రోజయినా ఎలాంటి ఉపదేశం చేయలేదు శిష్యులు కాదు, సేవకులని అందామంటే ఆశ్రమంలోని అన్ని పనుల్లోను వాళ్ళతోపాటు సమానంగా మహర్షి పనిచేసేవాడు వాళ్ళు చేసే పనుల్లో ఈయన చేయని పని ఏమిటంటే ఆదార్లో వెడుతూ ఆశ్రమానికి వచ్చే భిక్షుకులకు చేసిన అతిథి మర్యాదలు అలాగే అలాంటి వాళ్ళు ఎక్కడికైనా వెళ్ళాలని అడిగితే వాళ్ళకు దారి చూపించి ఆ ప్రదేశానికి పంపించడం ఆయన ఇలాంటి పనుల్ని చేయకపోవడానికి కారణం బహుశా వాళ్ళు ఆయనతో ఈ పనుల్ని చేయించు కోవడానికి అడ్డు చెప్పడం

కొత్తగా ఆశ్రమం ఏర్పాటు చేసుకొన్న రోజుల్లో ఆ స్థలం అరణ్యంగా ఉండేదని, మహర్షి స్వయంగా ఆ ప్రదేశాన్ని సరిచేసి నేటిస్థితికి తెచ్చాడని చుట్టు ప్రక్కల గ్రామాల వాళ్ళు అనుకునేవారు ఆశ్రమం ఇప్పుడు ఒక నందనవనంలా కన్పిస్తోంది ఎప్పట్నుంచో పెరుగుతూ వస్తున్న ఆమహా వట వృక్షం నాలుగు వైపులా వరుస వరసలుగా చిన్న చిన్న చెట్లు పెరిగాయి కొన్ని పళ్ళ చెట్లు, మరికొన్ని పూలచెట్లు ఈ ఒక్కొక్క చెట్టును మహర్షి తానే నాటి నీళ్ళు పోసి పెంచాడు పెద్ద చెట్టు క్రింద నాలుగు దిక్కులా మొహం ఉండేట్టు చక్కని చతురస్రాకారంలో ఒక రచ్చ దాని మధ్య ఏ ముఖంగా కూర్చున్నా ఎదురుగా ఒక దారి కన్పిస్తుంది దాని రెండు ప్రక్కలా వరుసగా చెట్లు వనంలో నాలుగు మూలల్లో నాలుగు పెద్ద బావులున్నాయి వాటి దగ్గర రాతి అరుగులు అటూ ఇటూ చెట్లు

వనంలోని ప్రతి మాను, చెట్టు, తీగల చరిత్ర గురించి మహర్షికి తెలుసు

వెట్లు పూలు పండ్లు సమీపంలోని ఆశ్రమ ప్రజలకి, గ్రామంలోని జనులకి మాత్రమే పరిమితం వామదేవుడి ఆశ్రమానికి శ్రమపడి నడచివచ్చే వాళ్ళకి పూలుపండ్లకేమాత్రం కొదువలేదు

ఇతని ఆశ్రమంలో పాలిచ్చే ఆవులు నాలుగు ఉండేవి గ్రామప్రజలు పాలిచ్చే ఆవుల్ని దూడలతోపాటు తోలుకొనివచ్చి ఆశ్రమంలో వదలి పెట్టి వెళ్ళేవారు ఆవు పాలివ్వడం నిలిపేవేళకు ఆవును, దూడను తోలుకొని పోయేవారు వనంలోని పండ్లు, పూలు ఉపయోగించుకొంటున్నందుకు ప్రతిఫలంగా గ్రామస్థులు మహర్షికి ఈ ఉపకారం చేసేవాళ్ళు

ముసలితనం ఎక్కువయ్యే కొద్దీ మహర్షిని చూడడానికి వచ్చే వాళ్ళ సంఖ్య కూడ పెరిగింది వచ్చినవాళ్ళు కొని సార్లు ప్రశ్నించేవాళ్ళు; వాదానికి లాగడానికి ప్రయత్నించేవాళ్ళు వాళ్ళందరికీ ఆయన ఒకే ఉత్తరం ఇచ్చేవారు, "ఇప్పుడు మీరంటున్నారు కదా ఈ మాటని ఆధారంగా తీసుకొని మీరే ఆలోచించండి, సత్యం దర్శనమిస్తుంది"

ఇతని ఈ మౌనవ్రతాన్ని చూసి చాలమందికి కడుపుమంట 'ఈయన చిన్న తనంలో శాస్త్రాభ్యాసం చేయలేదు తన అజ్ఞానం బయట పడుతుందని భయపడి మౌనవ్రతం పట్టాడని ఇలాంటివాళ్ళు సిద్ధాంతం చేశారు అయితే ఈ నిర్దిష్టమైన జీవితాన్ని, మానవత్వాన్ని, ఓటమిలేని శ్రమని గుర్తించినవాళ్ళు "శాస్త్రాభ్యాసం మాట ఎలా ఉన్న, మహర్షి జీవితం నుంచి నేర్చుకొన్న పాఠమే ఎక్కువ" అనేవాళ్ళు

మహర్షి తమ్ముడి కొడుకు అనేవాడు "అప్పాజీగారి బుద్ధి బహు సూక్ష్మం, జ్ఞాపకశక్తి ప్రచండం. ఆయన ఏవాదాన్నయినా రెండు సార్లు వినేవాళ్ళు కాదు అయితే ఆయనకి అన్నివాదాలు తెలుసు పాఠం వినలేక విసుగుతో ఆయన శాస్త్రాలను అభ్యసించడం మాని ఆశ్రమం పనుల్ని చూసుకోవడానికి ఉండిపోయారని మానాన్న చెప్పుండేవారు"

మహర్షి తనకు తొంభై సంవత్సరాలు నిండాయని, తొంభై ఒకటి నిండిందని, తొంభైతొమ్మిది నిండిందని చెప్పుకొంటువచ్చాడు ఈ మాట

నిజమే కావచ్చు, ఎంచేతనంటే రఃయన సమవయస్కులు చుట్టు ప్రక్కల గ్రామాల్లో ఎవరూ లేరు ఆయినా రఃయన తన తమ్ముడి ఆశ్రమంలోను, అతని కొడకు ఆశ్రమంలోను చేస్తుండిన పనుల్ని ఇప్పుడు కూడా తన ఆశ్రమంలో చెస్తూనే ఉన్నాడు ఏళ్ళు నిండాయి, ముసలితనం రాలేదు, ముసలితనం వచ్చి ఉండవచ్చు శక్తి తగ్గలేదు, లేదా శక్తి కృశించినా మనోదార్ఢ్యం మాత్రం అజేయంగా అలానే నిలిచి ఉంది

తమ్ముడి కొడుకు ఆశ్రమాధిపతి ఒక రోజు తన దగ్గరికి రాగా మహర్షి ఆయనతో "ఇక నేను చాలకాలం నీకు అగుపించను పెద్దల్ని కలవడానికి వెళ్తాను" అన్నాడు

యువకుడైన ఆశ్రమాధిపతికి హృదయం స్తంభించినట్టయింది "అప్పాజీ ఎందుకిలా అంటున్నారు?" అన్నాడు.

"మా తండ్రి నాతో 'లోకంలో కర్మల్ని అనుభవించి నూరేళ్ళు జీవించు' అని ఆజ్ఞాపించారు ఈ ఆజ్ఞ ఆశీర్వాద రూపంగా నన్ను ఇన్ని రోజులు నడిపించుకొంటూ వచ్చింది. నూరేళ్ళు నిండిన తర్వాత నేను ఇక్కడ ఉండడానికి కారణం కన్పించటం లేదు"

"నూరేళ్ళు ఎప్పుడు నిండుతాయి?"

"రానున్న చైత్ర పూర్ణిమకి"

ఆశ్రమాధిపతి "అయ్యో ఇంత త్వరగా మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోతారా?" అని మహర్షిని కౌగిలించుకొని ఎదమీద తలవుంచి కన్నీరు కార్చాడు. మహర్షి అతన్ని దగ్గరికి చేర్చుకొని తల నిమూరుస్తూ బుగ్గమీద ముద్దెట్టి "ఈ శరీరం నశిస్తుంది. నేను పెద్దలతో పాటు ఎప్పుడూ నీలోనే ఉంటాను. ఆశ్రమాధిపతివయిన నీవు ఇలా కన్నీరు పెడితే ఎలాగయ్యా? ఆత్మ విషయంగా నేర్పించేపాఠం జీవితంలో తటస్థపడవద్దా?" అన్నాడు.

కుమార కులపతి సమాధానం తెచ్చుకొన్నాడు. లేచి మహర్షి కాళ్ళమీద పడి నమస్కరించాడు. "మీరు ఎవర్నీ శిష్యుడిగా స్వీకరించలేదు. ఇప్పుడు పెద్దమనసు చేసి నన్ను శిష్యుడిగా అంగీకరించి ఉద్ధరించాలి" అని

వేడుకొన్నాడు

మహర్షి, "ఎవడ ఒకర్దిని పెద్దవాడిగా బావించి ఇలా వినయంతో ప్రవర్తించే జీవితానికి దన్యత సిద్ధించింది నీవు వి వారించకు పెద్దల ధర్మాన్ని అనుసరిస్తున్నావే దాన్ని మాత్రం వదలకు, అలాగే కొనసాగిస్తూ ఉండు, తప్పక ఉద్ధరింపబడతావు" అన్నాడు

"మీరు అనుసరించిన దర్మాన్ని అనుసరించడం నేరమా?"

"నాకు కనిపించిన సందేహం ఎవరికి కన్పిస్తుందో, అలాంటివాళ్ళు నేను అనుసరించిన ధర్మాన్ని ఒనుసరించాలి"

"ఆ సందేహం ఏది?"

"అది కన్పించనివాళ్ళకి దాన్ని గురించి చెప్పకూడదు ఆలోచనాపథంలో సహకరించాలే కాని సంశయాన్ని కల్గించడం బుషి ధర్మం కాదు"

"ఇదెది మీరు మాకు చెప్పలేదు కదా? మీ సంప్రదాయం మునుపటినుంచి రాలేదు ఇకముందైనా కొన సాగవద్దా?"

"తత్వాన్ని తెలుసుకొన్న మహర్షులు అనేకులు. అందరూ తాము తెలుసుకొన్నదాన్ని తెలిపి ద్రష్టలనిపించుకొన్నారు. ఇప్పటికే తగినంత సత్య దర్శనమయింది దాని అనుష్టానం కొనసాగని కొత్తగా చెప్పాల్సిందేమీ లేదు"

"మీ జీవితం ఒక పద్ధతి ప్రకారం ఉందికదా? దీని ఆంతర్యం ఏమిటో మాకు తెలపండి"

"చెప్పడానికేముంది? ఈ పద్ధతి మంచిదనిపిస్తే దాన్నే అనుసరించాలి"

"చెప్పాలని ఎవరికి అనిపిస్తుందో వాళ్ళే చెప్పాలి"

కుమార కులపతి ఇకమాటల్ని పొడిగించలేదు. "నేను మీ శుశ్రూష తగినంత చేయలేదు. మిగిలిన నెలరోజుల్లో వీలయినన్ని సార్లు మీ దగ్గరికి వస్తాను. నా చేయి పట్టుకు నడిపించాలి" అన్నాడు.

మహర్షి ఒక్క క్షణం ఆలోచించి "సంతోషం..." అన్నారు.

"చివరిరోజు నేను మీ దగ్గరే కూర్చోవాలి అందుకు మీరు అంగీకరించాలి"

మహర్షి మళ్ళీ కొంచెం సేపు ఆలోచించి "అలాగే" అన్నారు

రెండు రోజుల తర్వాత ఆశ్రమాధిపతి "పౌర్ణమి నాడు మిమ్మల్ని చూడవచ్చినవారు ఏదైనా విషయం అడిగితే మీరు వీలయినంత అర్థమయ్యే రీతిలో జవాబివ్వాలి" అన్నాడు మహర్షి మళ్ళీ ఆలోచించి "సరే" అన్నాడు

ఈ సంభాషణ జరిగి నెలరోజులు గడిచాయి చైత్ర పూర్ణిమ రానే వచ్చింది చుట్టుపక్కల ప్రజలంతా మహర్షిని చూడడానికి వస్తున్నారు

ఉదయం ఎప్పటిలాగానే లేచి, మహర్షి అన్ని కర్మల్ని ముగించి కుటీరం ఎదురుగా ఉన్న మల్లె తీగ చెంత కూర్చొని దాని వేరుకు మన్నువేస్తూ పాదు సరిచేస్తున్నాడు

చూడడానికి వచ్చిన జనుల్లో ఇద్దరు మహర్షికి నమస్కరించి "ఇదేమిటి ఈ పనిని మీరే చేయాలా?" అన్నారు

మహర్షి, "అవునయ్యా, ఇది నా పని తల్లి తన బిడ్డని తానే చూసుకొనేలా ఈ చెట్లనన్నిటిని నేనే చూసుకోవాలి" అన్నాడు

"ఇలా సంసారంలో మునిగిపోవడం తప్పు మమత సద్గతికి అడ్డవుతుందని అంటారు కదా?"

"మమత తప్పు, అభిమానం తప్పుకాదు ప్రేమతో శ్రమించడమే సద్గతికి సాధనం అది తప్ప సద్గతికి మార్గం లేదు"

"మీరు ఈ రోజయినా విశ్రాంతి తీసుకోండి ఈ పనిని మేమెవరయినా చేస్తాము"

"వద్దు నాయనా, నా కిది కష్టంకాదు"

"చేతులన్ని మట్టవుతాయి కదా"

"చేతులు మాత్రమే మట్టవుతాయి జీవానికి కర్మపు లేపనం లేదు"

మరికొంత మంది వచ్చారు మహర్షి ఒక పెద్ద చెట్టు క్రింద కూర్చొని ఉదయిస్తున్న బాల భానుణ్ణి చూస్తున్నారు ఆశ్రమంలోని లెగదూడ ఆయన దగ్గరికి వచ్చి నిలుచుంది మహర్షి దగ్గరున్న పచ్చగడ్డిని పెరికి దూడకు తినిపించారు మహర్షి దగ్గరికి వచ్చిన వాళ్ళు నమస్కరించి క్రిందకూర్చున్నారు అందులో ఒకతను "ఎంతకాలంగా ఆలోచించినా దేవుడున్నడా అనే ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది కదా ఈ విషయంగా మహర్షులు మాకు సరయిన సమాధానం చెప్పాలి" అన్నాడు

మహర్షి "అయ్యా చరాచర సమస్తమయిన ఈ సృష్టి ఈశ్వరుడే, వేరు కాదు; ఈ సూర్యుడి వెలుగు బాహ్యలోకాన్ని చుట్టినట్టుగా, ఈశ్వరుడి వెలుగు అంతర్లోక బహిర్లోకాలను నిండి ఉంది ఈ లోకం అనేది ఒకటుందా అని ప్రశ్నించుకో ఉంది అనేది నీ ఉత్తరమయితే, ఆ ఉన్నదంతా ఈశ్వరుడే"

"అంటే ఎదురుగా కన్పిస్తున్నదంతా ఈశ్వరుడు"

"అవును, నిస్సందేహంగా లోపల ఉన్నది ఎదురుగా ఉన్నది, ఎక్కడ చూసినా ఉన్నది, ఈశ్వరుడే"

"అయితే మనం ఈశ్వరుడితో మసలుకోవడం కష్టంకాదా?"

"కష్టానికి కారణం లేదు ఇదంతా ఈశ్వరమయం అని నిశ్చయించుకో పని సులభమవుతుంది దేంతోనూ వివాదం ఉండదు అన్నింటితోను నెమ్మదిగా బ్రతుకుతావు అప్పుడు ఈశ్వరుడు దయపాలించినదాన్ని నీవు సంతోషంగా అనుభవిస్తావు నీవై నీవు దేన్నీ పోగొట్టుకోవు"

మరికొంతమంది వచ్చారు మహర్షి దగ్గర కూర్చున్నారు మనుష్యులం ఎందుకు తప్పు చేస్తున్నామన్న ప్రశ్నను లేవదీశారు

"లోకమంతా ఒకే ప్రాణం అని తెలుసుకోకపోవడంవల్ల అన్ని ఒక్కటే అని తెలుసు కొన్నవాడు, ఇతరులకు ఏదైనా చెడ్డ చేస్తే అది తనకే చెడుగా మారుతుందని గ్రహిస్తాడు అన్ని దుష్ప్రవర్తనలూ తననే దహిస్తాయి"

"అన్ని తప్పులూ అజ్ఞానపు ఫలితమా? కొన్ని సార్లు తెలిసి తెలిసి తప్పు చేస్తాము కదా?"

"అప్పుడు మొత్తం మీద పరిజ్ఞానం విషయంలో ఏదో తప్పుంటుంది"

"పరిజ్ఞానం లేక తప్పుగా నడచుకొన్న దానికి కూడ శిక్ష ఉంటుందా?"

"తప్పుగా నడచుకొన్నందుకు ఆ నడతే శిక్ష వెలుతురు ఎక్కువ కావడానికి బదులుగా చేతనంలో అందకారం అధికం అవుతుంది మంచిగా బ్రతికితే వెలుతురు ప్రపంచంలోకి అడుగు పెడతాము తప్పుగా ప్రవర్తించి జీవిస్తే అంధకార కూపంలోకి దిగబడిపోతాము."

ఒక జిజ్ఞాసువు వచ్చాడు "నాకు బ్రహ్మ స్వరూపం గురించి తెలియచెప్పండి" అన్నాడు

మహర్షి అతణ్ణి కొన్ని ప్రశ్నలు అడిగి చివరికి ఇలా అన్నారు "నువ్వు ఈ విషయాన్ని తెలుసుకోవడానికి అర్హుడవయ్యావా అయితే విను, తెలుసుకో సర్వ ఖలు ఇదం బ్రహ్మ అన్నారు పెద్దలు అది అక్షర సత్యం. బ్రహ్మమనే దాన్ని అందులోని ఒక్కొక్క ముక్కా గ్రహించలేదు దాన్ని వర్ణించాలంటే అసాధ్యమయిన రెండు అవస్థలని జోడించి చెప్పాలి అది నడుస్తూనే ఉంది; ఉన్న చోటనే ఉంది అది దూరంగా ఉంది; దగ్గరలోనూ ఉంది అది అన్నింటిలోనూ ఉంది; అన్నింటి వెలుపలా ఉంది ఉన్న చోటనే ఉంది మనస్సుకు మించిన వేగంతో ఎగురుతోంది దేవతలు కూడ దాన్ని తాకరు, అది అందరికంటే మొదటిది. కొండ మీదినుంచి ఒక రాయి దొర్లి ఎంత దూరం పోయినా భూమి మీదనే ఉన్నట్టే, భూమి తాను ఉన్న చోటనే ఉండి ఆరాయి పరుగు నిలిచిపోయి అది చేరిన స్థలంలోనూ ఉన్నట్టు, బ్రహ్మతత్వం పరుగెత్తే వస్తువుల్ని పరుగు ప్రారంభంలో పరుగెత్తడానికి; అవి పరుగు ముగించి గమ్యం చేరగానే అక్కడ వాటిని చేయిపట్టుకోవడానికి నిరీక్షిస్తుంది."

మరి కొంత మందివచ్చారు. అందులో ఒకతను, "తాము దయచేసి

ముఖ్య ధర్మమని బోధించారట. వెదుకు దయతో మాడడం ఎలా? దయచేసి తెలియజేయండి," అన్నాడు

మహర్షి చెప్పారు "అన్నీ ఒకే ఆత్మ దీన్ని అభ్యసించు అప్పుడు దుష్టమనే విషయంలో కనికరమే కలుగుతుంది, విసుగు జనించదు నీకాలు బురదయితే కాలికి నొప్పితగలకుండా బురదను మాత్రం కడుగుకొంటావా ర. విధంగా జాగ్రత్త వహించడానికి కారణం ఏమిటంటే కాలు కూడ నీవేకాని మరొకటికాదన్న పరిజ్ఞానం జీవితంలోని ప్రతి విషయంలోను ఇది నేనే అన్న భావం ఓర్పును చేకూరుస్తుంది"

"అన్ని నేనే అన్నప్పుడు స్వార్థమె పెరిగి పరులకు మంచి చేయడం మరచిపోవచ్చును కదా?"

"అన్ని నేనే అనేది చర్చ మాత్రంగా మిగిలిపోతే ఇలా కావడానికి సాధ్యం ఉంది అనుభవం అయినప్పుడు సాధ్యంకాదు. కాలిని గిల్లి, చేతిని కొరికి, నోరు ఏ సుఖాన్ని అనుభవించదు కాలికి దెబ్బ తగిలినప్పుడు చేయిదాన్ని నిమురుతుంది చేయికాలినప్పుడు నోరు దాన్ని ఉఫ్ అని ఊదుతుంది అంతా ఒకటే అని నోట చెప్పడంకాదు. అంతా ఒకటే అని జీవించడం లక్ష్యం కావాలి ఇలా జీవించే జీవానికి మోహం మాత్రం తొలగిపోదు, శోకం కూడ లేకుండా పోతుంది"

"బ్రహ్మమే అన్నీ అన్నప్పుడు నేను బ్రహ్మ, అయినా నేను కష్ట పడుతున్నాను దీనికి కారణం ఏమిటి?"

"అదే కారణం నేను బ్రహ్మ అనేది మాటమాత్రంగా తెలిసింది, కాని అనుభవం కాలేదు బ్రహ్మయే నేను అని తెలుసుకొన్న మానవుడికి నేను అనే తత్త్వం స్వచ్ఛమైన వస్తువు దానికి కాయంలేదు, అందులో బాధ లేదు, బాధ పడడానికి అంగాలు లేవు, బాధ దాన్ని సమీపించడానికి కూడా వీలుకానంత శుద్ధ తత్త్వంగా ఉంటుంది"

ఒక క్షణం తర్వాత మహర్షి మళ్ళీ చెప్పాడు "దీన్ని తెలుసుకొన్న చేతనానికి బ్రహ్మతత్త్వం మన్వంతర, కల్పాంతర సమన్వితమైన అనంత

కాలంలో అవ్యామిశ్రమైన శుబాన్ని అనుగ్రహిస్తుంది"

మధ్యాహ్నమవుతోంది మహర్షి తమ్ముడి కుమారుడు వృద్ధకులపతికి కాస్త విశ్రాంతి లభించాలన్న ఉద్దేశంతో ఇతరులు రాకుండా ఆపాడు మహర్షి అక్కడే కాళ్ళు చేతులు కడుక్కుని కాస్త గుగ్గిళ్ళు, పళ్ళు పాలను స్వీకరించి, ఒక పిడికిలంత గుగ్గిళ్ళను నాలుగు భాగాలుగా చేసి వాటిని నాలుగు వైపులా ఉంచి రాతి అరుగు మీద పడుకొన్నారు

కొంచెం సేపటికి నాలుగు ఉడతలు వచ్చి గుగ్గిళ్ళు తిన్నాయి మహర్షి అవి తినే తీరును సంతోషంగా చూస్తున్నారు

సూర్యుడు పశ్చిమదిశకి చేరుకోనడం మొదలు పెట్టాడు మహర్షి చెట్టుకు పడమరలో ఉన్న రచ్చ మీద పడుకొన్నారు సూర్యుడు దిగుతూ ఉండడాన్ని చూస్తూ హర్ష చిత్తులై ధ్యానంలో ఉన్నారు

గంగకు ఉత్తర తీరంలోని ఆశ్రమవాసులు కొందరు ఏరు దాటివచ్చి మహర్షి సాన్నిధ్యం చేరుకొన్నారు

ఆ రోజుల్లో విద్య - అవిద్య, సంసారం-వైరాగ్యం, ఇహం-పరం వీటిలో ఒకదాన్ని ముఖ్యమైన దానిగా పరిగణించి ఇంకొక దాన్ని కించపరచి వాదోపవాదాలు జరిగేవి వాదించే వాళ్ళెవరూ మూర్ఖులు కారు అందువల్ల వాదానికి ముగింపు ఉండేది కాదు

వచ్చినవాళ్ళలో ఒకతను, "మనిషికి పరలోకానికి సాధకమైన పరావిద్య ముఖ్యమా లేక ఇహజీవనానికి సాధకమైన అపరావిద్య ముఖ్యమా, సంసారికి మోక్షం ఉంటుందా? లేదా మోక్షార్థి విరాగి కావాలా?" అని ప్రశించాడు

మహర్షి కొద్ది నిమిషాలు ఆగి ఇలా అన్నారు, "జ్ఞానం అజ్ఞానం అని లోకాన్ని నిరాకరించినవాడు అంధకార కూపంలో మునుగుతాడు ఇహం, ఇహం అని జ్ఞానాన్ని నిరాకరించినవాడు దాంతోపాటు అంధకారంలోకి అడుగుపెడతాడు. ఇహంలో మసలడానికి అవసరమైన విద్యను శ్రద్ధతో అభ్యసించి ఇహాన్ని నడిపించాలి. పరలోక జీవనానికి సాధకమైన విద్యలో

సిద్ధినిపొంది పరాన్ని సాధించాలి సంసారంలో ఉంటూ వైరాగ్యాన్ని అనుష్ఠానించాలి అప్పుడు సంసారం బంధనం కాదు, మోక్షం కష్ట తరం కాదు పరస్పరం పూరకంగా ఉండాల్సిన తత్వాలను పరస్పర విరోధులుగా చేసి మనం తప్పు చెస్తున్నాము మాకు ధర్మాన్ని బోధించిన గురువులు మహాత్ములు వాళ్ళు సంతృప్తులు వాళ్ళు మాకిలా ఉపదేశం చేశారు"

మహర్షి స్వరం మరింత మృదువుగా మారింది శక్తి చాల క్షీణించినట్లనిపినింది తర్వాత ఎవరో ఒకరిద్దరు అడిగిన ప్రశ్నలకు ఆయన సమాధానం ఇవ్వలేదు

సూర్యుడు వైవిధ్యమయ వర్ణాలమధ్య వైభవాన్ని కప్పుకొని దిగంతపుటంచుల్లోకి చొరబడడానికి పూనుకొన్నాడు సాయంకాలపు గాలి చల్లగా వీస్తోంది ఆశ్రమంలోని వృక్షాల మీద పక్షుల సముదాయం ఉత్సాహంగా కలకలారవాన్ని రేపుతున్నాయి సగం వెనుకటి జ్ఞాపకాలతో సగం తనకు తానే చెప్పుకొంటున్నట్లుగా మహర్షి, "సూర్యుని హిరణ్మయ పాత్ర భూమిని తెరిచే సమయంలో ఆకారన్ని కప్పేస్తుంది ఇంట్లో ఉన్నవాడికి ఆయింటి గడప ఇంటిని ప్రసాదిస్తుంది, బయలును తప్పిస్తుంది జీవితమనే గడప దాటేవాడికి లాభం తప్ప నష్టం లేదు ఇహలోక జీవితం పగలు అందులో అర్ధ సత్యాన్ని దర్శిస్తాము సాయంకాలపు గడపను దాటి నశించని ఐశ్వర్యాన్ని పొందుతాము," అని, "సూర్యదేవా! నేను సత్యాన్ని దర్శించాలని కోరుకొంటున్నాను, అది నాకు కనిపించని," అంటూ నమస్కరించారు.

పది నిమిషాలు గడిచాయి మహర్షి సుస్పష్టమైన శుద్ధ స్వరంలో, "పూషన్ ఏకర్షే యమ సూర్య ప్రాజాపత్య వ్యూహ రశ్మిన్, సమూహ తేజః, యత్తే రూపం కల్యాణ తమం తత్తే పశ్యామి, అని అన్నారు"

కుమార కులపతి వచ్చి మహర్షి తలదగ్గర ఎదురుగా కూర్చున్నాడు తట్టుకోలేక ఆయన కళ్ళనుండి రెండు కన్నీటి బిందువులు రాలాయి మహర్షి దీన్ని చూశారు కుమారుడి చేతిలో చేయి ఉంచారు. క్షణ కాలం తర్వాత, "యః అసౌ, అసౌ పురుషః, సః అహం అస్మి" అన్నారు

సంజ్ఞా రూపంలో తనని రచ్చకు తూర్పుదిశలో ఉన్న లరుగు దగ్గరికి తీసుకొని వెళ్ళవలసిందిగా కోరారు

ఆశ్రమాది పతితో పాటు ఉన్న నలుగురు వ్యక్తులు సున్నితంగా ఎత్తికొని చెట్టుకు తూర్పువైపుకు తీసుకొని వెళ్ళారు, మహర్షి పూర్వాభిముఖంగా కుడిభుజం మీద పడుకొన్నారు

అందరి కళ్ళల్లోను కన్నీరు మహర్షి గమనించారు సమాధాన పరిచారు "వాయుః అనిలం అమృతం అదేదం భస్మాంతకం శరీరం," అన్నారు "ఓం" అంటూ ఘోషించారు "క్రతువును స్మరించు, కృతాన్ని స్మరించు" ధ్యేయాన్న స్మరించు, సాధించినదాన్ని స్మరించు అంటూ తనకు తానే మళ్ళీ మళ్ళీ చెప్పుకొన్నారు

కుమార కులపతి దగ్గరిగా వంగి, "ఏది క్రతువు ?" అన్నాడు మహర్షి మెల్లగా, "భూమి అంతా నందనవనం కావాలి, దీనివల్ల అంతర జీవనం సుందరమూ, సఫలమూ కావాలి," అన్నారు

క్షణం తర్వాత మహర్షి కుమారుణ్ణి చేర బిలిచి, "నా హోమాగ్నిని ఇక్కడికి తీసుకొనిరా" అన్నారు

ఆయన ఏడుస్తూ వెళ్ళి దాన్ని తెచ్చి తండ్రి ముందుంచాడు

సూర్యుడు పూర్తిగా అస్తమించాడు తూర్పు దిక్కుల్లో మసకగా ఉన్న పూర్ణ చంద్రుని బింబం ప్రకాశవంతమైంది అక్కడ అదృశ్యమైన అగ్నిగోళం ఇక్కడ వెన్నముద్ద అయిందేమో ననిపించింది మహర్షి అగ్నికి నమస్కరించారు వైదికులు గానం చేసిన ఋక్కును పాడారు

"అగ్నే నయ సువథ రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్ యుయోధ్యస్మజ్జు హురాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ."

ఋక్కును గానం చేసి కళ్ళు మూసుకొన్న మహర్షి చాల సేపటి దాకా కళ్ళు తెరవలేదు. కుమార కులపతి దగ్గరగా వచ్చి తండ్రి కాళ్ళు పట్టుకొన్నాడు

మహర్షి కళ్ళు తెరచి చూశారు కొడుకును చూశారు కళకళలాడుతున్న చంద్రుణ్ణి చూశారు మెరుస్తున్న చుక్కల ఆకాశాన్ని చూశారు "యత్తే రూపం కల్యాణ తమం తత్తేపశ్యామి," అంటూ చాలసార్లు ఉచ్చరించి కళ్ళుమూసుకొన్నారు

మళ్ళీ కళ్ళు తెరవలేదు మధ్యరాత్రి శ్వాస నిలిచిపోయింది తెల్లవారే సరికి దేహం చల్లబడింది.

సంకల్పించి నట్టుగానే ఒక సమయంలో తన శరీరం విడిన ఈ మహా పురుషుడు మహాజ్ఞాని అని అందరూ తెలుసుకొన్నారు ఇలాంటి మహర్షికి చెందిన ఒక ఉపనిషత్తు లేకపోయిందికదా అని అనేకులు విచారం చెందారు

మహర్షి జీవన విధానాన్ని అంగికరించని వాళ్ళు, "ఇతనినుంచి గోవుల్ని రక్షించడం, చెట్లని పోషించడం అవసరమైతే నేర్చుకొని ఉండవచ్చు ఈయన ఉపనిషత్తును ఏమి చెప్పి ఉంటాడు?" అన్నారు.

చివరి రోజు ఆయన దగ్గరికి వచ్చిన వాళ్ళలో ఒక కుశలుడు, "మహర్షి కడపటి రోజు చెప్పిన మాటలనన్నింటిని చేర్చి ఆ వాక్య సంగ్రహాన్ని ఆయన ఉపనిషత్తని ప్రచారం చేద్దాం" అన్నాడు

"ఇలా ఏదైనా చేయవచ్చున్న ఉద్దేశంతోనే నేను మహర్షిని కడపటిరోజు మేము ఎప్పుడైనప్పటికీ మేము అడిగే ప్రశ్నలకు సమాధానం ఇవ్వాలని కోరాను" అని కులపతి అన్నాడు.

"మీదంటూ ఒక ఉపనిషత్తు ఉండొద్దా అని ఎవరో ఒకప్పుడు అడిగినదానికి మహర్షి తన చేత్తో బాగా పెరిగిన నందనవనాన్ని చూపించి, "ఇదే నా ఉపనిషత్తు" అని అన్నారట.

మరోసారి, "నా ఉపనిషత్తు మరొకటి ఎందుకు? ఈశోపనిషత్తు లేదా!" అన్నారట.

ఇంకోసారి "మానవుడి ఉపనిషత్తు మాటల్లో ఉంది, ఈశ్వరలోని ఉపనిషత్తు లోకంలో ఉంది" అన్నారట.

ఆయన పలికిన ఈ మాటలన్ని తర్వాత తెలిశాయి ప్రాజ్ఞులందరూ ఈ మహర్షి అప్రతిమ కర్మయోగి అని తెలుసుకొన్నారు. శ్రద్ధాసక్తులున్నవాళ్ళు మహర్షి తమ్ముడి కొడుకు దగ్గరికి వచ్చారు; తాము విన్న మాటలనన్నిటిని ఆయనకి వివరించారు ఆశ్రమాధిపతి కూడ వాటిని ఎరుగును ఇతరులతోపాటు ఆ వాక్యాలను సంగ్రహించి ఈశోపనిషత్తు శ్లోకాలను రచించారు

వామదేవ ద్వైపాయన ఆరుణేయ మహర్షి తన జీవన విధానంనుంచి వెలిగించిన జ్ఞాన దీపంలోని కొంత భాగం ఆ వాక్యాలలో నిండి, ప్రకాశించి నేటికీ మానవ జీవితాన్ని ప్రకాశింప చేస్తున్నాయి

# సంయమి కేటో

## 1

రోమ్ ప్రజాప్రభుత్వం పతనమవడానికి దగ్గరపడుతున్న రోజుల్లో నియంతలు కావడానికి ప్రయత్నిస్తున్న పాంపే, సీసర్ ప్రభృతులతో పాటు, శ్రీమంతుడిగా జన్మించి, అధికారం చేపట్టడానికనే పెరిగి పెద్దవాడై, అధికార స్థానాలను చేపట్టి, పెద్దల మార్గాన్ని వదలక, తక్కినవాళ్ళకి ఆదర్శ ప్రాయుడయ్యేట్టు నడచుకొన్న కేటో అన్న ఒక మహాత్ముడు ఉండేవాడు

రోమ్ దేశం పురాతన అత్యుత్తమ సంప్రదాయ కాలంనాటి అత్యుత్తమ ప్రతినిధి కేటో ఎంతటి ఉత్తముడంటే, ఆయనలాంటి మరో ఉత్తముడెవ్వరూ లేరని తెలిసినవాళ్ళు చెప్తారు

కేటో శ్రేష్ఠులైన గురువులదగ్గర తత్త్వశాస్త్రాన్ని అభ్యసించాడు, దాన్ని తన జీవితంలో ఆచరించాడు ఇంట్లో, వీధిలో, సభలో సంతలో, రోములోనూ, సార్వభౌమ పాలనలోనూ ఇతను చేపట్టాల్సివచ్చిన అధికార నిర్వహణలో నిష్ఠుర సత్యం, నిస్పృహ, నిర్లిప్తలతో నడచుకొని, కేటో అంటే న్యాయం, కేటో అంటే సత్యం, కేటో అంటే నిర్లిప్తత అని ప్రజలు గ్రహించేలా అనుష్ఠించాడు

## 2

పాంపే నియంత కావడానికి ఉవ్విళ్ళూరుతున్న సమయం ఒకరోజు జాతీయ సదస్సు పరిపాలనా విషయంలో సభ జరిగింది సభలో కేటో, సీసర్ ఒకరి ప్రక్కఒకరు కూర్చొన్నారు పాంపేకు కొన్ని అధికారాలను, మర్యాదలని ఇవ్వడమా వద్దా అన్న విషయం గురించి చర్చ జరుగుతోంది

సద్యుడొకాయన పాంపేకు ఆ అధికారాలను, మర్యాదలనూ ఇవ్వకూడదని ఖచ్చితంగా వాదించాడు "దేశంలో పూర్వపు సభ్యత నాశనమైంది సేవా దృష్టితో అధికారానికి వచ్చే ప్రజలు తక్కువయ్యారు నిజం చెప్పాలంటే ఒకరు తప్ప తక్కిన మనమెవ్వరమూ స్వార్థంనుంచి ముక్తులయ్యామని చెప్పలేం అధికారానికి పౌరుల ఓట్లు కావాలి, ఓట్లు కోసం పౌరులకు ఇష్టమైన పని చేయాలి, ఎక్కువ ఓట్లు కావాలంటే ఎక్కువ మందికి ఇష్టమైంది చేయాలి, అనేక మంది పేదవాళ్ళు అందువల్ల దేశం కోశాగారంనుంచి విచ్చలవిడిగా డబ్బు ఖర్చు చేసి పేదలకి ఉచితంగా ధాన్యం పంచాలి ఇలా పంచి వాళ్ళనుంచి మంచివాళ్ళనిపించుకొని వాళ్ళ ఓట్లను సంపాదించి మనం అధికారానికి రావాలి, ఇలా వుంది మన జీవన సూత్రం ప్రజలకు సేవ చేయాలనే మాట వెనక్కిపడింది, స్వార్థమె ముందుకు వచ్చింది ఇలాంటి పరిస్థితిలో ఒకణ్ణే సర్వాధికారిగా చేసి అతని చేతికి కోశాగారాన్నిస్తే దేశం దివాలా తీయక పోతుందా? ఆ సర్వాధికారి కేటో అయినప్పటికీ సరిగ్గా నడచుకొంటాడా అన్న విషయంలో నాకు సందేహం ఉంది ఇక తక్కినవాళ్ళ మాటేమిటి?" అన్నాడు

వెనుకటి మహాత్ములలాగా పెద్దల మార్గంలో నడుస్తున్న వాడొక్కడే ఉన్నాడంటే ఆ ఒక్కడూ కేటో అన్న విషయం సభికులు గ్రహించారు, వాళ్ళందరూ అతని వైపు చూశారు స్నేహితులు గర్వంగానూ, కాని వాళ్ళు ఈర్ష్యతోను, అయితే ఏదో ఒక భావంతో అందరూ చూసినవాళ్ళే చివరికి ఆ ఒక్కడు ఎవరన్నది స్పష్టంగా తెలిసిన తర్వాత, సభ ముక్త కంఠంతో ఉత్సాహంతో" అవును, అవును" అంది

## 3

మరో సభికుడు మాట్లాడడానికని లేచాడు ఇటు కేటో ప్రక్కన కూర్చున్న సీసరుకు సభలోని సేవకుడొకడు ఒక ఉత్తరం తెచ్చిచ్చాడు సీసర్ దాన్ని అందుకొని చదివి సంతోషించాడు కేటో, " ఆ ఉత్తరమేమిటి" అని అడిగాడు కాగితం మీదున్న వ్రాత అతనికి తెలిసిన వ్రాతలా ఉంది. సీసర్ "ఏదో ఒక ఉత్తరం" అన్నాడు.

కేటో, "సభలో కూర్చొన్నప్పుడు ప్రేమ పత్రాలా?" అన్నాడు

సీసర్ "రోసేవాళ్ళు ఇలాంటి సమయంలో పంపిస్తే నేనేం చేయగలను" అన్నాడు

"ఉత్తరం ఈ చర్చకు సంబంధించింది కాదుకదా?"

"కాదు"

"ఈ మధ్య నువ్వు సత్య మార్గాన్ని వదలి పెట్టావు నీ మాట నిజమో, కాదో, ఉత్తరాన్ని నేను చూడనా?"

"సర్వం గ్రహించావని గర్వపడే నువ్వు చూస్తే తప్పేముంది? చూడు" అని సీసర్ ఉత్తరాన్ని కేటో వైపు విసిరాడు కేటో దాన్ని అందుకొని చూస్తే అది తన సోదరి సెర్విలియా సీసర్‌కి రాసినట్టు గ్రహించాడు ఆరోజు సాయంకాలం సీసర్ తనదగ్గరికి రావచ్చునని ఆమె ఆ ఉత్తరంలో వ్రాసింది

తన సోదరి సీసరుతో చాల చనువుగా ఉంటోందని కేటో విన్నాడు అయితే అతను ఆ విషయంలో ఆమెను వారించే ప్రసక్తినే తీసుకురాలేదు ఆమె పరిజ్ఞానం, ఆమె ఆశ–ఆకాంక్ష, ఆమె యోగ్యతలననుసరించి ఆమె జీవితం సాగాలి తను చెప్తే వింటుందా? అడ్డు చెప్తే ఆగుతుందా? అన్నకు ఇష్టం లేదని, ఇది మర్యాదకు లోటని, ఆమెకు మాత్రం తెలిదా? ఇది ఈ సోదరుడి మనోధర్మం దీన్నే సీసర్ నువ్వు సర్వం గ్రహించావని పేర్కొన్నది

4

వాదన సాగుతోంది సభలోని ఒక పక్షంవారు, కేటో ఈ విషయంలో తన అభిప్రాయాన్ని తెలియజేయాలని పట్టు బట్టారు

కేటో లేచి నిలబడ్డాడు మొహంలో కోపతాపాల ఛాయలు చూపించక, నిష్పక్ష పాతంగా రెండు పక్షాలను గురించి ప్రస్తావించాడు "పాంపే దక్షుడైన సేనాపతి అయితే అతను సేనాపతిగా మాత్రమే ఉండాలి రాజు కాకూడదు రాజు పదవి రోములది వాళ్ళు ఏమాటనైనా గ్రహించి స్వయంగా నిర్ణయించుకొనే పై స్థానంలోనే ఉండాలికానీ, ఎవరో ఒకరి

నిర్ణయాలను నడిపించే క్రింది స్థాయికి దిగజారకూడదు అలా చేస్తే వారు ప్రభుత్వ బాధ్యతలనుండి తప్పించుకొని దాస్యంలోని నిశ్చింతస్థితికి జారిపోయినట్లవుతుంది సర్వాధికారులయిన ప్రజలే సర్వాధికారులుగా ఉండాలి" అని వాదించాడు

ఇతరులెవరైన ఈ విధంగా మాట్లాడివుంటే సభలో నిర్ణయం ఎలా ఉండేదోమో కేటో ఇలా అన్నతర్వాత పాంపే పక్షం వారు తమకు ఓటమి తప్పదని అనుకొన్నారు సభ నిర్ణయం కూడా అలాగే జరిగింది

5

సభ ముగిసి కేటో బయటికి వచ్చేసరికి హార్టెన్సియస్ అనే అతని చిరకాల మిత్రుడు అతనితో పాటు వచ్చాడు "నీతో మాట్లాడాల్సిన విషయం ఒకటుంది" అని చెప్పి "సాయంకాలం రానా?" అని అడిగాడు కేటో "అలాగే" అన్నాడు

ఇంటికి వెళ్తూ కేటో కొంతసేపు నగరంలోని ఒక ఉద్యానవనంలో కూర్చున్నాడు చాల పొద్దు పోయినతర్వాత ఇంటికి బయల్దేరాడు

6

దార్లో ఒక కూడలి దగ్గర పాంపే శిలా విగ్రహం ఉంది, దాని దగ్గర పాంపే శత్రువులు ఒక సభను ఏర్పాటు చేసి, ఇతను స్వాతంత్ర్యం విరోధి, ప్రజల శత్రువు, దేశద్రోహి అని నోటికి వచ్చినట్టు మాట్లాడి జనుల్ని రెచ్చగొట్టారు కేటో అక్కడికి వచ్చే సమయానికి ఉద్రిక్తులయిన గుంపు పాంపే శిలావిగ్రహాన్ని కూలద్రోయడానికి ఉద్యుక్తులయ్యారు. వీళ్ళ ఉద్రేకాన్ని చూసి కేటో సంగతేమిటని విచారించాడు విషయం తెలుసుకొని "నేను చెప్పే నాలుగు మాటలు వినండి, ఆ తర్వాత మీ యిష్టం వచ్చినట్టు చేయండి" అన్నాడు

ఆ ప్రజా నాయకులు అంగీకరించారు పాంపేకు సర్వాధికారం ఇవ్వకూడదని ఇతను మధ్యాహ్నం వాదించిన విషయం వాళ్ళకి తెలుసు ఇతని మాటలవల్ల తమకు ప్రోత్సాహం లభిస్తుందని వాళ్ళు నిరీక్షించారు

కేటో ఇలా అన్నాడు "సర్వాధికారి అవులానన్న పాంపేను గురించి మీరు ఆగ్రహించడం సమంజసంగానే ఉంది అయితే ఈ పాంపే ఆ పాంపే కాదు వెనక మన దేశానికి విజయం సాధించి పెట్టిన ఉత్తమ సైన్యాధిపతి శిలా విగ్రహం ఇది ఇక్కడ ఈ విగ్రహాన్ని స్థాపించి మీ సేవకుణ్ణే గౌరవించారు దాన్నిప్పుడు వెనక్కి తీయాల్సిన అవసరం ఏముంది? ఆ మంచి పనికి ఆ గౌరవం నేడతను తప్పు చేసివుంటే మీరు మీ అసమ్మతిని మరోలా చూపించాలి ఈ విగ్రహాన్ని పెరికి పారవేయండి అని చెప్పినవాళ్ళు విజ్ఞులని నేను చెప్పలేను దీనివల్ల అనవసరమైన వివాదం తలెత్తుతుంది శాంతియుతంగా ఉండాలని అపేక్షించే అధిక సంఖ్యాకుల మనస్సు మీ విపరీత ప్రవర్తనవల్ల వేసారి మీ శత్రువుల పక్షం వహించవచ్చు నా మాట వినాలనుకొనేటట్టయితే మీరీ విగ్రహం జోలికి పోరాదు అందరూ మీమీ ఇళ్ళకు వెళ్ళండి"

గుంపులోని జనం "అరే, అవునే" "అమ్మ, ఎంత పెద్దమనిషి", "మధ్యాహ్నం అలా చెప్పి ఇప్పుడిలా అంటున్నాడే! ఊసరివెల్లి" "కేటో కేటోయే న్యాయం గురించి ఇతని దగ్గర నేర్చుకోవాలి", అంటూ రకరకాలుగా మాట్లాడుకొన్నారు వాళ్ళ నాయకులు తమలో తాము ఆలోచించుకొని, ఇతని సూచన మంచిదని నిర్ణయించుకొన్నారు పాంపే శిలా విగ్రహం అలాగే ఉండాలని నిశ్చయించుకొని తమ అనుచరులతో అక్కడినుంచి వెళ్ళిపోయారు పాంపే విగ్రహం రక్షించబడింది

## 7

కేటో రాత్రి భోజనం ముగించుకొని భార్యాపిల్లలతో మాట్లాడుతూ కూర్చుని ఉండగా హోర్టెన్సియస్ వచ్చాడు స్నేహితుడితో ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ కాసేపు గడిపాడు సాయంకాలం కేటో పాంపే విగ్రహాన్ని రక్షించిన విషయం అతడికి తెలుసు

"స్వార్థ చింతన లేక పెద్ద మనుష్యుల్లా నడచుకొనే వాళ్ళలో నీతో సమానమైన వాళ్ళు మన ప్రజల్లో ఇప్పుడు మరొకరులేరు నీ శత్రువులు కూడా నిన్ను పొగడుతారు నీ కీర్తి అంతటా వ్యాపించింది కేటో ఏ వివాదం

వచ్చినా నిష్పక్షపాతంగా న్యాయమైన తీర్పు ఇచ్చేవాడివి నీవొక్కడివి ఉన్నావు అని ప్రజలు ఒప్పుకొన్నారు పోట్లాటలు వచ్చినప్పుడు, అయ్యా అదెంత మాట? కేటో దగ్గరికి వెళ్దాం వస్తావా? అనడం లోకోక్తి అయింది తన వైపు న్యాయం ఉందని ధైర్యం ఉన్నవాడే ఈ మాటనంటాడు న్యాయం చెప్పడానికి పెద్దల్ని ఎంపిక చేసేటప్పుడు నీ పేరు ప్రస్తావనకు వస్తే, తప్పు చేసినవాళ్ళు తమ పని ముగిసినట్టేనని వంకి పోతారు ప్రాధేయపణి వదలించుకోవడానికే కాదు, చేసిన తప్పను కప్పి పెట్టడానికీ కాదు, గతేమిటి? సరే, కెటో న్యాయాధికారుల్లో ఒకడుగా ఉండ కూడదనాలి అలాగేమయినా అంటే వాళ్ళు తాము తప్పు చేసిన వాళ్ళమని మొదటే ఒప్పకొన్నట్టవుతుంది కేటో ఎదురుగా నిలబడడానికి భయపడతాడు, సత్యవంతుడెప్పడూ భయపడాల్సిన అవసరం లేదు తప్పు చేయకపోతే తన శత్రువయినా సరే కేటో శిక్ష విధించేవాడు కాదు ఇతనికెందుకు భయం? పూర్వ కాలపు నడవడికే నామ మాత్రపు జ్ఞాపకంగా మిగిలిన ఈ రోజుల్లో నీవు దీన్ని నిజం చేసి చూపిస్తున్నావు"

హోర్టెన్సియస్ స్నేహితుణ్ణి పొగడటం కోసం ఈ మాటల్ని అనడం లేదు తన నిజమైన అభిప్రాయాన్ని ప్రశంసని ఈ మాటల్లో తెలియజేశాడు అతను కూడ కేటోలాగానే ఉదాత్త స్వభావం ఉన్నవాడు కేటో భార్యాపిల్లలు అతని మాటలని విని ఆనందించారు కేటో విషయంగా ఇలాంటి ప్రశంసల్ని వాళ్ళు అప్పుడప్పుడూ వింటూనే ఉంటారు

## 8

కేటో ఇతని ప్రశంసా పూర్వకమైన మాటలకి ప్రత్యుత్తరమివ్వలేదు మంచిమాట వద్దని కాదు కావాలి, అయితే దానికి ప్రతిక్రియ ఏది? 'మీ అభిమానం, నాలో ఆ లక్షణాలు లేవు" అంటే అసత్యమవుతుంది అసత్యమాడరాదని 'అవును' అంటే ఆత్మ ప్రశంస అవుతుంది. స్నేహానికీ ప్రేమకీ బదులు ఏమిటి? స్నేహం, ప్రేమే నిజమైన ప్రతిస్పందన అది నడతలో కన్పించాలి

ఇతని ఈ పద్ధతి అందరికీ తెలుసు అనవసరమైన మాటల్ని ఆడక,

నడతలో అతి చూపించక, ఇతని స్నేహంలో ప్రేమ ఉందో లేదో అనేలా తేలికగా ఉండేది స్నేహితుడికి మాత్రమే కాదు. భార్యకి కూడా అంతే పిల్లలకూ అంతే ఇతని మనసులోని భావాలకు అబివ్యక్తి ఉండేది కాదు అభివ్యక్తి లేక పోవడంవల్ల ఏ భావమూ లేని ఒక చెట్టు భాగమేమో అనేట్టు ఇతని నడత రస హీనంగా ఉండేది.

## 9

హోర్టెన్సియస్ ఏదో చెప్పడానికి వచ్చి ఉంటాడనుకొని కేటో భార్యా పిల్లలు లోపలికి వెళ్ళారు హోర్టెన్సియస్ ఆ తర్వాత, కేటో, నేను నిన్ను ఒక విషయం అర్థించడానికి వచ్చాను, ఇవ్వగలవా?" అన్నాడు

కేటో, "స్నేహితుడివి మాత్రమే కాదు, పెద్దవాడివి కూడా. నీవు ఇది కావాలని అడిగితే నేను లేదని ఎలా అనగలను? అది నా దగ్గర ఉంటే తప్పకుండా ఇస్తాను" అన్నాడు

"చూడు కేటో, కొన్నేళ్ళ క్రితం నా భార్య మరణించింది నాకున్న పిల్లలూ ఈ మధ్యనే మరణించారు ప్రస్తుతం నేను ఒంటరి వాణ్ణయ్యాను పెళ్ళి చేసుకొందామంటే గుణవంతులైన అమ్మాయిలు నాలాంటి వయసు మళ్ళిన మనిషితో జీవించడానికి ఇష్టపడరు. వయస్సయిన ఒక సంసారం చేసే స్త్రీని నేను సంపాదించు కోవాలి పది చోట్ల చూసిన నాకు నిజంగా ఇష్టమైన స్త్రీ అంటే నీ భార్య మార్సియా. నీ మొదటి భార్య మరణించినప్పుడు నీవిమెను పెళ్ళాడాక ఉండి ఉంటే, ఇప్పుడామె నాకు లభించేటట్టయితే నేను ఆమె తండ్రిని అర్థించేవాణ్ణి మార్సియా అందరిలాంటి స్త్రీ కాదు వయసు మళ్ళిన వాణ్ణనే కారణం చేత నన్ను చులకనగా చూడదు తన నడతను తప్పేదికాదు నీవు నా మీద దయచూపి ఈమెను త్యాగం చేసేటట్టయితే నేను పెళ్ళి చేసుకోవాలనుకొంటున్నాను ఆస్తికి దిక్కయి ఇంటికి పేరు తెచ్చే ఒక కొడుకో, కూతురో పుడితె నాకు ఎలాంటి చింత ఉండదు.

రోము దేశపు నాటి సమాజ వ్యవస్థలో ఆలూ మగలిలా విడిపోవడంలో తప్పులేదన్న భావం ఉండేది అయితే అన్యోన్యంగా ఉన్న దంపతులు మరొకరి కోసం విడిపోవాలా?

కేటో ఈ మాటల నన్నింటిని నెమ్మదిగా విన్నాడు ఆ మాటలు ముగిశాక రెండు నిముషాలు తనలోనే ఆలోచించుకొని, "నీ కోరిక తప్పుకాదు, మార్సియా అడ్డు చెప్పకపోతే నేనామెను వదలి పెట్టడానికి సమ్మతిస్తాను ఆ తర్వాత నీవామెను పెళ్ళి చేసుకునే విషయంలో ఆమె తండ్రి అంగీకారాన్ని పొందాల్సి ఉంటుంది" అన్నాడు

## 10

మార్సియా ఇతని సలహా విని అంగీకరించింది ఆమె తండ్రి కూడా ఈ ఏర్పాటుకు అనుమతి ఇచ్చారు కేటో ఆమెకు చట్టం ప్రకారంగా విడాకులిచ్చాడు హోర్టెన్సియస్ ఆమెను పెళ్ళాడాడు

కానివాళ్ళు, "మార్సియాకు ఈ భర్త సహవాసం చాలనిపించింది. అందువల్ల ఆమె మరొకరి భార్య కావడానికి ఒప్పుకొంది. కేటో హృదయంలో భార్య విషయంగా నిజమైన ప్రేమలేదు. ఆమె ఉన్నా లేకపోయినా ఒకటే అనేంతటి కట్టెలాంటి వాడతను" అన్నారు ఈ మాట కేటో చెవికీ, మార్సియా చెవికీ చేరింది కేటో దీనికి స్పందించలేదు మార్సియా, "వీళ్ళు కేటోని అర్థం చేసుకోలేదు" అంది

## 11

దీనికి తగినట్టుగానే కొంతకాలానికే హోర్టెన్సియస్ మరణించాడు మార్సియా ఒంటరిదయింది. కేటో ఆమెని మళ్ళీ పెళ్ళాడి ఇంటికి తెచ్చుకొన్నాడు

హోర్టెన్సియస్ ఆస్తి మార్సియాకి లభించింది కేటోకి కానివాళ్ళు, "ఈ ఆస్తి మీదున్న ఆశవల్లే కేటో తనభార్యని వదలి, ఆమెని ఆ ముసలివాడికిచ్చి పెళ్ళి చేసి, వాడు చావడానికై ఎదురు చూశాడు" అన్నారు వాళ్ళలోనే కొంతమంది, "కేటో మరో విధంగా అయోగ్యుడు కావచ్చు డబ్బుకు నోరు తెరిచేవాడు కాదు కేటో డబ్బుకు ఆశపడ్డాడంటే హెర్క్యులస్ నపుంసకుడని చెప్పినట్టే" అన్నారు. వీళ్ళ సాహిత్యంలో హెర్క్యులస్ భారతీయ సాహిత్యంలో కర్ణుడు, భీముడు లాగ వీరాధి వీరుడు

# 12

దేశంలో పరిపాలన అస్తవ్యస్తమై సీసర్ సర్వాధికారి అయ్యాడు కేటో ప్రతిపక్షం అభ్యర్థియై దేశం వదలి దూరంగా ఒక ప్రాంతంలో ఉండాల్సి వచ్చింది సీసర్ అక్కడికి వచ్చాడు కేటో పక్షం సేనలు ఓడిపో యి సీసర్కు లొంగి బందీలు కావలసిన సందర్భం ఏర్పడింది అయోగ్యుడి బందీగా జీవించడం కంటే మరణించడమే మంచిదని కేటో నిశ్చయించాడు అతని పగ తనని వెంటాడే ముందురోజు తన కత్తిమీద తానే ఎగిరి ప్రాణం వదిలాడు

కఠోర సత్యం లాంటి అతని జీవితంలాగ నిరాటంకంగా వరించిన ఈ మరణం రోమ్ దేశపు పురాతన సంప్రదాయాన్ని అనుసరించింది పెద్దలు చూపెట్టిన దారి అది జీవితంలో లాగానే చావులోనూ కేటో, సంయమి అంటే ఎవరో నిదర్శన పూర్వకంగా చూపెట్టాడు

# రాణి హాట్‌షేప్ సిటూ

## 1

ఈజిప్ట్ దేశపు రాణి హాట్‌షేప్ సిటూ అంతః పురంలోని తనమందిరంలో సభతీర్చి ఎప్పటిలా ఆర్తుల కోరికలను వింటోంది మధ్యలో ఆ దేశపు రాజు టూహు టూమీసు ఆప్త సచివుడు ఆహామీసు అక్కడికి వచ్చి రాణికి వంగి నమస్కరించి, "ప్రభువులకు చాల ఆయాసంగా ఉంది ఏలినవారి పాదాలు ఒక్క క్షణం అటువైపు దయచేస్తే ప్రభువులకు సమాధానమవుతుంది" అని అత్యంత వినయంతో విన్నవించుకొన్నాడు

## 2

హాట్‌షేప్ సిటూ, టేహూ టూమీసు, ఒక తండ్రి బిడ్డలు వీళ్ళ తల్లులు మాత్రం ఒక్కర్తు కారు హాట్‌షేప్ సిటూ పట్టపురాణి కూతురు, టేహూటేమీసు తల్లి చిన్నరాణి, లేదా ప్రేయసి ఈజిప్టు దేశపు సంప్రదాయం ప్రకారం రాజ సంతతి తమకు సమానమైన రాజ సంతతితోనే వివాహం చేసుకోవాలి ఈజిప్టు రాజ సంతతికి సమానంగా తూగే రాజ సంతతి ఎక్కడ లభిస్తారు? ఈ కారణం వల్లే ప్రతి తరంలోనూ రాజదంపతుల కొడుకు, కూతురు యువరాజు, యువరాణి అయ్యేవారు పతి పత్ని రాజ సంతతివారే అయి ఉండాలన్న ఈ కఠిన సంప్రదాయం ఇంత దూరం వచ్చింది: ఈ అన్న చెల్లెళ్ళ వయస్సులో ఎంత తేడా ఉన్న అడ్డులేదు భర్త అయ్యేవాడు ఎంత చిన్నవాడయినా అడ్డులేదు అక్క తమ్ముడు పెళ్ళి చేసుకొని కాబోయే రాణి, రాజు అయ్యేవారు హాట్‌షేప్ సిటూ, టేహూ టేమీస్ ఈ విధంగా రాజు రాణి అయిన అక్క తమ్ముడు.

హాట్‌షెప్ సిటా తమ్ముడికంటే పదిహేను సంవత్సరాలు పెద్దది పట్టపు రాణి కూతురు కావడంవల్ల ఈమె సింహాసనానికి మొదటి అధికారిణి. థేహుటేమిస్ చిన్నవాడుగా ఉన్నప్పుడే వీళ్ళిద్దరి వివాహం జరిగింది హాట్‌షెప్ సిటా రాజదర్పం ఉన్న వాతావరణంలో పెరిగిన యువతి పెళ్ళయితే ఏమిటి? పదేళ్ళ తమ్ముడు తమ్ముడే చిన్న తమ్ముడు, పెళ్ళయినప్పుడు పేరుకు మగడు దానికి తోడు భర్తగా కాపురం చేయడం అనేది జరగబోయె విషయం అంతే కాకుండా తండ్రి ఈమెను అతి గారాబంగా పెంచారు తన అనంతరం రాజ్యభారం ముఖ్యంగా ఈమె చేతిలో ఉంటుందన్న కారణంతో ఆమెకు, ఆమె కూతురు కాదు ఒక కొడుకనే వాత్సల్యంతో పరిపాలనా పద్ధతుల్ని నేర్పించాడు తండ్రి మరణించిన తర్వాత ఈ అక్క తమ్ముడు రాజ్యాధికారానికి రాగా అన్ని వ్యవహారాల్లోను అన్ని విధాలుగా ఈమెదే పైచేయి అయింది

మగవాడిలా పెరిగిన రాణి తాను పుట్టుకతోనే మగవాడన్న మనోభావాన్ని పెంచుకొంది అన్ని సందర్భాల్లోను తాను అబలకాదు మగవాడనే విధంగా వర్తించేది

ఈమె ఈ మూర్ఖత్వం ఎంత దూరం వెళ్ళిందంటె ప్రజల ఎదుట నిలబడ్డప్పుడు తాను అబల అని తెలియకూడదని ఈమె మగవాడిలా దుస్తులు ధరించేది వక్షస్థలం మగవాడి రొమ్ములా కన్పించాలని శస్త్ర చికిత్స చేయించుకొన్నట్టనిపిస్తుంది. అంతఃపుర రాణి అని అర్థం వచ్చే హాట్‌షెప్సిటా అన్న తన పేరును ప్రబు నాయకుడు అని అర్థం వచ్చే హాట్‌షెప్సు అనె పుంలింగ శబ్దానికి మార్చింది విజయ సమారంభాలలో స్మారకంగా తన రూపాన్ని రాతిమీద చెక్కించాల్సి వస్తే అందులో మగవాడి వేషభూషణాలనే చెక్కించేది

ఈ స్వబావం ఉన్న ఈమెని భార్యగా, దానికి తోడు ప్రభువుగా పొందిన ఈ తేప్రాయపు తమ్ముడు దాంపత్యంలో, రాజ్యపాలనలో ఎంతటి అసమర్థుడుగా ఉండేవాడో ఊహించుకోవచ్చును వయసు వచ్చిన తర్వాత థేహు టేమిస్ పరిపాలనలో దక్షునిగా, యుద్ధాలలో వీరునిగా అగుపించసాగాడు స్వాబావికంగా ఎలా ఉన్నా నో దరికంటే చాల చిన్నవాడు కావడం వల్ల అనేక

సంవత్సరాలు ఆమె చెప్పినట్టు వినే ప్రవృత్తి ఆతనిలో పెరిగింది ఈ కారణాల వల్ల ఇతడు ప్రబుద్ధుడై పరిపాలన చేసే సమయం వచ్చినప్పుడు రాణి అన్ని వేళల్లోనూ ముందు ఉండడం, ఈయన రెండవ వాడిగా నిలవడం వాడుకయింది దైవసాన్నిధ్యంలో మగవాడు మాత్రం చేయ దగ్గ కర్మలు, సేవలు కొన్ని ఉండేవి అలాటి కర్మల్ని సేవల్ని చేయాల్సి వచ్చినప్పుడు మాత్రల తమ్ముడు ముందుండేవాడు అక్క ప్రక్కనుండేది

రాణికి దాంపత్య సుఖం కావాలా, ఎంతకావాలి ఇది తెలిసింది కాదు తక్కిన వివరాలను పరిశీలిస్తే ఈమె భర్తతో కాపురం చేయడానికయినా తాను స్త్రీనని అంగికరించడానికి సులభంగా సమ్మతించి ఉండదనిపిస్తుంది ఒక చోట సమ్మతించక పోయినా భర్తని పూర్తిగా తిరస్కరించడం ఎలా ? కొన్నేళ్ళు సంసారం చెసిన తర్వాత ఈమె ఒక కూతుర్ని ప్రసవించింది ఈ కూతురు మున్ముందు రాజ్యానికి రాణి కావాలి

ఈ కూతుర్ని పెళ్ళాడి, ఈమెతో పాటు రాజు కావడానికి రాణి ఒక కొడుకును కంటుందని రాజ పరివారం నిరీక్షించింది దేశ ప్రజలూ నిరీక్షించి ఉండవచ్చు అయితే రాణిమళ్ళీ గర్భిణి కాలేదు

## 3

ఆ మధ్య ఒక విషయంవల్ల వీళ్ళిద్దరి మధ్య విరసం వచ్చింది

టేహు టేమీస్ ఒక సారి రాజ మందిరంలోని ఉద్యానవనంలో స్నేహితులతో వినోద కాలక్షేపం చేస్తుండగా ఆకాశంనుండి టప్ అని ఆయన ఆసనానికి ఎదురుగా ఏదో పడ్డ శబ్దం అయింది పడ్డది ఒక చెప్పు ఇదెక్కడ్డి నుంచి పడి ఉంటుందని అందరూ తల ఎత్తి చూశారు పైన ఒక గ్రద్ద ఎగురుతూ ఉండడం కనిపించింది చెప్పు మాత్రం ఎవరో ఒక యువతిది అయి ఉండాలి అమ్మాయి శ్రీమంతుడి కూతురయి ఉండాలి చెప్పు మీద పరిగెతో తీర్చిన హస్తకళా నైపుణ్యం ఉంది. మధ్యలో రంగురంగుల గుండ్లు నాలుగు ఉంచారు ఇది నగరంలోని శ్రీమంతుల కుటుంబానికి చెందిన ఆడపిల్లల చెప్పుల లక్షణం

స్నేహితులు రాజుని పరిహాసం చేశారు "మీరు మరో రాణిని కోరుకొని ఉండాలి, దేవుడు ఆమెను తెలియజెయ్యడానికి ఆమె కాలిచెప్పును మీ చెప్పు ప్రక్కన వేయించాడు" అన్నారు

రాజనవ్వాడు, వెంటనే ఏమీ చెప్పలేదు క్షణం తర్వాత, "మా వంశంలో వెనుకటికి ఒక రాజుకు రాణి ఇదే విధంగా లభించిందని చెప్పగావిన్నాను ఆ రాణి చాల అందగెత్తె అని చరిత్రలో కూడ చెప్పబడింది" అని అన్నాడు

రాజుకు చాల ఇష్టమయిన స్నేహితుడు ఒకడు దగ్గరగా వచ్చి "ప్రభువుతో పరసమాడే లేజవ్వని ఒకతె ఉండని చిన్న భార్యగా వేసుకోవచ్చును కదా" అన్నాడు

పేహు పేమీస్ మళ్ళీ కాస్తనవ్వాడు కాసేపు ఊరకున్నాడు ఆ తర్వాత, "ఈ చెప్పు ఎవరిదో తెలుసుకోగలరా?" అన్నాడు స్నేహితుడు, "కాస్త దూరంలో స్త్రీల స్నాన ఘట్టం ఉంది గ్రద్ద ఈ చెప్పును అక్కడినుంచి తెచ్చి ఇక్కడ వేసి ఉండవచ్చు అక్కడికి వెళ్ళి వాకబు చేస్తే చెప్పు పోగొట్టుకొన్నవాళ్ళు ఎవరన్నది తెలుస్తుంది" అన్నాడు

రాజు, "పెళ్ళి చేసుకోవడానికి కాదు, చెప్పును వెనక్కి ఇవ్వడానికి వెళ్ళి విచారించి పోగొట్టుకొన్నవాళ్ళు కన్పిస్తే దాన్ని వాళ్ళకివ్వండి" అన్నాడు ఈ పని చేయడానికి స్నేహితుడు తానే బయల్దేరాడు

రాజుకు రాణి ప్రవర్తనవల్ల లభిస్తున్న సుఖం ఏ మాత్రం ఎక్కువగా లేదని అతని పరివారానికి తెలుసు. ఆ అమ్మాయి అందగత్తె అయివుంటే ఈయన ఆమెను ఇష్టపడవచ్చు చెప్పును వెనక్కి ఇవ్వడానికి కాదు, ఆమె విషయం తెలుసుకోవడానికీ, ఆమెను చూడడానికీ స్నేహితుడే వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు

స్నాన ఘట్టాన్ని చేరుకొనేసరికి అక్కడ ఒక దాది, నలుగురు అమ్మాయిలు, చెప్పుకోసం వెతుకూతూ ఉండడం కన్పించింది దాది, "నేను చెప్పాను కదమ్మ, ఆగ్రద్ద ఎగిరె పోయిందని, అదే దాన్ని తన్నుకొని పోయి

ఉండాలి" అని అంటోంది

స్నేహితుడు వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు "చెప్పు వెదుకుతున్నారా ?" అని అడిగాడు

అతని వాలకం చూసి రాజ మందిరానికి చెందిన వాడని వాళ్ళు గ్రహించారు అమ్మాయిలలో పెద్దది, "అవును, అది మీకెలా తెలిసింది ?" అని అడిగింది

"ఈ జోడు ఉద్యానవనంలో పడింది దీన్ని గ్రద్ద తన్నుకొని వచ్చి ఉండాలని అనుకొన్నాము ఆడపిల్ల చెప్పు కావడంవల్ల స్నాన ఘట్టానికి వెళ్తే పో గొట్టుకొన్నవాళ్ళకి అందివ్వ వచ్చని దీన్ని తెచ్చాను"

అమ్మాయిలు సంతోషించారు దాంతో పాటు అంతే బిడియపడ్డారు స్నేహితురాళ్ళల్లో ఒకతె, "అవును, ఇది నా స్నేహితురాలి చెప్పు చాల ఉపకారం చేశారు అయితే దీన్నిక్కడికి తీసుకు వచ్చే అవసరం మాకు రాకపో తే బాగుండేది" అంది

అమ్మాయిలు చాల బుద్ధిమంతులు స్నేహితుల్లో ఒకతె చెప్పు ఎవరికి చెందిందో ఆమెను చూపించింది ఆమె చాల అందంగా ఉంది అప్పుడే విరుస్తున్న పూవులా ఉంది ఈ అమ్మాయి రాజుకు తగిన భార్య కాగలదని ఈ స్నేహితుడికి అనిపించింది అతను, "ఏమీ తప్పులేదు దీన్ని మీకు ఇచ్చిరమ్మని స్వయంగా మారాజే నన్నిక్కడికి పంపించారు అనుమానం ఉంటే మీరు ఇంటికి వెళ్తూ ఒకసారి ఆయనికి కన్పించి కృతజ్ఞతలు చెప్పవచ్చు," అన్నాడు

అమ్మాయిలు ఒకరి ముఖం ఒకరు చూసుకొన్నారు ముసి ముసి నవ్వులు నవ్వారు రాజమందిరానికి చెందిన ఈ వ్యక్తి ఆహ్వానానికి ఏమి బదులు చెప్పాలో వాళ్ళకు తోచలేదు

రెండు క్షణాల తర్వాత మొదట మాట్లాడిన యువతి, "మేము ఈ చెప్పుకోసం వెదుకుతున్నాము ఇది దొరికింది కనుక ఇప్పుడే ఇంటికి వెళ్ళిపో తాము. ఈ దార్లో వెళ్తాము" అంది

ఆ దారి రాజమందిరం ఉద్యానవనం వైజయంతి ఎదురుగా వెళ్తుంది రాజు స్నేహితుడు, ఆమె మాటల్లోని అర్థాన్ని గ్రహించాడు. "సంతోషం" అని వినయంతో చెప్పి వెంటనే రాజుదగ్గరికి వచ్చాడు జరిగిన సంగతిని చెప్తూ అతణ్ణి వైజయంతి దగ్గరకు పిలుచుకొనివచ్చాడు.

ఆ సమయానికి అమ్మాయిలు దాదితో పాటు మెల్లగా నడుస్తూ అక్కడికి చేరుకొన్నారు దాదికి ఎదురుగా నడుస్తున్న అమ్మాయి చెప్పును పో గొట్టుకొన్న యువతి అని స్నేహితుడు రాజుతో చెప్పాడు. రాజు ఆమెను తదేకంగా చూశాడు ఆమె కాస్త బిడియంతోను, మరికాస్త సంతోషంతోను అతని వైపుచూసి తలవంచింది. రాజు స్నేహితుడితో, "ఈమెను ఈ రోజు సాయంకాలం రాజమందిరానికి రప్పించు, నేను ఈమెను పెళ్ళాడుతాను," అన్నాడు

శ్రీమంతుల కుటుంబానికి చెందిన అమ్మాయి ఆసెట్ ఆ సాయంకాలం శాస్త్రోక్తంగా టేహు టేమీసు చిన్నరాణి అయింది ఆమెను పెళ్ళాడడానికి ముందు రాజు అక్కదగ్గరికి వెళ్ళి తన నిశ్చయాన్ని తెలిపాడు. హాట్‌షెప్ సిటా ఇతని మాటల్ని విని వేసారింది అయితే దీన్ని ముఖంలో వ్యక్తం చేయలేదు. "నీవు రాజువి, ఏమి చేయడానికయినా స్వాతంత్ర్యం ఉంది చిన్న రాణి అవసరం అనుకొంటే చేసుకోవచ్చును" అంది

వివాహం అనేది అతి సరళమైన, కల్పనాసుందరమైన ఒక వ్యవహారం అదే సాయంకాలం జరిగింది పెద్దరాణి వివాహానికి హాజరుకాలేదు ఆ తర్వాత కూడ చిన్నరాణి ఎవరని చూడనైనా చూడలేదు ఏమీ జరగనట్టు తనకు తాను ఉండిపోయింది

సంవత్సరం తర్వాత చిన్నరాణికి ఒక అబ్బాయి కలిగాడు. నాలుగేళ్ళ గడిచినా పెదతల్లి ఆ పాపణ్ణి చూడడానికి రాలేదు "చిన్నరాణికాని, ఆమె పరివారంలోని వాళ్ళెవరైనా కాని, ఈ పాపడు కాని, పెద్దరాణి అంతఃపురానికి రాకూడదు" అని ఆజ్ఞాపించింది

టేహు టేమీస్ ఈమె ప్రవర్తనవల్ల బాధ పడ్డాడని వేరే

చెప్పరక్కర్లేదు అయినా అతను పెద్దరాణిని సమాధాన పరవడానికి ప్రయత్నించలేదు తక్కిన వ్యవహారాల్లో ఎప్పటిలా ప్రవర్తిస్తూ పెద్దరాణి దగ్గరికి వస్తూపోతూ, చిన్నరాణి సంసారాన్ని తన స్వంత వ్యవహారంలా పూర్తిగా వేరు చేసి నడిపిస్తూ వచ్చాడు

## 4

రాజురాణి మధ్య ఈ మాత్రంగా ఉన్న సంబంధం కూడ ఒక సంఘటన వల్ల పూర్తిగా దెబ్బ తింది దేశం సరిహద్దుల్లో ఉన్న ఒక వర్గం ప్రజలు రాజ్యపాలనకు ఎదురు తిరిగి ప్రక్క దేశమైన సిరియాతో చేతులు కలిపారు చేమొచెమిస్ యుద్ధానికి వెళ్ళి శత్రు సేనల్ని చెండాడి ఎదురుతిరిగిన ప్రజల గర్వాన్ని అణచి విజయుడై వెనుదిరిగాడు విజయోత్సవం జరగాల్సి ఉంది దైవసాన్నిధ్యంలో నిలబడి విజయాన్ని దేవుడికి సమర్పించి, దేవుడి అనుగ్రహ మాలను మెడలో ధరించాల్సిన బాధ్యత రాజుకు ఉంది ఈ ఉత్సవంలో రాజుకు ప్రాముఖ్యం ఉంటుంది కారణం అతను పురుషుడు కాబట్టి రాణి అతని ప్రక్కలో కాస్త వెనుక నిలబడాలి, రాణికి ఇలా వెనక నిలబడడం ఇష్టంలేదు విధిలేక దానికి సమ్మతించింది అయితే ఉత్సవంలో చిన్నరాణి కూడ పాల్గొనదలచింది ఇది రాజుకూ ఇష్టమే, పెద్దరాణికి ఇష్టంలేదు చర్చ జరిగింది అర్చకులు, పురోహితులు, మంత్రులు, మేధావులు అందరూ కలిసి, చిన్నరాణి ఉత్సవంలో పాల్గొనడం ఉచితంగా ఉందని తీర్మానించారు ఆమె, ఆమె కొడుకూ ఉత్సవానికి వచ్చేశారు రాజు ప్రక్కన నిలబడ్డ రాణి దీన్ని సహించలేక సహించి తన మందిరానికి వెళ్ళింది ఇక మీదట నేను రాజును చూడనని తీర్మానించుకొంది

దురదృష్టవశాత్తు రాజుకు మరుసటి రోజే జ్వరం వచ్చింది యుద్ధం చేయడం వల్ల కలిగిన ఆయాసం, వెనుతిరిగే సమయంలో మార్గమధ్యంలో అనుకూలమైన వసతులు లేకపోవడం, విజయోత్సవం చేరి దేహానికి శ్రమ కలిగించాయి. వైద్యులు మొదట్లో ఇలానే అన్నారు అయితే పదిరోజులయినా జ్వరం తగ్గలేదు జ్వరం తీవ్రమై ఈ రోజు రాజు కన్ను మూస్తాడన్న భయం ఆవహించింది.

రాజు ఎక్కువగా అక్కకు విధేయుడై ప్రవర్తిస్తున్నప్పటికీ అప్పుడప్పుడు ఆమెలా బిగువు చూపించగలడు ఈ మారు అతను మనసును గట్టి చేసుకొని సమ్మె చేస్తున్నట్టనిపించింది "తాను మెత్తనవుతున్నంత సేపు ఈ అక్క గర్విష్టవుతోంది ఈ గర్వానికి మితి లేదా? ఈమె ఎలా రాణిగా ఉందో, అలాగే రాణిగావున్న మరొక స్త్రీని కించపరచే ఈమెకు నేనెందుకు మర్యాద చూపించాలి?" అని అతను మనసు రాయి చెసుకొన్నాడు చిన్నరాణి అతని దగ్గరే కూర్చుని శుశ్రూష చేస్తూ అతని పట్టుదలని సడలించింది

"ఎంతయినా ఆమె పెద్దది స్త్రీ దేహం అంతే, ప్రవర్తన అంతా మగవాడి ప్రవర్తన. ఆమెను తండ్రి లేదా అన్న అనే భావంతో చూస్తే తప్పుకాదు! మీరు నన్ను వివాహం చేసుకొన్న తర్వాత ఆమెను కాస్త నిర్లక్ష్యం చేశారు అందువల్ల ఆమె వేసారిపోయింది వినయంగా వర్తించి దాన్ని పోగొట్టాలి"

"పోగొట్టక పోతే ఏమిటి, ఆమె తనకు ఇష్టం వచ్చినట్టుగా ఉండని"

"మీ కూతురు, కొడుకు కాబోయే రాజదంపతులు, అక్క దీనికి సమ్మతించాలి కదా"

"సమ్మతించక ఏం చేస్తారు? అనాదిగా వస్తున్న సంప్రదాయం, దాన్నెవరు కాదంటారు?"

"ఆమె వద్దన్నా, కాదన్నా, మననుండి అందుకు ఏ అడ్డూ రాకూడదు జ్వరంతో ఉన్నారు చెప్పి పంపండి ఒకసారి కాదు రెండు సార్లు వేడుకోండి వచ్చినప్పుడు పిల్లల పెళ్ళి వెంటనే జరగాలని చెప్పండి ఆకార్యం జరగనీ, కొడుకు క్షేమాన్ని చూసుకొన్నట్టవుతుంది"

"కొడుకు కంటె ఎక్కువగా నీకు రాజమందిరంలో స్థానం లభిస్తుంది నేను చెప్పానని అక్కగారికి చెప్పించు"

వీళ్ళ ఈ నిర్ణయం ప్రకారం రాజుగారి ఆప్త సచివుడు రాణి హాట్‌షెప్‌సిటా దగ్గరికి వచ్చి, కథ మొదట్లో చెప్పిన విధంగా విన్నవించాడు

5

రాణి ఆక్షణంలో, "నేను వెళ్ళిమాడాల్సిందెమిటి? నేను వాడికి ఇప్పుడు మంచి మాటలు చెప్పలేను వాడినుంచి నాకు మంచి మాట వినవలసిన అవసరంలేదు తోబుట్టువుకాదు, భార్యాభర్తలు కాము" అనుకొంది మంత్రితో 'సరె' అని సమాధానం ఇచ్చి తన పనిలో నిమగ్నురాలయింది

అర్థులందరూ వెళ్ళిపోయారు మంత్రి ఆహామెస్ మళ్ళీ వచ్చాడు "సన్నిధానానికి విచ్చేయగలరా?" అన్నారు రాణి, "సరే, మాద్దాం" అంది మళ్ళీ ఏదో పనిలా నిమగ్నురాలయింది ఆహామెస్ వెనక్కివెళ్ళి రాజుకు ఈ సంగతి తెలియజేశాడు

గంటసేపు గడచినా రాణి రాలేదు చిన్నరాణి రాజుతో "మరోసారి పిలవడం మంచిది కదా?" అంది రాజు క్షణం సేపు ఊరకుంది "సరె చెప్పి పంపు" అన్నాడు అక్కకోపంతో కొడుక్కిపట్టం కట్టక పోయినా పోవచ్చని అతని మనసులో సంశయం అంకురించింది

అహామెస్ మళ్ళీ వెళ్ళి "ప్రభువుకు చాల నీరసంగా ఉంది మీరు ఒక్కక్షణం దయతలచి రావాల్సిందిగా వినయంతో వేడుకొంటున్నారు" అన్నాడు

ఆ పాటికి రాణి మనస్సు కూడ కాస్త మెత్తబడింది ఈ తమ్ముడు తన విషయంలో మొత్తం మీద బాగానె నడచుకొన్నాడు లోటివారు అతని మనసు మార్చారు ఈ మాత్రానికే అక్కయయిన తాను జ్వరంతో ఉన్న తమ్ముణ్ణి చూడకుండా ఉండకూడదు ఇది మంచి నడత కాదు అతను మరణిస్తే మనసుకు ఎప్పటికీ తీరని దుఃఖం దీనికి తోడు అపఖ్యాతి ఇలా ఆలోచించిన రాణి ఈ పిలుపురాగానే తమ్ముణ్ణి చూడడానికి వెళ్ళింది

ఆమె వచ్చేసరికి రాజు మంచం ప్రక్కల్లో ఆమెకోసమని రాజపీఠాన్ని తెచ్చి ఉంచారు. రాణి వచ్చి రాజు ఎదురుగా నిల్చుంది రాజు ఆమెకు మర్యాద పూర్వకంగా పీఠం వైపు చేయి చూపించాడు రాణి పీఠం మీద కూర్చుంటూ "జ్వరం తగ్గలేదా?" అంది రాజు నాసలు పట్టి చూసింది

ఈ సమయానికి ఆమెతో ఏయే విషయాలను మాట్లాడాలో రాజు నిర్ణయించుకొన్నాడు

"జ్వరం తగ్గుతున్న కొద్దీ నేనుకూడ క్షీణిస్తున్నానని పిస్తుంది అందుకే చెప్పిపంపాను"

"వైద్యులు సంశయం వ్యక్తం చేశారా?"

"లేదు, నాకే అధైర్యంగా ఉంది ఈ రోజో, రేపో అన్నట్టు శక్తి తగ్గిపోతూ ఉంది. అందుకనే పోయే ముందు ఒక కోర్కెను తీర్చమని అడగడానికని అక్కగారికి చెప్పి పంపాను"

"ఈజిప్టు రాజు అడగాల్సిన మాటేనా? అతని ఇష్ట ప్రకారం జరుగుతాయి కదా!"

"రాజుకైనా అక్కయిన రాణి, సరే అనాలి కదా!"

"జరిగిందంతా నన్నడిగే చేశారా?"

"అడగకనే చేసినపని ఏ ఒక్కటీ లేదు"

"ఎందుకు కాలేదు? రాజు ఇష్ట ప్రకారం జరిగింది"

"అక్కసమ్మతి లేకుండా ఇష్ట ప్రకారం నేను తృణమయినా చేయలేదు అక్కగారే తమ్ముణ్ణి అడగకనే తన ఇష్టంవచ్చినట్టు నడుచుకోవడం జరిగింది అది తప్పుకాదు అక్క కావడంవల్ల అలా నడచుకోనూవచ్చు"

"తమ్ముడికి ఇష్టం కాని విధంగా ఎప్పుడు నడచుకొన్నాను?"

"ప్రస్తుతం ఆ విషయం ఎందుకు? ఇప్పుడు రమ్మని చెప్పింది మరోవిషయానికి"

"మొదట ఆ విషయం ముగించాలి తమ్ముడికి ఇష్టం కాని పని అక్క ఏమి చేసింది?"

"నేను ఆ మాటను ఎప్పుడూ అనలేదు ప్రతిదానికీ అక్కకు సంపూర్ణ అధికారం ఉంది"

"ఇదిగో తమ్ముడూ, ఆయుస్సు ముగిసిందని అంటున్నావు ఈ సమయంలో నేను నాకూతురు మీద ప్రమాణం చేసి చెప్తున్నాను పెళ్ళి చేసుకొన్నావని, దేవుడిలా సృష్టించాడని, నీపాలికి నేను స్త్రీలా నడచుకొన్నాను రాజ్యం కోసం నీకూతుర్ని కన్నాను తక్కిన విషయాల్లో పురుషుడిగా ప్రవర్తించాను లోకంలోని పురుషులు నాతో పాటు పురుషులు ఈజిప్టు దేశపు రాజుకు తప్ప నేను మరొకరికి స్త్రీనికాను"

"నాకూడా ఎక్కువ కాలం ఆడదానిలాగ ఉండలేదు. పైగా మగవాడిలాగానె ప్రవర్తించావు"

"అది సరే నేను రంగురంగుల సీతాకోక చిలుక కాలేదు అయితె అదే నీకు కావాల్సి వచ్చింది"

"నేను మగవాణ్ణి అక్కా స్త్రీ దిట్టతనం మగవాడికెలావస్తుంది?"

"దిట్టతనం కాదు, రాజకుమారి కానిదాన్ని పెళ్ళి చేసుకోవాల్సి వచ్చిందా?"

"చేసుకొకూడదేమో, జరిగిందేదో జరిగిపోయింది ఆమె ఉన్నా నీ విషయంగా నేను ఒక రోజు కూడ తప్పుగా మాట్లాడలేదు నువ్వు మాట్లాడించి ఉంటే నీకాళ్ళ మీద పడి ఉండేది నీవు నిర్లక్ష్యం చేశావు భయంతో దూరంగా ఉండిపోయింది నాకు సంతోషం ఇవ్వడానికి నువ్వే మరో శరీరమై వచ్చావన్నట్టుగా ప్రవర్తించింది రాజ్యాన్నంతా చూసుకునే నీవు ఆమెను కూడా చూసుకోవాలి."

"నాలాగానె ఆమె కూడా రాణి నేనామెను చూసుకోవడమేముంది?"

"వచ్చిన యువతి అక్కలాగ రాణి ఎలా అవుతుంది? ఏమన్నా సరే ఆమె ఈ ఇంటికి వచ్చిన స్త్రీ అక్కదేవుడు చేసిన రాణి, ఈమె నేను చేసుకొన్న ఆడది"

• ఇద్దరూ అతి జాగ్రత్తగా మాట్లాడుతున్నారు ఈ మాటల్లో రాణి మనస్సు ఈ తమ్ముడి విషయంగా మెత్తబడింది జ్వరంతో నీరసంగా ఉన్న ముఖం, చేహుచేమీస్ కళ్ళ నిండా ప్రాధేయపూర్వకమైన పసిబిడ్డ లాంటి

చూపులు ఆమెను మెత్తబరచాయి రాణి ఇతడు పసివాడుగా ఉన్నప్పుడు ఎత్తుకొంది పిల్లవాడిగా ఉన్నప్పుడు ఇతనితో ఆడుకొంది యువకుడు కాగానే పెళ్ళి చేసుకొంది అప్పుడప్పుడు తాను స్త్రీ అని భావించినప్పుడు ఇతనిని భర్తగా గుర్తించి భార్యగా మెలిగేది ప్రజలు తనని మగరాయుడు అని పిలిచే వాళ్ళని ఆమెకు తెలుసు ఇతను భార్యగా పొంది రాజుకు లభించిన సుఖం ఏమిటని ప్రజలు అనుకొనేదాన్ని గురించి విని ఉంది ఒక్కొక్క సారి అతడి విషయంలో కాస్త కనికరం చూపించింది కూడా జ్వరంతో మంచం మీద పడుకుని చిన్న పిల్లవాడిలా తనను చూస్తున్న తమ్ముడి పట్ల ఆమె మనస్సులో ఇప్పుడు కనికరం కలిగింది తాను దేవుడు చేసిన రాణి అని అతను అన్నమాటలవల్ల మరింత కరగిపోయింది

ఆమె, "జ్వరంతో నీరసంగా ఉన్న నిన్ను నేను చాల సేపు మాట్లాడించాను ఇక నేను వెళ్ళిరానా ?" అంది

"అలాగే, పిలిపించిన విషయాన్ని విన్నవించుకొంటాను దాన్ని విని వెళ్ళవచ్చు "

"ఏ విషయం ?"

"ఒక తండ్రిబిడ్డలం అయిన మనమిద్దరం రాజు, రాణి అయ్యాము నాబిడ్డలయిన కూతురు, కొడుకు రాణి, రాజు కావాలి అక్కగారు దీన్ని అనుగ్రహించాలి"

ఇలాంటి ప్రసక్తి వస్తుందన్న విషయం రాణి ఇక్కడికి రాక మునుపే గ్రహించింది ఆ విషయం ప్రస్తావనకు వస్తే ప్రస్తుతం వద్దని చెప్పాలనుకొని ఆమె వచ్చింది అయితే అక్కడకు వచ్చిన తర్వాత జరిగిన మాటలవల్ల, రాజు చూపించిన వినయంవల్ల, చిన్నరాణి వీళ్ళున్న చోటుకు రాక మరుగ్గా ఉన్నందున, ఇతని కొడుకును కూడ వీళ్ళ దగ్గరికి పంపక దూరంగా నిలబెట్టుకొని ఉన్నందువల్ల, ఆమె మనస్సు చాల ప్రసన్నంగా ఉంది అందువల్ల క్షణం తర్వాత, "దేవుడు చేసిన రాణి, రాజు, నేను అనుగ్రహించడం కాదు అలాగే జరగని" అంది

రాజు ముఖంలో కృతజ్ఞతా బావం పొంగిపొరలింది ప్రేమతో రాణి వైపు చేతులు చాచాడు, రాణి చేతులకు ముఖాన్ని అందించింది రాజు ఆమె ముఖాన్ని తన వైపులాక్కున్నాడు

రఃమె ప్రసన్నురాలు కావడాన్ని మరుగులో ఉండి చూస్తున్న చిన్నరాణి కొడుకును తీసుకొని దగ్గరికి వచ్చింది పెద్దరాణి లేచి, "ఇక బయల్దేరనా" అంటూ నిలబడగానె ఆమె కొడుకును రఃమె కాళ్ళమీద పడేసింది తాను మోకాళ్ళ మీద నిలబడి ఆమె కాళ్ళను తాకింది ఊనుకొకుండా జరిగిన రఃః ఘటనవల్ల రాజుకు ఒక ఆలోచన తటుక్కున కలిగింది అతను రాణితో, "వేళ చాలా బాగుంది మన కూతుర్ని పిలిచి వీళ్ళ సంబంధాన్ని నిశ్చయంచేయండి" అన్నాడు

వద్దనడానికి రాణికి కారణం కన్పించలేదు రఃః పాటికి మంత్రి ఆహామెస్ గదిలోపలికి వచ్చాడు రాణితో "ఏలినవారు సమ్మతించారా?" అన్నాడు

రాణి సమ్మతిని సూచించింది మంత్రి వెళ్ళి ఆమె కూతుర్ని పిలుచుకొని వచ్చాడు అక్కాతమ్ముడు అయి పరస్పరం ఇదివరకూ చూడక ఉండిన ఆ పిల్లలు పెద్దల ఎదుట దంపతులయ్యారు.

తర్వాత రాణి, రాజు అనుమతిని పొంది, చిన్నరాణితో చెప్పాల్సిన విషయం చెప్పి, అబ్బాయి తలమీద చేయిపట్టి ప్రమాణం చేసి, తన మందిరానికి వెనుదిరిగి పోయింది

## 6

వస్తూ వస్తూ ఆమె మనసు ఏదో బాధలో కొట్టుమిట్టాడింది రఃః రాజ పదవి పాడు ఇలానే ఉంటుంది తాను సామాన్య కుటుంబంలో పుట్టివుంటే ఒక సాధారణ గృహిణిగా ఎంత సుఖంగా బ్రతికి ఉండవచ్చు? పుణ్యవతి అయివుంటే రః చిన్నరాణిలా ఒక రాజును ప్రేమించి రాణిలా బ్రతికి వుండ గలిగేది. రాజు కూతురుగా పుట్టి రఃః అదృష్టాన్ని పోగొట్టుకొన్నాను తన కడుపున పుట్టిన కూతురు కూడ ఇదే పద్ధతికి బలి అయింది రాణీ పట్టం ఉంది అయితే స్త్రీ తనపు సౌఖ్యంలేదు సరే, ఇది

దేవుడు చేసింది, విదికి అడ్డుపడెదేవరు? తన తమ్ముడు తన విషయంగా ఇంతకాలం సరిగ్గానే వర్తించాడు అతని కొడుకు తన కూతుర్ని ఇలా చూసుకొంటే అంతే చాలు ఆ అమ్మాయిని, ఆ అబ్బాయిని ఆ ఈజిప్టు దేశపు దొర పిల్లలుగా సృష్టించి, వాళ్ళను దంపతులుగా చేసిన దైవం, తనకూతురు జీవితంలో తనకిచ్చినంత సుఖాన్నయినా ఇచ్చి అనుగ్రహిస్తే చాలు

## 7

రాజు మూడు రోజుల్లో కన్ను మూశాడు రాణి ఒక్కత్తే పరిపాలించడానికి వీలులేదు హాట్ షెప్ సిటా చిన్న ఛేహు టేమీసును సింహాసనం మీద తనతో పాటు కూర్చుండ బెట్టుకుంది అతడి పరంగా రాజ్యాన్ని పాలించింది కొత్త దొర ఇరవై అయిదు సంవత్సరాల యువకుడు లయ్యేదాకా రాజు, రాణి రెండూ తానే అయి సమర్ధవంతురాలైన సామ్రాజ్ఞి అనే కీర్తిని గడించి బ్రతుకు చాలించింది

# చెడ్డ కాలం

నగరమంతా దేశమై, నగర ప్రముఖులే ప్రభువులై, రోమ్ ఒకప్పుడు అత్యుత్తమమైన జాతీయ జీవనాన్ని నిర్మించుకొంది ఆ తర్వాత అది ఒక రాజ్యమై, కాలక్రమంలో సార్వభౌమాధికారాన్ని పొందింది ఐశ్వర్య అధికారాల అనుభవ పరిణామంవల్ల రోము ప్రజాజీవనం నరకప్రాయంగా మారసాగింది

పదిమంది వెరి స్వార్థాన్ని మరచి దేశం అభివృద్ధికి పరిశ్రమించే, అఖండంగా వచ్చిన దెశ గౌరవాన్ని నిలబెట్టినరోజులు మారిపోయాయి తాను గొప్ప కావాలి, తనవారు గొప్పకావాలి అంటూ ప్రముఖులు తమలో తామె గుంపులై పదవులకు ప్రాకులాడే కాలం సంభవించింది

సత్యం, ధర్మం, శాంతిని నిత్య ధ్యేయాలుగా ఎంచి తమ వ్యక్తిత్వాన్ని పరిశుద్ధమైన అద్దంలా ఉంచుకొన్న నాయకులు కరువయ్యారు అధర్మానికి, అసత్యానికి వెనుకాడని, శాంతి మీద విశ్వాసంలేని, శక్తిమంతులు నాయకులయ్యారు. ఆధిపత్యానికి లోబడ్డ ఇతర దేశ ప్రజల అసహాయతని ఆధారం చేసికొని ఐశ్వర్యవంతులై తమదేశానికి వెనుదిరిగివచ్చి గర్వంతో బ్రతికే అధికారవర్గం అధికమైంది

## 2

ఇలాంటికాలంలో రోం సమీపంలోని లారివో పట్టణంలో ఓపియానికస్ కుటుంబానికి చెందిన స్టేషియస్ అనే ఒక మహాశయుడుండేవాడు అతనికి కయస్ అనే తమ్ముడు

అదే ఊళ్ళో ఇలాగే పుణ్యవంతులనిపించుకొన్న క్లుయెంటియై, ఔరియై అనే రెండు కుటుంబాలుండేవి

ఆ రెండిళ్ళకు చెందిన యజమానులు కన్ను మూశారు క్లుయెంటియస్ కుటుంబంలో పెద్దావిడ సాసియా, ఔరియస్ కుటుంబంలో పెద్దావిడ డైనియా సాసియా దేవికి ఔరస్ అనే కుమారుడు, క్లుయెంటియా అనే కూతురు ఉన్నారు డైనియా దేవికి మార్కస్, నుమెరియస్, నేయస్ అనే కొడుకులు, మ్యాజియా అనే కూతురు ఉండేవారు

మార్కస్ యుద్ధంలో మరణించాడని ప్రతీతి అందువల్ల నుమేరియస్ ఆస్తికి అధికారి అయ్యాడు యుక్త వయస్కురాలైన మ్యాజియాకు స్టేషియస్ తమ్ముడు కయస్‌తో వివాహం జరిగింది

## 3

స్టేషియస్ సత్యవంతుడు కాడు మొదటినుంచి తప్పుదార్లో నడుస్తూ వచ్చాడు ఇద్దరు భార్యల్ని పొగొట్టుకొని మూడో పెళ్ళి చేసుకొన్నాడు మొదటి భార్యని విషం ఇచ్చి చంపాడని ప్రతీతి రెండో భార్యను వదలిపెట్టాడు ప్రస్తుతం కాపురం చెస్తున్నది మూడో భార్య వ్యర్థంగా ఖర్చుచేసి తన భాగానికి వచ్చిన ఆస్తిని నాశనం చేసుకొని ఏమీలేని వాడయ్యాడు బ్రతకడానికి ఏదైనా దారి చూసుకోవాలి

లారినో పట్టణంలో ఆసినియస్ అనే శ్రీమంతుడైన యువకుడు ఉండేవాడు ఓపియానికస్ అతనితో స్నేహంచేశాడు తెలిసినవాడు తెలియనివాణ్ణి చూసుకొనే వాడిలాగ, అతనితో తిరగడం మొదలు పెట్టాడు తనకు జత సహాయంకోసం ఒక స్నేహితుణ్ణి చేర్చుకొన్నాడు ఆ యువకునికి నగర జీవనాన్ని పరిచయం చేస్తానని చెప్పి అతణ్ణి రోం నగరానికి తీసుకొని వెళ్ళాడు

వీళ్ళు నగరంలో కొంతకాలం ఉన్న తరువాత ఒక రోజు ఆ స్నేహితుడు అనారోగ్యంతో పడుకొన్నాడు పరిచయంలేని ఒక హోటలరిని నలుగురు సాక్షులను ఓపియానికస్ పిలుచుకొనివచ్చాడు వ్యాధిగ్రస్తుడైన స్నేహితుడి పేరిట ఒక విల్లు వ్రాయించాడు నా ప్రియ స్నేహితుడైన ఓపియానికస్ మహాశయునికి ఆస్తినంతటిని వదులుతున్నానని విల్లులో సూచించాడు అందులో ఆసినియస్ అనే దొంగసంతకం చేశాడు విల్లు

వల్లరీత్యా పరిలసిపేంమకొంది

## 4

మరుసటిరోజు స్నేహితుడు ఎప్పటిలా ఆరోగ్యవంతుడయ్యాడు ఇది జరిగిన రెండు మూడు రోజుల్లో ఎవరో ఆసినియస్‌ను హత్య చేశారు

విల్లు మూపించి ఓపియానికస్ మరణించిన శ్రీమంతుని ఆస్తిని వశపరచుకొన్నాడు

ఆ ఆస్తి ఇతనికి లభించిన పరిస్థితులు ప్రజల్లో సందేహాన్ని కలిగించాయి ఎవరో న్యాయస్థానంలో ఫిర్యాదు చేశారు దొంగ సంతకం చేసిన స్నేహితుణ్ణి న్యాయస్థానానికి ఆడ్చుకొనివచ్చారు అతడు తాను చేసిన తప్పును ఒంగికరించాడు దీని ఫలితంగా విధిలేక ఓపియానికస్ న్యాయస్థానానికి వచ్చాడు

అయితే న్యాయాధికారి స్వలాభాపేక్ష కలవాడు ఓపియానికస్ తగురీతిలో అతనికి చెప్పి పంపి ఆస్తిలో సగభాగం అతనికివ్వడానికి ఒప్పుకొన్నాడు న్యాయస్థానం ఓపియానికస్‌ను నిర్దోషిగా ఎంచి వదలిపెట్టింది

## 5

ఓపియానికస్ దనవంతుడై తన ఊరికి తిరిగివచ్చాడు అతడు చాల అందంగా ఉండేవాడు మాట్లాడడంలో కూడ చాల నేర్పరి పులికి ఏ అడవైతేనేం? ఆ అందగాడు, మాటల్లో నేర్పరి, తన తమ్ముడి బార్య మ్యాజియా శీలాన్ని చెరిచాడు

ఆలోగా ఆమె ఉన్న మ్యూమెరియస్ కన్ను మూశాడు మరణిస్తూ తన ఆస్తిని తన తమ్ముడు నెయస్‌కు వదలి పెట్టాడు

అతి త్వరలోనే ఇతడు కూడ అనారోగ్యంపాలయ్యాడు తనకు అనారోగ్యం ఎలా కలిగిందన్న విషయంలో ఇతనికి సంశయం కలిగి ఉండాలి. తాను ఇక ఎక్కువ రోజులు బ్రతకనని అతనికి అనిపించి ఉండాలి ఆ సమయంలో మ్యాజియా గర్భిణీ నెయస్ తన చెల్లెలి నడత సరిగా లేదని అనుమానించి ఉండవచ్చు అతడు ఆమెను పిలిపించుకొన్నాడు ఆమె తాను

తప్పుగా నడచుకోలేదని, తన గర్భంలో ఉన్న శిశువు తన బిడ్డదని, తన బావది కాదని అతను నమ్మేలా చెప్పింది నేయస్ తన ఆస్తి, తన అన్ననుండి వచ్చిన ఆస్తి, అంతా ఆమె ప్రసవించే బిడ్డకు చెందాలని, ఆ బిడ్డ బ్రతకకపోతే తనతల్లి, చెల్లెలుకు చెందాలని విల్లు వ్రాశాడు ఓపియానికస్ ఆస్తిని కాజేస్తాడన్న ఉద్దేశంతో పుట్టబోయే శిశువుకు డైనియాదేవిని సంరక్షకురాలుగా నియమించాడు

ఇది జరిగిన కొద్ది రోజులకు అతను మరణించాడు

నేయస్ మరణించిన కొన్ని రోజులకే ఓపియానికస్ మ్యాజియాను ఒప్పించి ఆమెకు గర్భస్రావం అయ్యేందుకు మందిచ్చాడు, ఆస్తికి ఉత్తరాధికారి లేక పోయినట్టయింది విధవదైన డైనియా, తనకు లొంగిపోయిన మ్యాజియా వీళ్ళ ఆస్తి అంతా తన ఆస్తేనని ఓపియానికస్ ధైర్యంతో ఉన్నాడు

6

ఈ మధ్య డైనియా పెద్దకొడుకు మార్కస్ జీవితుడై ఉన్నాడనే వార్త వచ్చింది అతన్ని వెదకి తేసుకురావడానికి డైనియా మనుష్యుల్ని నియమించింది అతనువస్తే ఈ ఆస్తికంతటికి అధికారి అవుతాడు ఓపియానికస్ వేరే మనుష్యుల్ని నియమించాడు వాళ్ళ ద్వారా డైనియాదేవి నియమించిన వాళ్ళను తప్పుత్రోవపట్టించాడు పెద్ద కొడుకైనవాడు బ్రతికి ఉన్నా దొరకనట్టు చేశాడు, బహుశా అతణ్ణి చంపించి ఉంటాడు

డైనియా అనారోగ్యం పాలయింది ఓపియానికస్ వైద్యుణ్ణి పిలిపించాడు ఆమెకు ఇతని విషయంలో అనుమానం ఆమె మరో వైద్యుణ్ణి పిలిపించు కొంది ఓపియానికస్ ఇతణ్ణి కూడ వలలో వేసుకొన్నాడు అతనికి నాలుగువేల పౌండ్లు ఇచ్చి ఆతనితో అనారోగ్యంతో బాధపడుతున్న డైనియా దేవికి విషం ఇప్పించాడు

ఆమె మరణించింది చావడానికి ముందు తన భాగానికి వచ్చిన ఆస్తి విషయంగా విల్లువ్రాసింది. ఓపియానికస్ దాన్ని వశ పరచుకొన్నాడు, ఆమె మరణించగానే దాన్ని కాల్చివేశాడు

ఇప్పుడు ఆస్తికంతటికి మ్యాజియా ఏకైక అధికారిణి

ఇదంతా జరుగుతున్న సమయంలో ఒకరోజు మ్యాజియా భర్త కన్ను మూశాడు ఓపియానికస్ తన భార్యను వదలివేశాడు, తమ్ముడి భార్య మ్యాజియాను పెళ్ళి చేసుకొన్నాడు, ఆమె ఆస్తికంతటికీ సర్వాధికారి అయ్యాడు

ఇతను ఇలా వేస్తున్నదంతా ఊళ్ళోవాళ్ళకు తెలియకుండా ఉంటుందా? ఊళ్ళో ఇతనికి విరోధులు కూడ ఉన్నారు వాళ్ళు ప్రభుత్వానికి ఫిర్యాదు వ్రాసి పంపించారు మేలినస్ అనే న్యాయాధికారిని ఈ వ్యవహారానికి పర్యవేక్షకుడిగా నియమించారు

## 7

న్యాయాధికారి అయినంత మాత్రాన మేలినస్ సత్యవంతుడేమీ కాదు కొన్నేళ్ళక్రితం ఇతను సాసియా దేవి కూతుర్ని వివాహం చేసుకొన్నాడు సాసియా దుష్ప్రవర్తన కలది ఆమె అల్లుడితో సరసమాడింది రోమ్ ఇతిహాసపు మంచి రోజుల్లో వివాహం అనేది భద్రమైన వ్యవస్థగా ఉండేది, రోజులు గడిచే కొద్దీ ఈ భద్రతకు ముప్పువాటిల్లింది ఈ విషయం ఓపియానికస్ చరిత్రవల్ల స్పష్టమవుతుంది మెలినస్ ఆధునిక కాలపు ఈ సౌలభ్యాన్ని వినియోగించుకొన్నాడు భార్య అయిన క్లుయెంటియాను త్యజించి అత్త సాసియాను పెళ్ళి చేసుకొన్నాడు.

ఈ సంఘటనలవల్ల గ్రామస్థులు మేరినస్‌ను అసహ్యించుకొన్నారు అయితే ఆ పురుషుడు ఆ స్త్రీ సంబంధాన్ని కాంక్షించినప్పుడు, వద్దని చెప్పే చట్టం లేనప్పుడు, ఎవరేమంటే ఏమవుతుంది?

ప్రజలు తన విషయంగా చూపిస్తున్న ఏహ్యాభావానికి నివారణగా ఓపియానికస్ మీద ఫిర్యాదు గ్రహించి నగరం వెళ్ళాడు

## 8

ఊరిప్రజలు తన మీద పగబట్టడాన్ని గమనించిన ఓపియానికస్ ఇదివరకే రోం ప్రవేశించాడు అక్కడ ప్రముఖులైన వాళ్ళ స్నేహాన్ని సంపాదించుకొన్నాడు

రోంలో సర్వాదికారం విషయంగా రెండు గుంపుల మధ్య పోట్లాటలు జరుగుతుండేవి ఒక గుంపుకు నాయకుడు సల్లా ఆ సమయంలో అతను సర్వాదికారి ఓపియానికస్ సల్లా గుంపుకు చెందిన వాడు, నాయకుణ్ణి సమీపించి "నీ శత్రువులు మా ఊళ్ళో చాలమంది ఉన్నారు" అన్నాడు

సల్లా 'వాళ్ళందరి లిస్టు వ్రాసివ్వ' మన్నాడు ఓపియానికస్ తన విరోధుల పేర్లన్నింటిని వ్రాసి ఒక పట్టీ ఇచ్చాడు 'వీళ్ళనందర్నీ చంపండి' అని సల్లా ఆజ్ఞాపించాడు, దాన్ని నడిపించే అదికారాన్ని ఓపియానికస్‌కు ఇచ్చాడు

## 9

ఇలా ఉంటుందా, ముందూ వెనకా ఆలోచించక, విచారణ చేయక, సర్వాదికారి ఇలాంటి ఆజ్ఞను జారి చేశాడా, అని లోకం ప్రశ్నిస్తోంది ఒక దేశం దురదృష్టం పాలైనప్పుడు ఇలాంటి పరిపాలన సాధ్యమవుతుంది

సర్వాధికారినుండి పొందిన అధికారంతో ఓపియానికస్ మెలినస్‌తో పాటు తన విరోధులందర్నీ చంపించాడు దానికితోడు తాను చేసిన అక్రమాలలో సహకరించి తనగుట్టును రట్టు చెయగల స్నేహితుడి కథను కూడ ముగించాడు

దేశానికి ఇతను చేసిన సేవకు ప్రతిపలంగా దేశద్రోహుల ఆస్తిలో తగినంత బాగం ఇతనికి బహుమతిగా లభించింది

## 10

ఇప్పటికి ఇతనికి మ్యాజియా విషయంలో విసుగుపుట్టింది ఇతని దుశ్చర్యవల్ల మెలినస్ ప్రాణం పోగొట్టుకోవడంవల్ల సాసియా ఇప్పుడు ఒంటరిదయ్యింది

ఓపియానికస్ మ్యాజియాను త్యజించాడు, సాసియాను వివాహం చేసుకోవాలనుకొన్నాడు

సొసియా దనవంతురాలు, పెళ్ళాడడానికి ముందు ఆమె ఇది కావాలి, అది కావాలి అని కాలం వెళ్ళబుచ్చింది

ఓపియానికస్‌కు ముగ్గురు పిల్లలు ఉన్నారు వాళ్ళలో పెద్దవాడు మాత్రం ప్రాణంతో ఉండవచ్చునని, తక్కిన ఇద్దర్ని చంపితేనే తాను పెళ్ళాడుతానని సొసియా ఓపియానికస్‌తో అంది

ఆమె అందానికి పరవశుడయ్యాడో లేక ఐశ్వర్యానికి లోలుడయ్యాడో లేక ఆ సమయంలో వ్యక్తమయిన ఆమె హృదయ కాఠిన్యానికి బలి అయ్యాడో కాని ఓపియానికస్ దీనికి అంగీకరించాడు ఒక బిడ్డను ఒక రోజు మట్టు పెట్టాడు, సందేహానికీ, విచారణకీ అవకాశం లేనట్టుగా ఆ కళేబరాన్ని కాల్పించాడు రెండు రోజుల తర్వాత ఇంకొక బిడ్డకు కూడ ఇదే గతి పట్టింది

ఈ శిశుహోమం జరిగిన తర్వాత సొసియా ఇతని దర్మపత్ని లయింది

## 11

ఈ విధంగా ఓపియానికస్ చేస్తున్న అక్రమాలకు, అన్యాయాలకు ఊరుఊరే లసహ్యించుకొంది అయితే సర్వాధికారి సల్లా ఇంకా పాలన చేస్తున్నప్పుడు అతని ప్రతినిదిని ఎవరు మాత్రం తాకగలరు? ఏమీ చేయలేక పోయినా ఊళ్ళోని వాళ్ళందరూ వీళ్ళకు దూరంగా ఉండిపోయారు అందరికంటే ఎక్కువగా సొసియా కొడుకు క్లుయెంటియస్ తల్లి నడతను తిరస్కరించాడు, ఆమె ముఖం చూడనన్నాడు

సల్లా మరణించాడు ప్రజలు నోరు విప్పేందుకు మళ్ళీ లవకాశం లభించింది సర్వాధికారి గ్రామస్థులకు లేకుండా చేసిన కొన్ని సౌకర్యాలను తిరిగి పొందేందుకు గ్రామంలోని ప్రముఖులు రోమ్ వెళ్ళారు వీళ్ళకు నాయకుడుగా క్లుయెంటియస్ బయల్దేరాడు

క్లుయెంటియస్‌ను హత మార్చడం తనకు క్షేమమని ఓపియానికస్ బావించాడు క్లుయెంటియస్ రోమ్‌లో కొంత అనారోగ్యంతో బాద పడ్తున్నప్పుడు అతనికి ఒక వైద్యుడు చికిత్స చేస్తుండేవాడు ఓపియానికస్ ఆ వైద్యుడి నౌకరుకు ఆశ చూపించి క్లుయెంటియస్‌కు విషమివ్వమని మరొకరి

మూలకంగా సలహా చెప్పించాడు

మహా మహా సంసారుల మనిపించుకొన్న వాళ్ళు కూడ ఇలాంటి పనులు చేయడానికి వెనుకంజవేయని కాలంలో వైద్యుడి సామాన్య నౌకరుకు ఇలాంటి లక్ష్యత్యం చేయడానికి మనసు లంగీకరించలేదు తనకు వచ్చిన రః సలహాను అతను తన యజమానికి చెప్పాడు, అతను దాన్ని లొగికి చెప్పాడు, లతను దాన్ని తనకు క్షేమాన్ని కోరె ఒక శాసన సభ్యుడికి చెప్పాడు

ఇది నిజమో కాదో తెలుసుకోవడానికి ఒక పరీక్ష జరిగింది ఓపియానికస్ డబ్బు, విషం ఇస్తుండగా సత్యవంతులైన నలుగురు ఇతనికి కనపడకుండా మరుగున ఉండి చూశారు ఓపియానికస్ మరో సారి న్యాయ స్థానం ముందు నిలవాల్సి వచ్చింది

## 12

రః న్యాయ స్థానంలో ముప్పై రెండు మంది తీర్పు ఇవ్వాలి అందరూ సత్యవంతులు కాదు, అనేక సందర్భాల్లో అపరాధి లయినవాడు వీళ్ళలో సగం మందికి డబ్బిచ్చి తన వైపుకు త్రిప్పుకొంటాడు

ఇది అందరికి తెలిసిన విషయం ఒకడే న్యాయాధికారి అయితే అన్యాయానికి పాల్పడవచ్చుననే ఉద్దేశంతో ముప్పైరెండు మందికి దెశం అధికారం ఇచ్చింది ఇందులో పదహారు మంది అయోగ్యులై అయితే దేశం మళ్ళీ న్యాయాన్ని ఎలా పాటిస్తుంది?

ముప్పయిరెండు మంది న్యాయాదికారుల్లో ఒకడు ఓపియానికస్ బంగారు నాణేలకు లొంగిపోయాడు, మరో పదునైదు మందిని తనవైపుకు త్రిప్పుకొంటానన్నాడు ఓపియానికస్ నుండి వాళ్ళకు లంచం ఇవ్వడానికి ఒక్కొక్కడికి నాలుగు వందల బంగారు నాణేల చొప్పున మొత్తం ఆరు వేల నాలుగు వందల నాణేలను తీసుకొన్నాడు ఓపియానికస్ పరంగా తీర్పు చెప్పమని పదిహేను మందికి డబ్బాశ చూపించి ఒప్పించాడు

## 13

ఆయితే ఆ తర్వాత ఆ న్యాయాధికారికి, ఇంత డబ్బా అందరికీ ఇచ్చి

తాను మాత్రం నాలుగు వందల బంగారు నాణేలను మిగుల్చుకోవడమనేది అవివేకమనిపించింది ఏమయినా డబ్బు చేతికందింది, డబ్బు అందలేదని చెప్తే ఈ పదహైదు మంది ఆక్రోశంతో అపరాధికి వ్యతిరేకంగా తీర్పు ఇస్తారు, తక్కిన వాళ్ళ తీర్పు వ్యతిరెకంగానె ఉంటుందన్న విషయం చెప్పాల్సిన పనిలేదు న్యాయస్థానం ఓపియానికస్ మీద అపరాదం మోపడం తథ్యం ఇలాంటి న్యాయస్థానం వ్యతిరెకంగా తీర్పునిచ్చిన తర్వాత మరో సారి విచారణ జరిపించాలని కోరడానికి పాపి అయిన ఓపియానికస్‌కు ధైర్యం ఉండదు, చేసిన తప్పుకు శిక్షగా అతను దేశ భ్రష్టుడవుతాడు చెతికి వచ్చిన డబ్బు తనకు, అపరాధికి అతని తప్పుకు తగ్గ శిక్ష

లంచం తీసుకున్న న్యాయాదికారి ఇలా ఆలోచించాడు, ఇదే విదంగా చెశాడు, న్యాయస్థానం ఓపియానికస్‌ని అపరాదిగా పరిగణించింది

అతను తనకు మోసం జరిగిందని అరిచాడు, ఆ అరుపుల్ని ఎవరూ వినలేదు గత్యంతరం లెక ఓపియానికస్ నగరం నుండి బహిష్కరింపబడి ఇటలీలో తిరిగాడు

సాసియా అతని వెంటేవెళ్ళింది నిరాధారుడైన జీవచ్ఛవాన్ని దైవమని భావించింది ఓపియానికస్ జీవితంలో విరక్తి అనే అధః పాతాళాన్ని చేరాడు

ఒక రోజు ఎక్కడో గుర్రం పైవెళ్తుడగా ఓపియానికస్ క్రింద పడ్డాడు, పెక్కు గాయాలవల్ల కన్ను మూశాడు

## 14

ఈ వివాదంలో ఒకరి చేతినుండి డబ్బు ఖర్చయిందని అందరికి తెలిసిపోయింది ఎవరిచ్చారన్నది నిర్ధారింపబడలేదు ఓపియానికస్ నిర్దోషి న్యాయాధికారులు క్లుయెంటియస్ నుండి డబ్బు తీసుకొని అన్యాయంగా ఇతని మీద అపరాధం మోపారని కథ అల్లబడింది ఈ కట్టు కథకు కారకురాలు బహుశా సాసియా కావచ్చును తన కొడుకు తనను నిరాకరించాడు, ఇతనికి గుణపాఠం చెప్పాలన్నది ఆమె పగ

లంచం తీసుకొన్నారని న్యాయాధికారులమీద, ఇచ్చాడని క్లుయెంటియస్

మీద ఆరోపించడం జరిగింది చూడకపోయినా చూసామని చెప్పే సాక్షులకు కొదువలేదు చాలమంది న్యాయాధికారులు శిక్షకు గురయ్యారు గొప్ప వంశానికి చెందినవాడన్న కారణంగా క్లుయెంటియస్‌కు శిక్ష తప్పింది

15

ఆస్తిని కాజేయడానికి తన కొడుకు అతని స్నేహితుణ్ణొకణ్ణి చంపాడని సాసియా ఆరోపించింది అది అసత్యమని బుజువయింది ఇతను ఓపియానికస్ కుమారుణ్ణి చంపాడని మరొక ఆరోపణ చేసింది, ఇదికూడ అసత్యమనే బుజువైంది మూడొ ప్రయత్నంగా ఈమె, ఓపియానికస్ గుర్రం మీది నుండి పడి చావలేదని, క్లుయెంటియస్ ఎవరి మూలకంగానో ఇప్పించిన విషపూరితమైన రొట్టెను తిని చచ్చాడని ఆరోపించింది, ఇదీ కూడ అసత్యమని తీర్పు ఇవ్వబడింది

మూడేళ్ళ తర్వాత దుష్టజన వత్సలుడైన హోర్టెన్సియస్ అనే అతను ప్రధాన న్యాయాధీశుడయ్యాడు అప్పుడు సాసియా ఓపియానికస్ కొడుకు ద్వారా తన కొడుకు మీద మరొక ఆరోపణ చేయించింది విచారణ సమయంలో అతనిపరంగా వాదించిన సిసెరో మహాశయుడు ఈ పూర్వచరిత్రనంతటిని చెప్పాల్సి వచ్చింది సాసియా దుష్కృత్యాలని లోకానికంతటికీ తెలుసు క్లుయెంటియస్‌ని శిక్షించకూడదని గ్రామ గ్రామాలనుండి ప్రముఖులు వచ్చి రోంలో సమ్మె చేశారు

క్లుయెంటియస్‌ను విడుదల చేశారో లేదో చరిత్ర చెప్పడం లేదు, విడుదల అయివుంటాడని మనం ఊహించవచ్చు

అయితే చరిత్ర, ఇది జరిగిన కొన్ని సంవత్సరాలకే రోం ప్రజాప్రభుత్వ వ్యవస్థ క్షీణించి, దాని పరిపాలనని ఆ దేశ సైన్యాధ్యక్షుడు తన కైవశం చేసుకొన్నాడని చెప్తుంది ఆ సైన్యాధ్యక్షుడు రోం చక్రవర్తుల్లో ప్రథముడయ్యాడు, రోం మళ్ళీ ప్రజాప్రభుత్వాన్ని దర్శించలేదు

# నేష్‌హువల్ కోయోట్‌ల్

దక్షిణ అమెరికా ఖండం పాశ్చాత్యుల పాలనలోకి రాకముందు పూర్వం ప్రస్తుతం మెక్సికో అని పిలుస్తున్న ప్రాంతంలో ఎన్నో వర్గాల ప్రజలు పుట్టి పెరిగారు అందులో ఒక వర్గం ప్రజలు తెష్కాక్‌ను తమ రాజధానిగా చేసుకొని పాలించడంవల్ల చరిత్ర వాళ్ళను తెపనాక్‌లు అని పిలిచింది పాశ్చాత్యులు యుద్ధంలో మందుగుండు సామగ్రిని అప్పటికే వాడుతుండడంవల్ల దక్షిణ అమెరికాలోని ఇలాంటి జాతులు వాళ్ళను ఎదిరించలేక త్వరగా ఓడిపోయాయి దేవుడికి నరబలి ఇచ్చె సంప్రదాయంతో పాటు మరికొన్ని క్షుద్ర సంప్రదాయాలు వీళ్ళలో ఉన్నందువల్ల క్రైస్తవ మతానికి చెందిన పాశ్చాత్యుల కంటె తక్కువ నాగరికత ఉన్నవాళ్ళుగా వీళ్ళను పేర్కొనవచ్చు ఇలా ఉన్నప్పటికి ఈ జాతుల జీవనం అనేక విధాలుగా సుసంస్కృతంగానె ఉండెది వీళ్ళ ప్రభువులు ఉదాత్తమైన ఉన్నతమైన ధ్యేయాలతో కూడిన జీవితాన్ని గడిపారు తేష్కాక్ ప్రజల రాజు నెష్ హువల్ కొయోటల్ జీవితం ఆ జీవనవిధానాన్ని కొంతవరకు తెలియజెస్తుంది

2

నెష్ హువల్ తండ్రి ప్రజల అభిమానానికి పాత్రుడై కొంతకాలం పరిపాలించాడు ఈ రాజు పెద్ద అంతఃపురాన్ని కలిగి ఉన్నప్పటికి ఈయనకు రాణి లేదా పత్ని ఒకతె ఉండెది ఈ రాణి సంతానానికి మాత్రం రాజ్యాధికారం సంక్రమించెది రాణి ప్రథమ పుత్రుడై యువరాజుగా ఉండిన నేష్‌హువల్ కుయోట్‌ల్ పదిహేనేండ్ల యువకుడుగా ఉన్నప్పుడు, ఈ జాతి విరోధులైన తేపనెక్ అనే ప్రజల రాజు వీళ్ళ మీద దండెత్తివచ్చాడు యుద్ధంలో వీళ్ళని ఓడించి, వీళ్ళం రాజును బందిగావించి, పదిమంది

చూస్తుండగానేహత్య చేశాడు విరోధులు రాజమందిరంలోనికి ప్రవేశించగానే, యువరాజు తప్పించుకొని పారిపోయి, చెట్టెక్కి కూర్చుని, అక్కడినుంచి తనతండ్రిని చంపుతున్న దృశ్యాన్ని చూసి నిస్సహాయునిగా కూర్చున్నాడు తెల్లవారగానె చెట్టుమీదినుండె దిగిఊరునుండి పరుగెత్తి తనదేశంలోని అడవుల్లో కొంతకాలం తలదాచుకుని బ్రతికాడు

మెక్సికో, తెష్కుక్, తేపనేక్ ప్రజలు పరస్పర సంబంధం ఉన్నవాళ్ళు మెక్సికో రాజు ఒకవిదంగా సార్వభౌముడు అప్పటి తేష్కూక్ తేపనేక్ ప్రదేశాల ప్రజల మధ్య కలిగిన వివాదంలో జొక్యం చేసుకుని, విజేత తేపనేక్ రాజును సమాదానపరచి, రాజ్యం ఆతని వశంలోనే ఉండవచ్చని విజేతకు అధీనుడై మెలగవచ్చని సంధి జరిపాడు తేపనేక్ ప్రభువుకు ఇది ఇష్టంలేదు, అయితే సార్వభౌముడు సూచించాడు విధిలేక సరేనన్నాడు నేష్ హువల్ కొయోట్ల్ రాజమందిరానికి వచ్చి, రాజుగా యువరాజుగా కాక సామాన్య పౌరుడిగా జీవించసాగాడు

విజేత నిర్దయకు ప్రతిరూపం అయితే ఈ రాజకుమారుడు అపారమైన గుణసంపద ఉన్నవాడు దొరకాడుకే కాదు అన్నట్టుగా, సామాన్య ప్రజల్లో తానూ ఒకడుగా, తన ప్రజలతో పాటు సరళ జీవనాన్ని గడపసాగాడు ఇలా ఇతను జనప్రియుడు కావడం విజేత ప్రభువుకు అప్రియమైంది ఇతనుంటే భవిష్యత్తులో తను బ్రతకడం కష్టమన్న బయం కలిగింది ఎలాగైనా ఇతన్ని చంపించిపేయాలని ఆతను నిశ్చయించుకొన్నాడు

ఒకరోజు యువరాజు తన ఇంటి అవరణలో మిత్రులతో బంతాట ఆడుతున్నాడు విజేత దూతలు నలుగురు ఇతను ఉన్న చోటుకు వచ్చారు, విజేత ప్రభువు ఇతన్ని పిలుచుకోని రమ్మన్నారని చెప్పారు విజేత తనకు ఏదో అపాయం తలపెట్టేలా ఉన్నదని ఇంతకు ముందే యువరాజుకు వర్తమానం అందింది నేష్ హువల్ కొయోట్ల్ దూతలతో ప్రభువుల ఆజ్ఞఅయిందా? వస్తున్నానన్నాడు కూర్చోండి, దుస్తులు వేసుకొని వస్తాను అని చెప్పి లోపలికి వెళ్ళి, నాలుగు సార్లు వీళ్ళకు కనిపించేలా అటూ తిరిగి ఇంటిలోపలికి వెళ్ళాడు

చాలసేవు అతని కోసం కాచుకొని ఇతనెక్క డా అని యువరాజ

సేవకుల్ని అడిగారు వాళ్ళు ఇక్కడ్డె ఉన్నారు కదా అన్నారు, దూతలు ఆయన లోపలికి వెళ్ళారు, మేము ఆయన్ని పిలుమకాని వెళ్ళాల్సివుంది, ఆయన తనంతకు తాను వస్తే సరే, లెకపో తె లొపలికి వెళ్ళి వెతుకుతాము అన్నారు

సేవకులు, మీయిష్టం, మీరు ప్రభువుల దూతలు, మీకు ఎవరు అడ్డం? అన్నారు

దూతలు లోపలికి వెళ్ళారు, ఇల్లంతా గాలించారు యువరాజు లేడు ఎంత ప్రశ్నించినా అతని సేవకులు ఎవరూ యువరాజు ఎక్కడికి వెళ్ళాడో చెప్పడానికి అంగీకరించలేదు

దూతలు వెనుదిరిగి వెళ్ళి జరిగిన సంగతిని విన్నవించారు కోపం పట్టలేక విజేత ఈ ఇంటి దగ్గరికి వచ్చాడు ఇంటి నౌకర్లను పిలిచి పెద్ద నౌకరు మొదలుకొని చిన్న నౌకరుదాకా అందర్ని యువరాజు ఏమయ్యాడో చెప్తారా లేక మీ తల తీసెయ్యనా అన్నాడు వాళ్ళలో ప్రతియొక దూ, ప్రభువుల విషయం మేము చెప్పె వాళ్ళము కాము తల తీయడానికి మీరు స్వతంత్రులు అన్నారు విజేత పెద్ద నౌకరను అందరి ముందూ చంపించాడు తక్కిన వాళ్ళను ఇప్పటికైనా చెప్తారా అని అడిగాడు వాళ్ళు అది మావల్ల సాధ్యంకాదు అన్నారు విజేత రెండోవాడి తలకూడ తీయించాడు "ఇప్పుడు", అని తక్కిన వాళ్ళని అడిగాడు అప్పుడు కూడ ఇదే సమాధానం నలుగురి తలలు ఖండించినప్పటికీ ఎవరూ యువరాజు ఆచూకీ తెలియజేయక పోవడాన్ని చూసి, కానివ్వండి మిమ్మల్ని వరుసగా ఉరితీయిస్తాను అని బెదరించి తన రాజమందిరానికి వెళ్ళాడు

యువరాజు దూతల కళ్ళనుండి మరుగైన కొద్ది క్షణాల్లో అక్కడి నుంచి తప్పించుకొని వెళ్ళిపోయాడు బయట ఉన్న ఒక చెరువునుంచి రాజమందిరానికి నీరు తెవడానికి ఒక చిన్న మార్గం ఉండేది, ఆ మార్గంగుండా వెళ్ళి ఒక సొరంగం దగ్గర దాక్కున్నాడు రాత్రికాగానే బయటికి వచ్చి సామాన్యుడిలా వేషం ధరించి నగరం నుంచి మళ్ళీ పారిపోయి అడవిలో దాక్కున్నాడు

నేషహువల్ నాలుగేళ్ళు ఇలా అజ్ఞాతంగా కాలం గడిపాడు విజేత ఆతన్ని గాలించడానికి వెయ్యి మందిని నియమించాడు, అతణ్ణిపట్టించిన

వారికి వెయి వరహాలు బహుమానంగా ప్రకటించాడు నాలుగేళ్ళు గడచినా ఆయన ఈ యువకుణ్ణి పట్టుకోలేక పోయాడు

## 3

ప్రజల ప్రేమే దైవంగా, వజ్రకవచంగా యువరాజును రక్షించింది

ఒకసారి విజేతదళం తనను వెన్నంటె తరుముకోని వస్తుండగా నేష్ హూవల్ కాయాటల్ తప్పించుకొని పరిగెడుతూ, ఒక గ్రామం పొలిమెరలో నృత్యం చేస్తున్న సైనికుల గుంపును మాశాడు ఇతను ఎవరయింది అందులోని కొంతమందికి తెలుసు అయినప్పటికీ ఇతను తమ యువరాజు, ఎలాగైనా సరే ఇతన్ని వాళ్ళ బారినుంది తప్పించాలని వాళ్ళ ఉద్దేశం యువరాజు పగవాళ్ళు తరుముకొని వస్తున్నారు అన్నాడు, వాళ్ళు తాము నర్తిస్తున్న మధ్య భాగంలో ఒక పీపాను ఉంచారు యువరాజును లందులో దాక్కోమని చెప్పి తాము తమ నృత్యాన్ని కొనసాగించారు తరుముకొని వస్తున్నవాళ్ళు అక్కడకు రాగానే ఎవలో ఇటు వైపు పరిగెత్తారని ముందు దారి చూపించారు

మరోసారి యువరాజు, పొలంలో నిలబడిఉన్న ఒక గ్రామస్థుడితో మీరాజు కొడుకును గుర్తుపట్టగలవా అని అడిగాడు ఆతను పట్టలేన న్నాడు "ఆతన్ని పట్టిచ్చిన వాళ్ళకు వెయి వరహాలు లభిస్తుంది తెలుసా," "తెలుసు అలా అంటున్నారు" "అతను కన్పిస్తే పట్టిస్తావా", "ఛీ-అలాగెవరైనా చేస్తారా" "ఎందుకోయ్, వేయువరవాలు నీకు వద్దేమిటి?"

"వద్దు వేయి వరహాలు? వేయి వరహాలు? ఒరేయ్ నేను దొరకొడుకుని, నన్ను పట్టిస్తే నీకు వేయి వరహాలు దొరుకుతాయి" "దొరకని, నా సామి నీకు దండం పెడతాను; మరుగ్గా వెళ్ళిపొండి" యువరాజుకు ఆశ్చర్యం వేసింది.

మరోసారి యువరాజు శత్రువుల బారినుంది తప్పించుకొని, ఒక యువతి పొలంలో గడ్డి మోపుల్ని ప్రొగు చేస్తున్న చోటుకు వచ్చాడు. శత్రువులు వెన్నంటె వస్తున్నారు. నేను ఇటుగావెళ్ళానని చెప్పకు అని ఆమెను ప్రాధేయపడి ముందుకు వెళ్ళ సాగాడు ఆమె, ఎక్కడికి వెళ్తారు?

ఆయాసపడుతున్నారు? ఇక్కడికి రండి అని ఒక గడ్డి కుప్పను చూపించింది ఆతనుఅలాగెనంటూ దానిమీద పడుకొన్నాడు ఆమె మెత్తగా పది గడ్డి మోపుల్ని ఒకవాటు పెరుస్తూ మెల్లగా నడిచింది యువరాజును తరుముకు వస్తున్న వాళ్ళు వచ్చారు, ఇక్కడికి ఎవరైనా పరుగెత్తు కుంటూ వచ్చారా అని అడిగారు ఆమె, వచ్చారులెండి, అలాగె పరుగెత్తి వెళ్ళారు అంది, ముందుకు వెళ్ళమంటూ ఒక దిక్కు చూపించింది వాళ్ళ భయం ఇక లేదని తెలుసుకుని, ఆతనితో ఇకలెవండి, వాళ్ళు వెళ్ళి పోయారు అంటూ పిలిచింది యువరాజు గడ్డి మోపులలొంచి బయటికి వచ్చి, నెనెవరో తెలుసా? అని అడిగాడు ఆమె, "ఏమిటి, మా దొరకొడుకా?" అని అడిగింది ఆతను, "అవును, నేవు నన్ను రక్షించావు" అన్నాడు ఆమె, "మీరు రాజై మమ్మల్ని రక్షించండి" అని చెతులెత్తి నమస్కరించింది

+

ఈ నాలుగేళ్ళలో విజేత క్రౌర్యం అతనికి వెయి మందిని శత్రువుల్ని చెసింది అతనికి అణగి మణిగి ఉన్నా, యువరాజు పక్షం ఉన్న ప్రజలు సమయం చూసుకుని తిరుగుబాటు చేసి విజేతను ఓడించారు, అతణ్ణి చంపెశారు, తలదాచుకుని తిరుగుతున్న యువరాజును పిలుచుకుని వచ్చి సింహాసనం మీద కూర్చో బెట్టారు మెక్సికో చక్రవర్తి, వాళ్ళు ఈ విధంగా చేయడంలొ తప్పేమీ లేదని అంగీకరించాడు నేష్‌హువల్ కాయొట్ల్ ఆ రోజు నుండి ముప్పయి రెండేళ్ళు రాజ్యాన్ని పరిపాలించి ఆదర్శ రాజన్న కీర్తిని సంపాదించాడు

వీళ్ళ వంశంలో ఇతని వయస్సుకు పెళ్ళి చేసుకొని ఒకరిద్దరు సంతానాన్ని కలిగి ఉండడం వాడుకగా ఉండేది, అయితే ప్రాణ భీతితో తలదాచుకోవాల్సిన పరిస్థితి ఏర్పడినందువల్ల, ఇతను ప్రభువయిన తర్వాత పెళ్ళి చేసుకోవాల్సిన స్థితి ఏర్పడింది తండ్రి హత్య గావింప బడడానికి ముందు రాచరికానికి చెందిన ఒక అందమయిన అమ్మాయిని ఇతనికి నిశ్చయించారు రాజయ్యాక తనను పెళ్ళి చేసుకోవాల్సిందిగా ఆమెను కోరాడు ఆమె, నేను వెరొకణ్ణి ప్రేమించాను మీరు నన్ను బలాత్కరించవద్దు అంది ఇలాంటి

సందర్భల్లో అబ్బాయి ఇంటివైపు వాళ్ళు పెద్దల్ని పంచాయితి చేర్చి తీర్పుకోరాడు పంచాయితి పెద్దలు అమ్మాయి అందగత్తె అందువల్ల ఆమెను వదలుకోవడం యువరాజుకు ఇష్టంలేదు ఆతను పంచాయితి చేర్చి తీర్పు కోరాడు పంచాయితి పెద్దలు అమ్మాయి చెప్పదలచుకొన్న విషయాన్ని, ఆమెను వలచిన యువకుడి మాటల్ని విని ఇలా ఒక నిర్ణయం తీసుకొన్నారు దొరకొడుకు రాజమందిరంలో సుఖ జీవనం గడపి ఉంటే కన్య మరో ఆలోచన చేసి ఉండేది కాదు, పెద్దల మాటల్ని శిరసావహించి నడుచుకొనేది రాజుహత్యకు గురయి, యువరాజు ఊరువదలి వనవాసంలో తలదాచుకొన్న సందర్భంలో ఈమె మరో యువకుడితో స్నేహం చేయడం తప్పుకాదు వీళ్ళిద్దరూ పరస్పరం వివాహం చేసుకోవాలన్న అంగీకారం కూడ చేసుకొన్నారు రాజుకోసం ఇలాంటి ఒప్పందాన్ని తుంచివేయడం భావ్యం కాదు అందువల్ల రాజుగారు ఈ అమ్మాయి పెళ్ళి చేసుకోవాలన్న తలంపును వదలుకోవడం మంచిది రాజుకు ఈ తీర్పు నచ్చలేదు అయినప్పటికి అది సరైయన తీర్పని ఆతనికి తెలుసు పంచాయితి పెద్దలు తనకు అనుకూలంగా తీర్పు ఇస్తారన్న ఆశ ఏకోశానో ఉండేది అయితే తీర్పు విన్న తర్వాత వాళ్ళ సత్యనిష్ఠని, నిష్పక్షపాతాన్ని మెచ్చుకొని ప్రశంసించాడు ఆ సుందరిని ఆమె మెచ్చి న వాడికిచ్చి పెళ్ళి జరిపించాడు

ఈ విషయంలో ఇలా ఉదాత్తంగా నడచుకొన్న రాజు తనరాణిని ఎంచుకునే విషయంలో తప్పుదారి పట్టాడన్నది ఒక విషాదకరమైన సంగతి అదెలా జరిగిందంటే తన రాజ్యంలోని మన్యం ప్రజలలో వయసు మళ్ళిన సామంత ప్రభువు ఒకరుండేవారు రాజయిన కొత్తలో ఇతనొకసారి అయన ఇంటికి విందుకు వెళ్ళాడు ఆ ప్రభువు అత్యంత సుందరి అయిన ఒక యువతితో విందు వడ్డింపచేశాడు దొర ఆమెను మెప్పించాడు ఆమె ఎవరో తెలుసుకోవాలనుకొన్నాడు ఆమె అంతఃపురంలో చేరదానికి వృద్ధప్రభువు ఎంపిక చేసిన మన్యం కన్య అని అతనికి తెలియవచ్చింది ఈమెను తనకిచ్చి వివాహం చేయమని ఆ సామంతుణ్ణి అడగడం రాజుకు ఇష్టంలేదు ఆతను అంగీకరించక పోతే పనిచెడిపోయినట్టే రాజు కొంతకాలం మౌనంగా ఉన్నాడు కొన్ని నెలలు గడవగానే పొరుగు దేశం వాళ్ళతో యుద్ధం ఆరంభం

కాగా సైన్యాధ్యక్ష బారాన్ని సామంతుని మీద ఎందుకు మోపాడని సామంతునికి ఆశ్చర్యం కలిగించింది అయిన అది రాజాజ్ఞ పాలించక తప్పదు ఆయన యుద్ధానికి బయల్దేరాడు, శత్రువుల చేతుల్లో హతుడయ్యాడు ఇది గడచిన కొంతకాలం తర్వాత రాజు మన్యం కుటుంబాలకు చెందిన అమ్మాయిలు అంతఃపురానికి రావడం కోసం ఒక ఉత్సవం ఏర్పాటు చేశాడు ఆ ఉత్సవానికి ఆ అమ్మాయి కూడ వచ్చేలా ముందుగానే ఏర్పాటు చేసి, స్నేహితురాండ్ర మధ్య ఆమె నిలబడ్డప్పుడు, ఆమెను తాను చూడనట్టుగా నటించి, ఈ సుందరి ఎవరని అడిగాడు ఇది నటన అని ఆ సుందరికి తెలుసు ఆమెకూ రాణి కావడం ఇష్టమే చుట్టూ ఉన్నవాళ్ళు ఆమెను పరిచయం చేసిన తర్వాత, దొర ఆమె తన రాణి కావలన్న కోరికని తెలియజేశాడు వృద్ధ ప్రభువు మరణించే సమయానికి ఆమె అతనిఅంతఃపురంలో ప్రవేశించి ఉండలేదు అందువల్ల ఆమె రాణి కావడానికి అర్హురాలయిన కన్య సుందరిని పొందడానికి రాజుగావించిన తంత్రం కొంతమందికి తెలుసు మరికొంతమంది ఇలా జరుగుతుందని ఊహించారు అయనా దొర ప్రవర్తన కొంచెం అన్యాయమనిపించినా అక్రమం మాత్రం కాదు. రాజు ప్రవర్తనని ఖండించి ఎత్తి చూపడానికి ఎవరికీ సాహసం లేదు సుందరి రాణి అయింది, దొరగారి జీవన జ్యోతిలా వెలిగింది

## 5

నేష్‌హువల్ కాయోటెల్ ఆదర్శరాజని ఇంతకు ముందే చెప్పాను అతను సహజంగా సూక్ష్మ బుద్ధి ఉన్నవ్యక్తి చిన్నతనంలోనే అనేక కష్టాలకు లోనై, అనన్య సాధారణమైన అనుభవాలతో సతమతమయ్యాడు పట్టపురాజు అయినప్పటికి ఆతను సుఖలోలుడు కాలేదు వంశాచారం ప్రకారం పెద్ద అంతఃపురాన్ని కలిగి ఉన్నాడు అనేక మంది భార్యల్ని పొందాడు అయినా ఎప్పుడూ వివేకరహితుడు కాలేదు సూక్ష్మ బుద్ధితోపాటు అతను భావుకుడు కూడ జీవితాన్ని గురించి లోతుగా ఆలోచించేవాడు ఆలోచనతోపాటు అతనికి సరస్వతి కటాక్షమూ కలిగింది ప్రజలు నమ్మిన దైవాన్ని నమ్మి పూజిస్తూ కొంతకాలం తర్వాత దేవుడ్ని గురించి తనదే అయిన ఒక భావాన్ని ఇతను ఏర్పరచుకొన్నాడు ప్రజలు తమ దేవుళ్ళకు నరబలి ఇచ్చేవారు నడివయస్సు

వచ్చేసరికి రాజుగారికి ఇది సరియైంది కాదనిఅనిపించింది ప్రజలు నమ్మిన దేవుణ్ణి త్రోసివేయకుండా, ఇతను తను బావించిన దైవానికి ఒక పూజా మందిరాన్ని కట్టించాడు అక్కడ జరిగే పూజకు పూలు, పండ్లు, సుగంధ ద్రవ్యాలును మాత్రమే అర్పించాలని శాసించాడు తాను పూజించే దేవుణ్ణి ఇతను దైవంగా పిలిచాడు ఆ అదృశ్య దైవానికి విగ్రహరూపం ఇవ్వడం బావ్యం కాదన్నాడు మతవిషయంగా జనులతొ బాగా కలిసిపో యి, వాళ్ళస్థాయినుండి పైకి ఎదిగాడు ఆ రాజ్యంలొ సంవత్సరానికోసారి ఒక కవి సమ్మేళనం జరిగెది ప్రతి సంవత్సరం ఆ సంవత్సరంలొని అత్యుత్తమ కవితకు రాజుగారి బహుమానం లబించేది అందరిలాగానే రాజు కూడ తన కవితను గోష్ఠిలో విన్పించెవాడు సమాజంలొని పంచాయితిదారుళ్ళ లాగానే ఆ గోష్ఠి పంచాయితి దారులు కూడ సత్యనిష్ఠులు, నిష్పక్షపాతులు అనేక సంవత్సరాలు ఇతనికవితకు బహుమానం లభించలేదు అయినా రాజు నిరుత్సాహ పడలేదు ఒక సంవత్సరం బహుమానం లభించింది ఇతర కవులలాగానే రాజు దాన్ని స్వీకరించాడు, తీర్పునిచ్చిన నిర్ణేతలకు ధన్యవాదాలు తెలియజేశాడు

సన్మానం పొందిన ఆ కవితా తాత్పర్యం ఇలా ఉంది  
అతి చింత చేయకు మూర్ఖమనుజుడా  
బతుకనే నీడను విశ్వసించకు అతిగా  
సుఖం శాశ్వతం కాదని ఏడవకు మూర్ఖుడా  
సుఖమనే నీడకు ఊపిరిపో సి  
బంధించబోతున్నావు; దీన్ని గ్రహించు.

ఆలోచించు కాస్త, నీ జాణతనం తెలుస్తుంది  
ఊపిరే అనిత్యం; సుఖం అంతకంటే క్షణికం కదా  
సుఖం నిత్యంగా ఉండాలనే మూర్ఖుడా!  
కష్టమూ నిత్యం కావాలంటావే నీవు  
నిత్యకష్టం ఆశించడమా నీజాణతనం?  
పూమాలకట్టు దేవాలయంఊడ్చు  
నవవసంతం కాలపు రసాన్ని పీల్చు  
సమస్తం నశించి ధర్మం నిలుస్తుంది చూడు,  
చూశాను, ధర్మ మార్గంలో నడుస్తావు నీవు

ఆ తరువాత ఒకరోజు, అది వచ్చిన నాడు
చెతికందని గగన కుసుమానికై ఆశించెవు
వ్యర్థంగా అది లశించెవు, వద్దు నీ తిప్పలు
అంతా బాగున్న నెడె చెయాలి దైవగానం
నశిస్తుంది రాజపదవి, గతిస్తుంది వైభవం
కాలమనె పొట్టెలు తన కొమ్ములతో
పొడిచి నీ ఆటను అంతం చెస్తుంది, లప్పుడు
మిగిలేదెమిటి? జీవితపు ఒక బాగం
నిలుస్తుంది నడిచాడు వీడు ధర్మ మార్గం,
అన్నమాట నూటొక్కమంది పిల్లల్ని కన్న
మనుజుడు యశస్సనె శిశువుకు ఇవ్వాలి జన్మని
యశస్సనె వెలుతురులో చూడాలి దేవుడి ముఖాన్ని
రః లోకం బాగుంది, ఇంతకంటే బాగుంది ఆలోకం
దీన్ని తెలుసుకొవడమే వివేకం
రః మట్టి భృంగారం, వనం జలం శృంగారం
మాడు ఆకాశరాజు నక్షత్రహారం

నెషూవల్ కొయోట్ల్ పరిపాలనా విషయంలో కూడా ఇదే విధంగా ఉన్నతమైన మనోధర్మంతో వర్తించేవాడు దీనికి నిదర్శనంగా కొన్ని సంగతుల్ని చెప్పవచ్చు

సింహాసనం అధిష్ఠించిన కొన్ని రోజులకే, తనను శత్రువుల బారినుండి రక్షించిన యువతి గ్రామానికి వెళ్ళి, ఆమె తల్లిదండ్రుల ఎదుట ఆమె చేసిన ఉపకారాన్ని స్మరించడమే కాకుండా, నువ్విష్ట పడితే నిన్ను నా ప్రేయసిగా ఉంచుకొంటాను, అంతఃపురానికి వస్తావా? అని పిలిచాడు రాజుకు ప్రియురాలు కావడం చాల మంది అడపిల్లలకు ఇష్టం కావచ్చు అయితే ఈ అమ్మాయి మనస్సలాంటిది కాదు, ఆమె నిరాకరించింది రాజు కోపగించుకుంటాడేమోనని ఆమె తల్లిదండ్రులు భయపడ్డారు ఆతను కోపగించుకోలేదు; "నవ్వుతూ, ఎందుకని? అమ్మా నాన్నల్ని వదలిపెట్టలేవా? వాళ్ళు కూడా రానీ" అన్నాడు అమ్మాయి "అందుకని కాదు, వదలిపెట్టగలను, నాకు నాదంటూ ఇల్లు కావాలి" రాజు "అంతఃపురం నీది కాదా"? యువతి

"అంతఃపురం రాణిగా వచ్చేవాళ్ళదవుతుంది" రాజు అయితే ఏమిటి ? యువతి "ఏమిటంటే, నేనూ అంతఃపురము మీ ఆస్తి అవుతాము, అంతఃపురము, మీరు రాణి ఆస్తి అవుతారు" అమ్మాయిచాలా గడుసుది, తెలివైంది ఆమె ఈ కల్లా కపటం లేని మాటల్ని విని రాజుకు ఎక్కడలేని సంతోషం, ఆశ్చర్యం కలిగింది అతను, కష్ట కాలంలో రక్షించిన దానివి సుఖంగా ఉన్న కాలంలోనూ నాకు తోడుగా ఉండి నన్ను కాపాడలన్న భావంతో పిలిచాను పెళ్ళి చేసుకోని భర్తతోపాటు అంతఃపురానికి వస్తావా ? అని అడిగాడు ఆమె, భర్త అంగీకరిస్తె రాగలను అంది రాజు ఆమె తల్లిదండ్రులకు కొన్ని వరహాలనిచ్చి వెనుదిరిగి వచ్చాడు వస్తూ దార్లో దొరకొడుకును శత్రువుల చేతికి అప్పగించనని చెప్పి ఉండిన గ్రామస్థుడి ఊళ్ళోకి ప్రవేశించాడు అతన్ని కలిసి పొరుగూరులోని ఆ అమ్మాయి నీకు తెలుసా, అని అడిగాడు తెలుసునని అతడు చెప్పాడు ఆమె చేసిన ఉపకారాన్ని అతనికి వివరించి రాజు నీవు ఆమెను పెళ్ళి చేసుకొని నాదగ్గర పనిలోకి చేరగలవా ? అని అడిగాడు అతను ఆమెను అడుగుతాను, ఆమె సరేనంటే అలాగే వస్తాను అన్నాడు దొరవాళ్ళ పరివారంతో ఒక పెద్దమనిషిని పిలిపించి వాళ్లిద్దరికి తానే పెళ్ళి జరిపించాడు భార్యభర్తలని తన పెద్ద రాజమందిరానికి పిలిపించు కొని భర్తను తన అంగరక్షకుడిగాను, అతని బార్యను తనకు భోజన సదుపాయాలను ఏర్పాటు చేసే స్త్రీ గాను నియమించాడు ఈ ఏర్పాటు రాజుగారి జీవనపర్యంతము అలానే కొనసాగింది

రాజ్యంలోని వనప్రదేశం అదిక భాగం రాజుగారి అరణ్యా రక్షిత ప్రదేశంగా పరిగణించబడినది ఇరుగు పొరుగు గ్రామాల ప్రజలను ఈ అరణ్యంలోను ప్రవేశించడానికి అనుమతించేవాళ్ళు కాదు అలా ప్రవేశిస్తె, రాజభటులు వాళ్ళను శిక్షించేవాళ్ళు, పీడించేవాళ్ళు, దొర ఒకసారి ఇలాంటి ఒక అడవి వెలుపల పల్లెటూరి కుర్రవాడు ఎండు పుల్లలు ఏరుకుంటూ చెమటలు కార్చుతూ ఉండడం చుశాడు ఎవరు బాబు , అక్కడ కావలసినన్ని ఎండు కట్టెలు ఉన్నాయి కదా, వాటిని ఏరుకోవచ్చు కదా ? అంటూ అడవిని చూపిస్తూ అడిగాడు ఆకుర్రవాడు , రాజుగారు అనుమతిస్తె అలాగే చేయవచ్చు అయితే ఆయనకు మా కష్టాలు ఎలా తెలియాలి అని సమాధానమిచ్చాడు ఈయనె దొరగారిని అతనికి

తెలియదు చాలామంది ఈ కుర్ర వాడి లాగానే అనుకుంటూ ఉంటారని రాజుగారికి తోచింది అతను రాజమందిరానికి వెనుదిరిగి, రాజుగారి అడవుల్లో ఇరుగుపొరుగు గ్రామాల్లోని ప్రజలు తమ నిత్యావాయానికి కావలసినన్ని కట్టెలని ఏరుకొని వెళ్లవచ్చని చట్టాన్ని జారి చేశాడు

ఒకసారి వయస్సుమళ్లిన భార్యాభర్తలు రాజధానిలో కట్టెల వ్యాపారం జరిగే రచ్చదగ్గరికు వచ్చారు రచ్చమధ్యలో వనివాళ్లకోసం రెండంతస్తుల భవనం ఉండేది రాజు తనకు ఇష్టం వచ్చినప్పుడు వేషం మార్చుకోని, ఈ బవనం మీద నిలబడి ప్రజల నడవడిని, మాటల్ని గమనిస్తూ ఉండేవాడు ఆరోజుఅతను అక్కడ నిలబడ్డప్పుడు ఈ దంపతులు మాట్లాడుకుంటున్న మాటలు వినిపించాయి, రోజంతా కష్టపడి ఇక్కడికి వస్తే ఇక్కడ దొరికేది మూడుకాసులు, అది దేనికీ చాలదు ప్రభువులైనవాళ్లు రాజబవనంలో చల్లకదలుకుండా సుఖంగా ఉంటారు అని భర్త అన్నాడు అందుకు భార్య ఏమిటలా మాట్లాడు తావు? ఎవరైనా వింటె రాజను దోషించావని తలనరికెస్తారు అంది మరుక్షణంలో రాజుగారి సేవకుడొకడు వచ్చి రాజుగారి మిమ్మల్ని పిలుస్తున్నారు రండి అన్నాడు భార్యాభర్తలిద్దరూ ఇక తమ పని ముగిసిందని అనుకొన్నారు, వాడి వెంటవెళ్ళారు రాజు వాళ్ళతో మీరక్కడ ఏం మాట్లాడుకొన్నారు? అని అడిగారు అందుకు ఆ భార్య, మా ఇంటాయిన అంత తెలిసినవాడు కాదు అయ్యగారు కోపం చెసుకోకూడదు, రోజంతా కష్టపడినా కడుపునిండదు అందుకలా అన్నారు అని వివరించింది రాజు రాజు గురించిన మాటేమిటి అని అడిగాడు ఆమె, ఏదో నోటికి వచ్చింది అన్నారు, మా కర్మ మాది రాజుగారి కష్టం రాజుగారిది అంది రాజు ఈమె మాటలకు మెచ్చి ఆమె చేతికి, అమె భర్త చేతికి ఒకొక పిడికెడు వరహాలు ఇచ్చాడు సంపాదన లేనిరోజున వీటిని వాడుకొండని చెప్పాడు ఇది ఖర్చు కాగానే మళ్ళీరండి దేశంలో ఎవరూ కడుపు నిండడం లేదనకూడదు రాజుగా నా చేతనైనంతవరకు అందరి బాగోగులు చూసుకొంటాను రాజమందిరంలో వరహాలు, ధాన్యం కావలసినంత ఉన్నాయి దాన్ని తినే జనమూ ఉన్నారు నేను కూడా పేదవాడినే వెళ్ళిరండి అన్నాడు

# 8

నెష్హువల్ కాయోటేల్ తన వంశాచారం ప్రకారం ఒక రాణితోపాటు చాలమంది ప్రియురాళ్ళతో అంత పురంలో కాపురం ఉంటున్నాడు ఇతనికి ప్రియురాళ్ళవల్ల చాలమంది సంతానం కలిగినా, కలకాలం రాణిగారికి మగసంతానం లేకపో యింది రాజుగారికిది కొరతగా ఏర్పడింది సాంప్రదాయిక పురోహితులు, పూర్వీకులు పూజించిన దేవుడిని ఆదరించక పోవడంవల్ల రాణికి సంతానం కలగలేదు రాజుగారు ఆ దేవుణ్ణి ఆరాదించాలి, రాణిగారు కొడుకును కంటారు అన్నారు రాజు కాదనలేక పూర్వీకులు పూజించిన దేవుణ్ణిపురోహితులు చెప్పిన విదంగానె ఆరాదించాడు రెండేళ్ళు గడిచాయి, సంతానం కలగలేదు నా మనస్సులో నాటిన దేవుణ్ణే వెడుకొంటాను కొడుకును పొందుతాను అన్నాడు తాను నిర్మించిన దైవమందిరంలో పూజా పునస్కారాలను జరిపి, దేవుణ్ణిస్మరించి, చాలసార్లు ఉపవాసాలు చేశాడు ఇతని నమ్మకానికి తగినట్టుగానె రాణి గర్భం దరించి రాజుగారి తర్వాత అదికారి కాబోయే కొడుకును ప్రసవించింది

నెష్హువల్ కాయెట్ల్ పూర్వీకులు పూజించిన దేవుణ్ణి అంగికరించక పోయినప్పటికి పూర్వంనుంచి వంశ పారంపర్యంగా వస్తున్న ఆచారాల్ని వదలక పాటించారు ఆచారం ఇలాగుండేది ప్రతిసంవత్సరం ప్రతి సంవత్సరం రాజు గారి సింహాసనం అధిష్టించిన రోజున రాజమందిరం ప్రాంగణంలో రాజుగారు రాజ్యంలొని సామంతులతో సభ జరిపేవారు ఆ సభలో వాళ్ళు తమ వాడుక ప్రకారంగా శ్రేష్టమైన బట్టల్ని ధరించకూడదు రాజ్యంలోని అతిసామాన్య వ్యక్తులు ధరించే బట్టల్ని ధరించాలి సభలో రాజ పురోహితుడు దేవుణ్ణి గురించి , ధర్మాన్ని గురించి , పుణ్యవంతుల కర్తవ్యాన్ని గురించి వివరించి ఉపదేశం ఇవ్వాల్సి ఉంటుంది ఆ సంవత్సరంలో రాజుగారు కాని , సామంత ప్రభువులైనవారు కాని, ఏ విషయంలోనైనా కాని తప్పు చేసినట్టు తనకు కాని తన తోటి పురోహితులకు కాని చెవిని పడితే అలాంటి విషయాలను అందరి సమక్షంలో బహిరంగ పరచాలి ఇక ముందు ఇలాంటిది జరగకూడదని హెచ్చరించాలి

ఈ విధంగా పాటించబడుతున్న పద్ధతి వల్ల ఎంతటి ప్రయోజనం కలిగేదో చెప్పాల్సినపనిలేదు పురోహితులు ఈ అధికారాన్ని స్వేచ్ఛగా ఉపయోగించేవారు అంతేకాదు దోషాలను నిరూపించడంలో ఎవరికీ గౌరవ భంగం కాకుండా జాగ్రత్తగా వ్యవహరించేవారు ఆ రాజపురోహితుడు ఈ కార్యాన్ని చాల సక్రమంగా నిర్వహించేవారని నెషహువల్ కొయోట్ల్ ఒయునని బాగా ప్రశంసించాడు

నెష్హువల్ కొయోట్ల్ రాజుగా ఉండిన ముప్ఫయి రెండేళ్ళు ఉదాత్తమైన జీవన మార్గంలో నడిచాడు విశ్రాంతి అవసరమైనప్పుడు ఏకాంతంగా ఉండడానికి రాజధానికి దూరంగా, దట్టమైన అడవిలోని ఒక కొండ శిఖరాన, ఒక భవనాన్ని నిర్మించుకొన్నాడు గిరి శిఖరంలో ఒక పెద్ద తటాకాన్ని నిర్మించి, ఒక ఉద్యానవనాన్ని నిర్మింపచేశాడు గిరి మధ్య బాగంలోని ఒక సమతల ప్రదేశంలో మరికొన్ని ఉద్యానవనాలను నిర్మింపచేశాడు ఈ ఉద్యానవనాల్లో అనేక తటాకాలను నిర్మించి, పైతటాకాంలోని నీరు కృతక జలపాతాలుగా దుమికి, తటాకాలను ప్రవేశించేది జలపాతాలనుండి వచ్చే శీతల వాయువులతో నిండి విహార భూమి చల్లగా ఉండేది రాజు ఓకసారి పైనున్న ఉద్యానవనంలో ఓకసారి మధ్యభాగంలోని ఉద్యానవనంలో మరోసారి క్రింద ఉద్యానవనాల్లో, రాణితో ,ప్రియురాళ్ళతో, పిల్లలతో, పురోహితులు, ప్రభువులు పుర ప్రముఖులతో కూడి సరససల్లాపాలతో, క్రీడా వినోదాలతో, వర్షాగోష్ఠులతో కాలం గడిపే వాడు మొత్తం మీద దొరగారు జీవితాన్ని ఒక కళగా పరిగణించి అందంగా తీర్చిదిద్దుకున్నారు

ప్రతి సంవత్సరం జరిగె సభలో ఒకసారి, అదేందుకో ఏమో, దొరగారికి తాను వచ్చే ఏడు ఉండడని పించింది అయితె అప్పుడు అతను ఏమీ చెప్పక, నెల రోజులు తర్వాత ఒకరోజు ఊపిరి పీల్చడం కష్టంగా తోచి , రాణి ,ప్రియురాండ్లతో పాటు గిరి శిఖరం మీద ఈ విహార మందిరానికి వచ్చాడుపురోహితులను కూడ పిలిపించుకొని ఆ సాయంకాలం అందరి సమక్షంలో రాణిగారిని ప్రక్కన కూర్చో బెట్టుకోని, ప్రియురాంద్రను చుట్టు కూర్చోమని చెప్పి, తొమ్మిదేళ్ళ వయస్సున్న యువరాజును తన తొడమీద కూర్చో బెట్టుకోని , ప్రియురాంద్ర పిల్లలలో ప్రీతి పాత్రుడైన పెద్దవాడిని

దగ్గరికి పిలిచి "చూడు నాయనా, నేనిక చాలా రోజులు బ్రతకను ఈ క్షణంనుంచి ఈ నీ తమ్ముడు రాజు నీవు రక్షకుడివి ఇతనికి యుక్త వయస్సు వచ్చేదాకా నీవు ఇతని పరంగా రాజ్యాన్ని పాలించాలి, తెలిసిందా?" అని అన్నాడు ప్రేయసికొడుకు వీళ్ళందరికంటే పెద్దవాడేకాక ఇరవై అయిదు ఏళ్ళకు పైగా వయస్సున్నవాడు ఎప్పటికైనా ఈపనికి నియుక్తుణ్ణి చేయాలనే ఉద్దేశంతో రాజు అతణ్ణి పెంచాడు ఆతను, "దైవ నిర్ణయం ఇలాగే జరిగే రోజున నేను తప్పకుండా ఈ పనికి అంగీకరిస్తాను ద్రోహం తలపెట్టక నిర్వర్తిస్తాను అయినా ఆ మాటలన్నీ ఇప్పుడెందుకు?" అన్నాడు రాజు రేపు ఒప్పుకునేవాడివి, ఇప్పుడే నాకు మాటివ్వు, ఇది నా కోరిక అన్నాడు అతను తమ అజ్ఞ అని అంగీకరించాడు దొర రాణితోను, పురోహితుడితోను, నా పెద్ద కుమారుడు గుణవంతుడు అతను తన కర్తవ్యాన్ని తప్పక నిర్వర్తిస్తాడు మీరందరూ అతనికి సహకరించాలి అన్నాడు రాణి అలాగే అంది, పురోహితుడు , రాజాజ్ఞ అన్నాడు

ఇది జరిగిన మూడు రోజులకు నేష్‌హువల్ కోయోట్‌ల్ కన్ను మూశాడు మరణించడానికి ముందు ఒక పద్యాన్ని రచించి , దాన్ని తన పిల్లలకు నేర్పించి వాళ్ళతో పాడించుకొని విన్నాడు

నశిస్తుంది ఈ లోకంలోని సమస్తం
ఈ జగత్తులో నశించని వస్తువు శూన్యం
ఉత్సాహం, ఆనందం సొగసుతో బ్రతికినా
ఉన్నవారికు మధ్యలో తగులుతుంది రోగం
ఓడిపోయి పడిపోతాయి అన్ని, కళ్ళు
మూస్తాయి, మరపిస్తాయి, కలుస్తాయి మట్టిని

గోళాకారంలో కన్పించే ఈ సృష్టి
శవాన్ని పూడ్చే గుంత, ఈ సమస్త ప్రేతభూమి
దీని గుండెమీద బ్రతకడమంటే ఏమిటి?
అన్నిటిని మ్రింగి, తాను మాత్రం మిగులుతుంది

నదీనదులు మహానదులన్ని
ఆతురాతురతో పరుగెత్తి పరుగెత్తి నేరుగా

సముద్ర ప్రళయమగున కలిసిపోతాయి
మళ్ళీ ఎవరు చూడలేరు వాటి మూలాన్ని

ఎన్నటి బ్రతుకు నేడు అగపడదు
నేడు కనబడ్డా మళ్ళీ ముందెప్పుడు అగపడవు
సర్వం నశించే శ్మశానం చేరడం మానవా?
సృష్టి వ్యాత్యపు తాండవమామి

గద్దెనెక్కి సభలు జరిపించి
సైన్యాధిపత్యాన్ని వహించి, దర్పంలో
వైభవంగా విర్రవీగిన వాళ్ళెక్కడ?
మట్టిలో కొట్టుమిట్టాడుతున్నారంతే

చరిత్ర చెప్తోంది ఇది ఉండేదని
ఆ మాటేమిటి? అదివదలిపెట్టింది ఏది
అగ్నిదేవుడు తన మండే నాలికను చాచి చాచి
సాగిపోతున్నప్పుడు దూరం బహుదూరం

పెద్దలు, మంచివాళ్ళు, బుద్ధిమంతులు , జ్ఞానులు
వీళ్ళందరూ నేడెక్కడ ? తెలుసుకో రః నిజం
గొంతెత్తి చాటారు మాస్థలం మట్టేనని
ఈః మాటే చెప్తుంది తరం తరం

దీన్ని తెలుసుకొని బుద్ధిగా మెలగాలి అందరం
పిల్లలు, పెద్దలు నాగరీకులు, గ్రామీణులు
అందరూ తెలుసుకోండి, ధైర్యం వహించండి
తెలిసినవాళ్ళెరిగిన సత్యాన్ని అనుసరించండి

శ్మశానం మొత్తం భయంకర దృశ్యాలె
దానవతల బాస్కరుడి వెలుగు, ఈ రహస్యం తెలుసుకో
చావనేది బయంకరమైన నల్లటి ఛాయ ఈః
శ్మశానంలో, దాన్ని దాటితే నక్షత్రాలకు భాస్కరుడి వెలుగు

దీని ఆంతర్యం తెలుసుకోండి ప్రజలారా
నా మాట వినండి, ఇదే నా మనవి
కారివి, శోకం, శాశ్వతమైన సత్యం

దాన్ని ఆశించెవము మనం, అదొక టె నిత్యం

నెఫ్‌హువెల్ కోయోట్‌ల్ చరిత్ర ఎంత మనోహరంగా ఉంది, ఇది చరిత్రా ?లెక కదా? అని మాలాంటి వాళ్ళకు సందేహం కలుగుతుంది అయితే ఇది చరిత్రె దీన్ని ఇతని మునిమనుమడేకడు సంప్రదాయను సారంగా వ్రాసి ఉంటాడు రాజుగారు బ్రతికిన రోజుల్లో బంగారుతో ఒకటి, లోహంతో ఒకటి, కొయ్యతో ఒకటి, రాతితో ఒకటి ఇలా అతని శిల్పాలు విగ్రహాలనూ చెక్కారు రాతిశిల్పం విహార కేంద్రంగా ఉన్న పర్వతం మీద తటాకం పై బాగంలో ఉన్న ఒక దెవతా మూర్తి నోటి చెంత నిర్మించారు తక్కిన విగ్రహ మూర్తులకంటె ఈ శిల్పం తన రూపాన్ని ప్రతి బింబిస్తుందని రాజు చెప్పేవాడట

ప్రస్తుతం ఆ విగ్రహమూ లేదు, అలాంటి ప్రజలూ లేరు, రాజుగారి జ్ఞాపకం మాత్రం నిలిచి పొయింది అతని ప్రజలు అంత ప్రసిద్దులు కాక పోవడం వెత, లోకం అ చరిత్రను, ఆది దాచుకున్న జ్ఞాపకాన్నీ గుర్తించడం లేదు

# విచిత్రప్రేమ

ఫ్రాన్స్ దేశపు ప్రసిద్ధ సాహితివేత్తగా పేరుగాంచిన వాల్టేర్, దేశంలోని అతిముఖ్య నగరమైన ప్యారిస్‌లో ఒకనాటి సాయంకాల వినోద కాలక్షేపంలో పాల్గొని ఉన్నప్పుడు, ఒక వెగుల వాడు అతనికి ఏదో ఒక వార్తను అందించడానికి వచ్చాడని సేవకులు చెప్పారు వాల్టేర్ ద్వారం దగ్గరికి వెళ్ళి వార్త ఏమిటని ప్రశ్నించాడు చాటలైట్ ప్రభువు వార్త పంపించాడు తమ రాణిగారు నిన్నటి రోజు ప్రసవించారు ఆమె చాల అపాయ స్థితిలో ఉన్నారు మిమ్మల్ని చూడాలని కోరుతున్నట్టుగా తమకు తెలుపమని నన్ను పంపించారు అన్నాడు

వాల్టేర్ గుండె జల్లుమంది చాటెలైట్ రాణి రెండేళ్ల క్రితం తన ప్రేయసిగా ఉండేంది అనేక సంవత్సరాలుగా చేయిపట్టిన బర్త భర్త కాదు, చతురుడైన ప్రియుడె తన బర్త అన్నట్టుగా ప్రవర్తించి తన జీవితాన్ని సుఖసంతోషాలతో నింపింది చాల ఏళ్ళు ఇలాగే గడిపి, ఉన్నట్టుండి ఒకరోజు ఆయన మీద ప్రేమను మరిచి పోయింది వాల్టర్ చాల దుఃఖించాడు, జీవిత మక్కాని దూరమయినట్టుగా దిగులు చెందాడు, తనను తిరస్కరించిన స్త్రీచెంత ఉండడం కంటే దూరంగా ఉండడం మంచిదని ఆమెను వదలి దూరం వెళ్ళిపోయాడు

కొద్దిరోజులకే అతనికి తన ప్రియురాలు తనెందుకు తిరస్కరించిందో తెలియవచ్చింది సెయింట్ ల్యాంబర్ట్అనే యువకుడు ప్రభువుకు మిత్రుడుకావడం తటస్థించింది ఆ సుందరి ఆ మనోహరుణ్ణి మెచ్చుకొంది, తనను దూరం చేసింది

సెయింట్ ల్యాంబర్ట్ యువకుడు, స్ఫురద్రూపి కూడ తాను

యువకుడూ కాదు, స్ఫురద్రూపి కూడ కాదు రాణి అతని అందాన్ని మెచ్చుకొని ఇతని కురూపత్వాన్ని తిరస్కరించడంలో ఆశ్చర్యంలేదు అయితే ఆమె తనను ప్రేమించిన రోజుల్లో తానేమీ పెద్ద అందగాడు కాదు అప్పుడూ తను కురూపే ఉందమైన యువకులు, ప్రభువులు, ఎంతోమంది ఉండేవారు ఆమె తనని ఎందుకు వరించింది? ఎందుకు ప్రేమించింది? ఎందుకు సంతోష పరచింది? వరించి, ప్రేమించి ఆనందింప చేసి ఎన్నో సంవత్సరాలు తనతోపాటు జీవించి హఠాత్తుగా ఎందుకు తిరస్కరించింది?

ఆనాడు అంత క్రూరంగా ప్రవర్తించి తన మనస్సును నొప్పించిన కటిక ప్రవర్తనగల స్త్రీ ఇప్పుడు నన్నెందుకు చూడాలనుకొంటోంది? వెళ్ళడమా? ఆమె భర్త అక్కడె ఉంటాడు, అతన్ని చూడడమా? సెయింట్ ల్యాంబర్ట్ కూడ అక్కడ ఉంటె ఉండవచ్చు అతన్ని కూడ చూడడమా వెళ్ళిన తర్వాత వీళ్ళందర్ని మాట్లాడించాలి, ఆ భర్తనూ, ఆ ప్రియుడిని ఆ కళ్ళుమూస్తున్న ప్రేయసిని, ఏమని మాట్లాడించేది?

ఇలాంటి ఆలోచనలన్ని ఒక క్షణంలో మెరుపులా మెరిసి, వేగులవాడితో, వార్త తెచ్చి ఉపకారం చేశావు నీవు ప్రభువులకు నా నమస్కారాలు తెలియజెయి నేను నీవెంటనే వస్తున్నట్లు విన్నవించు అన్నాడు

వినోద కాలక్షేపం జరుగుతున్న ప్రదేశానికి మళ్ళీ వెళ్ళి మిత్రుల అనుమతిని పొంది తన నివాసానికి బయల్దేరి, వెంటనే అక్కడినుండి చాటలైట్ దుర్గానికి ప్రయాణమయ్యాడు

మార్గ మధ్యంలో తాను తన ప్రేయసితో గడపిన మధుర క్షణాలను స్మరిస్తున్నాడు రాణి ఇతనికి ఊపిరి పోసిన ప్రేయసి మాత్రమేకాదు ఇతని మాటల్ని విని మెచ్చుకొన్నది, మాటలకు సరిగా ప్రత్యుత్తరం ఇచ్చేది అదివ్రాయమని, ఇది వ్రాయమని ప్రేరణ ఇచ్చెది, వ్రాయగానే అందరికంటే ముందు తాను విని, మార్పులు చేర్పుల్ని అతి తెలివితేటలతో సూచించేది ఇతను జరుపదలచుకొన్న భౌతిక శాస్త్ర ప్రయోగాల కోసం రాజమందిరంలో ఒక ప్రయోగశాలను ఏర్పాటు చేసింది అందులో ఇతనితో పాటు తాను

కూడ ప్రయోగాలను జరిపింది కొన్ని సార్లు ఇతనికి తోచని సంగతుల్ని తాను కనిపెట్టేది వీళ్ళిద్దరి జీవితం కేవలం శారీరిక ఆకర్షణ మాత్రం కాదు రెండు దేహాల్లో ఉన్న ఒక చైతన్యంలా ఒక జీవితంగా కలిసి సాగింది

చాటలైట్ రాజమందిరాన్ని ప్రవేశించగానె ప్రభువు ఇతనికి స్వాగతం పలికాడు చాల ఆత్మీయుడన్నట్టుగా ఇతనికి ఎదురువెళ్ళి, రాణి చాల నీరసంగా ఉంది, బ్రతికెలా లెదు, అందువల్ల మిమ్మల్ని చూడాలనుకొన్నారు నెను చెప్పిపంపాను అన్నాడు అతని మాటల్లో నానుండి నా భార్యను వేరుచెసిన దుష్టుడనె భావం ఏమాత్రం కన్పించలెదు అతి పతివ్రత అయిన భార్య, ధీరుడు, శుద్ధమనస్కుడు భర్త ఎలా నడుచుకొనెవాడో అలాంటి నడవడిక ప్రభువులొ సాక్షాత్కరించింది

వాల్టైర్ పలుతీరుల జీవితాలను అనుభవించిన నేర్పరి మానవుల ప్రవర్తన అతనికి అపురూపంగా కన్పించడం అరుదని చెప్పవచ్చు తన ప్రేయసి పెనిమిటి రాజుగారికి అయినా ఈ ప్రభువు ఈ రోజు చూపించిన ప్రవర్తన వాల్టెరుకు చాల విచిత్రంగా కన్పించింది

లోపలికి వేళ్ళేసరికి ఇతను ఊహించినట్టుగానే సేయింట్ ల్యాంబర్ట్ కన్పించాడు చాటలైట్ ప్రభువు ల్యాంబర్ట్‌తో పెద్దలు వచ్చేశారు సమయం చూసుకుని లోపలికు తీసుకు వెళ్తారా అన్నాడు సెయింట్ ల్యాంబర్ట్ ముందుకు వచ్చాడు వాల్టైర్ తనకంటే చాలా పెద్దవా డని స్పష్టంచేసే రీతిలో వంగి నమస్కారం చేశాడు

వాల్టేర్ తగినరీతిలో ప్రతినమస్కారం చేసి, కరచాలనం చేసి కుశలమా అన్నాడు అతని ప్రత్యుత్తరం కోసం నిక్షించక , రాణి పరిస్థితి ఎలాగుందని వివరించాడు

వీళ్ళిద్దరి మధ్య ఇలా సంభాషణ కొనసాగు తుంటే ప్రభువు బయటకి వెళ్ళాడు రాణి బ్రతకడం చాలా కష్టం అందువల్లనే మిమ్మల్ని ఆమె చూడాలనుకొన్నది అన్నాడు

వాల్టేర్ , నేను యముణ్ణి కాదు కదా? చెప్పి నవ్వాడు

సెయింట్ ల్యాంబర్ట్ రాణి మిమ్మల్ని గురించి మీరు చెప్పుకొనె ఓ మాటను జ్ఞావకం చెసుకున్నారు మీరు చెప్పారని అమె ఆమె వెనుకటి సారి నాతో చెప్పిన మాటని మేమిద్దరం జ్ఞాపకం చెసుకున్నాము అన్నాడు

"ఏమీ చెప్పారు?"

"చెప్పడానికి సంకొచంగా ఉంది"

"సంకోచం ఎందుకు? ఆమె నాకు ముద్దిచ్చే ప్రతి సమయంలోను జీవితాన్ని ముద్దిస్తున్నట్టు నాకు అనిపించింది దాన్ని నేను ఆమెతో ప్రస్తావించెవాణ్ణి, ఆ మాటను చెప్పారా?"

"అవును"

"మరింకేం చెప్పారు"

"దాన్ని చెప్పడానికి కూడా సంకోచంగా వుంది"

"నాకు సమాదానంగా ఆమె - జీవ - మృత్యువుల గురించి కాదు, మరణించె అందం మరిణించని అందానికి ముద్దు ఇస్తున్నది అనెవారు ఆ విషయం గురించి చెప్పారా?"

"అవును తన అందం నా అందం బంకమట్టి అందమని, మీ అందం తన చైతన్యపు అందమని ఆమె తలంపు"

"అయినా ఆ అందం రః అందాన్ని వదలి పెట్టింది"

ఆమె, "మర్త్యులకు మర్త్యులు సరి అయినట్టుగా, అమర్త్యులు జతకాలెరు నేను నీకు జోడికావచ్చును కాని వాల్టేర్‌కు సరిజోడి కాలేదు అనేవారు"

"వాల్టేరు ఏమీ సమాధానం చెప్పలేదు" రాణి తన విషయం గురించి ప్రతిమాట ఆమె స్థిరమైన అభిప్రాయాలని అతనికి తెలుసు రాణి అందగత్తె అంతకంటే జాణ, దాంతోపాటు ధీరురాలు కూడా శ్రీమంతుల కూతురై పుట్టి శ్రీమంతుడినే పెళ్ళి చేసుకొంది ఆమెకూ, ఆమె భర్తకు వయస్సులో చాలా తేడా ఉంది వీళ్ళ సమాజంలో ఇలాంటి సందర్భాల్లో భార్య తనకు

నప్పిన పరపురుషునితో చనువుగా ఉండడం అపరాదం కాదు ప్రజలు గమనించేలా అవివేకంగా ప్రవర్తించ కూడదంతే ఇలాగుంటూ ప్రేమించిన తనని, వివాహమాడిన ఇతన్ని వదలి ఇప్పుడు సెయింట్ ల్యాంబర్ట్ ని మోహించింది , ఇప్పటికీ భర్త ప్రేమను నిలుపుకోంది నిజంగా ఆమె ఎంత అందగత్తో, అంతే చతుర, ధీరురాలు కూడా

సరె, తనను వదిలి సంవత్సరం దాటిపోతోంది , దూరమైన నన్ను మళ్ళీ ఇప్పుడెందుకు పిలిపించింది ?

వాల్టేర్ ఇలా ఆలోచిస్తు కూర్చోనివుంటే, సెయింట్ ల్యాంబర్ట్ రాణి దగ్గరకువె వెళ్ళి రాణిగారు మేల్కొనగానే వాల్టేర్ మహాశయులు విచ్చేశారని తెలియజెయమని చెప్పాడు

రాణి మెలుకువతోనె ఉంది ఇతని మాటల్ని విని క్షీణస్వరంతో అత్యంత సంతోషాన్ని సూచించి, వచ్చారా ? వెంటనే రమ్మని చెప్పు అని చెప్పింది

చెలికత్తె మరేం చెప్పలేదు సెయింట్ ల్యాంబర్ట్ వాల్టేర్ దగ్గరికి వచ్చి రాణి కోరిక తెలిపాడు వాల్టేర్ లోపలికి వెళ్ళాడు

రాణి పడుకొన్న మంచందగ్గరికి ఇతను వెళ్తుండగానే రాణి కళ్ళతోనే ఆదరం ప్రకటిస్తూ "వచ్చావా ఫ్రాంకాయ్ ? నా మీద వేసరపాటుతో నువ్వక్కడ రావో అని కాస్త బయంగా ఉండింది అంటూ తనరెండూ చేతుల్ని అతనివైపు చాచింది

వాల్టేర్ ఆమె క్షీణ స్వరంవిని పరితపించాడు కంచుకంఠం, మెరుపులాంటి కళ్ళు, విభ్రమతో కూడిన నాసలు, నవ్వులొలికే పెదవులు, పుటంపట్టే వ్యక్తిత్వం ఇది ఇతని మనస్సులోని ఆమె చిత్రం ఆ రూపం ఇప్పుడిలా అయ్యింది ! దగ్గరికి వెళ్ళి చేతుల్ని ముద్దిడుకొని, నీవు చెప్పిపంపితే నేను రాకపోతానా ? అన్నాడు రాణి మంచం ప్రక్కనున్న కుర్చీ చూపించి కూర్చోమని సంజ్ఞ చేసింది అతను దానిమీద కూర్చున్నాడు

రాణి "నాకలా అన్పించింది నీ ఉన్నతవ్యక్తిత్వానికి క్షుద్ర మనోభావాలకు

ఎంత మారవో నాకు తెలీదా?"

"నీవనుకున్నంత గొప్పవస్తువును కాను నేను ఈ ముఖం ఎంత వికృతంగా ఉందో మనస్సుకూడా అంత విరూపంగా ఉంది బుద్ధి కాస్త మరుగ్గా వుంది అయితె అంతమాత్రంచేత అన్ని మంచి జరగవు"

"సరె, ముఖం వికృతం, మనస్సు వికారం బుద్ధి మొద్దు ఇది లోకంలోని జనం అదృష్టహీనులున్న ఈ లోకంలో నీలాంటి వాళ్ళు వెలుగునిచ్చె ఆదార స్తంబాలు"

"సరే , ఇప్పుడు నీకెలా ఉంది?"

"ఎలా ఉందని చెప్పేందుకు కూడ సమయం లేదు నీవు వస్తావని నిరీక్షలో ఊపిరి ఒక రొజు మాత్రం బిగి పట్టుకొని ఉన్నాను ఇక దాని పని ముగిసింది"

"ఛీ ఇలా అధైర్యపడడమా?"

"లేదు, ధైర్యం మాటకాదు సెయింట్ ల్యాంబర్ట్ ముఖంలాంటి అందంగా ఉన్న శిశువుకు తల్లి కావాలని అనుకొన్నాను బిడ్డను కన్నాను అది వచ్చిపోయింది ఇన్ని రోజులా గొడ్రాలయిన దాన్ని ఈ వయస్సులో తల్లిపదవిని కోరడం అపరాధమయింది జీవితం నాకు మరణదండన విధించింది, దాన్ని నేను అంగీకరించాను

రాణి మాటల్ని వింటున్న అతనికి ఆమె నగ్న సత్యాన్ని చెప్తోందనిపించింది సంతోషం లేని ఇంట్లో ఉన్న ప్రియుడి ఆనందంకోసం ఈమె ఇతనికి పదునాలుగు సంవత్సరాలు ఆనందాన్ని పంచింది, అతని జీవితంలో ఆహ్లాదమనే ఏటిని ప్రవహింపచేసింది ఈమె మనస్సులో కపటం కల్మషం, కుటిలత్వం, వంచన మొదలైన దోషాల సంపర్కమే లేదు ఈ జీవం ఎంత ఉన్నతమైందో తాను కూడ గుర్తించలేక పోయానని వాల్టేరుకు అనిపించింది ఆమె తనని వదలి సెయింట్ ల్యాంబర్ట్‌ను వరించిందన్న క్రోధావేషం అతడి మనస్సులో అట్టడుగున ఏదైనా కొంత మిగిలిలో అది హఠాత్తుగా అదృశ్యమైంది అతని మనస్సుకు నెమ్మది కలిగింది

రఃమె తనని ప్రేమించిన స్త్రీ అనే విషయాన్ని అతని మనస్సు మరచింది కేవలం ఒకస్త్రీ అందం, చాతుర్యం, ధీరత్వం కలిగి వయస్సు మళ్ళి పొకనే చావు తలుపుల్ని తెరుస్తున్నదన్న పరితాపం అతని మనస్సులొ పూర్తిగా నిండుపంది

మరుక్షణం అతను నిన్నీ స్థితిలో చూడడానికి నన్నెందుకు రప్పించావు? అన్నాడు

"కళ్ళు మూసుకునె లోపుగా నా జీవితాన్ని ఆహ్లాదపరచిన మీయిుగ్గుర్ని ఒకెసారి చూడాలనిపించింది

"నే కనిపించింది సరె రఃముగ్గురిని గురించి ఆలోచించావా?"

"ఆలోచించాను, నేవు మహ మెధావివి నీకు దేనివల్ల ఎలాంటి ఒడిదొడుకులు లెవు సెయింట్ ల్యాంబర్ట్ ముగ్ద మనస్కుడు నాయిష్టమె అతని ఇష్టము, అతని మనస్సులో ఎలాంటి స్వార్ధమూ లేదు నా ప్రభువు ఉదార మనస్కులు పెళ్ళయిన రోజు నాతో ఆయన ఇలా అన్నారు భార్యగా నేవు వచ్చావని నేను అనుకొలెదు బార్యభర్తల సంబంధంలో భర్త తనకు ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే బార్యకూడా అలాగె ప్రవర్తించవచ్చు , ఇది మా అవ్వ చెప్పిన సూత్రం దీన్ని నేను అంగీకరిస్తున్నాను అన్నారు నేను సూత్రం న్యాయ సమ్మతంగా ఉంది స్త్రీ చెప్పింది స్త్రీకెలా బిన్నంగా ఉంటుంది? అయితే భర్తదీన్ని అంగీకరించవచ్చా? అన్నాను ప్రబువు, అంగీకరిస్తున్నాను, ఇదిగో అన్నారు చేతిలో చెయివేశారు నేను అంగికరించినంత సులభమా దీన్ని ఆచరించడం? అన్నాను ప్రబువు సులబం కాకపొవచ్చును, అయితే ఆచరిస్తాను అంటూ మళ్ళీ చేతిలొ చెయ్యివెశారు

ఈ విషయం నీవెప్పుడు నాతో ప్రస్తావించలేదు కదా!

నివు అయిన మాటల్ని ప్రస్తావించలేదు నేను దాన్ని చెప్పదలుచుకోలేదు

నీవు ఆసాధారణ స్త్రీవని నాకెప్పుడో తెలుసు అయితే ఎంతటి అసాధారణ మహిళవో ఈ క్షణందాక నాకు తెలీదు అదే విధంగా నీ ప్రభువు ఎంతటి అసాధారణ వ్యక్తో తేలియలేదు

ఆయన చాల అసాధారణ వ్యక్తి సంవత్సరం రోజులు నాతో కాపురం చేసి, తమ సైన్యంతో ప్రవాసం గైకొనాల్సి వస్తుందన్న సమయంలో , ఆయనే నాతో నీకు వాల్టేరు అంటే చాలా ఇష్టం , ఆయన్ని వచ్చి మన ఇంట్లో అతిథిగా ఉండమని చెప్పిపంపుదామా అన్నారు ఆ మాట ప్రకారమే మేము నిన్ను ఆహ్వానించింది, నీవు ఇక్కడికి వచ్చింది నెలరోజులపాటు నీకు ఆతిద్యం ఇచ్చి ఆయన సైన్యంతో వెళ్ళిపోయారు నేను భర్తను వంచించిన కులటనుకాను, ఆయన భార్య మోసానికి గురైన బర్త కాదు

"అతని గురించిన ఈ విషయాలు నాకు చాల కొత్తగా కన్పిస్తున్నాయి క్షణం క్రితం నేనిక్కడికి వచ్చినప్పుడు ఆయన నన్ను ఎంత నిష్కల్మషంగా ఆహ్వానించింది , లోపలి గదిలో సెయింట్ ల్యాంబర్ట్ ఎలా కూర్చున్నది, నాకిప్పుడు ద్యోతక మవుతున్నాయి"

"అవును, నా ప్రభువు సంకుచిత స్వభావుడై ఉండి ఉంటే నా జీవన క్రమం మరో విధంగా ఉయిఉండేది అయితే నెనీయింట్లో ఉండేదాన్ని కాను"

"ఉండేదానివి కావా ?"

"ఆయన నన్ను బయటికి గెంటేవారని కాదు, దానికి ముందు నేను బయటకు వెళ్ళేదాన్ని"

"నేను దీన్ని నమ్మను"

"నాకు సంతోషంగావుంది మానవ జాతి స్త్రీ మానవి నేను జాతి స్త్రీనికాను ఆమెకోసం పురుషులు కుక్కల్లా కొట్టుకోవడం భావ్యం కాదు నీవొక సారి చెప్పిన మాటలు నాకు జ్ఞాపకం ఉన్నాయి ప్రతి స్త్రీకి ప్రతి పురుషుడికి జ్ఞాపకం ఉండాలి ఉంటే వాళ్ళ జీవితాలు సార్ధకం అవుతాయి

"ఏం మాటలవి ?"

"ప్రేమించినది నాకు భార్య కాదు , ఆనందింప చేయువాడు నీకు భర్తకాదు"

"నిజం"

"నా ఊపిరి మందగిస్తోంది రేపు ఉదయంలోగా దీని పని ముగుస్తుంది ఈ రోజు ఉండేటట్టయితే ఉండి వెళ్ళు"

"ఉంటాను"

"నేను తొందరగా కన్ను మూస్తున్నానని వ్యధగా లేదు నాకు స్త్రీ లభించె సుఖాలన్నిటిని నేను అనుభవించినదాన్ని"

"అలాగా"

"అవును, నా ప్రభువు నాకు పదవి ఇచ్చారు, నీవు ప్రేమను పంచావు

"ఆ తర్వాత"

"చెప్పనా ? సెయింట్ ల్యాంబర్ట్ రూపానుభవాన్ని ఇచ్చాడు నేను తృప్తిని చెందాను"

రాణి మళ్ళీ రెండుచేతుల్ని వాల్టేర్ వైపుచాచింది అతను మళ్ళీ వాటిని ముద్దుపెట్టుకున్నాడు వాటిని కళ్ళకద్దు న్నాడు రాణి ఆప్యాయంగా నీరసించిన అతని బుగ్గల్ని నవరించింది

ఆమె ఆప్యాయత వాల్టేరుకు కనికరపు ప్రవాహంలా తోచింది అతను లేచి గదినుండి బయటికి నడిచాడు రాణి మాటలు అతనికి, ప్లేటో తన ఆదర్శాలను దేశంలో పెద్దలకు బోధించిన స్త్రీ విషయ మనోధర్మాన్ని గుర్తు చేశాయి

అ రాత్రి రాణి కన్ను మూసింది ముందుగానే అందరికి ఈమె అస్వస్థతను గురించి తెలిపి ఉండడం వల్ల సమీప బంధువులు ఉదయానికల్లా వచ్చి చేరారు ఆ రోజు ఆమె దేహాన్ని మట్టి పాలు చేయడానికి నిశ్చయించారు ఆమె అంతిమ యాత్ర రాజమందిరంనుంచి బయల్దేరే దాకా ప్రభువుతోను, సెయింట్ ల్యాంబర్ట్ తోను కలిసి ఉన్నాడు ఆమె అంతిమ యాత్ర బయల్దేరగానే అతను ప్యారిస్‌కు ప్రయాణమైయ్యాడు

బయల్దేరడానికి ముందు అతను ప్రభువుతో "రాణి, మీరు ఎంతటి అసాధారణ వ్యక్తులో నాకు తెలియచేశారు" అన్నాడు

ప్రభువు, "ఆమె తేలివైనది రః ఉదారత అనేది కేవలం సభ్యవర్తన, ఆమె నన్ను కూడా అంగీకరించింది అది ఆమె ఔదార్యం" అన్నాడు క్షణం తర్వాత "మీరు ఆమెను ఫ్రాన్స్ దేశపు అత్యంత బుద్ధిమంతురాలైన మహాపురుషులని, ఆమెలోని ఏకమాత్ర దోషం ఆమె స్త్రీ కావడమేనని అన్నారని" అన్నాడు మళ్ళీ క్షణంవదలి, "స్త్రీ కావడమే దోషమైంది, అంటూ పొంగివస్తున్న కన్నీళ్ళను ఆపుచేసుకోను మొహం త్రిప్పుకొన్నాడు

"వాల్టేర్ కళ్ళల్లోను నీళ్ళు నిండాయి అతను వాటిని ఆపుచేసుకొన్నాడు ప్రభువు చేయి పట్టుకుని ఆప్యాయంగా కరచాలనం చెసి నాలుగు అడుగులు వెసి అటుగా నిల్చున్న సెయింట్ ల్యాంబర్ట్ అతనితో, మీరు వచ్చింది వాల మంచిదయింది రాణి తనువు చాలించినప్పుడు చాల తృప్తి చెందారు అన్నాడు

"అలాగంటారా?"

"అవును, ఆమె మీకు చెప్పి పంపేటప్పుడు నాతో అన్నారు వాల్టేర్ వస్తే నాకొక విషయం స్పష్టమవుతుంది లోకాన్ని నడిపిస్తున్న దేవుడనే శక్తి ఒకటుందని నాకు తెలుసు అది ఎంత శక్తివంతమైందో అయితే శ్రమతో కూడివుంది నాకు తెలిసినంతవరుకు నేను నిర్వంచితురాలిగా నడుచుకున్నాను సరిగ్గా, అని చెప్పలేను సమాజం దీన్ని అంగికరించదు అయితే లోకాన్ని సృష్టించిన శక్తి మనల్నిలా ఆడించింది సమాజ న్యాయం సమాజానికి సరిపోతుంది దైవం ముందు ఒకె న్యాయం సాధ్యం , అది నిర్వంచన వాల్టేర్ నన్ను క్షమిస్తే దైవం నన్ను తప్పక క్షమిస్తాడు వంచన లేక వర్తించినా, నేను మీ అందరికి కష్టం కలిగించను నేను దేవుడికి ఎలాంటి కష్టం కలిగించలేదు ఏదే ్రనుభవించినా నేర్పరి అయినా వ్యక్తియే నన్ను క్షమించేటట్టయితే తల్లి తండ్రి అయిన దైవం ఆగ్రహిస్తుందా? అన్నారు

వాల్టేర్ ఎలా అంటే? రాణి గణితశాస్త్రంలో పారంగతురాలు

అమె బుద్ధికి తోచిన విషయం సత్యమై ఉండాలి అయితే ఇదేమిటి మీరు ఈ మాటల్ని కంఠపాఠం చేసి అప్పగించేటట్టుగా అప్పగించారు?

"ఆమె ఈ మాటల్ని నాలుగు సార్లు చెప్పారు అవి వాటికవే నోటికి వచ్చాయి అంతేకాక ఇది నాకు కూడా అవసరమయిన విషయం"

"నిజమే అవి అందరికి అవసరమయిన విషయాలే"

ఇలాగంటూ వాల్టేర్ సెయింట్ లాంబర్ట్ చేతిని పట్టుకుని ఆదరంతో ఒత్తుతూ అతని అనుమతి తీసుకుని ప్యారిస్ బయల్దేరాడు దైవం గురించి రాణి భావించిన విషయాలు అతని హృదయ మంతటా నిండుకున్నాయి

# నర్తకి పరాభవం

ప్రసిద్ధ నర్తకి ఇసడొరా డంకన్ ఒక వారంలోగా నగరానికి వస్తుందన్న వార్త మాస్కో ప్రజల్లో వ్యాపించింది

సామాన్య జనుల్లో కుతూహలం, విలాసపురుషుల్లో సంభ్రమం సంసారుల్లో వ్యాకులత, ఇసడోరా ఏ ఊళ్ళో కాలుపెట్టినా ఈ మూడు బావతరంగాలుగా చెలరేగడం వాడుక మాస్కో నగర వాసుల్లోనూ ఈ బావాలు వ్యాపించాయి తక్కిన నగరాలకంటే మాస్కో నగరం అదిక రసలాలస నగరంగా పేరుపొందింది అందువల్ల బహుశా ఇక్కడ కుతూహలం, సంభ్రమం, వ్యాకులతయు ఈ మూడు తక్కిన ప్రదేశాల్లో కంటే ఎక్కువగానే వ్యాపించాయి

ప్రఖ్యాత నర్తకి వస్తోందంటే కుతూహలం కలగడం సహజమే సంభ్రమం, వ్యాకులం ఎందుకు కలుగుతాయి? అందుకు కారణం ఇది ఇసడోరా విలాసవతి అయిన నర్తకి కాకుండా శృంగార జీవనాన్ని నడిపేవ్యక్తి కూడ కంటికి కనపడ్డ ఏమగవాడు నచ్చినా తన కోర్కెను వెల్లడి చేసేది అతని మానసిక స్థితిగతుల్ని, పరిస్థితుల్ని ఖాతరు చేయక అతని సహవాసం చెసేదే వారం, పది రోజులు, నెల రోజులు , తనకు కావలసినన్ని రోజులు అతడితో గడిపి,నిస్సంకోచంగా అతణ్ణి వదలివేసేది ఆ పురుషుడు మరికొన్ని రోజులు నీతో గడుపుతానని చెప్పడానికి వీలు లేదు, ఈమె మోహిస్తే రావాలి, వద్దంటే వదిలిపెట్టి వెళ్ళిపోవాలి తన శారీరిక మానసిక స్థితులకు ఈమేరాణి ఈమెగా పిలిస్తేనే తప్ప ఎవ్వరూ స్పృశించడానికి కూడా వీలు లేదు పిలవడంలోనూ, వదిలిపెట్టడంలోనూ ఈమెదే సంపూర్ణాధికారం ఇది భారతీయ రాజకుమారులు కొన్ని సార్లు అనుసరిస్తుండిన స్వయంవరంలాంటి

ఒక పద్ధతి లేదా ఇంతే బారతీయ స్వయంవరంలో వధువు ఒకణ్ణి వరించి అతనికి ఆజన్మం ధర్మపత్నిగా జీవిస్తుంది, అయితే నర్తకిలో ఆ ప్రసక్తే లేదు పలానా వారం, లేదా పక్షం ప్రియురాలిగా గడపడమే ఈమె నియమం వారం, పక్షం రోజులు ముగియగానే, అతడి దారి అతనిది, ఆమె దారి ఆమెది

ఈ స్వేచ్ఛా శృంగార జీవితంతోపాటు ఈమె చెయికూడా విచ్చలవిడిగా ఖర్చుపెట్టేది ఈమె మెచ్చిన పురుషుడు తోడుగా ఉన్నన్ని రోజులు అతడి జేబులో కోరుకున్న బంగారు నాణెలు ఉండేవి అతడు ఊహించనంతటి బంగారు నాణేలు లభించేవి ఈమె వదిలిపెట్టి వెళ్ళిన తర్వాత పది సంవత్సరాల కాలం అతను సంపాదించాల్సిన అవసరం లేదు ఈమెకు డబ్బుకేమో కొదువలేదు నాట్యం చేసి లక్షల కొద్దీ గడించింది ఈమెకు ప్రియుల్లో కొందరు శ్రీమంతులే కావడంవల్ల ఈమె ఇతురులకిచ్చిన డబ్బుకు రెండింతలు ఈమెకు ఇచ్చేవాళ్ళు ఇవ్వటానికి ఎలా సిద్ధపడుతుందో తీసుకోవడానికి కూడా అలాగే సిద్ధపడుతుంది అందువల్ల ఈమె నాట్యం చేయడానికి వెళ్ళే ఊళ్ళలో పేద యువకులు సైతం ఈమె కటాక్షానికి పాత్రులు కావడానికి నిరీక్షించేవాళ్ళు ఈ కారణంగానే ఇసడోరా మాస్కో నగరాన్ని చేరుకోనె రోజుకు అక్కడి పురుష ప్రపంచంలో అత్యంత సంబ్రమం కలిగింది

సంసారుల్లో వ్యాకులత ఎందుకంటారా? పెళ్ళి చేసుకొని సుఖంగా జీవనాన్ని కొనసాగిస్తున్న ఏయింంటి మగవాడి మీద ఈమె కన్ను పడుతుందో ?పడితే ఆ సంసారం గతేమిటి? తన భర్త తనవశంలో ఉన్నాడని ఎలాంటి సందేహానికి తావివ్వని సుందరాంగులు సైతం ఈ మోహిని తమ భర్తల మనసుల్ని దోచేస్తే తమ గతేమిటని చింతించసాగారు ఆ విచారానికి పరిహారంగా ఉన్నది ఒకే ఒక విశ్వాసం ఒక వారం రోజులో లేక ఒక నెల రోజులో కలిగే జ్వరం మాత్రమే, అంతకంటే ఎక్కువ కాదు అన్ని రోజులు గడవగానే జ్వరానికి గురయిన వ్యక్తి దాన్నుంచి విడుదల అవుతాడు ఆమె మీద మోహం తగ్గక పోయినా, పెళ్ళాం చెంతకు రానే వస్తాడు ఏమయితేనేం ఈ మాత్రం ఆశ అయినా ఉంది కదా ఇదే క్షేమం

నిప్పంటుకున్న ఇంట్లో కాలింది కాలిపో గా మిగిలినదంతా లాబమే

## 2

ఇలా వూహల ప్రపంచంలో ఊగుతున్న నగరానికి ఇసడోరా ప్రవేశించింది వచ్చినరోజు విశ్రాంతి తీసుకోని, మరుసటి రోజు తన నృత్య కార్యక్రమాన్ని ఆరంబించింది తక్కిన ప్రాంతాల్లో ఎలా తన విలక్షణ నృత్యవిలాసంతో స్త్రీ పురుషులు, దనవంతులు దరిద్రులూ యువకులూ వయస్సు మిళ్ళిన వాళ్ళు అనే బేదం లేక, వీక్షించిన అందరి మనస్సుల్ని ఆకర్షించిందో ఇః ఊళ్ళోనూ, అలాగే అందర్ని ఆకట్టుకుంది మొత్తం ఊరే ఈః నృత్యానికి లొంగిపో యింది

ఏ ఊరయినా సరే ఆమెకు వశం కాక ఏం చేస్తుంది ? సుందర రూపం, సుందర విగ్రహం , సుందర వేషం ఇసడోరాది ఆమె నృత్యానికి తగిన దుస్తుల్ని దరించి రంగం మీద నిలుచుంటే చాలు, ఆమె అందం చూసేవాళ్ళ కళ్ళు జిగేలుమనిపించేవి దంతపు వర్ణం కలిగిన ఎత్తయిన ఆకారం, వశీకరణం చేయగల ముఖం, నక్షత్రాల్లాంటి రెండుకళ్ళు, ఆపెదవులు, ఆగడ్డం, ఆ ముక్కు ఆ నాసలు, ఏమీ అందం అది! ఇక ఆ శరీరం వంపుసొంపులు! శరీరం తేలికేమీ కాదు, అయితే ఆమె నిలబడే బంగిమవల్ల ఆమెది స్థూలకాయమనిపించేదికాదు నృత్యం మొదలైయిందంటే నర్తిస్తున్నది ఒక మానవ మూర్తి అన్న విషయాన్నే విస్మరించేవారు ప్రేక్షకులు ఆమె కిన్నర దేవదూత, సీతాకోకచిలుక, హంస ఇత్యాది నృత్య పాత్రల్ని ధరించేది ఆయా నృత్యాలు చేసేటప్పుడు అమె అందులో లీనమై కరిగిపో యింది ఉదయం వీచే మందపవనాల్లో మసక వెలుతుర్లో ఒక చెట్టునుండి మరో చెట్టుకు ఎగిరే సీతాకోకచిలుకను అనుకరించి ఈమె నర్తించే సమయంలో ఆమె అంగ విన్యాసం, చేష్టలు ఎంత సహజంగా ఉండేవంటే, తమ ఎదురుగా నృత్యం చేస్తున్నది ఒక స్త్రీ మూర్తి కాదు, సాధారణ సీతాకోక చిలుక వచ్చిందన్న భ్రాంతిని కలిగించేది దేవదూతగా పైకి ఎగిరినప్పుడు కన్పించే రూపం కొన్ని క్షణాలు ఈమె నేలను విడిచి ఆకాశంలో నిల్చున్నది ఇంకా పైకి ఎగిరిపో తున్నది అనే భ్రాంతిని కలిగించేది

కిన్నెర నృత్యంలో కిన్నెరలా, హంస నృత్యంలో హంసలా నాట్యం చేసేది కిన్నెర అంటె ఏమిటో హంస అంటె ఇలా ఉండాలి అంటూ నేటేలా తెలుతున్నట్టుగా నర్తించి ప్రేక్షకుల్ని ప్రముగ్ధుల్ని చేసేది

ఆమె హావభావాలు,విలాసం,ఉల్లాసం మర్త్యలోకంలోని వస్తువులుకావు ఆమె అప్సర స్త్రీ ఆమె నాట్యం చేస్తున్న రంగం మీద నందనవనం మధ్యలోని ఒక కూడలి ఆమె నృత్యాన్ని చూస్తున్న మనం నందనోద్యానంలో ఉన్నాం నర్తకి వంగిమలు, వయ్యారం, ప్రేక్షకుల హృదయాల్లో ఆనందాన్ని కలుగచేసేది ఆమె నృత్యాన్ని చూస్తున్న రసిక జనం భూలోకాన్ని వదలి స్వర్గంలో తేలేవారు నృత్యం ముగిసే దాక ఆ గాలిలోనే వూపిరి పీల్చుకునేవారు

## 3

ఇసడోరా నృత్యం చూసి ఆనందించిన వాళ్ళు ఆమె చెంత ఒక క్షణం నిలవాలని సాధ్యమయితె కాసెపు మాట్లాడాలని సహజంగానె ఆశించెవారు నర్తకి వృత్తిని చెపట్టిన క్రొత్తలోనె దీన్ని గమనించిన ఇసడోరా దినికి ఏర్పాటు చేసింది దాని ప్రకారంగా మాస్కో నగరంలోనూ అది ఏర్పాటయింది అదేమిటెంటే ఈమెను నగరానికి ఆహ్వానించి స్వాగతం పలుకిన సంస్థ సభ్యులు ఈమె సౌందర్యాన్ని ఆపేక్షించి పురప్రముఖుల్ని రసికుల్ని ఆమెతోపాటు అల్పాహారానికో భోజనానికో కూర్చోవడానికి పిలిచెవారు బొజనానికయితే ఒకేసారికి పదిమంది మాత్రం, పలహారానికయితే వంద మంది మాత్రం ఆమెతో పాటు కూర్చోవచ్చు ఆమె అప్పుడు డాబా మీద నిల్చుని వీళ్ళకి దర్శనం ఇచ్చి నమస్కరించింది ఇసడోరా మాస్కో నగరానికి వచ్చిన నాలుగైదు రోజుల్లోనే ఇలాంటి భోజన అల్పాహారాలు, మహాజనుల సందర్శనాలు పలు జరిగాయి ఇలా ఇసడోరా తన నాట్యం చెతనే కాక తన సౌజన్యంతోను నగర వాసులకు అత్యంత ప్రీతి పాత్రురాలయింది

అల్పాహారానికి, భోజనానికి విచ్చేసే ప్రజలంతా బహుశా ఈమె స్వేచ్ఛా ప్రణయాన్ని సమర్థించే స్త్రీ అని భావించినవాళ్ళు వీళ్ళలో కొంతమంది దీన్ని ఆసరాగా తీసుకోని అమెనుండి కొన్ని అవాచ్య శబ్దాలను పలికించడానికి

నిరీక్షించెవాళ్ళు ఇసడోరా ఇలాంటి మాటల్ని పలకడానికి సంకోచించేదికాదు అయితె ఆ మాత్రానికి ఎవరూ అతి చనువుగా వర్తించడానికి వీలయ్యేది కాదు ఏదైనా విషయం మాత్రం చర్చకు వస్తె సంకోచించక చర్చించెది అయితె చర్చ, చర్చించె విషయాన్ని వదలి పెడత్రోవ పడుతోందని ఆమె భావిస్తే వెంటనే అలాంటి విషయాన్ని ఖండించేది ఈమె ఈ విధంగా ఖండించడం అల్పాహారం సేవిస్తున్న తొలి రోజే స్పష్టమైంది అతిదుల్లో ఒకతను, మీరు స్వేచ్ఛా ప్రణయాన్ని సమర్ధిస్తారని విన్నాం, ఇది నిజమా అని అడిగాడు

స్వేచ్ఛ అనే విషయంలో మన అవగాహన స్పష్టమైనది కాదు స్త్రీ పురుషుల సంబంద విషయాల్లో ప్రస్తుత సమాజాలు నియమించిన కొన్ని నిర్బంధాలు తొలగిపో వాలన్నది అభిప్రాయం మేము దీన్ని సమర్ధిస్తాము

"దీన్ని మరికొంత వివరిస్తారా ?"

"తప్పకుండా మీరు, ఇక్కడ చేరిన పెద్దలందరూ మా ఆశయాన్ని సరిగ్గా అర్ధం చేసుకోవడానికి ప్రయత్నించాలని నేను కోరుతున్నాను,"

"సరిగ్గా తెలుసుకోవడం అంటె ?"

"మీ మనస్సులో మొదట్నుంచి నాటుకుపోయిన సంగతులను ఆధారం చేసుకుని అర్ధం కల్పించకూడదు, మేము ఏం చేప్తామో దాన్ని మాత్రమే మీరు గ్రహించాలి"

"అది న్యాయమే కదా"

"ఇలా మాట్లాడుతున్న నేను నృత్యకళను అభ్యసించిన విధంగా చర్చా కళని అభ్యసించలేదు నాకు తెలిసినంతవరకు మాట్లాడుతాను ప్రజలు స్వేచ్ఛా అంటున్నా ఈ ప్రణయ పద్ధతి స్త్రీకి స్వాతంత్ర్యం ఉండాలన్న మూల ఉద్దేశంనుండి పుట్టి పెరిగింది ఇప్పుడున్న పరిస్థితిలో స్వాతంత్ర్యం మొత్తం మగవాడికే పరిమితమైంది స్త్రీకి స్వాతంత్ర్యం ఏ కోశాన లేదు, ఈ స్థితి స్త్రీజాతిని చాలాకష్టాలకు గురి చేసింది"

"ఉదాహరిస్తారా ?"

"ఈ సంస్కరణ మూల ప్రతిపాదకులు ఒక ఫ్రెంచి రచయిత్రి అనె విషయం మీ అందరికి తెలిసి ఉంటుంది"

"జార్జ్‌సాండ్"

"అవును వారి జీవితమె దీనికి ఉదాహరణ ఆమె ప్రాయం రోజుల్లో చాల సంతోషంతొ వివాహం చెసుకున్నారు భర్త పెడత్రొవ పట్టాడు ఆమె సహించినంత కాలం సహించింది, చివరికి ఇతన్ని వదిలించుకొక పొతే జీవితమె లెదని తెలుసుంది ఈ సందర్భంల్లొ బార్య భర్తనుండి విడిపొయెందుకు అవకాశం ఉండాలని వాదించడం మొదలు పెట్టింది"

"ఆ వాదం అంతటితొ ఆగలెదు కదా ?"

"లెదు ఈ అవకాశం ఉండాలని కోరడానికి కారణమైన మూలభావంనుండి, ఇతర విషయాల్లో ను స్త్రీకి స్వాతంత్ర్యం ఉండడం క్షేమమన్న ఆలొచన ఉదయిస్తుంది జార్జ్ సాండ్ ఈ వాదాన్ని కొనసాగించి ప్రజల మనస్సును దిద్దడానికి ప్రయత్నించారు"

"ఆమె మాట ప్రకారంగా నడిస్తె వివాహమనె వ్యవస్థ పవిత్రత నాశమవుతుందని ప్రతి పక్షం ఆలోచించినట్టు విన్నాం"

స్త్రీ పురుష సంబంధాన్ని గురించిన మూలభూతమైన ఉద్దేశాలు వివాహ వ్యవస్థకు కారణమయ్యాయి ఆ వ్యవస్థ అ ఉద్దేశాలను పూర్తిగా సాధించలేదు సాధించే విధంగాదాన్ని రక్షించాలి ఇప్పుడది పూర్తిగా పవిత్రంకాదు ఇక ముందు కావాలి

పురుషునికి స్త్రీ, స్త్రీకి పురుషుడు అవసరం అన్న కోరిక, దప్పిక కలిగినప్పుడు నీళ్ళు కావాలన్న కోరికలాంటిది దాన్ని ఇష్టం వచ్చిన విధంగా తీర్చుకోవచ్చు, దానికి వివాహ వ్యవస్థ అవశ్యకం కాదు అని జార్జ్ సాన్ చెప్పాడని మేము విన్నాం

ఇది వరకు ప్రశ్నించిన వ్యక్తికీ, నర్తకికీ మధ్య సంభాషణ జరిగింది ప్రశ్నించిన వ్యక్తి ఈ విధంగా చెప్పగానే అతిథుల పంక్తిలో కూర్చున్న మరొక

వ్యక్తి జార్జ్ సాక్ ఇలా ఎప్పుడూ ఉనలేదు ఇది ఆమె విరోధులు, ఆమె మాటల్ని వక్రీకరించి స్వార్ధం కోసం వాడుకొన్న అల్పులు ఆమె మీద ఆరోపించిన వట్టి బాష్యం అన్నాడు

ఇసడోరా ఇలా అన్న వ్యక్తితో ఇది సత్యమైన విషయం దీన్ని తెలిపినందుకు ధన్యవాదాలు అంది

ఈ విషయం తెలిపినవాడు ప్రసిద్ధనటుడు స్టేనిస్ లావెస్కీ అతను ఉత్తమ నటుడే కాదు, అదునిక భావాలను గురించి బాగా అధ్యయనం చేసినవాడు కూడ ఇసడోరా తెలిపిన ధన్యవాదాలకు ప్రతిగా ధన్యవాదాలను తెలిపే అవసరం లేదు జార్జ్ సాక్ గారిని నిందించడం ఇక్కడ ఎవ్వరికి ఇష్టంలేదు ఆమె విషయంగా సత్యాన్నితెలుసు కొన్న వాళ్ళెవరయినా సరే ఆమె భావాల్ని ప్రకటించాలి అది అతని కర్తవ్యం అన్నాడు

అతనితో పాటు కూర్చున్న స్నేహితురాలు నటి ఓల్గా, అది సత్యం అయితే అందరూ తమ తమ కర్తవ్యాలను నిర్వర్తించారు కదా మీరు చేసింది మీ కర్తవ్యమే అయినా అది సహాయ పడింది, అందువల్ల ఆమె మీకు ధన్యవాదాలు తెలియచేశారు అంది

ప్రక్కలో కూర్చున్న వ్యక్తినుండి ఆమె పేరును తెలుసుకున్న ఇసడోరా, అవును, ఓల్గా మాట, నా పరంగా మాట్లాడినందుకు మీకు కృతజ్ఞతలు అంది

ఆ తర్వాత జరిగిన చర్చలో, అధిక భాగాన్ని బాధ్యతని ఇసడోరా స్టేనిస్ లావ్ స్కీ కి అప్పగించింది, అతను ఆ బాధ్యతను అంగీకరించి అతిథులకు ఈ ఆధునిక భావాలను, ఇతర వివరాలను అనేకం స్పష్టం చేశాడు

మనుష్య జాతి సమాజ జీవనాన్ని ఆరంభించిన నాటినుంచి సమాజ క్షేమంకోసం అనేక నియమాలను ఏర్పాటు చేసుకున్నది అందులో వివాహం ఒకటి, ఇలాంటి నియమాలనే మనం నాగరికత అని పిలుస్తున్నాం సమాజ జీవనం ఇప్పటికి సంపూర్ణంగా మెరుగుపడిందని చెప్పలేం అది మరింత బాగుపడాలి వివాహ వ్యవస్థలో అనేక దిద్దుబాట్లు కావాలని విజ్ఞులు

ఆలోచించాలి స్త్రీ పురుషుల స్వభావాలను, అదిరు మళ్ళి గ్రహించి స్త్రీ పురుషులనే రెండు జాతులకూ మంచి జరిగే ఉద్దేశ్యంతో అవసరం అనిపించే మార్పుల్ని అందరి అంగీకారాన్ని పొంది చేయాలి ఆ మార్పుల్ని చలామణిలోకి తీసుకోరావాలి జాన్సన్ గారి ఈ ఆశయం కేవలం స్త్రీ పరమైనది కాదు దాన్ని వారి మిత్రులయిన ప్రముఖ రచయిత ఒకరు అంగీకరించారు తాము కూడా సమర్థించారు పుద్రులు అల్పాలు, దురుపయోగం చేస్తారన్న కారణం చేత సంస్కర్తల ఆశయం దుష్టం కాదు దాన్ని చలామణిలోకి తెచ్చే సమయంలో ఎక్కువ జాగ్రత్త అవసరమని గ్రహించాలి వివాహాన్ని ఏర్పాటు చేయడం మంచిదే అయినప్పటికీ దాని విషయంగా దురుపయోగం కూడా జరిగింది ఎలాంటి మంచి ఉద్దేశానికైనా చెడు ఉద్దేశానికైనా అనుగుణంగా మార్చుకోవడం సాధ్యం వాదాన్ని ఇష్టం వచ్చిన రీతిలో తీర్చుకోవచ్చున్న జాన్సన్ మాటను తమకు తగినట్టుగా త్రిప్పుకొనేవారు ఇలాంటి ప్రజలు

సిగ్గులేని వారు ఎక్కడయినా సరె ఎప్పుడైనా సరె ఉంటారు అప్పటి ఆ ప్రజల్ని అదుపులో ఉంచి సమాజాన్ని రక్షించడానికి వివాహ వ్యవస్థ ఏర్పాటయింది, ఇప్పుడు అలాంటి ప్రజలు ఉన్నారు కొడుకు పోకిరిగా ప్రవర్తిస్తే గర్వించే తండ్రులూ ఉన్నారు మా పుంజు వదులుతున్నాం, మీ కోడి పెట్టలు జాగ్రత్త అని ఫ్రాన్స్ దేశపు ప్రాంతంలోని ఒక సామెత దూరంగా ఉన్న భారత దేశంలో కొన్ని సంవత్సరాల క్రితమే ఇలాంటి వ్యక్తి ఉండేవాడని మహాకవి కాళిదాసు రచించింది అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతుడి మూలంగా తెలియజేయబడింది ధర్మిష్ఠుడైన రాజే ఇలా ప్రవర్తిస్తే , అవినీతిమంతుడు అనాగరికుడు అయిన ఒక సామాన్య వ్యక్తి ఏమి చేయకూడదు ?

మధ్యలో ఒకరిద్దరు ఇలా అడిగిన ప్రశ్నలవల్ల సంభాషణ ఈ స్థాయిని చేరేసరికి అల్పాహార సేవన ముగిసింది,ఆతిథ్యం ఇచ్చిన వాళ్ళ అనుమతితో అతిథులు వెళ్ళిపోయారు

4

ఆ తర్వాత జరిగిన అల్పాహార, బోజన సమయాల్లో స్వేచ్ఛా ప్రణయానికి సంబంధించిన మూల తత్వాలను గురించి సంబాషణ కొంత జరిగింది ఆ సందర్భాల్లో ఇసడోరా ఈ విషయంగా కొన్ని రోజుల క్రితం చర్చ జరిగింది ఈ వాదం ప్రతిపాదించిన మూల పురుషులు ఆశించింది స్వాతంత్రాన్ని స్వేచ్ఛను కాదు ఈ విషయాన్ని నట శ్రే ష్టుడైన స్టేవేస్కీలావేసే గారు ఆలోజు అందరికి విశదీకరించారు మీారెవరైనా సరే ఆయనతో ఈ విషయం చర్చించవచ్చు ఆయన ఈ విషయం బాగా అద్యయనం చేశారు నాకంటే బాగా చెప్పగలరు అని చెప్పి తన మాటల్ని ముగించింది అసూయాపరులు కొందరు, ఓహో స్టేనిస్ లావెస్కి ఈమె తౌత్తయ్యుడా అని అనుకొన్నారు

స్త్రీ పురుషుల సంబంద విషయాల్లో స్టెనిసే ల్యావేస్కీఆదునిక బావాలను కలిగిన వ్యక్తి ఆతన్ని గురించి కూడ తెలుసుకోన్న వాళ్ళీ అందువల్ల అతని విషయం చెడ్డగా మాట్లడుతున్నారు అయితే అతన్ని గురించి తెలియనివాళ్ళు అతనొక అవినీతి పరులిని అనుకోనేవారు అతను ఓల్గాతో చెడ్డగా ప్రవర్తిస్తున్నాడని వాళ్ళ తలంపు ఈతన్ని తన ఇంటికి ఆహ్వానిస్తే మర్యాద పోతుందని వాళ్ల అబిప్రాయం ఈ ఆదునిక బావుకలందరూ నీతి తప్పినవాళ్ళు అని వీళ్ళ అబిప్రాయం వీళ్ళ మాటలు మాత్రం ఉదాత్తంగా ఉంటాయి అయితే తనకు పసందుగా కన్పించే ఎవరినయినా ఒకణ్ణి పిలిపించుకోని నాలుగు రోజులు సహవాసం చేసి, వదలి పెట్టి మలో విటుణ్ణి పిలుపించుకొంటుంది తక్కిన ఊళ్ళలో ఇలా ప్రవర్తించకుండా ఉంటుందా, అని అనుకుంటు ఈ విషయంగా కొద్దిరోజులు గుసగుసలు పుడతాయని కొంతమంది నిరీక్షిస్తున్నారు

వారం రోజులు గడిచాయి, పది రోజులు గడిచాయి, పదిహేను రోజులు గడిచాయి, ఇసడోరా ఎవర్ని పిలిపించుకోలేదు వీళ్ళందరికి ఆశ్చర్యం, అసమాధానం కలిగాయి ఇతురుల్ని పిలిపించుకొంటుందని నిరీక్షించిన కోడెగాళ్ళకు మరింత అతృప్తి ఏర్పడింది పదిహేను రోజుల్లో అనేక భోజన అల్పాహారాలు ఏర్పడ్డాయి నర్తకి విషయంలో ఎలాంటి

గుసగుసలు కాని, చెడ్డ మాటలు కానీ బయత్రేరలేదు

5

ఈ అల్పాహార, భోజన సమావేశాలన్నీ ఇసడోరా వసతి గృహంలో జరగలేదు, నగర ప్రముఖులు కొందరు నాటక మందిరాలు, గాయన సమాజాలు, నాట్య మందిరాలు, గాయన సమాజాలు, నాట్య సంఘాల సభ్యులు, ఆతిధ్యం ఇవ్వడానికి ముందుకువచ్చి ఈమెను పిలిపించుకున్నారు, కళా ప్రేమికుల్ని ఆహ్వానించారు, ఈమెను ఇలాంటి వాళ్ళందరితోను పరిచయం చెయించారు ఇలాంటి సందర్భాల్లో పలుమార్లు స్టైనెస్ లావెస్కీ ఓల్గానీ వీళ్ళ నాటక మందిరంలెక్కనాటకాలను రచించి సమర్పిస్తున్న చెకావ్ ని చూసింది వీళ్ళందరుతోను మాట్లాడింది, స్టైనెస లావెస్కీని బాగా మెచ్చుకొంది

చివరిగా ఒకరోజు, ఈ రోజు రాత్రి నా వసతి గృహానికి భోజనానికి రండి అని ఈ ముగ్గురుకి ఆహ్వానం పంపింది

చెకావ్ ఈ భోజనానికు హాజరు కాలేదు, అనారోగ్యంగా ఉందని మన్నించమని తప్పించుకొన్నాడు, ఓల్గా, స్టైనెస లావెస్కీవెళ్ళారు

భోజనానికి ముందూ, భోజం సమయంలోను స్త్రీ జాతి స్వాతంత్ర్య విషయంగా చర్చ జరిగింది

అందులో ఓల్గా ఇసడోరా అభిప్రాయానికి విరుద్ధంగా ఒకటి రెండు మాటల్ని అన్నారు

ఇసడోరా, మీరంటున్న ఈ మాటలు ప్రాచీన భావాలకు సంబంధిచినవి, ఆధునిక భావాలను తెలిసిన మీరు ఇలా అనడం నాకు ఆశ్చర్యంగా వుంది అంది

ఓల్గా, "ఆధునిక భావాలు ఏకముఖంగా కొనసాగకూడదు నలువైపులా పరికించి ఏది సరి అయిందో తెలుసుకోని ముందుకు నడవాలి కదా, "అంది

"పురుషులకు ప్రస్తుతం ఉన్న సౌలభ్యాలు తగ్గకూడదని వాదించేవాళ్ళు

మీరన్న మాటల్ని ఆసరాగా తీసుకొని సంస్కర్తణను అడ్డుపడుతారు"

"అది పురుష జాతి, స్త్రీ జాతి అని వేర్వేరుగా ఆలోచిస్తే తప్పక దారి తప్పడం జరుగుతుంది మనమంతా మనుష్యజాతికే చెందిన వాళ్ళ మన్న అర్థంతో ఆలోచిస్తే సరియిన దారి దొరుకుతుంది"

"అంటె ఇది ఆచి తూచి తేల్చాల్సిన విషయం ఇప్పుడు సౌలభ్యాలు తక్కెడలో ఒక వైపు మాత్రమె పడిఉన్నాయి మరో వైపు ఇలాంటి సౌలభ్యాలనే కొన్నింటిని వెయాలి"

"ఆ సిద్ధాంతానికి అడ్డులెదు అయితే ఆ సౌలభ్యాల స్వరూపమెమిటన్న విషయాన్ని ఆలోచించాలి"

"మన ప్రజలంయున్నది ఇది ఒక స్త్రీ ,ఒక పురుషుడు ఇద్దరూ అంగీకరిస్తేనే పరస్పరం తోడుగా కాపురం చెయవచ్చు అలా కాపురం చేస్తున్నప్పుడు స్త్రీకిగాని, పురుషుడికి గాని ఆ సహవాసం చాలనిపిస్తె, వాళ్ళు ఆ విషయాన్ని తెలిపి సంబంధాన్ని తెంపుకొవాలి"

"తర్కం ప్రకారం ఇది సరి అనిపిస్తుంది వ్యవహారంలో ఇది ఎన్ని అనర్థాలకు దారి తీస్తుందో చెప్పలేము"

"స్టనిస్ లావ్స్కి" ఓల్గా ఆదునిక బావాలను గురించి చెప్తున్నారు మానవుల స్వబావాలన్ని ఒక రకంగా ఉండవు ఎక్కువ ఆకలి , తక్కువ ఆకలి ఉన్న ప్రజలలాగనే ఎక్కువ ఆశ తక్కువ ఆశా ఉన్న ప్రజలు ఉంటారు అందరికి ఒకే విధమైన నియమాలు వర్తించవు సంస్కర్తణ అనేది ఒకెసారి కాకుండ దశలవారిగా రావాలన్నది రఃమె అభిప్రాయం" అని వివరించారు

ఇసడోరా " ఇలాగయితె మనం ఆశించే సంస్కర్తణ రావడానికి వేయి సంవత్సరాలయినా చాలవు"

"స్టనిస్ లావ్స్కి అది సాధ్యం అయితే వివాహ వ్యవస్థ ఆరంభమయిన దిశనుండి నేటి పరిస్థితికి రావడానికి ఏన్నో వేల సంవత్సరాలు గతించాయి అది దాని ధ్యేయాన్ని సంపూర్ణంగా సాధించే స్థితికి రావడానికి ఇంకా కొన్ని

వేల సంవత్సరాలు అవుతుందంటె అతిశయోక్తి లేదు"

ఓల్గా "వ్యవస్థలు వెరె అయినంత మాత్రాన స్వభావాలు వేరుకావు సమాజం ప్రజల స్వభావాలను మనసులో పెట్టుకొని వ్యవస్థల్ని రూపొందించాలి వాటిని విస్మరించి చెసిన వ్యవస్థలు నావు మాత్రంగావ్యవస్థల నిపించుకుంటాయి స్వభావం మాత్రం తన ఆటను ఆడుతూనే ఆడునే ఉంది స్వభావాన్నె దిద్దాలి ఇది సావకాశంగా జరిగెపని సంస్కరణ బహిరంగ ప్రదర్శన కారాదు అంతరంగంగా కూడ దిద్దుబాటు జరగాలి ఇది సిద్ధించాలంటె వెయ్యేళ్ళ కూడా సరిపోవు కదా"

ఇసడొరా "అంతవరకు ఎన్ని కోట్ల మంది ఎంతగానో కష్టపడతారు కదా!"

స్టెనిస్ లావ్స్కి " మీరు సూచిస్తున్న ఆ సంస్కరణని అమలు చేసేటప్పటికి ఎన్నో కోట్ల మంది ప్రజలు అంతె కష్టాన్ని అనుభవిస్తారు ఆ ఆలా మగలు భర్త వద్దన్నాడని, ఆ భార్య భర్త భార్య వద్దన్నాడని విడిపోయారు అయితే ఆ భార్యకు ఆ భర్తకు కష్టం తప్పిందికాదు ఆభార్య మరో భర్తని, ఆ భర్త మరో భార్యని కొహంగాలించాలి ప్రాయంలో ఉంటే ఫరవాలెదు కొద్దిగా వయస్సు మళ్ళినవాళ్ళ వీళ్ళకు తోడు దొరుకుతుందా? ఇలా అందరు అన్వేషిస్తూ పోతే సమాజం ఏమవుతుంది? ఇంతకు పెళ్ళంటే, స్త్రీ పురుషులు తమ తమ సుఖాలను తీర్చుకోవడానికి ఏర్పాటయిన వ్యవస్థ కాదు దాని ఉద్దెశం సంసారాలను ఏర్పాటు చేయడం అందులో భార్యభర్తలు సుఖంలాగానే వాళ్ళ సంతానం సుఖ సంతోషాలు కూడా ముఖ్యమైన విషయం"

"ముఖ్య విషయం కావచ్చు, అయితే తోడుగా వేరదలచుకొన్న స్త్రీ పురుషులు ఆ విషయాన్ని ఆలొచిస్తూ కూర్చోరు"

"ఆలోచిస్తూ కూర్చోక పోవడం సత్యం అయితె ఆలోచించడం తప్పని సరి సమాజం దేని కోసం నిరీక్షించడం యుక్తం దేనికదే కారణం సమాజంలోని నేటి వ్యక్తులు తమ క్షేమాన్ని చూసుకొన్నట్టుగానే తమ

భవిష్యత్తుల్ని రక్షించుకోవాలి ఇలా స్నేహ పూరకమైన వాతావరణంలో వనువుతో కూడిన చర్చ జరిగింది ఇది చర్చ కాదు, ఇందులో గెలవడం, ఓడడం అనె ఉద్దేశాలు లేవు గెలిస్తె ,గౌరవం, ఓడిపోతే అవమానం అనేది కాదు ఈ మాటలన్ని అల్పాహార సేవన సమయంలో జరిగేవి అల్పాహారం ముగిసిన తర్వాతా ఇతర విషయాలకు సంబంధించిన మాటల్ని కొన్నింటిని మాట్లాడి అతిథులు బయల్దెరడానికి సిద్ధమయ్యారు

బయల్దేరే సమయంలో ఇసడోరా ఓల్గాతో, మీకు విరామం లభిస్తే రేపు మధ్యాహ్నం ఒక సారి ఇటు వైపురండి అంది ఓల్గా, నాకు మరో పనివుంది ఇంకెప్పుడైనా వస్తాను, అంది

ఇసడోరా ఆ తర్వాత స్టెనిస్ లావ్స్కీతో మీకు వీలుంటే రండి, అంది

స్టెనిస్ లావ్స్కీ క్షణం ఆలోచించి, వస్తాను అన్నాడు

అతిదులు వెళ్ళిపోయారు

## 6

మరుసటి రోజు మధ్నాహ్నం స్టెనిస్ లావ్స్కీవచ్చినప్పుడు ఇసడోరా ఒకతె ఉంది తలుపు దగ్గరికి వచ్చి ఆహ్వానించి అతణ్ణి తన లోపలి గదిలోనికి పిలుచుకొని వెళ్ళింది

అతిదులు మరెవ్వరూ లేరని స్టెనిస్ లావ్స్కీ గమనించాడు ఈమె ఏమి చెప్పుంచో అని అతనికి కాస్త సందేహం కలిగింది సందేహిస్తూనే అతను సావధానంగానే ఆమెతో పాటు నడిచాడు లోపలికి వెళ్ళిన తర్యాత ఇసడోరా ఇతన్ని సోపామీద కూర్చోబెట్టింది తానే లోపలికి వెళ్ళి ఒక పళ్ళెంలో అతిరుచిగా ఉన్న రెండు మద్యం గ్లాసుల్ని తెచ్చింది పళ్ళెమును ఇతనికెదురుగా ఉన్న ఒక చిన్న మేజా మీద పెట్టి తాను ఇతని ప్రక్కలో కూర్చుంది

క్షణం విడిచి ఒక గ్లాసుని తీసుకుని అతని చేతికిచ్చి, మరోదాన్ని

తన చేతికి తీసుకొని, రుచి చూడండి, ఇది బాగా ఊరిన అతిరుచి అయిన ఒక ఫ్రెంచ్ మద్యం, అంది

స్టేనిస్ లావ్స్కీ దాన్ని కాస్త చప్పరించి, అవును చాలరుచిగా వుంది, అన్నాడు

కొన్ని క్షణాల తర్వాత అతను, ఇతర అతిథులు వస్తారు కదా? అని అడిగాడు

ఇసడోరా, లేదు ఈ మధ్యాహ్నం మీ కోసం మాత్రమే అంది

స్టేనిస్ లావ్స్కీ ఈ మాట అర్థాన్ని తెలుసుకోవాలన్న అభిప్రాయంతో క్షణంసేపు ఆమెపైపు తదేకంగా చూసి, ఏమి చెప్పక మరొక వైపు తిరిగాడు

మళ్ళీ కొద్ది నిమిషాలు మద్యాన్ని సేవిస్తూ ఇసడోరా, లోపలికి వెళ్దామా అని అడిగింది

స్టేనిస్ లావ్స్కీ మృదు ధ్వనితో వద్దు అన్నాడు

"వద్దంటారా? అంది

స్టేనిస్ లావ్స్కీఅవునన్నట్టు సూచిస్తూ తల ఆడించారు

నర్తకికి ఆశ్చర్యం వేసింది

"మీరు నా పొందును ఆపేక్షించరా?"

"ఆపేక్షిస్తాను"

"మరి?"

"ఈ విషయం చర్చించాలా?"

"మీరు అంగీకరిస్తే నాకు మీ అభిప్రాయం తెలుసుకోవాలనివుంది"

"మంచిది రెండు కారణాలకోసం నేను ఆశను అణచి" పెట్టుకొన్నాను

"అవేమిటి?"

"సహవాసం చేసి మీరు నాకు ఆవశ్యకం అనిపించిన తర్వాత నన్ను

వదలిపెట్టి పోవచ్చును అప్పుడు కలుగబోమే బాదను అబ్బ పెట్టుకోవడం నాకిష్టం లెదు"

"మీరే నన్ను వదలి పెట్టి పోవచ్చుకదా!"

"నేను అలాంటి స్వబావం ఉన్న మగవాడిని కాను"

"మరో కారణం?"

"మనకు ఒక శిశువు జన్మిస్తే దాని బవిష్యత్తేమిటి?"

"అయినప్పుడు ఆమాట"

"నేను అలాంటి స్వబావం ఉన్న మగవాణ్ణికాను నా బిడ్డకు తల్లి ప్రేమ, పొషణ కావాలి దాన్ని నెహూ చూసుకోవాలి ఇది సాద్యమనేటట్టయితేనే నేను మీ సలహాను గురించి ఆలోచిస్తాను సాద్యం కాదంటె, నేనలా మనస్సు అర్పించలేను

"మీరు విచిత్ర వ్యక్తులు"

"ఆదునికులు విచిత్ర వ్యక్తులు"

"నేను ఆధునికురాలు కానా?"

"కాస్త ఆదునికులు, తగినంత ఆధునికులు కారు"

"ఇంతకుముందు నేను ఆపేక్షించిన మగవాడేవడూ నన్ను కాదనలేదు తెలుసా?"

"వాళ్ళెవ్వరూ నాలాంటి స్వబావం ఉన్నవాళ్ళు కాదు, అంతె"

ఇసడోరా మౌనంగా ఉండిపోయింది కాసేపు అలాగే కూర్చుని, మర్యాద తెలియని దాన్నని మీరనుకోలేదు కదా? అంది

"లేదు"

"నిజంగా"

"నేను సంపూర్ణంగా ఆధునికుణ్ణి"

"కాస్త వివరిస్తారా ?"

"ఆలాగె సంపూర్ణంగా ఆదునిపులయినవారు తోటి జనులు మంచివాళ్ళ కారు, ఇలాంటివారు, ఆలాంటివారు అని విలువ కట్టరు వాళ్ళెలా ఉంటె అలాగే అంగీకరిస్తారు ఏది సరి అయిందనిపిస్తుందో దాని ప్రకారంగానె నడమకొంటారు వాళ్ళ కళ్ళకు ఎవరూ పాపాత్ములు కారు, ఎవరూ దోషులు కారు"

"అంటె నెనిలా మాట్లాడిన తర్వాత కూడ నా విషయంలొ మొదటిలాగానె గౌరవం ఉందా ?"

"మొదటిలాగానే ఉంది"

"అంటె అది ఎక్కువ కాదని కాదు కదా!"

"అది అప్రస్తుతం, కదా ?"

నర్తకి బాగా అవమానం పొందింది అత్యంత తీక్షణంగా ఇతని వైపు చూసింది ఆమెకు అప్పుడు కలిగిన ఒకె ఒక కొరిక ఆతని చెంప వాయించాలని అయితే అది సాధ్యంకాదు

మళ్ళీ రెండు నిమిషాలు గడిచాయి స్టేనిస్ లావ్స్కీ లేచి, నేను బయల్దేరుతాను అన్నాడు

ఇసడోరా, మంచిది అంది

అతను వెళ్ళిపోయిన తర్వాత లోపలకి వెళ్ళి తాము మద్యం త్రాగిన ఆ రెండు గ్లాసుల్ని తీసుకొని జోరుగా క్రింద పడవేసింది అవి పగిలి ముక్కలయ్యాయి

గాజు పగిలిన శబ్దం విని పనిమనిషి తలుపు చాటునుండి తొంగి చూసింది యజమానురాలి రౌద్రముఖాన్ని చూసి భయపడి వెనక్కి వెళ్ళిపోయింది

ఇసడోరా రోజంతా పిచ్చిపిచ్చిగా ప్రవర్తించింది ఆ రోజు రాత్రి

బాగా మద్యం సేవించింది తలుపుకు చేసిన పరదా సులభంగా ప్రక్కకు జరగలేదని దాన్ని చింపిపెసింది మద్యం రుచిగా లేదని రెండు గ్లాసుల్ని క్రిందకు పడవేసి పగులగొట్టింది వంట బాగా చెయులేదని వంటమనిషిని కొట్టింది పడుకొన్నా నిద్రపట్టక పడక మీద అవమానాన్ని జీర్ణించుకుని మరుసటిరోజు ఎప్పటి ఇసడోరాలాగానే లేచింది

కొన్ని సంవత్సరాల తర్వాత ఇసడోరా సంగ్రహంగా ఆత్మ చరిత్రను వ్రాసింది అందులో తన ప్రీతికి పాత్రులై తనతో గడిపిన కళాకారుల పేర్లను పేరా ని వాటి మద్య స్టేనిస్ లావ్స్కీ తన ఆహ్వానాన్ని అంగికరించలేదన్న విషయాన్ని, దానికి అతనిచ్చిన రెండో కారణాన్ని ఉల్లేఖించింది ఆ వివరణలో ఆ రోజు ఆమె పొందిన అవమానపు చేదు మాత్రం లేదు ఒకడు తన పొందును కోరకపోయినా పది మంది తనని వలచారన్న తృప్తి మాత్రం ఆ వ్రాతలో ఉంది

# పేరుచావదు

గ్రీసు, రోము దేశాల మహాపురుషుల జీవిత చరిత్రలను వ్రాసి భవిష్యత్తులో ప్రసిద్ధి చెందాల్సిన ప్లూటార్క్ దాదాపు తన పదిహేడు వయస్సులో, ఉన్నత విద్య కోసం ఏదెన్స్ నగరానికి వచ్చాడు చరిత్ర ఆ తర్వాత క్రీస్తు శకం అనిపిలిచిన కాలమానంలో అది అరవై ఏడో సంవత్సరం అంటే నేటికి సరిగ్గా ఇది 1900 సంవత్సరాల క్రిందటి మాట

ప్లూటార్క్ బొయిషియా ప్రాంతంలో పుట్టిపెరిగినవాడు, బొయిషియా ప్రజలు నడకలో మాటల్లో కాస్త నిదానమైనవారిని ప్రతీతి అంటే తాము చురుకైన వాళ్ళని బావించె జనం, వీళ్ళను మూర్ఖులుగా పరిగణించెవారు తన ప్రజలు ఎలాగున్నా ప్లూటార్క్ ఎంతమాత్రమూ మూర్ఖుడు కాదు నిజంగా అతను అతి చురుకైన వాళ్ళ మధ్యకూడా చురుకైన వానిగా పేరుతెచ్చుకొన్న యువకుడు

ఆ కాలంలో ఏథెన్స్ నగరంలో అమ్మోనియన్ అనె తత్వజ్ఞాని ప్రముఖ అధ్యాపకుడుగా ఉండేవాడు ప్లూటార్క్ అతని ఆశ్రయం కోరివచ్చాడు అమ్మోనియనె కొత్తవాణ్ణి తన శిష్యుడిగా అంగీకరించడానికి ముందు అతన్ని అనేక ప్రశ్నలు అడిగాడు అతని సమాధానాలవల్ల ప్లూటార్క్ వంశీకులు తరతరాలుగా విద్యోపాసకులన్న విషయం తెలుసుకుని, ఈ శిష్యుడు కూడ ఇప్పటికీ అనేక విషయాలను తెలుసుకున్న వ్యక్తి అని గుర్తించి అతన్ని తన విద్యార్థిగా అంగీకరించాడు

గురువుగారు తనను విద్యార్థిగా స్వీకరించడానికి ఇన్ని పరీక్షలు పెట్టడం ప్లూటార్క్‌కి ఆశ్చర్యం కలిగించింది అ తడు ఆయనదగ్గరికి వెళ్ళిన సమయంలో గురువుగారు ఉపన్యాసం ఇస్తున్నాడు దాన్ని వింటూ అతనికెదురుగా చాలమంది

కూర్చున్నారు వీళ్ళందరూ తనలాగ లేదా తనకంటె ఎక్కువగా చదివి విద్యావంతులని అనిపించుకొన్నవాళ్ళేనా? అని ప్లూటార్క్ ఆలోచించాల్సి వచ్చింది ఆ తర్వాత తెలియవచ్చిందేమిటంటె ఉపన్యాసం వింటున్న వాళ్ళందరూ ఇతనిలా విద్యార్థులు కాదు ఈ ఉపన్యాసాలను వినడానికి ఇతరులు కూడ రావచ్చని తెలిసింది

ఈ విధంగా వస్తున్న ఇతరులలో ఒకడు చాల ధనికుడుగా కన్పించెవాడు అతని వేష భూషణాలు ఎంత ఖరీదైనవి అతనివెంట అతనికి కావలసిన ఒకటిరెండు సామాన్లు పట్టుకొని ఒక నౌకరు కూడా ఉన్నాడు శ్రోతలు వెళ్ళిన తర్వాత ఈయన ఎవరని ప్లూటార్క్ తన తోటి విద్యార్థిని అడిగాడు ఇతనిపేరు థెమిస్టాక్లీస్ అనితెలుసుకొన్నాడు దేమిస్టాక్లీస్ చరిత్రలో మహాపురుషుడిగా ప్రసిద్ధికెక్కిన థేమిస్టాక్లీస్‌కు ఇతడేమైనా సంబంధికుడా అవును ఈయన ఆ మహాపురుషుడి వంశపు నేటివారసుడు అలాగా అయితే అప్పటికి ఇప్పటికి పదిహేనో, ఇరవయ్యో తరాలు గడచి ఉంటాయి అవును దేమిస్టాక్లీస్ ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మహాపురుషుడు అతని వంశం వాడిని చూసిప్లూటార్క్ ఆ మహాపురుషుడినే చూసినంత సంబర పడ్డాడు వెంటనే ఆ ఖ్యాతితోపాటు కొంత కళంకం కూడా అతనికి వచ్చిన విషయం జ్ఞాపకానికి వచ్చి కాస్త వ్యధచెందాడు

థేమిస్టాక్లీస్ ఎంతటిశూరుడు,ఎంతటి మేధావి దేశానికి ఎంతోసేవచేసాడు అయితే అదే వ్యక్తి అధికార దుర్వినియోగం చేసాడు అన్యాయం చేసి డబ్బుగడించాడు దేశద్రోహి అయ్యాడు దేశంవదలి పరదేశానికి పారిపోయాడు శత్రువులతో చేతులు కలపి అక్కడ పెద్ద మనిషిగా జీవించడమే కాకుండా కావలిసినంత డబ్బ సంపాదించాడు అక్కడె మరణించి సమాధి అయ్యాడు

అతని ఈ మునిమనవడి, మునిమనవడు ఆ అన్యాయ సంపాదనతో ఇలా శ్రీమంతుడయ్యాడు

ప్లూటార్క్ ఈ విషయాన్ని అక్కడే అడగాలనుకొన్నాడు అయితే అలా అడగడం ఉచితం కాదన్న అంశంతో ఆగిపోయాడు ఆక్షణంలోనే మరోప్రశ్న మనసులో మెదిలింది థేమిస్టాక్లీస్ కాలంనాటి సత్యవంతుడైన

అరిస్టైడిస్ వంశపు వారసులు ఇంకాఉన్నారా, వారిస్థితి ఎలాఉండెది

థెమిస్టొక్లీస్ ఈ విషయాన్ని ఇతనికి తెలిపిన వ్యక్తి నగరంలొని లంగడెపేటలొ ఉన్నఒకవ్యాపారి పెద్దకొడుకు అదే యువకుడు ఆతర్వాత ప్లూటార్క్‌కు అన్ని విషయాలకు సంబంధించిన సంగతులన్ని తెలియచేసాడు

ఇప్పుడు దేమిస్టొక్లీస్ అనుభవిస్తున్న ఐశ్వర్యం అతని ముత్తాత దేమిస్టొక్లీస్ సంపాదించింది వీళ్ళవంశం అప్పటినుంచి ఇప్పటిదాకా ఐశ్వర్యం తొనె బ్రతుకుతుంది

అరిస్టైడిస్ గురించిన ఒక కద అందరికి తెలుసు విరొధులు అతన్ని దెశభ్రష్టుడిగా చెయడానికి అభిప్రాయ శెకరణ ఏర్పాటు చేసారు అది జరుగుతున్న రోజు అరిస్టైడిస్ చావడి ఎదురుగా నిలుచున్నాడు అతన్ని దెశభ్రష్టుడిగా చెయాలనుకున్నవారు అతడిపేరును పెంకుముక్కపై వ్రాసి ఒక పెట్టెలొ వేయాలి ఇది అభిప్రాయ శెకరణా పద్ధతి అక్షరం ముక్కరాని అరిస్టైడిస్‌ని చూడని ఒక ఓటరు అతని దగ్గరుకు వచ్చి పెంకుముక్కను అతని చేతికి ఇచ్చి దీనిమీద అరిస్టైడిస్ పేరు వ్రాయండి అన్నాడు అరిస్టైడిస్ నీకు అతను తెలుసా అనిఅడిగాడు అతను తెలీదు అన్నాడు అలాగైతె అతన్ని దేశభ్రష్టున్ని చేయమని ఎందుకు అంటున్నావు ఓటరు అరిస్టైడిస్ ని దర్మజ్ఞుడు అని ప్రజలు చెప్పడాన్ని విని విని విసుగెత్తింది అన్నాడు అరిస్టైడిస్ పెంకుమీద తనపేరే వ్రాసి ఇచ్చాడు. వ్రాసిచ్చి తానెంతటి ధర్మపరుడొ తెలియచెసాడు అదే విదమైనా ధర్మ మార్గాంనే చివరిదాకా నడచి తాను పేదవాడిగా మరణించాడు పిల్లలకు పేదరికాన్నే మిగిల్చాడు

వంశం ఎలాగొ కొనసాగుతూ వచ్చింది మూడు తరాలక్రితం ఆ వంశస్థుడొకడు గ్రహగతిని చూపించే పటాన్ని పట్టుకొని, పేటలొ నిలబడి వచ్చి పొయే జనం కోరితే శకునం చూడడం, స్వప్న ఫలాన్ని చెప్పడం లాంటి వృత్తిని స్వీకరించి జీవించాడు ఇప్పుడు ఆయన మనవడు ఇంట్లొ ఉంటూ అదే వృత్తిని చేపట్టాడు

అరిస్టైడిస్ సత్యవంతుడుగా బీదతనంలొ మరణించాడన్న కారణంచేత

అప్పటి నగర పంచాయతి అతని వంశస్థులకి సంవత్సరానికి నాలుగు బంగారు నాణేలను భరణంగా నిలచిపోయింది ఇప్పుడు మళ్ళీ ఇస్తున్నారు ఆ వంశంలోని ఇప్పటి మునిమనవడి పేరు లైసిమ్యాకస్

ఇన్ని వివరాలు తెలుసుకొన్న తర్వాత ప్లూటార్క్ అరిస్టైడీస్ మునిమనవణ్ణి చూడాలనుకొన్నాడు మిత్రుని సాయంతో అతన్ని పరిచయం చేసుకొన్నాడు ఒక రోజు అతని ఇంటికి వెళ్ళాడు

ఆయింట్లో లైసి మ్యాకస్‌లో పాటు అయన అత్తగారు, బార్య ఇద్దరూ మాత్రమె ఉన్నారు ప్లూటార్క్ ఆ వంశ మర్యాదని, కీర్తిని పొగడి వాళ్ళను సంతోషపరచాడు లైసిమ్యాకస్ చాల సరళ స్వభావం ఉన్న యువకుడు అతని అత్త సొంతిపే, ఈ తమ్ముడికొడుకు తమ వంశ గౌరవాన్ని నిలపడానికి జన్మ ఎత్తినట్టుగా మాట్లాడింది అతని భార్య గర ఇవేమీ పట్టించుకోదు అయినా ఆమె ముత్తాతల ముత్తాత అరిస్టైడీస్ సంపాదించిన మంచిపేరు ఆయన తమకిచ్చిన ఆస్తి అని, దాన్ని నిలుపుకొని జీవించడమే తమ బాధ్యత అని నమ్మిన యువతి

మేము బీదవాళ్ళమని సిగ్గుపడము మా ముత్తాత అధికారంలో ఉండి దరిద్రానికి సిగ్గు పడలేదు. ఇప్పుడు మాకెమిటి సిగ్గు? మేమేమీ ధనవంతులుగా ఉండి దరిద్రులు కాలేదు ఉన్నఅస్తిని పాడుచేయలేదు తాతగారు మాకు వదిలిపెట్టిపోయిన ఆస్తి మంచిపేరు, బీదరికం రెండింటిని కాపుడుకొంటూ వచ్చాము

ఇది లైసిమ్యాకస్ అత్తగారి ఉవాచ

బీదవాళ్ళుగా పుట్టినవాళ్ళు దనవంతులైతే ఆ డబ్బు ఎలా వచ్చిందని అడగవచ్చు అన్యాయంగా సంపాదించారని నిందించవచ్చు దరిద్రులుగా పుట్టి దరిద్రులుగాఉండిపోతే ఎవరేమయినా అడుగుతారన్న భయం లేదు

ఇది కోడలి మాట

మాటల మధ్యలో సొంతిపె ఒక విషయం చెప్పింది ఇప్పుడున్న మిసాక్లీస్ తాతగారి రోజుల్లో ఆయింటివాళ్ళు ఈ ఇంటివాళ్ళతో సంబంధం

పెంచుకోవడానికి ప్రయత్నించారు అయితే వీళ్ళు అంగీకరించలేదు వాళ్ళు ఆగ్రహంతో వీళ్ళకు హాని చెయ్యడానికి తలపడ్డారు వాళ్ళ మాటల్ని విని నగరంలోని ఒక పెద్ద అధికారి వీళ్ళకు వస్తున్న వేతనాన్ని నిలిపివేశాడు పూర్వీకులు ఎప్పుడో దేశానికి సేవ చేశారని ఎంతకాలం వీళ్ళకు భరణం ఇవ్వాలి ? లిరిస్ప్రెడిస్ వీళ్ళు ఏవీ బదులివ్వలేదు ఆ అధికారి ఉద్యోగవిరమణకాగానే, అతని స్థానానికి వచ్చిన మరో అధికారి, వెనుకటినుంచి ఇస్తున్న భరణాన్ని నిలిపివేయక ఉండాల్సిందని దాన్ని మళ్ళీ వాళ్ళకు ఇప్పించాడు ప్రస్తుతం అది ఇంకా కొనసాగుతూనే ఉంది

ఇప్పుడున్న థెమిస్టాక్లీస్ ఎలాంటివాడు అని ప్లూటార్క్ అడిగాడు లైసి మ్యాకస్, ఆయన సరళ హృదయుడు, నేను ఒప్పుకొంటే మనతో స్నేహం చెయ్యడానికి ఇష్టపడతాడు అయితే మా అత్తగారు అతనితో సంబంధమే వద్దంటారు అన్నాడు

ఆయన భార్య, మరేం చేద్దాం ? సరే అని దగ్గరికి ఎళ్తే ఆయన అది ఇది ఇవ్వడం, మనం దాన్ని తీసుకురావడం, తినడం, దరించడం జరుగుతుంది విషవృక్షం ఫలంలో మనకెందుకు భాగం ? దూరంగా ఉండడం క్షేమం

ప్లూటార్క్ అదేమో ఫరవాలేదు అయితే తాతలు వచ్చి ఐదు వందల సంవత్సరాలయినా అప్పటి విరోధం ఇంకా సజీవంగా ఉన్నట్టయిందికదా! అన్నాడు

లైసిమ్యాకస్, తాతలు మరణించినా వాళ్ళ పేరు మాత్రం చావలేదు అన్నాడు

ఆ తర్వాత బాగా అలోచించిన ప్లూటార్క్‌కు ఇంటి పేరు ప్రతిష్ఠలను గురించి వీళ్ళిలా గర్వపడుతుండడం ఒక విధంగా అతిగా కన్పించినా, మరో విధంగా సమంజసమనిపించింది ప్లూటార్క్ కొద్ది రోజుల్లోనే థెమిస్టాక్లీస్‌తో పరిచయం చేసుకొన్నాడు ఆతను తన ఆస్తి అన్యాయంగా వచ్చిందని సిగ్గుపడక పోయినా, దాని విషయంగా ఆతను గర్వపడే వ్యక్తి కాదని ప్లూటార్క్ తెలుసుకొన్నాడు

ప్లూటార్క్ ఒక రోజు గురువుగారయిన అమ్మోనియస్ వంశవిషయాలకు సంబంధించిన ప్రస్తావన చేశాడు అరిస్టిడిస్ విషయం ఆ గురువుగారికి తెలుసు ఆ వంశస్థులు ఆ ఊళ్ళోనే ఉన్నట్టుకూడా విన్నాడు అయితే ఇంతకాలమూ వాళ్ళతో పరిచయం చెసుకోనే తంటాకు పో లేదు ప్లూటార్క్ చెప్పిన సంగతులు విని, వంశ గౌరవాన్ని పేరు ప్రతిష్ఠలని ఇంటి అడబిడ్డలు ఇలాకాపాడు కానిరావడంవల్లే మనదర్మం ఇంతవరకు రక్షింపబడింది అన్నాడు తర్వాత నీవిలాంటి విషయాలను ఆమూలంగా విచారించి తెలుసుకొవడం మంచిదయింది ఇది నీకిష్టమైన పనిగా తోస్తుంది అన్నాడు

"అవును"

అమ్మోనియస్, అలాగయితే నీవు మన దెశ ప్రముఖులను గురించి ప్రజలు వ్రాసిన విషయాలను, చెప్పేకదలను అన్నింటిని చేర్చి జీవిత చరిత్రలను రాస్తే ఒక మంచి పని చేసినట్టువుతుంది అన్నాడు

"నెను తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేయడంకోసం వచ్చాను ఇది వేరేపని అవుతుంది"

అమ్మోనియస్, వేరెపనికాదు, అదే పని అన్నాడు తన ఉద్దేశాన్ని ఇలా వివరించాడు

"పేర్లను వ్రక్కకు పెడితే ఇక మిగిలేదేమిటి? ఈ సత్యవంతుడు, ఈ అయోగ్యుడు, వీళ్ళ బ్రతుకుల్లో తరించేదేమిటి? డబ్బు కావాలనుకొన్నవాడు సత్యాన్ని వదలుకొంటాడు సత్యం కావాలనుకొన్నవాడు ధనాన్ని వదులుకొండు అన్యాయం చేయనిదే ఆస్తిరాదు, బీదరికం కష్టంకాదు దీన్ని ఒకడు పద్యంగా పాడుతాడు, ఒకడు కథ కట్టి చేస్తాడు, ఒకడు చరిత్రగా రాస్తాడు, ఒకడు తత్వం అని ఉపదేశిస్తాడు వీళ్ళందరూ చేస్తున్న పని ఒకటే మానవజాతికి దారి చూపించడమే"

క్షణం తర్వాత అమ్మోనియస్ మళ్ళీ ఇలా అన్నాడు

"తాతలు మరణించారు, పేరు చావలేదు, అని లైసిమ్యాకస్ అన్నాడని చెప్పావు కదా, ఆమాట సత్యం ఎందుకంటే, పెద్దపేరు తెచ్చుకొన్న వ్యక్తి

మరణించి కూడా బ్రతికే ఉన్నారు. అయితే ఇద్దరి పేర్లు ఒకరకంగా మిగిలి ఉన్నాయి, ఒకే రకంగా మానవ జాతికి దారి చూపించే జ్యోతులయ్యాయి. చెడ్డపేరు హెచ్చరికనిస్తుంది. మంచిపేరు ఆశను రేకెత్తిస్తుంది. పేరు చావదు అన్న సంగతినే నేనూ నీవూ లోకానికి తెలియజేయాల్సింది.

గురువుగారి ఉపదేశం ప్లూటార్క్ మనస్సులో స్థిరంగా నిలిచిపోయింది. ఆ ప్రేరణతోనే అతను గ్రీసు, రోమను మహాపురుషుల జీవిత చరిత్రల రచయిత అయ్యాడు.

# దర్మకింకరుడు ఫిట్స్ స్టిఫన్

## 1

అయ్యగారు ఇంగ్లాండు పర్యటిస్తున్న రోజుల్లో ఒకసారి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం భారతీయ విద్యార్థి సంఘానికి వెళ్ళవచ్చారు ఆ రోజు అక్కడే ఆయనకు ప్రఖ్యాత రచయిత రాబర్ట్ లిండ్ మహాశయుడి పరిచయం జరిగింది లిండ్ ఐర్లండ్ దేశంలో జన్మించిన వ్యక్తి లిండ్ భారత దేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించవలసిందిగా వాదించేవాడు జర్మన్ ప్రజలు ఇంగ్లండును స్వాదీనం చేసుకొంటే అన్న శీర్షికలో ఇంగ్లాండు భారతదేశంలో చేస్తున్న అన్యాయాలన్నిటిని పరోక్షంగా ఖండించాడు అయ్యగారితో మాట్లాడుతూ ఆయన మనదేశ సంస్కృతిని గురించి గొప్పగా చెప్తూ గౌరవం కనబరచాడు మాటల్ల మధ్యలో అయ్యగారు వాల్మీకి తన కావ్యంలో దర్మ వీర న్యాయాదీశులను గురించి చెప్పిన, (ప్రాప్తకాలే యదాదండం ధారయేద సుతేష్వపి, అహితంచాపి పురుషం నవిహింస్యా అదూషకం) అన్న వాక్యాలను ఉదహరించాడు ఈ వాక్యల అర్థాన్ని లిండ్ తెలుసుకొని చాలా ఉదాత్తమైన కల్పన చూడండి, ఇదే కల్పన మాలోనూ ఉంది మీరు చెప్పిన వాక్యం కావ్యంలో ఉంది అయితే నిజజీవితంలో ఎప్పటి కన్పిస్తున్నదో చెప్పడానికి వీలుకాదు ఇప్పటికి ఇలాంటి ప్రజలు ఉండవచ్చు మనకు తెలియదు అయితే ఐర్లండులో నాలుగు వందల ఏండ్లకు పూర్వం న్యాయాధీశుడు తకొడుకు తప్పు చేసినప్పుడు, తానే ఆతణ్ణి విచారణకు గురిచేసి మరణ దండన విధించి, తానే ఉరికంబం ఎక్కించడం చరిత్ర చెప్పిన సంగతి అన్నాడు అయ్యగారు ఆ విషయాలన్నిటినీ వినడానికి కుతూహలం కనబరచారు లిండ్ ఈ విషయన్ని వివరించాడు

## 2

ఐర్లండులో గ్యాల్వే అన్న ఒక ఊరు ఉంది అది కాస్త పెద్ద ఊరే అనే చెప్పవచ్చు, అయితే దాని ప్రసిద్ధికి కారణం ఆదేశంలో జరిగే గుర్రపు పందెల మైదానం ఆ ఊళ్ళో ఉండడమే ఇంగ్లండులో డార్బి లాగా, ఐర్లండులో గ్యాల్వే

ర. పట్టణంలో ఇప్పటికి నాలుగువందల ఏండ్లకు పూర్వం ఒకసారి జేమ్సలించ్ పిట్స్ అనే పుర ప్రముఖుడు నగరాధ్యక్షుడయ్యాడు

పిట్స్ స్టెపన్ ఐర్లండు, స్పెయిన్ దెశాల మద్య జరుగుతున్న వ్యాపారంలో ప్రముఖుడు యువకుడుగా ఉన్నప్పుడె స్పెయిన్‌లో కొంతకాలం ఉన్నాడు బాగా సంపాదించి ప్రస్తుతం పెద్ద శ్రీమంతుడుగా పెరుపొందాడు ఇతని బార్యకొన్ని సంవత్సరాల క్రితమే మరణించింది ఇతని సంసారంలో ర:యున నగరాధ్యక్షుడయినప్పుడు ఇతని సంసారంలో ర:యున,ర:యున కొడుకు ఇద్దరు మాత్రమే ఉన్నారు

ఆయున కొడుకు మంచి యుక్తవయస్సులో ఉండెవాడు. తండ్రిగారి వ్యాపార నిర్వహణని అతను కొనసాగించాడు ప్రజలకు కావలసిన వాడయ్యాడు

తండ్రి ఒకసారి స్పెయిన్ దేశానికి వెళ్ళి తిరిగి వస్తూ అక్కడి పరిచయస్తుడి కొడుకును ఐర్లండులో కొంతకాలం ఉంచుకొవడం కోసం పిలుచుకొని వచ్చాడు

ఆ యువకుడు కూడా దాదాపు ర: యింటి కొడుకు వయస్సులో ఉన్నవాడు ఆతను కూడ గుణవంతుడు. ఇద్దరూ మంచి మిత్రులయ్యారు పరస్పరం స్నేహంగా ఉంటూ కొంత కాలం విశ్వాసంగా ఉన్నారు

అయితే ఇద్దరూ ఒకే అమ్మాయిని ప్రేమించడంవల్ల వీళ్ళిద్దరి మధ్య మనస్తాపాలు మొదలయ్యాయి

నేను మొదట ఆ అమ్మాయిని చూసాను, నీవు ఈమె విషయంగా ఆలోచించడం తప్పు నీవామెను మరచిపో అని స్టీఫన్ కొడుకు అన్నాడు

అతను, నీవామెను మొదట చూడడం నిజమే అప్పుడామె నిన్ను

ప్రేమించి ఉండవచ్చు అయితే ఇప్పుడామె నన్ను ప్రేమిస్తూ ఉంది అందువల్ల నీవు ఆమెను గురించిన ఆశలు వదులుకోవాలి ఆమెను వెనుకటి మా ప్రేమ విషయం చెప్పి లొంగదీసుకోవడానికి ప్రయత్నించకు అన్నాడు

ఈ వివాదం నాలుగు రోజులు నడిచింది యువతి స్పెయిన్ యువకుడి వైపు మొగ్గింది ఫిట్స్ స్టీఫన్ కొడుకుతో చెప్పి చూసింది

ఇతను ఆమెను వదులుకోవడానికి సిద్ధపడలేదు స్నేహితుడితో, మా పాటికి మేము ఉంటే మధ్యలో వచ్చి నా జీవితాన్ని చెడగొట్టావు నీవు అన్యాయం దొంగవు అన్నారు

ఆ యువకుడికి కోపం వచ్చింది అతను దొంగగా అనవద్దు నేను చేసిన అన్యాయమేమిటి? ఆమె నన్ను చూసి నా ప్రియురాలిగా ఉండడానికి ఇష్టపడింది, దీనికి నేనెలా బాధ్యుణ్ణి అన్నాడు

మాటకి మాట పెరిగింది జగడమయింది ఫిట్స్ స్టీఫన్ కొడుకు యువ మిత్రుడ్ని కత్తితో పొడిచాడు అది అతని గుండెకు తాకింది యువకుడు గాయాలతో కన్ను మూశాడు

ఊళ్ళో జరిగే ఇలాంటి కృత్యాలకు సంబంధించిన విచారణను జరపడం, దండన విధించడం, నగరాధ్యక్షుడి కర్తవ్యం తండ్రి కొడుకును కొత్వాలుకు అప్పగించాడు మరుసటి రోజు విచారణ జరిపాడు

విచారణ ఎందుకు? యువకుడు తన తప్పును తానే అంగీకరించాడు ఆ యువతి వీళ్లిద్దరి మధ్య జరిగిన జగడాన్ని చూసింది ఆ విషయంగా సాక్ష్యం చెప్పింది అపరాధానికి ఒకే శిక్ష అపరాధిని ఉరికంబం యెక్కించడం తండ్రి కొడుకుకు మరణ దండన విధించాడు కొత్వాలుకు మరణ దండనను అమలు చేసే బాధ్యతను అప్పగించి నిర్లిప్తంగా ఇంటికి వెళ్ళాడు

ఫిట్స్ స్టీఫన్ కొడుకు ఊళ్ళోని ప్రజలకు కావలసిన యువకుడు వాళ్ళకు అతను చావడం ఇష్టం లేదు వాళ్ళలో పదిమంది పెద్దలు అతని తండ్రి దగ్గరికి వచ్చి, ఈ శిక్షను ఎలాగైనా తప్పించండి అతను పశ్చాత్తాప పడుతున్నాడు ఇలాంటి సందర్భంలో క్షమించడం యుక్తం అని

నివేదించుకొన్నారు

తండ్రి, కొడుకును చంపడం నాకు ఇష్టం లేనందున, క్షమించడానికి అవకాశం ఉంటే క్షమించమన్నా అందులోను మీరందరు కోరుతుండడం వల్ల నేను వేరే మాట్లాడాల్సిన పని లేదు. అయితే ఇలాంటి సంఘటనలు దీనికి ఇంతకంటే తప్పుడు ఏ పట్టణంలోనే లేదు నా ఆజ్ఞ పాటించబడి తీరాలి అని బదులిచ్చాడు

వాళ్ళు వేలాడ మొహాలు పెట్టుకుని వెళ్ళిపోయారు. అయితే న్యాయాధీశుడైన నగరాధ్యక్షుని కష్టం అక్కడితో ముగియలేదు. యువకుడ్ని ఉరికంబమెక్కించాల్సిన కటికవాడు, నేను ఆ అబ్బాయిని చిన్నతనం నుంచి చూస్తున్నాను, ఎత్తుకొని ఆడించాను ఇతన్ని వేరె ఎవరయినా ఉరికంబమెక్కించని నేను ఆ పని చెయ్యలేను అన్నాడు

అధ్యక్షుడు ఆ బాధ్యతని ఎవరైనా నిర్వర్తించగలరేమోనని విచారించి చూశాడు ఎవరూ అంగీకరించకపోతే తండ్రి ఆ యువకుని వదిలిపెడతాడని నిరీక్షించారేమో ఆ ఊరి ప్రజలు మొత్తం ఊళ్ళోని ప్రజల్లో ఏ ఒకరూ ఇతని ఆజ్ఞను నెరవేర్చడానికి ముందుకురాలేదు

అయ్యో! అంతా దైవేచ్ఛ అనుకొని స్టీఫన్ కొడుకును తీసుకువెళ్ళి తానే ఉరితాడు బిగించి వ్రేలాడదీశాడు, ప్రాణం పోయాక తర్వాత శవాన్ని దింపడానికి ఇతరుల్ని పిలిచాడు దింపిన తర్వాత శవానికి అంత్యక్రియలు కూడ చేశాడు

కొడుకునే ఉరి తీసిన స్థిరబుద్ధి ఉన్న న్యాయాధీశుని ఇప్పటికీ అతణ్ణి పొగుడుతూ ఉంటుంది ఐర్లండులో ఇతని పేరు ప్రఖ్యాతి చెందింది

## 3

ఆశ్చర్యకరమైన ఆ కథను విని అయ్యగారు, "ఎండ్ మహాశయా! ఇది నమ్మశక్యంకాని కథగా ఉందికదా ఇది నిజంగా జరిగిన సంగతి అంటారా?" అడిగారు

"ఇందులో ప్రతివిషయం తు ట తప్పక జరిగాయి, ఇందులో ఏమాత్రం సందేహం లేదు"

"ర ంద్రి అత్యంత సత్యవంతుడైన వ్యక్తి ఆ తర్వాత అయినా ఆతనికి తాను వాల కరినంగా ప్రవర్తించానని అనిపించిందా ?"

అలాంటిదేమీ లేదు ర౾ విషయంగా ఆయనలో ఎవరూ మాట్లాడడానికి ఇష్టపడలేదు అత్యంత సన్నిహితుడైన ఒక ప్రియమిత్రుడు ర౾ ఊ౼ె ప్రజలు నీ వెత ర౾పె వెయింబిటుడరాదనింది చెప్పినప్పుడు ఇతను, నెను వెశాను, నా కొడుకు అనడం తప్పు ఒక వ్యక్తి ర౾ తప్పు వేశాడు, ఒకడు ర౾ శిక్ష విదించాల్సి ఉండింది విదించాడు, ఒకడు దీన్ని నిర్వర్తించాల్సి ఉండింది నిర్వర్తించాడు ఇదె ప్రస్తుతం కావలసింది దర్మం నడవాలి నెను వేస్తె తప్పు, మరొకరు వేస్తె తప్పు కాదా ? అన్నారట అతని మనస్సు చివరిదాకా నిశ్చలంగానే వుంది

అయ్యగారు, ఇలాంటి వ్యక్తి ఒకడు ఉండెవాడని చెప్పే కావ్యం ఉండవచ్చు మనుష్యుడు ఉండెవాడు అని చెప్పడం ఒక అద్భుతం అన్నారు

లిండ్, నమ్మడానికి వీలులేని ఇలాంటి మంచితనం, దర్మనిష్ఠ ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట కన్పిస్తుండడంవల్లే రాబోయే రోజులు మనుష్య జాతికి మరింత శుబాన్ని వేకూరుస్తాయని నిరీక్షించడాడనికి అవకాశం ఏర్పడింది లేకుంటె లోకంలో బ్రతకాలి అనె ఆశకు అవకాశం ఉండదు అన్నాడు

# యాన్ షేక్స్‌పియర్

తన ఇరవైరెండవ యేట లండన్ నగరం లోని నాటకం కంపెనీలకు పాతనాటకాలను దిద్దిపెట్టే రచయితగా, తన రచనా జీవితాన్ని ఆరంభించిన షేక్స్‌పియర్, నలభై ఒకవ సంవత్సరానికి ఆంగ్ల నాటకలోకంలో ప్రతిభాన్వితుడైన దృశ్యకవి అనే పేరు సంపాదించినాని, తన స్వగ్రామమైన స్ట్రాట్‌ఫర్డ్ ఆన్ ఏవన్‌కు విశ్రాంతి జీవనాన్ని గడపడానికి వెనుదిరిగి వచ్చాడు పద్దెనిమిదవ సంవత్సరం వచ్చేదాకా తన గ్రామంలో సోమారిగా తిరుగుతున్నా పిల్లవాడు ఇప్పుడు ఊరిమధ్యలో ఉన్న ఒక పెద్ద ఇంటికి యజమానిగా వచ్చాడు అప్పట్లో అతనొక నిరుపేద, నేడు పెద్ద శ్రీమంతుడు అప్పుడతనికి చెప్పుకోవడానికి పేరు లేదు, ఇప్పుడు ఇతని పేరును చెప్పని వాళ్ళు లేరు ఇది అతనికి ఒక తృప్తి, అతని భార్యపిల్లలకి గర్వకారణం, బంధుమిత్రులకు సంతోషం కలిగించిన సంగతి

ఇతడంటే పట్టనివాళ్ళకు ఇతని పేరు ప్రతిష్ఠలు దుఃఖాన్ని కలిగించాయని వేరే చెప్పాలా? కాని అలాంటి వాళ్ళు ఉండేవారా అని అడుగుతున్నారా? ఇంతటి కీర్తి ప్రతిష్ఠలు, ఐశ్వర్యం గడించిన వ్యక్తికి కానివాళ్ళు ఉండకపోతారా? అసూయ ఒకటి చాలు, ఇలాంటివాళ్ళ సృష్టికి షేక్స్‌పియర్ కొందరికి డబ్బిచ్చి భూమి కొన్నాడు ఇతర వ్యాపారాలను నడిపి పదిమందికి ప్రీతి పాత్రుడయ్యాడు, నలుగురి మనసు నొప్పించాడు, ప్రీతిపాత్రులయిన పదిమంది విశ్వాసంలో మెలిగినట్లు ప్రీతిపాత్రులుకాని నలుగురు ఇతని విషయంలో అవిశ్వాసంలో మెలిగారు

ఊళ్ళో ఆరేళ్ళు విశ్రాంత జీవనం గడిపి షేక్స్‌పియర్ 1616వ సంవత్సరారంభంలో అనారోగ్యం పాలై తన మరణ శాసనాన్ని చేసుకొన్నాడు

కొన్ని నెలల తర్వాత తన అంతిమ రోజు సమీపిస్తున్నదని తెలుసుకొని దానికి కొన్ని మార్పులు చేసి దాన్ని, ధ్రువీకరించాడు ఇలా చేసిన కొన్ని రోజుల తర్వాత తన ఇహలోక జీవనాన్ని త్యజించాడు ఇదొక విచిత్రం, అతను పుట్టింది ఏప్రిల్ ఇరవై మూడో తేది, అతను మరణించిన తేది కూడ ఏప్రిల్ ఇరవై మూడు

కవిపెద్ద కూతురు స్యూసానా, కవిగారి ఊళ్ళోనే ఉన్న వైద్యుడు హాల్ మహాశయుణ్ణి వివాహం చేసుకొంది ఆమె, ఆమెభర్తా కవిగారిని చివరి రోజుల్లో చూసుకొన్నాడు భార్య, ఈకూతురు కాక కవికి ఉన్న బంధువులంటే రెండో కూతురు జూడిత్, ఒక సోదరి జూన్, ఆమె పిల్లలు షేక్స్‌పియర్ మరణ శాసనంలో ఈ కూతురుకు కానుక నివ్వడాన్ని మెర్చా నలెదు సోదరికి, ఆమె పిల్లలకు అవసరమైన సహాయం అందించాడు మిత్రులకు, పరిచయస్తులకు ఉచిత రీతిలో కానుకుల్ని బహూకరించాడు

, ఈ మరణ శాసనాన్ని చేసి దీన్ని అమలు చేసే జవాబ్దారిని తన పెద్ద కూతురుకు, అల్లుడికి అప్పగించాడు

ఇందులో అతను తన భార్య జీవనాధార విషయాన్ని ఏమీ తెలియజెయులెదు అతనికి కాని, ఆమెకు కాని ఇది ఆవసరమనిపించలేదు ఆమె అతనికంటే ఏడేళ్ళ వయస్సులో పెద్దది అంతకు ముందే రోగపీడితురాలై ఎలాగో కోలుకుని భర్త మరణించేనాటికి కొంత స్వస్థత పొంది ఉండింది ఆమె కూతురు, అల్లుడు ఆమెను ప్రేమతోను గౌరవంతోనూ చూసుకొనేవాళ్ళు తండ్రి నుండి ఆస్తి పొందిన స్యూసానా తన తల్లి జీవించినంత కాలం ఆమెను చూసుకొంటుంది దీన్ని మరణశాసనంలో వ్రాయాల్సిన ఆగత్యం ఏమిటి? అందువల్ల అందులో ఆమె ప్రసక్తి రాలేదు

శాసనాన్ని ధ్రువీకరించడానికి ముందురోజు కవి, దాన్ని చివరిసారిగా కూతురుకు, వైద్యుడయిన అల్లుడికి చూపించారు ఈ విషయంగా ఇంట్లో మాట్లాడుకొంటున్నప్పుడు కవిగారి భార్య "ఇప్పుడు నేను ఉపయోగిస్తున్న పరుపు, దానికి సంబంధించిన సామాగ్రి నాకు చేరే విధంగా మరణ శాసనంలో ఒకమాట చేర్చండి" అంది

స్యూసానా, "ఎందుకమ్మా? శాస్వగారు ఉపయోగిస్తున్న పరుపు ఇంతకంటె బాగుంది, దాన్ని నీవు తీసుకో నేవు ఉపయోగిస్తున్న పరుపును మేమెవరమైనా తీసుకొంటాము" అంది

అల్లుడు హాల్, "అవును, పెద్ద పరుపు చాలా బాగుంది కొత్తగా కన్పిస్తుంది ఇది చాల కాలం క్రితం కొన్న పరుపులా ఉంది అత్తగారికి కొత్తదె ఉండని" అన్నాడు

కవిగారి భార్య ఇకవాళ్లతో చర్చించలేదు సాయంకాలం భర్త దగ్గరికి వెళ్ళి నీ రః మరణ శాసనంలో నేను ఉపయోగిస్తున్న పరుపు నాకె ఉండేలా ఒక వాక్యం చెర్చు అంది

"ఎదొక వెనా ఏమిటి? మరణ శాసనంలో వ్రాయాలి కదా అని ఆస్తిని కూతురు పేర అల్లుడి పెర వ్రాశాను అంతానీదె నేను కావలసినదాన్ని నేవు ఉంచుకో"

"ఎదేమోనిజమె అయితె నాకు రః విషయాన్ని స్యూసానాతో కాని, అల్లుడితో కానీ చర్చించడం ఇష్టంలేదు వాళ్ళు ర. పెద్ద పరుపు తీసుకో మంటున్నారు నాకు ఇది ఒక్కంలెదు అందువల్లె మిమ్మల్ని అడుగుతున్నాను మరణ శాసనంలో రః మాట వ్రాస్తె ఇక చర్చించాల్సిన పని ఉండదు"

"వాళ్ళ ఇష్ట ప్రకారమే చెయ్యి,, రః పెద్ద పరపునె నీవు ఉంచుకో"

"వద్దు, వద్దు, నాకు బాగా కుదిరిన పరుపు నాకె ఉండని ర మాత్రం వెయండి"

కవి, సరే అన్నాడు, మరణ శాసనంలో నా భార్యకు నా పాత పరుపు, దానితో పాటున్న అన్ని వస్తువులను ఇస్తున్నాను అని ఒక వాక్యాన్ని చెర్చాడు

మరుసటిరోజు దీన్ని చదివినప్పుడు కూతురుకు, అల్లుడికి ఎంతో ఆశ్చర్యం చేసింది కొత్త పరుపు ఉండని, పాత పరుపువద్దని అనెవాళ్ళుంటారు కాదా! ఇదెమిటి రః మా తల్లి పాతది ఉండని అని పట్టు బట్ట డమే

కాదు దాన్ని విల్లులోనే వ్రాయించిందే! అని వాళ్ళు మాట్లాడుకొన్నారు కూతురు తల్లిని ఎందుకిలా చేశావని అడగాలని అడిగింది

యాన్ షెక్స్‌పియర్, నాకలవాటయిన పరుపు, ఉండని, అని వ్రాయించాను అంది అయితె ఆమె మనస్సులో మరేదో కారణం ఉన్నట్టు అగుపించింది

స్యూసానా "మరెదో సంగతి ఉంది, నీవు చెప్పడం లేదు"

యాన్ (కాసేపు ఉండి) అవును, అయితె ఆ విషయం వద్దు

స్యూసానా వద్దంటే వద్దు, అది నాకెందుకు?

వర్ష అప్పటికి అక్కడికి ముగిసింది కొద్ది రోజుల్లో షెక్స్‌పియర్ కన్ను మూశాడు అంత్య క్రియలన్ని ముగిసిన తర్వాత మరణ శాసనాన్ని చదివారు రః పరుపు విషయంగా ప్రజలు, షేక్స్‌పియర్‌కు తన బార్య అంటె అశ్రద్ధ అతను మరణిస్తూ ఆమెకు తన చిన్న పరుపును వదలిపెట్టి పోయాడు అని చెప్పుకున్నాడు స్యూసానా అమ్మ చెసిన పనివల్ల నాన్నకు అపఖ్యాతి వచ్చింది అని అనుకుంది, భర్తకు కూడ చెప్పి దుఃఖించింది

యాన్ షెక్స్‌పియర్ ఆ తన పరుపును మరి ఏడేళ్ళపాటు ఉపయోగించి తాను కూడ ఒక రోజు జీవన యాత్రను ముగించింది

ఆమె మరణించడానికి ముందు రోజు కూతుర్ని పిలచి, "నీకొక మాట చెప్పాలనుకొని ఇన్ని రోజులు నామనసులో ఉంచుకొన్నాను ఇక నా కాలం ముగిసింది రః రోజు చెప్తాను" అంది

"చెప్పమ్మా"

"మీనాన్న మరణించడానికి ముందు నాకు రః పరుపే కావాలని మరణ శాసనం వ్రాయించుకొన్నాను నీవూ, నీ భర్త వద్దన్నారు, నేను వినలేదు కారణం ఏమిటి అని నీవు అడిగావు, నేను అప్పుడు చెప్పలేదు, ఎప్పుడైనా చెప్తానన్నాను ఇప్పుడు చెప్తాను

"చెప్పు"

'చూడు, ఈ రెండు పరుపులూ మా యింటికి అదృష్ట దేవత వచ్చినరోజునె, దాంతో పాటె వచ్చాయి మీ నాన్న దీన్ని నాకు నీకూ అని, దీన్ని తన తండ్రికి తల్లికి అని చెప్పారు"

"సరె"

"వాళ్ళ నాన్న మరణించగానె తల్లి, ఇది నాకెందుకు నాయనా" మీరె ఉంచుకోండి అని దాన్ని ఇచ్చివెశారు మీ నాన్న దాన్ని తీసుకొన్నారు, నెను నాకు ఇదె ఉండని అన్నాను, దీన్నె ఉపయోగిస్తున్నాను

"ఎప్పుడో ఒకప్పుడు దీన్ని వదలి నెను దాని మీద పడుకొనే దాన్నేమో ఒకరోజు ఒక సంఘటన జరిగింది ఆరోజు నుంచి నాకు దాన్ని తాకడం వద్దనిపించింది

"ఆ"

"ఆ నల్లని యువతిని మీరందరూ చూశారు కదా వీళ్ళ కంపెని ఒకసారి ఇక్కడికి వచ్చినప్పుడు ఆమె, ఆమెతోపాటున్న మరో యువతి, దంపతులతోపాటు వచ్చారు వాళ్ళ వాళ్ళ విడిదిళ్ళల్లోవాళ్ళుండెవారు ఇక్కడికి వచ్చిపోయెవారు ఒకరోజు ఉదయం నేను కాస్త ముందుగా లేచి మీ నాన్నగారి గదిలోకి వెళ్ళాను ఆ యువతి ఆయనతోపాటు ఆ పరుపు మీద పడుకొని ఉంది"

"అయ్యో!"

"చూశాను, కళ్ళకు చెతులు అడ్డం పెట్టుకొని వెనుదిరిగాను మౌనంగా ఉండిపోయాను ఉదయం ఇంట్లొ వాళ్ళెవరు లేవక ముందే ఆమె లేచి వెళ్ళి పోయింది ఆమె వచ్చినట్టు నాకు తప్ప మరెవ్వరికీ తెలీదు"

"సరే"

భార్య మరో పురుషుణ్ణి తాకకూడదన్నట్టుగానె భర్త మరో స్త్రీని తాకకూడదని నెను చెప్పనమ్మా అయితె నాఇంట్లోనే, ఇలా ఒక స్త్రీ నా భర్త

పరుపుమీద పడుకోవడం నేను సహించలేనమ్మా నాకు ఆ పరుపును తలచుకుంటేనే అసహ్యం వేస్తుంది ఆ రోజే అనుకొన్నాను, దీన్ని ముట్టుకూడదని అనుకొన్నదాన్ని ఆచరించాను

"నువ్విలా పట్టుబట్టడం ఇందుకే అని నాన్నకు తెలుసా?"

"ఎలా తెలియాలి? నేను దాని ఊసే ఎత్తలేదు"

"అమ్మా నీవెంత గుణవంతురాలవమ్మా! నీవు నాన్న విషయంలో ఎప్పుడూ అలక్ష్యం చేయలేదు"

"మీనాన్న చాలా గొప్ప వ్యక్తి తల్లీ తెలియని ఆడదాన్ని నేను, పెళ్ళి కావడానికి ముందు రాయుడుతో సరసమాడి గర్భం దరించి కూడాయున్నాను వేరే వాళ్ళయితే ఏమి చేసి ఉండేవాళ్ళో మీ నాన్న కూడ కాస్త ముందు వెనుక చూశారు మరెవ్వరికో గర్భం దరించి వుంటే? నాటితో చెప్పలేదు నాకు తోచింది నేను ప్రమాణం చేశాను నిన్ను తప్పనేను పరపురుషుణ్ణి ఎరుగనని విశ్వసించారు, పెళ్ళి చేసుకొన్నారు నా మర్యాద నిలిపారు పెళ్ళయిన ఐదు నెలలకే నేను నిన్ను కన్నాను నీ ముఖం, ముక్కు కళ్ళు, నోరు చూసి వాళ్ళకేమిటే, ఊళ్ళో వాళ్ళకూ తెలిసింది నీవు ఆయనపోలికేనని ఆ తర్వాత ఊళ్ళో వాళ్ళ నోరు మూసుకొన్నారు, ఆయన మనస్సూ కుదుట పడింది మీనాన్నచే పోలిన మంచి కూతురనిపించుకొన్నదానివి నీవు"

"ఆ విషయం నాకు తెలీదు అయితే నేను పూర్తిగా నాన్నను పోలుతానని అందరూ అంటారు"

"కదా?"

"చెన్ మామ చెప్పుందేవారు నాన్నతో ఒకరోజు తెచ్చిందేమో" అన్నట్టుగా ఉంది స్వ్యాసానా అని

"అవునమ్మా అంటూ నీవు మీ నాన్నను పోలడం మా సంసారాన్ని నిలిపింది నీవు పుట్టిన రోజు మంచిది మీనాన్న డబ్బు గడించారు, పేరు

గడించారు, తండ్రి అప్పు తీర్చారు, కొత్త ఇల్లుకొన్నారు, గొప్ప వ్యక్తి అనిపించుకొన్నారు, ప్రతిసారు ఇలాంటి భర్తను పొందడానికి నేను పుణ్యం చేసుకొన్నాను"

"అమ్మా నీవు చాలమంచిదానివి నా భర్త ఇలాగేమయినా చేసివుంటే నేను నేలా సహించుకొని ఉండేదాన్నని చెప్పలేను"

"అయ్యో పిచ్చిదానా నీ భర్త అలాంటివాడు కాదు నీవిలా అయ్యున్నావు మరో విధంగా ప్రవర్తించి ఉంటె కూడ సహించుకొని ఉండేదానివి"

"అంతేనంటావా?"

"అంతేమరి ఆ మాట వదిలెయ్ విల్లియం సత్యవంతుడు, నీవు పుణ్యాత్మురాలవు సుఖంగా జీవించు అంటె నేను పుణ్యాత్మురాలిని కానని అనుకోవద్దు నేనూ పుణ్యాత్మురాలినే"

ఇలా మాట్లాడుకొన్న మరుసటి రోజు యాన్ షెక్స్పియర్ కన్ను మూసింది ఆమె పార్థివ శరీరాన్ని ఆమె భర్త సమాధి ప్రక్కనె సమాధి చేశారు

# టాల్‌స్టాయ్ మహర్షి భూర్జవృక్షాలు

శ్రీమంతుడి కొడుకుగా పుట్టి, శ్రీమంత యువకుడిలా విచ్చలవిడిగా జీవితాన్ని అనుభవించి, యోధుడిగా కీర్తి పొంది, అత్యుత్తమ గ్రంథాలను రచించి సాహిత్య కేసరి అన్న బిరుదం గడించి, పిత్రార్జితమైన ఆస్తికి వారసుడై దాన్ని అభివృద్ధి చేసి, సంసారిగా జీవన సౌఖ్యాన్ని రుచి చూసిన ప్రభు లియో టాల్‌స్టాయ్ తన వది వయస్సులో జీవితం మీద విరక్తి చెందాడు ప్రాణ త్యాగం ఒక్కటే మార్గం అన్నంత తీవ్రమైన వైరాగ్యానికి లోనయ్యాడు

సాంప్రదాయికమైన ఆస్తిక మనోభావం కలిగిన కుటుంబంలో పెరిగిన టాల్‌స్టాయ్, తన విద్యాభ్యాసపు రోజుల్లో అనేక తర్క వితర్కాలకు లోనై దేవుడు లేడన్న నిర్ధారణకు వచ్చాడు ఆ నిర్ధారణలో జీవించడం అసాధ్యమని భావించి జీవితం విషయంలో మాత్రం జనసామాన్యుల దృక్పథమే సరైన జీవన దృక్పథమని నిశ్చయించుకొన్నాడు

భాగ్యవంతులై, సుఖాల్లో తెలియాడుతూ ఆరోగ్యవంతులైనవాళ్ళు మనస్సు స్థిమితం లేక కష్టాల్లో సతమతమవుతుంటే, దరిద్రులు కష్టజీవులు అనారోగ్యవంతులైన సామాన్య జనులు ఇదే జీవితం అనుకొని తమ జీవిత విధానంతో రాజీ పడుతున్నారు ఇదే సరైన సిద్ధాంతం, జీవితమే దైవం, జీవితంలో రాజీ పడడమే బుద్ధి మంతుడి లక్షణం ఇది టాల్ స్టాయి ప్రభువుకి నిత్యమైన, నిశ్చలమైన సత్యంగాకన్పించాయి

"తనలాంటి శ్రీమంతులు, ఇలాంటి సరళ జీవితాన్ని గడిపేవాళ్ళని దాస్యంలో ముంచి వాళ్ళ కష్టార్జితాన్ని శ్రమని దోచుకుంటున్నారు ఆ దోపిడి స్థిరంగా ఉండాలని ఆస్తి సంపాదించడం, దీనిని భద్రపరచడానికి చట్టాలను

నిర్మించడం, పట్నాన్ని నడిపించడానికి బుద్ధిమంతులూ, అల్ప సంఖ్యాకులూ ఉన్న తమదే అయిన ప్రభుత్వాన్ని నెలకొల్పడం, ఆ ప్రభుత్వం కొనసాగడానికి సైన్యాన్ని ఉపయోగించడం, ఈ విధంగా దేశాలుగా ఏర్పడి, దేశాల మధ్య వివాదాలు తలెత్తినప్పుడు యుద్ధాలను జరపడం, ఇది నాగరికతా జాడ్యంగా పరిణమించింది దీన్ని రూపు మాపకపోతె మనుష్యవర్గానికి క్షేమంలేదు ఇది ప్రభువు చిట్టచివరి నిర్ణయమయింది

అంటే ఆస్తి అనేది మానవజాతి క్షేమానికి ఎదురవుతున్న మొట్ట మొదటి సమస్య

అందువల్ల తాను ఇకముందు తన పిత్రార్జితమైన ఆస్తిని వాడుకోరాదు తాను సంపాదించుకొన్న ఆస్తి అయినా సరె తనదిగా ఉంచుకోరాదు తాను రచించిన పుస్తకాలను తనవె అని ఉంచుకొన్నా ఇతరులు దాన్ని ముద్రింపదలిస్తె అభ్యంతరం ఉండకూడదు ముఖ్యంగా ఇకముందు ఇది నాది అని దేన్ని భావించకూడదు

ఈ నిర్ణయానికి వచ్చిన టాల్ స్టాయ్ ప్రభువు ఇలా అన్ని రూపాల్లో ఉన్న ఆస్తిని తాను త్యజించినట్టు లోకానికి ప్రకటించాడు తాను పాశ్చాత్యలోకపు ఆధునిక యుగపు సన్యాసి అయ్యాడు, ప్రవక్త అనిపించుకొన్నాడు తనలాగానే ఆస్తి కలిగిన ఇతరులూ ఈ మార్గాన్ని అనుసరించాలని, లోకం స్థితిని మెరుగుపరచాలని ఆశించాడు, అనేకులు ఇలా చేస్తారనిభావించి సంతృప్తి చెందాడు

లోకంలోని జిజ్ఞాసువులు ప్రభువు మనస్సు నిష్కల్మషమని, అకుటిలమని గ్రహించారు ఇతని భావాలు ఉదాత్తమైనవని అంగీకరించారు ఇతని త్యాగాన్ని ప్రశంసించారు, శ్లాఘించారు అయితే అనేకులు ఇతని మార్గాన్ని అనుసరించలేదు జీవితంలో ఈ నిర్ణయం కేవలం ఒక వ్యక్తికి సాధ్యంకాని ఒక జనసముదాయం అనుసరించే నిర్ణయం కాదు నా చేతో పట్టుకొన్న అన్నం నాది అనేది తప్పయితే ఎవరయినా సరే భోజనం చేయడం ఎలా? తక్కిన వాళ్ళ మాట అలా ఉండని, మహర్షి ఇంట్లోనే ఈ సిద్ధాంతం నూటికి నూరు పాళ్ళు పనిచేయలేదు పిత్రార్జితమైన ఆస్తి అవసరంలేదు, తనదంటూ ఎలాంటి

ఆదాయమూ లేదు ఇలా అయితే ఇంట్లో ప్రతిరోజూ జీవన మెలా గడుస్తుంది?

ఒక్కడుంటే ఆకలితో ఉంటాననవచ్చు టాల్ స్టాయ్ ఇంట్లో అంత వరకు సుఖంగా బ్రతుకుతూవచ్చిన అతని భార్య సోఫియా కూడ ఉండేది వీళ్ళకు ముగ్గురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిలు ఉన్నారు సాధారణంగా శ్రీమంతుల్ని ఆశ్రయించుకొని బ్రతికే బంధువులు ఉన్నారు టాల్ స్టాయ్ గొప్పరచయిత కాబట్టి ఆయనకు పరిచయం ఉన్న రచయితలు ఇంటికి వచ్చి పోయేవాళ్ళు వీళ్ళలో చాలమంది పేదరికంతో బాధపడుతున్నవాళ్ళు వీళ్ళకు ఈయన నీడ తప్ప మరెవ్వరి దిక్కూ లేనివాళ్ళు వీళ్ళందరూ రోజూ వాడుక ప్రకారంగా భోజనంచెయ్యాలి దీన్ని నడిపించడానికి మార్గం ఏది?

ప్రజాపత్ని సోఫియా దేవి, తన భర్త ఏమైనా చెప్పనీ, ఈ ఆస్తి ఈ ఆదాయం లేకపోతె వీళ్ళెవ్వరూ బ్రతక లేరని, కనీసం తన భర్తకూడ జీవించడం కష్టమని నిశ్చయించుకొంది ఇతను ఆస్తి వద్దనవచ్చు నేను అలా అంటె అవుతుందా? పిల్లలుకూడ వద్దనాలా? ఇలా ఆలోచించి తన భర్త వదిలివేసిన వ్యవహారాల నన్నింటినీ తనచేతికి తీసుకొంది మహర్షి తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి దాని ప్రకారంగా నడుచుకోవడానికి మొదలు పెట్టిన తక్షణమే, అతనికి బదులుగా తాను ఆస్తి వ్యవహారాలను చేపట్టి భర్త, పిల్లల, బంధుమిత్రుల యోగక్షేమాలు చూసుకోవడం మొదలుపెట్టింది

టాల్‌స్టాయ్ మిత్రుల్లో ముగ్గురు ముఖ్యులు వాళ్ళు చెర్ట్ కాప్, గార్కి, సూలర్ జెట్స్కి చెర్ట్‌కాప్ ఉత్సాహవంతావాది ఆస్తి సమాజాన్ని నాశనంచేసిన వ్యవస్థ అని ఇతని దృఢమైన నమ్మకం టాల్ స్టాయ్ ప్రతిపాదించిన స్వామ్య విరుద్ధ వాదాన్ని ప్రశంసించిన వాళ్ళలో ఇతను ప్రముఖుడు గార్కికూడ ఆస్తికి విరోధె ఆస్తి పోవాలనె వారు ఆస్తి వ్యవస్థను దురుపయోగ పరచినట్లే ఆస్తి వద్దనే వాళ్ళు తమ నీతి దురుపయోగం చెస్తారనేది ఇతని వాదం సూలర్ జెట్స్కి కొద్దిగా అటువైపూ, కొద్దిగా ఇటువైపూ ఉంటూ ఈ రెండూ తర్కాల మధ్య నిలబడ్డాడు

టాల్‌స్టాయ్ ఇంటి దగ్గర ఒక భూర్జవనం ఉండేది ఆ స్థలం ఈ

చెట్లు పెరగడానికి తగిన స్థలంగా ఉండవన్న టాల్‌స్టాయ్ యువకుడుగా ఉన్న రోజుల్లో కొన్ని చెట్లు మాత్రమే ఇక్కడ ఉండేవి ఆ స్థలాన్ని, చెట్లను ఆయన ఎక్కువగా ఇష్టపడడంవల్ల అక్కడే ఆ రోజుల్లోనే ఒక వంద చెట్లను నాటించాడు అవి పెరిగిన తర్వాత ఆనందించాడు ఆస్తికి యజమాని అయ్యాక అక్కడే మరో వంద చెట్లను నాటించి పెంచి ఆ ప్రదేశాన్ని ఒక వనంగా తీర్చిదిద్దాడు ఈ వనం అతనికి గర్వకారణం ఆరోగ్యంగా ఉన్న రోజుల్లో అతిథులు ఎవరువచ్చినా వాళ్ళను ఈ వనానికి పిలుచుకొని వచ్చి చూపించేవాడు ఆ చెట్లనన్నిటిని తానే పెంచినట్లు గర్వంగా చెప్పుకొనేవాడు వయస్సయి అనారోగ్యం పాలయినప్పటికీ ఆ రోజుల్లో కూడ అప్పుడప్పుడు నౌకర్లతో అక్కడికి వెళ్ళి వచ్చేవాడు అక్కడికి వెళ్ళలేని రోజు ఇంటి ముందుకూర్చుని వనం వైపు చూస్తూ సంతోషపడేవాడు ప్రేమను త్యజించిన ఋషికి ఒక జింకమీద కలిగిన కనికరం ప్రేమగా మారిందని భారతీయ పురాణం చెప్పినట్లు, స్వామ్యం, అభిమానం దుష్టం అనిప్రతిపాదించిన ఋషి కల్పుడైన అగ్రరచయితకు ఈ భూర్జ వనం విషయంలో తనకే తెలియని స్వామ్యభావం, అభిమానం ఏర్పడ్డాయి

ఇంటి ఖర్చుకు డబ్బు అవసరమై సోఫియా దేవి ఒకసారి ఈ వనంలోని పాత చెట్లలో పదింటిని అమ్మాలని ఆలోచించింది బాగా పెరిగి దృఢంగా ఉన్న చెట్లు మంచి ధర కూడ పలికేది ఎవరో వచ్చి అడగనూ అడిగారు ఈలోగా ఈ విషయం టాల్ స్టాయ్ చెవినిపడి ఎక్కడైనా ఇలా ఉందా, ఎలాంటి వనం అది, చెట్లను అమ్మి దాన్ని పాడు చేయడమా? అనుకున్నాడు

భర్త అభిప్రాయం తెలిసి సోఫియా ఆ ఆలోచనని విరమించుకొంది యజమాని, చెట్లను నాటించాడు, ఇప్పుడు అనారోగ్యం పాలయ్యాడు చూడడంతో సంతోషపడుతున్నాడు, ఇంకెన్ని రోజులు ఈ సంతోషాన్ని పొందుతాడో, ఎంత త్వరగా ఈ జీవితం చాలిస్తాడో చెప్పలేము, ఇప్పుడెందుకీ చెట్లను నరికించి ఆయన మనస్సును బాధించడం?

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజులకు [illegible] గ్రామంలో

కూలినాలి చేసుకొని బ్రతికే నూరుమంది చెర్ట్ కాప్ దగ్గరికి వెళ్ళి, మాకెవరికి ఇళ్ళు లేవు, చిన్న చిన్న ఇళ్ళు కట్టుకోవాలనుకొంటున్నాము యజమానికి చెప్పి ఈ బూర్జువనం లోని చెట్లను ఇప్పించండి, ఇళ్ళు కట్టుకొంటాము, ఆయన పెద్ద మనస్సు చేశారు, ఆస్తి వద్దంటున్నారు, ఎవరైనా వచ్చి ఈ చెట్లను నరికి తీసుకొని పోగలరు, వాటినిమాకు అప్పగించండి అని సూచించాడు

టాల్ స్టాయ్ వెంటనే ఏమీ చెప్పలేదు చెర్ట్ కాప్ మళ్ళీ ఈ విషయాన్ని ప్రస్తావించగానే, స్వామ్యం అక్కడ లేదన్న తర్వాత నేను అనుమతి ఇవ్వడమేమిటి? కూలీలు ఉన్నారు, చెట్లున్నాయి అన్నాడు ఇది ఆతను ఆనందంతో చెప్పిన మాటలు కావు చెర్ట్ కాప్ మళ్ళీ ఈ విషయాన్ని ప్రస్తావించగానే, స్వామ్యం అక్కడ లేదన్న తర్వాత నేను అనుమతి ఇవ్వడమేమిటి? కూలీలు ఉన్నారు, చెట్లున్నాయి అన్నాడు ఇది అతను ఆనందంతో చెప్పిన మాటలు కావు చెర్ట్ కాప్ ఇది గమనించాడు అయితే టాల్ స్టాయ్ మాటల్ని ఉపయోగించుకొని కూలీలు చెట్లు నరకడానికి అడ్డులేదని ఈ కార్యం కొనసాగించదలచు కొన్నాడు

ఈ విషయం సోఫియాదేవికి తెలిసింది ఆమె యజమాని చెట్లను నాటించి పెంచిన వనం దాన్ని నరికించ కూడదని నేనే మౌనంగా ఉండిపోయాను దీన్ని ఎవరో వచ్చి నరికేలా చేస్తున్నావా? అని అడ్డుచెప్పింది

చెర్ట్ కాఫ్ ఋషితుల్యులైన మీ భర్త ఔదార్యం మీ వల్ల నిష్ఫలమవుతుంది మీకిది భావ్యం కాదు అని అన్నాడు

ఆమె, యజమాని ఔదార్యం ఫలించడమనేది నాకంటే నీకు బాగాతెలుసా? ఈ అధిక ప్రసంగం అనవసరం మీరందరూ ఇక్కడికి వచ్చి భోంచేస్తున్నారు కదా, ఆస్తి లేకుండా ఇవన్నీ ఎలా వస్తాయి? మాయింటి విషయం మాకు వదిలెయ్యండి మీరు దీని తంటాకు రాకండి అంది

మాటకు మాట పెరిగింది జగడమే జరిగింది చెర్ట్ కాఫ్, సోఫియాకు మతి సరిగ్గా లేదని తీర్మానించుకొని, ఈమె ఇష్టం వచ్చింది చెప్పని, నేను యజమాని అభిప్రాయాన్ని జరిపిస్తాను అన్నాడు కూలీలతో మీరు

వచ్చి చెట్లను నరుక్కొని పోండి అన్నాడు

కూలీలు వచ్చి చెట్లను నరకడం ప్రారంభించారు యువజమానురాలు సోఫియా డబ్బిచ్చి వేరే వాళ్ళను పిలిపించింది, వాళ్ళను చెట్లను నరికేందుకుండా ఏర్పాటు చేసింది కూలీలకు దెబ్బలు తగిలాయి వాళ్ళు ఆమెను చాల క్రూరురాలని నిందించారు, అప్పటికీ ఊరుకున్నారు డబ్బిచ్చి పిలిపించిన జీతగాళ్ళు వెళ్ళిపోగానే వాళ్ళు మళ్ళీ వచ్చారు, చెట్లను నరికారు నరికిన చెట్లను కత్తిరించి సాగించారు కూలీలు పది సార్లు ఇలా వనాన్ని నరికారు సోఫియాదేవి పదిసార్లు అడ్డుకుంది ఒక నెలలో మహావనం నేలమట్టమయింది అక్కడ వనం ఉండేదనడానికి నిదర్శనంగా అంపంలో కొట్టబడ్డ చెట్ల మొదుళ్ళు మాత్రం మిగిలాయి

ఇలా జరుగుతున్నా టాల్ స్టాయ్ ఏమీ మాట్లాడలేదు చెట్లు అలాగే ఉండడం అతనికిష్టమని సోఫియాకి తెలుసు అయితే ఆమె ప్రయత్నమంతా వ్యర్థమయింది ఆమె పిచ్చిదానిగా తయారయింది టాల్ స్టాయ్ చెప్పరానంత దుఃఖం పొల్యయాడు క్షీణించి పోయాడు

ఆ తర్వాత కొన్ని నెలలకు ఒకరోజు ఎవ్వరికీ చెప్పకనే ఎక్కడికో వెళ్ళిపోయాడు అతను వెళ్ళిపోయిన తర్వాత ఇంట్లో పిల్లలకి విషయం తెలిసింది అతన్ని వెతకడానికి మనుష్యుల్ని పంపారు వాళ్ళు ఆయనను ఒకరైల్వే స్టేషన్‌లో చూశారు టాల్ స్టాయ్ అప్పటికే బాగ నీరసించి పోయాడు స్టేషన్‌లోనే ఉండిపోయాడు అతను అక్కడ ఉండడాన్ని తెలుసుకొని కావలసిన వాళ్ళు వచ్చారు అక్కడినుంచి అతన్ని మరో చోటికి మార్చే ఏర్పాటు చేశారు ఈలోగానే అతను రైల్వేస్టేషన్ లోనే కన్ను మూశాడు

చెట్లు పోయాయని దుఃఖమా? భార్య తన ఔదార్యానికి అడ్డు వచ్చిందన్న బాధా? ఆస్తి కూడదని బుద్ధి చెప్తున్న సమయంలో చెట్లు తనవన్న అభిమానం వెంటాడిందన్న ఉద్వేగమా? అతని జీవం వీటిలో ఏ విషయంగా చింతిస్తూ ముగిసింది? లేదా పైమూడు భావాలు మనస్సులో అయన కన్ను మూసె సమయంలో పీడించాయా?

ఈ విషయం గురించి ఇప్పుడెవ్వరూ చెప్పలేరు